కర్మయోగం

# నిత్యానుష్ఠాన చంద్రిక



ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్

www.freegurukul.org


సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజి
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస
అమ్మ శారదా దేవి
గురు వివేకానంద
గురు సాయిబాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళ స్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

Free Gurukul

"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం వెబ్ సైట్ నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) తిరుమల తిరుపతి దేవస్థానం వారి వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో తిరుమల తిరుపతి దేవస్థానం వారి సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Helpline/WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## TTD(తిరుమల తిరుపతి దేవస్థానం)

**http://ebooks.tirumala.org**



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీమతే రామానుజాయ నమః

ఓమ్ నమః పరమాత్మనే

# నిత్యానుష్ఠాన చంద్రిక



వేపూరి శేషగిరిరావు

ఓమ్

శ్రీకృష్ణ పరమాత్మనే నమః





శ్లో॥ జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిమ్।
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥

శ్రీ హయగ్రీవస్వామినే నమః

---

శ్లో॥ శ్రూయతాం ధర్మ సర్వస్వం శ్రుత్వాచైవావధార్యతామ్ ।
ఆత్మనః ప్రతికూలాని పరేషాం న సమాచరేత్ ॥

ఓ మానవులారా, ధర్మం యొక్క సర్వస్వాన్ని వినండి. విన్న పిదప దానిని చక్కగా ఆచరించండి. అదేమిటంటే - తమకి ప్రతికూలమైనదానిని ఇతరులకు చేయరాదు. నన్ను ఎవరూ హింసించరాదు, నాకెవరూ అపకారము చేయరాదు, అని ప్రతివారూ తలుస్తారు. ఎవరికీ అపకారము చేయకూడదు మరియు తానేది కావాలని అభిలషిస్తాడో దానిని ఇతరులకు ప్రసాదించాలి. ఆకలి కలిగినపుడు తనకు అన్నం కావాలని కోరుకుంటాడు. అలాగే ఆకలితో అలమటిస్తున్న ఇతరులకు అన్నదానం చేయాలి. చలితో బాధపడుతున్నపుడు తనకు దుప్పటి కావాలని కోరుకుంటాడు. అలాగే చలితో నానావస్థలు పడే బీదవారికి వస్త్రదానం చేయాలి. ఇదే సర్వధర్మసారం. దీన్ని ఆచరిస్తే మానవుడు కృతార్థుడవుతాడు. దైవకృపకు పాత్రుడు కాగలుగుతాడు.

- శ్రీ రామకృష్ణ ప్రభ 10/2003

శ్రీ వేంకటేశాయ నమః
శ్రీమతే రామానుజాయ నమః

ధర్మో రక్షతి రక్షితః

# నిత్యానుష్ఠాన చంద్రిక

## పండిత పరిష్కృతము

ఈ గ్రంథము శ్రీశ్రీశ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారి EDIT 5/2828/ EDITOR/2002 తేదీ 21-4-2004 ఆర్డరు ననుసరించి శ్రీవారి యొక్క ద్రవ్య సహాయముతో ముద్రితము. వారికి నా హృదయపూర్వక నమస్కృతులు.

ఓం నమో వేంకటేశాయ పురుషాయ మహాత్మనే.
ప్రణతక్లేశ నాశాయ గోవిందాయ నమో నమః.



తా. పరమ పురుషుడును, మహాత్ముడును, నమస్కరించు వారి కష్టములను నశింపజేయువాడును, భూమిని పొందినవాడును అగు శ్రీశ్రీశ్రీ వేంకటేశ్వర స్వామికి నమస్కారము.

పంకలనకర్త : **వేపూరి శేషగిరిరావు**

# పంచమ పుష్పము

ప్రథమ ముద్రణ : తారణ - భాద్రపద - బహుళ - దశమి
శుక్రవారము 8-10-2004

ప్రతులు : 1000

మూల్యము : రూ. 160/-

ముఖ చిత్రము : చిత్రకారుడు శ్రీ రాంబాబు మూకల
చిత్రాలయ ఆర్ట్స్, పవరుపేట, ఏలూరు -2, ఫోన్ : 239323





ప్రతులకు

## 1. వేపూరి శేషగిరిరావు

## కస్తూరి పబ్లికేషన్స్

వంగూరు, పెదవేగి మండలము
పశ్చిమగోదావరి జిల్లా
ఫోన్ : 279582

## 2. శివకామేశ్వరి గ్రంథమాల

41-22/4-36, భ్రమరాంబాపురం, కృష్ణలంక
విజయవాడ - 520 013
ఫోన్ : 0866 2522824

డిటిపి : శ్రీ జి.వి.యస్.మూర్తి (రత్నగర్భ)
ఏలూరు, ఫోన్ : 221815

ముద్రణ : శ్రీ జి గణేష్ కుమార్ M.Com., వెయ్యి కాపీలు 9/2004
లక్ష్మిసాయిశ్రీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ & బైండర్స్
గోసంరక్షణ సమితి కాంప్లెక్స్, ఆర్.ఆర్.పేట, ఏలూరు - 2, సెల్ : 98484 92174

ఓం శ్రీం శ్రియై నమః

ఓం నమో నారాయణాయ

ఓం బ్రహ్మదేవాయ నమః



తే.గీ. ఎవని వాక్యము సత్యమో, యెవని వసతి
సత్యలోకమో, యెవ్వని సతియు సత్య
యగు సరస్వతియో, యెవని యక్షరములు
సత్యమో! యట్టి బ్రహ్మకు సాగిలపడి
అనుదినము గొల్తు కృతికి బ్రహ్మయువునకు.

---

ఓం శ్రీం శ్రియై నమః

ఓం సరస్వత్యై నమః

**అంకితము**



సరస్వతీ మంత్రం
ఓం ప్రణోదేవీ సరస్వతీ
వాజేభివాజినీవతీ।
ధీనామవిత్ర్యవతు ॥ఓం॥

ప్రణమిల్లే యావన్మందినీ కాపాడే
సరస్వతీదేవి మనలను కాపాడు
గాక! వాక్ శక్తులను ప్రేరేపించి
మనలను జాగృతం చేయుగాక.

కం. "సత్యంవద ధర్మం చర"
శ్రుత్యార్థం బిదె గదమ్మ! శుభకరి వాణీ,
ప్రత్యహము నిన్ను దలచుచు
నిత్యానుష్ఠాన మిత్తు నీకంకితమున్.



జై శ్రీమన్నారాయణ

శ్రీమతే రామానుజాయ నమః





శ్రీ భాష్యకారులు భగవద్రామానుజులు

శ్రీశ్రీశ్రీ పెద్దజీయరుస్వామి వారు

ఓం

శ్రీ గురుపాదుకాభ్యాం నమః



శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి వారు

సీతానగరం.

జై శ్రీమన్నారాయణ

శ్రీమతే రామానుజాయ నమః ఓం శ్రీం శ్రియై నమః ఓం నమో నారాయణాయ

శ్రీకృష్ణః శరణంమమ

# ఓం నమః పరమాత్మనే



| | |
|---|---|
| పరిత్రాణాయ సాధూనాం | ఎల్ల సాధువుంగవుల రక్షించుకొరకు, |
| వినాశాయ చ దుష్కృతమ్, | క్షితిని దుష్టుల బట్టి శిక్షించుకొరకు, |
| ధర్మ సంస్థాపనార్థాయ | ధర్మ రక్షకు యుగయుగాంతములయందు, |
| సంభవామి యుగే యుగే. | నవతరించెదు శక్తిని హరిని నేను. |

శ్రీమతే రామానుజాయ నమః



శ్రీ వేపూరి చినరామయ్య
సీతారావమ్మ

**గ్రంథకర్త తల్లిదండ్రులు**

తండ్రి జననము : 1903
మరణము : 13-12-1973

తల్లి జననము : 1918
మరణము : 12-2-1998



శ్రీ వేపూరి శేషగిరిరావు
కస్తూరి

**గ్రంథకర్త దంపతులు**

## పరిచయము

**ప్రియమిత్రమా శేషగిరిరావ్**

నీ రచనలు మిత్రశతకము, వేదాంతచూర్ణిక (సంఖ్యాశాస్త్రము) ప్రథమభాగము, విష్ణుసహస్రనామ స్తోత్రము (రామానుజ భాష్యము) మరియు వేదాంతచూర్ణిక (సంఖ్యాప్రాశస్త్యము) ద్వితీయభాగము చదివాను.

1956 సంవత్సరము నుండి ఉద్యోగరీత్యా స్నేహితులమైయున్ననూ, నీకు గ్రంథపఠనము, ఆధ్యాత్మిక విషయసేకరణ ఉన్నాయని తెలిసినా, నేనూహించిన దానికంటే ఎక్కువగా అనేక గ్రంథాల నుండి సేకరించి రచించావు. చాలా సంతోషం. నీ రచనలు ఆయా విషయాలపై ఆసక్తి గల వారికి చాలా ఉపయోగపడతాయి.

ఏలూరు — నీ ప్రియమిత్రుడు

4-7-2004 — **కటకం వేంకట సుబ్బారావు** బి.కామ్.,

◇ ◇ ◇

"సత్యం వద" ఓమ్ తత్ సత్ "ధర్మంచర"

### అహింసా పరమో ధర్మః



తమ చరాచర సుఖాభిలాషియగు

### శ్రీ మలయాళ స్వాముల వారు

శ్రీ వ్యాసాశ్రమం, ఏర్పేడు

### శ్రీమతే రామానుజాయ నమః

## తొలిపలుకు

దైవారాధనకు పంబంధించిన గ్రంథములు ఇంతవరకు నాకు లభ్యము కాలేదు. అయితే భగవస్తుతికి అనుకూలమైన స్తోత్రములు గల పుస్తకములు చాలా చూచాను

చదివాను. ఆ స్తోత్ర శ్లోకములకు తాత్పర్యములు ఉండేవికావు. అయినా ఆ శ్లోకములను ఒక పుస్తకములో వ్రాసుకొని కంఠస్థము చేసి, దేవుని సమక్షమున కూర్చుని, దీపారాధన చేసి పూజ చేస్తుండేవాడిని నా చిన్న తనమునుండి. దీనికి కారణము మా తల్లిదండ్రులు చెప్తూండేవారు. నేను తల్లిగర్భములో నుండినప్పుడు ఒక శ్రీమళయాళస్వామి (ఏర్పేడు) వారి శిష్యులు సాధుగారు మావంగూరు గ్రామమునకు వచ్చి వేదాంతోపన్యాసములు యిస్తూ, ఓంకార ప్రాశస్త్యమును గురించి అనర్గళంగా ప్రసంగిస్తూ, శ్రీమళయాళస్వామివారు రచించిన "శ్రీశుష్క వేదాంత తమో భాస్కరము" అనే గ్రంథమును ఇచ్చి అందరిలోనూ కలిసిపోతూ 2 లేక 3 మాసములు మకాము ఉండేవారు. మాతండ్రిగారు శ్రీశుష్కవేదాంత తమోభాస్కరమును ఎల్లప్పుడు చదువుతూ, పద్యాలు పాడేవారు. ఈగ్రంథము నా రచనలకు ఎంతగానో ఉపయోగపడింది. యింకను ముందుముందు ఉపయోగపడుతుంది. మానవజన్మ నిచ్చిన పరమాత్మను సదా స్మరించుచు, కీర్తించుచూ నిత్యమూ పూజ చేసుకునే విధంగా స్తోత్ర, తాత్పర్యములతో ఓ గ్రంథము వ్రాయాలన్న తలంపు, తపన నాలో చోటు చేసుకున్నవి.

తరతరాలుగా వస్తూన్న భారతీయ సంస్కృతి, ఆర్షసాంప్రదాయము మరుగున పడిపోగూడదనే తీవ్ర తాపత్రయముతో, ఏడు సంవత్సరములు ఎడతెగని కృషితో, దైవారాధనా సాధనముగా, నిత్యపారాయణ కుపకరించు విధముగా, నాచే రచింపబడి వెలుగు చూస్తున్న యీ "నిత్యానుష్ఠాన చంద్రిక" (నా ఐదవ గ్రంథము)ను, ఉభయభాషాపారీణులైన పండిత పంచకముచే పరిష్కరింపబడినది. వారికి శిరము వంచి వినమ్రుడనై నా కృతజ్ఞతాభిందనములు తెలియపరచుకొను చున్నాను. ఈ సందర్భములో వారి శుభనామధేయములను పాఠకులకు వెల్లడించుట నా బాధ్యత కర్తవ్యము కూడా. వారు 1. జ్ఞానవృద్ధులు, ఉభయ భాషాప్రవీణ శ్రీమాన్ నందిభొట్ల సత్యనారాయణగారు, (ఏలూరు) 2. త్రిభాషా సహస్రావధాని, సరస్వతీపుత్ర, సహస్రకమల బిరుదాంకితులు శ్రీమాన్ వద్దిపర్తి పద్మాకర్‌గారు, (ఏలూరు), 3. వ్యాకరణప్రవీణ, భాషాప్రవీణ, పరమ సాత్వికస్వభావులు శ్రీమాన్ శ్రీపాదరామకృష్ణగారు, (ఏలూరు) 4. శుద్ధసత్త్వగుణ సంపన్నులు, అధర్వ వేదపండితులు శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీ కృష్ణమాచార్యులుగారు, (భద్రాచలము) నాకు అధర్వవేదపండితుల వారితో తొలిపరిచయము ఆశ్రమములో పనిచేయు శ్రీశ్రీనివాసరావు గారి ద్వారా యాదృచ్ఛికముగా జరిగినది. అది విజయవాడలో ఎక్కిన సిటీబస్ కృష్ణానది అవలి ఒడ్డునకు చేరుకోగానే దిగి, మద్గురువరేణ్యులు ప.వ. శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామి వారి సీతా

నగరము, ఆశ్రమము వైపు కాలినడకను పోవునప్పుడొక యపరిచితవ్యక్తి (వీరే శ్రీనివాసరావుగారు) నన్ననుసరిస్తూ, ఆశ్రమమునకు వస్తున్నారా? స్వామివారు లేరండీ, అన్న శ్రీనివాసరావుగారి మాటకు సమాధానమిస్తూ, ఔనండీ, స్వామివారి దర్శనము చేసుకుని, నేను వ్రాసిన "నిత్యానుష్ఠాన చంద్రిక" అను గ్రంథములోని కొన్ని సంస్కృత శ్లోకములు ఛందోభంగముగా నున్నందున, వాటిని సరిదిద్దించుటకు పండితుల కొరకు వస్తున్నాననగానే, వారు, సరేరండి, ఎవరైనా వుంటే మీకు పరిచయము చేస్తానని చెప్పిన శ్రీనివాసరావుగారూ నేనూ వారి ఆశ్రమములో ప్రవేశించగానే, మాకు ఎదురయిన అధర్వవేద పండితులవారిని నాకు పరిచయము చేసి, విషయము వివరించి డ్యూటీకి వెళుతున్న శ్రీనివాసరావుగార్కి కృతజ్ఞతలు తెలియపరచి, శ్రీమాన్ గుడిమెళ్ళ కృష్ణమాచార్యులుగారితో మండపములో కూర్చుని, నావెంట తెచ్చిన వ్రాతప్రతిని తీసి అందులోని ఛందోభంగమయిన శ్లోకములను చూపించడము వారువెనువెంటనే పూరించడము, యిలా 90 నిముషాలు గడచిపోగా, వారు సాపాటు చేసివద్దాము రండి అని ఆశ్రమములోని భోజనశాల కరుగగా నేనూవెళ్ళి భోజనము తృప్తిగాచేసి వచ్చి కరుణార్ద్రహృదయులైనవారికి కృతజ్ఞతా పూర్వకముగా పాదాభిందనములు చేసి శలవు తీసికొని వెనుతిరిగాను.

5. వయోవృద్ధులు, జ్ఞానసంపన్నులు, హేలాపురి సంస్కృతపాఠశాల ఉపాధ్యాయులు శ్రీమాన్ యనమంద్ర వేంకటసూర్యనారాయణమూర్తిగారు (ఏలూరు).

యుగములు నాలుగు అవి... ధర్మము నాలుగుపాదముల చరించు కృత యుగమున విష్ణువును ధ్యానించుట వలన, ధర్మము మూడు పాదముల చరించు త్రేతాయుగమున ఆయనను గూర్చి యజ్ఞము చేయుట వలన, ధర్మము రెండుపాదముల చరించు ద్వాపరయుగమున ఆయనను అర్చించుట వలన ఏ ఫలము కలుగునో అది కలియుగమున శ్రీహరినామము కీర్తించుట వలననే కలుగును.

కృతయుగమున జీవితపర్యంతము గాయత్రీదేవి నుపాసించు ఫలితము, త్రేతాయుగమున ఒకసంవత్సరము చేసిన చాలును. ద్వాపరయుగమున ఒక్క మాసమురోజులు చేసిన అంతఫలితము వచ్చును. అది కలియుగమున ఒక్కరోజు శ్రద్ధాభక్తులతో త్రికరణ శుద్ధిగా పరమాత్మను కీర్తించిన పై ఫలితము వచ్చును. మరియు కృతయుగమున ఒక పాపమును పోగొట్టుకొనుట కొక లక్షగాయత్రిని నిలబడి చేయవలయునని విధి యున్నచో, కలియుగమునందా పాపపరిహారమునకే కూర్చుండి శతగాయత్రి చేసిన ఆ పాపము పోవునని నిర్ణయించు అధికారము పరాశరుని కొచ్చినది.

కృతయుగమున ప్రాణములు ఎముకలు మిగిలిన జీవిస్తాడు. హిరణ్యకశిపుడు రక్తము, మాంసము పోయేదాకా తపస్సు చేసాడు. ఎముకలు మిగిలినవి. అప్పుడు బ్రహ్మ ప్రత్యక్షమయ్యాడు. త్రేతాయుగమున మాంసాన్ని ప్రాణము ఆశ్రయించి వుంటుంది. మాంసము పోతే ప్రాణము పోవును. ద్వాపరియుగమున రక్తాన్ని ఆశ్రయించి వుంటుంది ప్రాణము. రక్తము పోతే ప్రాణము పోవును. కలియుగమున "అన్నగత ప్రాణులు" అన్నమును ఆశ్రయించి వుండును ప్రాణము. అన్నము లేకపోయిన ప్రాణము పోవును.

కృతయుగమున అనాటి జనులచే అనుష్ఠింపబడిన ధర్మము నాలుగు పాదములతో గూడియుండెను. సత్యము, దయ, తపస్సు, దానము - నను నాలుగు గుణములు, దాని నాలుగు పాదములు.

కలియుగానికి ధర్మము ఒక్కపాదము మాత్రమే వుంది. అంటే సత్యములేదు, దయలేదు, తపస్సులేదు, మిగిలిన నాల్గవది దానము. ఇదీ అంతంత మాత్రముగనే యున్నది. ధర్మమార్గమున సంపాదించిన విత్తమును పదవవంతు దానము చెయ్యాలంటోంది శాస్త్రము. అదియు త్రికరణ శుద్ధిగా. ఇవి యుగ ధర్మాలు, యుగ ప్రాశస్త్యము.

కలి అనగా కలహము. కలియుగములో మనిషి మానవత్వమును మరచి తన సాటిమనిషి ఎదుగుదలను చూచి ఓర్వలేడు. చెడును గ్రహించునంత సులభముగా మంచిని గ్రహించలేడు. మనిషిని మంచి మార్గమునకు మళ్ళించు బాధ్యత తల్లిదండ్రులపైన, ఉపాధ్యాయుల పైన, రచయితల పైన ఎంతగానోయున్నది. సద్గురువునాశ్రయించిన వానికి జ్ఞానసముపార్జన కరతలామలకము. జ్ఞానబోధకు ఉత్తమ ప్రామాణిక గ్రంథపఠనము చాలా ముఖ్యము. అట్టి ఆధ్యాత్మిక సంబంధమైన గ్రంథములు ఈనాడు బహుతక్కువగా వెలువడుచున్నవి. బోధనా పటిమ కూడా అంతంతమాత్రమే. మనిషికి భగవంతునిపై దృఢ విశ్వాసమును కలిగించి, భక్తి, ధ్యాన, తపో కీర్తనాది నిత్యానుష్ఠానమార్గమును ఆచరించు విధానమును నిర్దేశించునదే యీ "నిత్యానుష్ఠానచంద్రిక" అనుగ్రంథము. మనము సూర్యుడు ఉదయించక పూర్వమే 4 గంటల 32 ని. ల (బ్రాహ్మీముహూర్తము)కు మేల్కొంచినది మొదలు రాత్రి 9 గంటలకు నిద్రకుపక్రమించువరకు, అంటే ఒక్కరోజు దినచర్యను అనుసరించవలసిన, సంధ్యావందనాది నియమనిష్ఠలు, శౌచవిధులు, పూజాది కార్యక్రమములు, నిర్వహించు విధివిధానములిందులో

వివరంగా విశదీకరించబడినవి. పాఠకమహాశయులు యీగ్రంథము అసాంతము చదివి ఆకళింపుచేసికొని, ఆచరించి కృతకృత్యులగుదురు గాక!

ధర్మము నాచరించుటకు మాత్రమే దేహము నిచ్చిన పరమాత్మను సదా తైలధారవలె కీర్తించుచూ, ఏకాగ్రమనస్కులై, నిత్యానుష్ఠానములో, దైవారాధనలో, అర్చించుటలో నిష్ణాతులైన మానవాళికి తత్త్వజ్ఞానముదయించగా, పూర్వజన్మ వాసనాక్షయము కాగా, మనస్సు పరిశుద్ధముకాగా, పరిశుద్ధాత్ములై, బ్రహ్మానందానుభవములో బ్రహ్మనిష్ఠులగుదురుగాక !

ఈ గ్రంథరచనకు ఏదోతెలియని అదృశ్యశక్తి నాకు ఉత్సాహమునిచ్చి ముమ్ముందుకు నడిపించింది. ఆ అదృశ్యశక్తి మూడురూపములలో నున్నది. ఒకటి, గురువర్యులు పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామి వారి ఆశీస్సు, రెండు సర్వాంతర్యామి శ్రీకృష్ణపరబ్రహ్మము యొక్క అనుగ్రహము, మూడు లిఖిత యజ్ఞ నిర్వహణాసక్త చిత్తమును కలిగించిన వాగ్దేవి కరుణాకటాక్షము.

ఈ గ్రంథమును ముద్రించుటకుగాను ఆర్థిక సహాయము సమకూర్చిన శ్రీశ్రీశ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారికి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు వారికి నా కృతజ్ఞతాభివందనములు.

ఈ గ్రంథమును సంకలనము చేయుటలో అనేక పురాతన పురాణ గ్రంథములేకాక శ్రీరామకృష్ణ మఠం వారి శ్రీరామకృష్ణ ప్రభలు, సీతానగరం జీయర్ స్వామి వారి ఆశ్రమ సంచిక భక్తి నివేదనలు, మరియు శ్రీ మద్భగవద్గీత విద్యాపీఠం వారి శ్రీ వి.డి.అ.స నామాస్తోత్రావళి శ్రీ సూక్తము నాకు ఎంతగానో ఉపయోగపడినది. ఆ గ్రంథ సంపాదకులకు, రచయితలకు నా కృతజ్ఞతాభివందనములు.

ఈ గ్రంథ సంకలనమునకు అన్నివేళలా, అన్ని విధములా నామనసెరిగి సంపూర్ణ సహకారము లందించిన నాధర్మపత్ని ల.సౌ. కస్తూరికి నామనఃపూర్వక శుభాశీస్సులు.

నాకు పుత్రులు లేరు అను విషయాన్ని మరపిస్తూ వృద్ధాప్యదశలోనాకు చేదోడు వాదోడుగా వుండి అన్నివిధాలా సహకరించిన నా అల్లుడు చి. కొరంగుల భాస్కరరావు, మాఏకైక కుమార్తె ల.సౌ. సుభాషిణి, దౌహిత్రి చి. జిగీష, దౌహిత్రుడు చి. సాయికృష్ణలకు నా శుభాశీస్సులు.

నేను రచించిన మిత్రశతకము, వేదాంతచూర్ణిక, 1,2 భాగములు. శ్రీవిష్ణు సహస్రనామస్తోత్రములను పఠించి తమ అమూల్యప్రశంసలను పంపించిన ఆత్మీయ

కవి మిత్రులకు నాహృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు తెలియపరుస్తూ, ఆ ప్రశంసలను ఈ గ్రంథాంతమున పొందుపరుస్తున్నాను.

సాహితైషి ప్రౌఢకవి శ్రీ బండ్లమూడి సత్యనారాయణ గార్కి (ఏలూరు) మధురకవి, కవితాభూషణ శ్రీ కలవర్తి వేంకటేశ్వరరావు ఎం.ఎ.బి.ఇడి గార్కి (ఏలూరు) నా బాల్యమిత్రుడు సహజ కవితాధురీణ శ్రీ వరిగొండ శ్రీరామమూర్తి గార్కి (వంగూరు) వీరి సోదరులు మౌనవ్రత దీక్షాదక్ష శిఖామణి శ్రీ వరిగొండ నాగేంద్రరావు డబుల్ ఎం.ఎ. ఇంగ్లీషు డిప్లమోహోల్డరుగార్కి (వంగూరు) నా బాల్యమిత్రుడు డా. శివలెంక ప్రకాశరావు గార్కి ఎం.ఎ., పి.హెచ్‌డి., (శ్రీశైలం) సహృదయులు శ్రీ అమరవాది జగన్నాథాచార్యులు గార్కి (భద్రాచలము) నా చిరకాల విశ్రాంత సహోద్యోగులు నాశ్రేయోభిలాషులు పరోపకార పరాయణులు శ్రీ కటకం వేంకట సుబ్బారావు, బి.కామ్ గార్కి (ఏలూరు) సాహితైషులు, సంఘసేవాతత్పరులు శ్రీ గురజాపు ఈశ్వరరావు గార్కి (సత్రంపాడు) సత్యవాది శ్రీ కె.వి. హనుమంతరావు గార్కి (ఏలూరు) నా తోటికళాకారుడు శ్రీ కేసానిపల్లి మల్లిఖార్జునరావు గార్కి (హైదరా బాదు), నాకు రూ. 2,000/- ఆర్థికసహాయము చేసిన సహృదయులు శ్రీ మేచినేని రాధాకృష్ణ గార్కి (చెన్నై) కళాపిపాసి, కవి, సువర్ణహస్త కంకణధారి 'తెనుగుదర్బారు' అధినేత, కార్యదర్శి శ్రీ కురెళ్ళ లక్ష్మణరావు గార్కి (ఏలూరు) పరులసేవయే తన కర్తవ్యముగా భావించు నా మేనల్లుళ్ళు 1. శ్రీ కారంగుల ప్రకాశరావుకు (హైదరాబాదు) 2. శ్రీ కారంగుల బాలమోహనరావుకు (చెన్నై) 3. శ్రీ కారంగుల రవిచంద్రశేఖర్‌కు (వంగూరు) బాల్యమిత్రుడు శ్రీ గొల్లంగి రామారావుకు (విశాఖపట్నం) అడిగినదే తడవుగా ముఖచిత్రమును సర్వాంగ సుందరముగా చిత్రించి ఇచ్చిన చిత్రకారుడు, చిత్రాలయా ఆర్ట్స్ అధినేత శ్రీ మూకల రాంబాబు గార్కి (ఏలూరు) అర్చకులు శ్రీమాన్ వేదాంతం సత్యనారాయణా చార్యులు గార్కి (వంగూరు) ముచ్చటగా డి.టి.పి. చేసిన శ్రీ జి.వి.యస్. మూర్తి గార్కి (ఏలూరు) ముద్రాపకులు లక్ష్మి సాయిశ్రీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ & బైండర్స్ వార్కి (ఏలూరు) నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

వంగూరు
24-7-2004

సర్వజన సుఖాభిలాషి
వేపూరి శేషగిరిరావు

శ్రీరస్తు అవిఘ్నమస్తు శుభమస్తు

ఓం నమః పరమాత్మనే
ఓం శ్రీం శ్రియై నమః

# నిత్యానుష్ఠాన చంద్రిక

## విషయ సూచిక

శ్రీమతే రామానుజాయ నమః

ఓమ్

శ్రీ గురుపాదుకాభ్యాం నమః

శ్రీమతే నారాయణాయ నమః

శ్రీకృష్ణ పరమాత్మనే నమః

# శాంతి మంత్రములు

1. ఓమ్ సహనావవతు, సహనౌభునక్తు, సహవీర్యం కరవావహై ।
తేజస్వినావధీతమస్తు। మావిద్విషావహై॥

ఓం శాంతిః శాంతిః శాంతిః । హరిః ఓం

తాత్పర్యము :- పరబ్రహ్మవిద్య శిష్యాచార్యులమగు మమ్ముల నిద్దఱిని ఆ పరమాత్మ రక్షించుగాక ! మా యిద్దఱికిని పరబ్రహ్మానుభవము కలుగజేయును గాక ! మాకు బ్రహ్మ విద్యా విషయమున ఆత్మశక్తి నొసంగునుగాక ! మాచేత నధ్యయనము చేయబడినది తేజోవంతమగునుగాక ! శిష్యాచార్యులమగు మా యిద్దరికిని ద్వేషము లేకుండుగాక. స్వస్వరూపసంధానము - 3

2. ఓమ్ శం నోమిత్రః। శం వరుణః। శం నో భవత్వర్యమా।
శం న ఇంద్రో బృహస్పతిః। శం నో విష్ణురురుక్రమః।
నమో బ్రహ్మణే। నమస్తే వాయో। త్వమేవ ప్రత్యక్షం
బ్రహ్మాఽసి। త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి॥
ఋతం వదిష్యామి। సత్యం వదిష్యామి। తన్మామవతు
తద్వక్తారమవతు। అవతు మామ్। అవతు వక్తారమ్।

ఓం శాంతిః శాంతిః శాంతిః॥

తాత్పర్యము :- సూర్యుడు మాకు సుఖమును కలుగజేయుగాక! వరుణుడు మాకు సౌఖ్యము నొసంగుగాక! అట్లనే అర్యముడు, ఇంద్రుడు, బృహస్పతి, విశాలరూపుడగు విష్ణువు మాకు సుఖమును కలుగజేయుదురుగాక! బ్రహ్మ

స్వరూపమైన వాయువునకు నమస్కారము. ఓ వాయువా! నీవే ప్రత్యక్షమైన బ్రహ్మస్వరూపముగా చెప్పగలను. నిన్ను ఋత స్వరూపముగను చెప్పగలను. (శాస్త్రమును, కర్తవ్యమును అతిక్రమింపబడకుండ బుద్ధియందు స్థిరమగు అర్థము ఋతమనబడును) సత్యస్వరూపముగను వచింపగలను. అ బ్రహ్మము నన్ను రక్షించును గాక! అచార్యుని రక్షించునుగాక! ప్రణవ స్వరూపమగునో పరబ్రహ్మమా ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధి దైవిక తాపములు శమనమగునుగాక!

స్వ.వం. 34

**3. ఓమ్ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే।**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే॥**
**ఓం శాంతిః శాంతిః శాంతిః॥**

తా:- అ బ్రహ్మము పూర్ణమైనది. (అది అపరోక్షముగనున్న బ్రహ్మము) పూర్ణము. ఇదియు (ప్రత్యక్షమునసున్న జీవాత్మయు) పూర్ణమే. పూర్ణము కంటె (పూర్ణము గనున్నదని యూహింపబడిన జగత్తుకంటె) పరిపూర్ణమైన బ్రహ్మము అతిక్రమించు చున్నది. ఆ పూర్ణవస్తువు(జీవుడు) పూర్ణమైన బ్రహ్మముయొక్క పూర్ణమును గ్రహించిన పూర్ణమే (అసంగమైన కూటస్థ స్వరూప బ్రహ్మమే) శేషించుచున్నది.

స్వ.వం - 34

**4. ఓం యశ్ఛందసామృషభో విశ్వరూపః । ఛందోభ్యోధ్య**
**మృతాత్సంబభూవ। సమేంద్రోమేధయా స్పృణోతు।**
**అమృతస్య దేవధారణో భూయాసమ్। శరీరం మే**
**విచర్షణమ్। జిహ్వా మే మధుమత్తమా। కర్ణాభ్యాం భూరివి**
**శ్రువమ్। బ్రహ్మణః కోశో౽సిమేధయా పిహితః। శ్రుతం మేగోపాయ॥**
**ఓం శాంతిః శాంతిః శాంతిః॥**

తా :- అమృత స్వరూపమును, వేదమువలన పుట్టినదై వేదములలో శ్రేష్ఠమైన దియు, బ్రహ్మస్వరూపమును, పరమేశ్వర స్వరూపమునగు ఓంకారము నన్ను మఱపులేని బుద్ధితో స్పృశించునుగాక! ప్రకాశస్వరూపమగు ఓ ప్రణవమా! బ్రహ్మజ్ఞానముయొక్కధారణనాకగుగాక। నా శరీరము పరిశుద్ధమగునుగాక! నాజిహ్వ మాధుర్యము గలది యగునుగాక! శ్రోత్రములచే నేననేకముల వినిన

వాడనగుదునుగాక! ఓంకారమా! నీవు బ్రహ్మకు స్థానమై లౌకిక ప్రజ్ఞచే గప్పబడిన దానవైతివి. ఇటువంటి నీవు నేను వినిన ఆత్మజ్ఞానము మొదలుగాగల విజ్ఞానమును రక్షింపుమా! నిత్యప్రార్థనావళి - 125

**5. ఓం వాఙ్మేమనసి ప్రతిష్ఠితా! మనోమేవాచి ప్రతిష్ఠితమావిరావీర్మ ఏధి। వేదస్యమ ఆణీస్థః। శ్రుతంమేమా ప్రహాసీరనేనాధీతేనాహో రాత్రాన్సందధామి। ఋతం వదిష్యామి। సత్యంవదిష్యామి। తన్మామవతు। తద్వక్తారమవతు। అవతు మామవతు వక్తారమ్।**

**ఓం శాంతిః శాంతిః శాంతిః॥**

సస్వరవేదమంత్రాలు - 39

తా :- నావాక్కు నిరంతరము మనః స్వరూపమున స్థిరమగునుగాక! నా మనస్సు వాక్కునందు నెలకొని యుండునుగాక! (వాక్కున్ను, మనస్సున్ను పరస్పర సహాయముగా నుండుగాక! యని ప్రార్థన) ఓ జ్యోతిస్వరూపమగు పరమాత్మా! నా అజ్ఞత్వమును బోగొట్టి నాకు ప్రకాశము కలుగునట్లు అనుగ్రహింపుము. ఓ మనోవాక్కులారా! నాకు దిగువనుదహరింపబడు గ్రంథము నొసంగుటకు సమర్థులగు దురుగాక! నాచే రచింపబడిన గ్రంథమును, దాని అర్థమును నేను మఱువకయుండును గాక! అధ్యయనము చేసి మఱువకయుండు గ్రంథమును నేను రేయింబవలు అనుసంధానము చేయుదును గాక! (అధ్యయనము చేయ బడిన గ్రంథమందు) యథార్థ వస్తువునే (పరమాత్మనే) అనుసరించెదను గాక! సత్యమునే వచింతునుగాక! మీద చెప్పిన పరమాత్మ శిష్యుడనగు నన్నును, బోధకులగు ఆచార్యులను రక్షించును గాక! నిత్యప్రార్థనావళి - 128

**6. ఓం అహం వృక్షస్యరేరివాకీర్తిః పృష్ఠంగిరేరివ।**
**ఊర్ధ్వ పవిత్రో వాజినీవ స్వమృతమస్మి।**
**ద్రవిణగ్ం సవర్చసమ్। సుమేధా అమృతోఽక్షితః।**
**ఇతి త్రిశంకోర్వేదానువచనమ్॥ ఇతి దశమోఽనువాకః॥**

**ఓం శాంతిః శాంతిః శాంతిః** తైత్తరీయోపనిషత్తు - 55

తా :- "నాశస్వరూపమైన జన్మజరామరణాదిరూపమగు దేహమను సంసార వృక్షమునకు అంతర్యామి స్వరూపముచేత ప్రేరకుడనున్నూ, పర్వతపృష్ఠభాగము

వలె ఖ్యాతిగలవాడనున్నూ, సూర్యునియందువలెనే ప్రసిద్ధమునగు పరిశుద్ధము నగు ఆత్మస్వరూపుడనున్నూ యగుచున్నాను. సంసారస్థిత్యుత్పత్తి సంహారముల యందు నైపుణ్యముయొక్క కూడిక వలన సర్వజ్ఞత్వలక్షణ రూపమైన మంచిబుద్ధి గలవాడను, మరణధర్మములేనివాడను, క్షీణింపనివాడనగుచున్నా"నని యీ ప్రకారము త్రిశంకుమహర్షి యొక్క ఆత్మైకత్వ జ్ఞానాను కూలమైన వాక్యమును (త్రిశంకుఋషిపంక్తి ఛందస్సు, పరమాత్మదేవత, బ్రహ్మవిద్యార్థ రూపమైన జపము నందు వినియోగము. ఇట్లు) దేవతాఛందస్సులతో నుపాసించువాడు స్వాధ్యాయ ప్రాప్తిద్వారా అంతఃకరణశుద్ధిగల్గి బ్రహ్మవిద్యాప్రాప్తి నొందుచున్నాడు. (ఈ మంత్రో పాసనవలన స్వాధ్యాయమున్నూ, ఆ స్వాధ్యాయమువలన అంతఃకరణ పరి శుద్ధియు, తద్వారా బ్రహ్మజ్ఞానోత్పత్తియు కల్పింపబడుచున్నది)

నిత్యప్రార్థనావళి - 126

7. ఓం అప్యాయన్తు మమాంగాని వాక్ప్రాణశ్చక్షుశ్శ్రోత్రమథో
బలమింద్రియాణి చ। సర్వాణి। సర్వం బ్రహ్మోపనిషదంమాఽహం
బ్రహ్మనిరాకుర్యాం। మా మా బ్రహ్మ నిరాకరోదనిరాకరణమస్త్వ
నిరాకరణం మేఽస్తు। తదాత్మని నిరతే య ఉపనిషత్సు
ధర్మాస్తే మయి సన్తు తే మయి సన్తు॥
ఓం శాంతిః శాంతిః శాంతిః॥

సస్వరవేదమంత్రాలు - 42

తా :- ఉపనిషత్తులచే ప్రతిపాదింపబడిన బ్రహ్మము నా యొక్క అంగములను, వాక్కు, నేత్రములు, ప్రాణము, కర్ణములు, బలము, ఇంద్రియములు మొదలగు వానిని తృప్తిపఱచునుగాక! వేదాంత ప్రతిపాద్యమైన బ్రహ్మయే సర్వమునగును. - బ్రహ్మము నన్ను నిరాదరణ చేయకుండునుగాక ! నేను బ్రహ్మమును నిరాదరణ చేయకుండునట్లను గ్రహించునుగాక! నా విషయమందు అదరణము కలుగు గాక! నాకు విశ్వాసము (లక్ష్య భావము) సంపన్నమగునుగాక! ఆ బ్రహ్మమందాసక్తి గల నాయందు ఉపనిషత్తులందు చెప్పబడిన ధర్మములేవి గలవో అవి యుండుగాక!

నిత్యప్రార్థనావళి - 127

**8. ఓమ్ భద్రం నో అపివాతయ మనః ఓం శాంతిః శాంతిః శాంతిః॥**

ఓ మనసా! మాకు శ్రేయమును సంపాదింప జేయుము.

**ఓమ్ భద్రం కర్ణేభిః శృణుయామదేవాః॥ భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః॥**
**స్థిరైరంగైస్తుష్టువాగ్ం సస్తనూభిః వ్యశేమ దేవహితం యదాయుః**
**స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః॥ స్వస్తి నః పూషా విశ్వవేదాః॥**
**స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః॥ స్వస్తినో బృహస్పతిర్దధాతు॥**
**ఓం శాంతిః శాంతిః శాంతిః॥** నిత్యప్రార్థనావళి - 129

తా :- ఓ దేవతలారా! గురుశిష్యులమగు మేము మీ మంగళకరమైన వాక్కులను చెవులారా వినెదముగాక! పూజ్యులైన యజ్ఞదేవతలారా! కన్నులచే మేము మీ మంగళకరములైన రూపముల చూచెదముగాక! దృఢమైనట్టి అవయవముల చేతను శరీరముల చేతను స్తోత్రముల చేయుచున్నవారమగుచు, మాజీవిత అయుర్దాయమేది గలదో దానిని దేవతలకు ప్రియమగునట్లు చేయుదుము గాక! సర్వదిగంత విశ్రాంత కీర్తి గల ఇంద్రుడు మాకు శుభముల నొసంగుగాక! సర్వజ్ఞుడైన సూర్యుడు మాకు శ్రేయములను గలుగజేయునుగాక! శుభముల కాధారుండైన గరుత్మంతుడు మాకు శుభమునిచ్చుగాక! దేవగురువైన బృహస్పతి మాకు మంగళము నొసంగుగాక! ని.ప్రా

**9. ఓం యో బ్రహ్మాణం విదధాతి పూర్వం! యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై! తం హ దేవమాత్మ బుద్ధిప్రకాశం! ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే॥**

**ఓం శాంతిః శాంతిః శాంతిః॥** నిత్యప్రార్థనావళి - 129

తా :- ఏ పరమాత్మ ప్రపంచ సృష్టికి ముందు హిరణ్యగర్భుని సృజించి వానికి వేదము లొసంగెనో, అట్టి స్వయంప్రకాశకుడును, అత్మబుద్ధియందంతర్యామి రూపమున నుండి తత్తత్కర్మానుసారముగ నాయాకార్యములందు నియమించు వాడునగు ఆ పరమాత్మను ముముక్షువగునేను శరణుబొందుచున్నాను..

నిత్యప్రార్థనావళి - 130

శాంతిమంత్రములు సంపూర్ణము.

శ్రీమతే రామానుజాయనమః



# గురుస్తుతి

శ్రీగురుపాదుకాభ్యాం నమః

శ్రీమతే నారాయణాయ నమః

పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయర్ స్వామివారు.

శ్రీ వైష్ణవాచార్య! శ్రీ జీయరుస్వామి! శుంభద్విశిష్టప్రభాద్వైత సిద్ధాంతలోక ప్రచారా! త్రిదండీ! సభాపూజ్య! నారాయణాచార్యదేవా!యతీంద్రా! భృహత్కీర్తిసాంద్రా! తపస్వీ! యశస్వీ! మనస్వీ! సదాచార! కందాడవంశీయ! పూర్వాశ్రమాన్వర్థ గోపాలనామోత్తరాచార్య! ప్రఖ్యాతనామా! గుణోద్దామ! అష్టాక్షరీమంత్ర దివ్యోప దేశా! జితాశామహాకోశ! విద్యాప్రకాశా! సుహృన్నిత్యవాసా! మహాభారతాంతర్గతో ద్భూత గీతా ప్రభోధా ధురీణా ఉదారస్వభావా! సదాతీర్థసంచార! సద్బ్రహ్మాచారీ! విరాగీ! పరివ్రాజకాచార్య! ప్రజ్ఞానిధీ! సర్వభాషాప్రవీణా! సదాసాత్వికాహార సంపన్న! స్మేరాననా! పావనా! కూర్మముద్రావినిర్మాణ దండ ప్రభా దివ్యహస్తా! త్రిలోక ప్రశస్తా! సుధీశిష్యవాత్సల్యమూర్తీ! మదీయాంతరంగాబ్జభృంగా! జితజ్ఞాన జీమూత వాతూల! సంసారదూరా! చిదానందయోగా! చతుర్మాసదీక్షాను లబ్ధ ప్రతిష్ఠా! మహాజీర్ణదేవాలయోద్ధారకా! వైదికాచార గ్రంథప్రచారా! సదాయజ్ఞ యాగాది సత్ పంచ సంస్కార సత్కార్య నిర్వాహణోత్సాహ!

సద్వెల్మ వంశాన విప్పర్ల గోత్రాన వేపూరి వారింట శ్రీ చిన్నరామయ్యకున్ పత్ని సీతమ్మకున్ పూర్వ పుణ్యంబునన్ చిన్నపుత్రుండనైపుట్టి, సంసారినై, ధర్మపత్నీ సమేతంబుగా తావకీనోపదేశంబులం పొంది శిష్యుండనై ధర్మవేదుండనై దానదాసానుదాసుండనై, దైవతధ్యానమగ్నుండనై తావాకాశీః ప్రభావంబు కల్మిన్, బహుగ్రంథకర్తృత్వ శక్తిన్ సమార్జించి, వంగూరు గ్రామంబునన్ "శేషగిర్యాఖ్య" జీవించుచున్నన్ దయాసాగరాచార్యవంశోత్తమా! వాసుదాసాశ్రమావాసి! రామానుజ స్వామి! ఎల్లప్పుడున్ శిష్యవాత్సల్యమున్ జూచి పాపంబులన్ బాపి రక్షింపగా వేడుకొందన్మదేకైక సచ్చిద్గురూత్తంసమా! దీనబంధూ! నమస్తే! నమస్తే! నమస్తే! నమః

జై శ్రీమన్నారాయణ

శ్రీమతే రామానుజాయ నమః

ఓమ్

శ్రీగురుపాదుకాభ్యాం నమః

శ్రీమతే నారాయణాయ నమః

# భగవత్ప్రార్థన

11. విష్వక్సేనం సకలవిబుధ ప్రౌఢ సైన్యాధినాథం।
ముద్రా చక్రే కరతలయుగే శంఖదణ్డౌ దధానమ్॥
మేఘశ్యామం సుఫణిమకుటం పీతవస్త్రం శుభాంగం।
ధ్యాయే దేవం విజితదనుజం సూత్రవత్యా సమేతమ్॥
దేవేంద్ర మౌళి మందార మకరంద కణా రుణాః।
విఘ్నం హరం తు హేరంబ చరణాంబుజ రేణవః॥
ఏకదంతం మహాకాయం తప్తకాంచన సన్నిభమ్।
విఘ్న నాశకరం దేవం హేరంబం ప్రణమామ్యహమ్॥

తా :- దేవేంద్రలోక మందారమకరంద రక్తవర్ణ కణాల వలె ఉన్న హేరంబ (వినాయక) పదకమల రేణువులు విఘ్నాన్ని తొలగించు గాక! ఏకదంతుడు, మహాకాయుడు, కరగించిన బంగారముతో సమానమైన కాంతి గలవాడు విఘ్ననాశకరుడైన హేరంబదేవునికి నా ప్రణామములు.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వ విఘ్నోపశాంతయే॥
తదేవలగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ।
విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతేతేఽఙ్ఘ్రియుగ్నం స్మరామి॥
యత్రయోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః।
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువానీతి ర్మతిర్మమ॥

స్మృతే సకలకల్యాణ భాజనం యత్రజాయతే,
పురుష స్తమజం నిత్యం వ్రజామి శరణం హరిమ్.
సర్వదా సర్వకార్యేషు నా స్తితేషా మమంగళమ్,
యేషాం హృదిస్థో భగవా న్మంగళాయతనం హరిః.
లాభస్తేషాం జయస్తేషాం కుతస్తేషాం పరాభవః,
యేషామిందీవరశ్యామో హృదయస్థో జనార్దనః.
ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదామ్,
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్.
యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్,
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే.
సమ్యజ్న్యాయకలాపేన మహతా భారతేన చ,
ఉపబృంహిత వేదాయ నమో వ్యాసాయ విష్ణవే.
వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేఃపౌత్ర మకల్మషమ్,
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్.
వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే,
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః.
మునిం స్నిగ్ధాంబుదాభాసం వేదవ్యాస మకల్మషమ్,
వేదవ్యాసం సరస్వత్యావాసం వ్యాసం నమామ్యహమ్.
అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరో హరిః,
అఫాలలోచనః శంభుర్భగవాన్ బాదరాయణః.
కృష్ణం కమల పత్రాక్షం పుణ్యశ్రవణ కీర్తనమ్,
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్.
కృష్ణాయ యాదవేంద్రాయ జ్ఞానముద్రాయ యోగినే,

నాథాయ రుక్మిణీశాయ నమో వేదాంతవేదినే.
ప్రపన్న పారిజాతాయ తోత్రవేత్రైకపాణయే,
జ్ఞానసముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః.
సారథ్యమర్జున స్యాదౌ కుర్వన్ గీతామృతం దదౌ,
లోక త్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః.
వసుదేవసుతం దేవం కంస చాణూరమర్దనమ్,
దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుమ్.
జ్ఞానం విశుద్ధం పరమార్థమేక మనన్తరం త్వ బహిర్బ్రహ్మ సత్యమ్।
ప్రత్యక్ప్రశాన్తం భగవచ్ఛబ్ద సంజ్ఞం యద్వాసుదేవం కవయోవదన్తి॥

సత్యమైనది జ్ఞానమొక్కటియే. అది నిర్మలమైనది. అతీతమైనది. సర్వగతమైనది. సర్వులయందు భాసించుచున్నది. ఈ అద్వైత జ్ఞానము యొక్క సంపూర్ణ రూపమే వాసుదేవుడు. భాగవతము 5-12-11

జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్ ।
ఆధారం సర్వ విద్యానాం హయగ్రీవ ముపాస్మహే॥

శ్రీ హయగ్రీవస్వామినే నమః.

శ్రీమతే రామానుజాయ నమః



# నిత్యానుష్ఠానచంద్రిక
## (పూర్వభాగము)

సూర్యోదయమునకు పూర్వమే ఆకాశమున నక్షత్రములుండగా బ్రాహ్మీ ముహూర్తమున గం.4.32ని.లకు నిద్రనుండి మేల్కొంచినది మొదలు రాత్రి 9 గంటలకు నిద్రించువరకు మానవుడుగా మానవతా ధర్మములను విద్యుక్త ధర్మముగా భావించి నిర్వర్తించ వలసిన నిత్యానుష్ఠానక్రమము.

**1.** నిద్ర నుండి మెలకువ రాగానే తటాలున లేవక కనులు తెరవక ఱొమ్మున కుడిచేయి యుంచి యీ క్రింది మంత్రములు జపింపదగును.

**ఉత్తిష్ఠ బ్రహ్మణ స్పతే, దేవయంతస్త్వేమహే**
**ఉపప్రయంతుమరుత స్సుదానవః**
**ఇంద్రప్రాశూర్భవా శుచా, ప్రైతుర్బ్రహ్మణస్పతిః**
**ప్రదేవ్యేతు సూనృతా అచ్ఛావీరం నర్యం పంక్తి**
**రాధసం దేవా యజ్ఞం న యంతు వః॥**
**వసురణ్యో విభూరసి, ప్రాణే త్వమసి సంధాతా**
**బ్రహ్మన్త్వమసి విశ్వస్య, క్తేజోదా స్త్వమస్యగ్నే**
**ర్వర్చోదాస్త్వమసి సూర్యస్య, ద్యుమ్నోదా**
**స్త్వమసి చంద్రమస ఉపయామ గృహీతోసి**
**బ్రహ్మణే త్వా మహస ఓమిత్యాత్మానం యుంజీత॥** బాలకాండ 652

**2.** కనులు తెరచుచూ కుడిప్రక్కనుండి లేచి అరచేతులను చూచుచూ

**కరాగ్రే వసతే లక్ష్మీః కరమధ్యే సరస్వతీ।**
**కరమూలే స్థితా గౌరీ ప్రభాతే కరదర్శనమ్॥**

(కరమూలేతు గోవిందః ప్రభాతే కరదర్శనమ్) అనియు చెప్పవచ్చును.

**3.** వెంటనే భూమాతపై కాలు మోపవలసి వచ్చినందులకు క్షమాపణ చెప్పుకుంటూ

**సముద్రవసనేదేవి పర్వతస్తనమండితే।**

**విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శం క్షమ స్వమే॥**

సముద్రమునే చీరగా గల దానవును, పర్వతములే స్తనములుగా గలదానవును, విష్ణువునకు భార్యవుగా నుండు నో భూదేవీ నీకు నమస్కారములు. నేను నీమీద పాదమును పెట్టుచున్నాను. నన్ను క్షమించుము.

**4.** 1. బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ చింతయే దాత్మనోహి చ।
స్మరణం వాసుదేవస్య కుర్యా త్కలి మలాపహమ్॥

2. అశ్వత్థామా బలిర్వ్యాసో హనుమాంశ్చవిభీషణః
కృపః పరశురామశ్చ సప్తైతే చిరంజీవినః॥
సప్తైతాన్ సంస్మరేన్నిత్యం మార్కండేయ మథాష్టమమ్॥

3. ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాన్
రుక్మాంగదోద్ధవ విభీషణ ఫల్గునాదీన్
పుణ్యానిమాన్ పరమ భాగవతాన్ స్మరామి॥

4. అహల్యా ద్రౌపదీ తారా సీతా మండోదరీ తథా ।
పంచకన్యాః పఠేన్నిత్యం మహాపాతక నాశనమ్॥

**5.** నిద్రలేవగానే, నిద్రపోయేముందు, ప్రయాణమయి బయలుదేరుటకు ముందు ఈ శ్లోకములు పారాయణ చేయుట చాలా మంచిది.

హనుమా నంజనా సూనుః వాయుపుత్రో మహాబలః,
రామేష్టః ఫల్గుణసఖః పింగాక్షో ఽమిత విక్రమః.
ఉదధిక్రమణశ్చైవ సీతాశోక వినాశకః
లక్ష్మణ ప్రాణదాతా చ దశగ్రీవస్య దర్పహా
ద్వాదశైతాని నామాని కపీంద్రస్య మహాత్మనః
స్వాపకాలే పఠేన్నిత్యం యాత్రాకాలే విశేషతః

తస్య మృత్యుభయం నాస్తి, సర్వత్ర విజయీభవేత్
యశ్శివో నామరూపాభ్యాం యాదేవీ సర్వమంగళా
తయోస్సంస్మరణా త్పుంసాం సర్వతో జయమంగళమ్
లాభస్తేషాం జయస్తేషాం కుతస్తేషాం పరాభవః
యేషామిందీ వరశ్యామో హృదయస్థో జనార్దనః
ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదాం,
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహం.
అగ్రతః పృష్ఠత శ్చైవ పార్శ్వతశ్చ మహాబలౌ
ఆకర్ణ పూర్ణ ధన్వానౌ రక్షేతాం రామలక్ష్మణౌ
సన్నద్ధః కవచీ ఖడ్గీ చాపబాణధరో యువా
గచ్ఛన్మమాగ్రతో నిత్యం రామః పాతు సలక్ష్మణః॥

6. ప్రాతః స్మరామి దధి ఘోష వినీత నిద్రం
నిద్రావసాన రమణీయ ముఖారవిందం।
హృద్యానవద్య వపుషం నయనాభిరామం
ఉన్నిద్ర పద్మనయనం నవనీతచోరమ్॥

పెఱుగు చిలుకబడుచుండగా ఆ శబ్దమును విని మేలుకొనునపుడు చక్కదనము తప్ప దోషమొకింతైనను లేని శరీరము కలిగి చూచువారికి కన్నులు పండువై వికసించిన తామరల వంటి నేత్రములు కల నవనీతచోరుడగు శ్రీకృష్ణుని ప్రాతఃకాలమున స్మరించుచున్నాను.

7. చిరమిహ వృజినార్త స్తప్యమానోఽనుతాపై
రవితృషపడమిత్రోఽలబ్ధశాంతిః కథంచిత్।
శరణద సముపేత స్త్వత్పదాబ్జం పరాత్మ
న్నభయమృతమశోకం పాహిమాం ఽఽ పన్నమీశ॥

మహాత్మా! నేను అనాదికాలమునుండియు నా యొక్క కర్మఫలములను అనుభవించుచు అనుభవించుచు మిగుల ఆర్తుడనైయున్నాను. వానియొక్క దుఃఖప్రదమగుజ్వాల రాత్రింబగళ్ళు నన్ను దహించుచున్నది. నా యొక్క ఆరు

గురు శత్రువులు (ఐదు యింద్రియములు ఒక మనస్సు) ఎన్నడును శాంతిచుట లేదు. వానియొక్క విషయ దాహము పెరుగుచునేయున్నది. ఎన్నడును ఏ విధముగను కూడ ఒక్క క్షణకాలమైనను నాకు శాంతి లభించుటలేదు. శరణదాతా! ఇపుడే నేను భయ, మృత్యు, శోకరహితమగు మీ పాదపద్మములను శరణుబొందినాను. సమస్త జగత్తుయొక్క ఏకైక ప్రభూ! పరమాత్మా! మిమ్ము శరణు బొందిన నన్ను రక్షింపుడు. భాగవతము 10-51-57

**8. శ్రీవల్లభేతి వరదేతి దయాపరేతి,**
**భక్తప్రియేతి భవలుంఠన కోవిదేతి,**
**నాథేతి నాగ శయనేతి జగన్నివాసే,**
**త్యాలాపనం ప్రతిపదం కురుమే ముకుంద.**

ఓ ముకుందా! (మోక్షప్రదాతా) లక్ష్మీపతీ! వరదాయకా! దయాపరా! భక్త వల్లభా! సంసారనాశననిపుణా! నాథా! శేషశయనా! జగదాధారా! యనెడి యాలపన మెల్లప్పుడును నాకు గల్గునట్లు చేయుము.

ముకుందమాల - 2 స్వస్వరూపానుసంధానము - 58

**9. శత్రుచ్ఛేదైకమంత్రం సకలముపనిషద్వాక్య సంపూజ్యమంత్రం**
**సంసారోత్తారమంత్రం సముపచిత తమస్సంఘ నిర్యాణమంత్రం**
**సర్వైశ్వర్యైక మంత్రం వ్యసన భుజగ సందష్ట సంత్రాణమంత్రం**
**జిహ్వే! శ్రీకృష్ణమంత్రం జప! జప! సతతం జన్మసాఫల్యమంత్రం.**

శత్రు సంహారకమును, ఉపనిషత్ప్రతిపాదితంబును, సంసారతారకంబును, ప్రబల అజ్ఞాన విధ్వంసకంబును, సకల సంపత్ప్రదంబును నాపత్పన్నగదష్టజన రక్షకంబును, జన్మసాఫల్యకరంబును, నగు శ్రీకృష్ణమంత్రమును ఓ నాలుకా నీవెల్లప్పుడును భజింపుము. ము.మాల - 16

**10. (కృష్ణ ప్రణామో న పునర్భవాయ)**
**కృష్ణవ్రతాః కృష్ణమనుస్మరంతో**
**రాత్రౌ చ కృష్ణం పునరుత్థితాయే**
**తే కృష్ణ దేహాః ప్రవిశంతి కృష్ణ**
**మాజ్యం యథామంత్రహుతం హుతాశే!**

అనగా శ్రీకృష్ణ పరమాత్మని నమస్కరించువారికి మఱుజన్మము లేదనియు, తమకు సర్వము కృష్ణుడేయని తెలిసికొని రాత్రింబవళ్ళు కృష్ణస్మరణము సేయు వాడు భ్రమరకీట న్యాయమున కృష్ణ స్వరూపము నొంది, అగ్నియందు వ్రేల్చిన హవిస్సువలె కృష్ణునియందే ప్రవేశించుచున్నారని చెప్పి తన పరమ భాగవత స్థితిని వెల్లడించెను. భారతోపన్యాసములు 5వ భాగము - 20

**11.** దేహబాధ ఉత్తర దిక్కును చూస్తూ కూర్చుని తీర్చుకొనవలయును. దంత ధావనము, స్నానము మెట్ల మీద చేయరాదు. ఉత్తరదిక్కును చూచుచు చేయ వలెను. దిగంబర స్నానము చేయరాదు. పైనుదహరించిన కార్యక్రమములు సూర్యోదయమునకు పూర్వమే చేయదగును.

**12. పురుషులు స్నానము చేయుటకు ముందు పఠించు మంత్రములు.**

**1. ఓం ఇదమాపః ప్రవహత, యత్కించ దురితంమయి**
**యద్వాహమభిదుద్రోహ, యద్వాశేప ఉతానృతం**

స్వస్వరూపసంధానము - 117

తా:- హే కరుణామయా? నేను ఏ ద్రోహములు చేసియున్నను ఏఅనతగని మాటలనియున్నను, ఏ హింసావాక్యముల నుడివియున్నను మరియు నాలో ఏ కొద్ది పాపములున్నను వానినెల్లను నశింపజేయుము. ఋగ్వేదము అష్ట1 అను2 వ 12

**2. ఓం ఆపోహిష్ఠా, మయోభువ, స్తాన ఊర్జే దధాతన,**
**మహేరణాయ చక్షసే.**

తా:- సుఖైశ్వర్యనిలయుడవగు ఓ సువర్ణమయా? మాకు యశస్సును ప్రసాదింపుము. ఐశ్వర్యసుఖములను దర్శింపచేయుము.

**3. యోవశ్శివతమోరస, స్తస్యభాజయతేహ నః**
**ఉశతీరివ మాతరః**

తా:- అమిత శ్రేయోవంతమగు నీయొక్క ఏ దివ్యతేజము కలదో దానిని యీ లోకమున మాకు ప్రసాదింపుము. తల్లివలె అపరాధములను మన్నింపుము.

**4. తస్మా అరంగమామవో, యస్యక్షయాయజిన్వథ,**
**ఆపో జనయథా చ నః.**

(అని పఠించుచూ శిరస్సుపై జలమును చల్లుకొనవలెను)

తా:- దేనిచే శ్రీప్రయశస్సు కలుగునో దానిని ప్రాప్తింపజేయుము. మరియు ఓ దేవా? నీవు మమ్ము ఆనందిపజేయుము. ఋగ్వేదము అష్ట 7 అను 6 వర్గ 5

**5. ఓం ఇషేత్వోర్జే, త్వా వాయవస్థ,**
**దేవో, వః సవితా ప్రార్పయతు,**
**శ్రేష్ఠతమాయ కర్మణ, అప్యాయ ధ్వ**
**మఘ్న్యా, ఇంద్రాయభాగం,**
**ప్రజావతీ రనమీవా, అయక్ష్మా,**
**మావస్తేన, ఈశత, మాఘశంసో,**
**ధృవా అస్మిన్, గోపతౌ, స్యాత,**
**బహ్వీ ర్యజమానస్య, పశూన్ పాహి.**

తా:- హే కరుణామయా? నీవు తేజోనిలయుడవు, నీవు ప్రాణాధారుడవు, సవితా స్వరూపుడవగు ఓదేవా? ఉత్కృష్ట సత్కర్మములను ప్రసాదింపుము. హే పరాత్పరా! సుఖైశ్వర్యమును బడయు పవిత్రతనిమ్ము. సమూహమునకు వివేకమును ఐశ్వర్యమును మరియు నిరోగము నిమ్ము. దొంగల యొక్కయు, పాపాత్ముల యొక్కయు స్వాధీనమున నుంచకుము. ఓ సత్యనిధీ? ఇట్టి సుఖైశ్వర్యములను ప్రాప్తింపజేసి పెక్కు సత్కర్ముల సందర్శనమున పోషింపుము.

(యజుర్వేదము. అ1, మం1) - స్వస్వరూపసందానము - 118

**6. అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాం గతోఽపివా,**
**యస్స్మరేత్పుండరీకాక్షం స బాహ్యాభ్యంతర శ్శుచిః,**
**పుండరీకాక్ష! పుండరీకాక్ష!! పుండరీకాక్షాయ నమః.**

అనుచు జలమును శిరస్సుపై ప్రోక్షించు(జల్లు)కొనవలయును.

తా:- అపవిత్రుడైనను, పవిత్రుడైనను సకల వ్యాపారముల బొందిన వాడైనను, ఎవడు పుండరీకాక్షుని స్మరించునో వాడు బాహ్యాంభ్యంతరముల శుచియగునని యర్థము. కనుక పుండరీకాక్షుని స్మరించవలయును.

స్నానానంతరము మరొక శుద్ధ వస్త్రముచేత తుడుచుకొనవలయునుగాని, స్నానము చేసిన వస్త్రముతోగాని, వట్టి చేతులతో గాని దేహమును తుడుచుకొన

కూడదు. స్నానము చేసి వస్త్రమును ధరించిన పిదప తలనుండి నీరు కార కూడదు. ముందుగా రెండు చేతులను, శిరస్సును ఆ తదుపరి దేహమును తుడుచుకొనవలయును. ద్విజుడు తెల్లని వస్త్రములను ధరించవలయును. నల్లని, ఎఱ్ఱని వస్త్రములు నిషిద్ధములు. పంచగోచీ కట్టక శాస్త్రీయ కర్మల నాచ రించగూడదు. జలముతో నిండిన పాత్రతో పూజాగృహమున ప్రవేశించ వలెను.

## 13. ద్వాదశోర్ధ్వపుండ్రాలు

1. పద్మపురాణం, వైష్ణవులు ఊర్ధ్వపుండ్రాన్నే ధరించాలని చెప్పింది. 12 స్థానాలలో భగవన్నామ సంకీర్తన పురస్సరంగా 12 ఊర్ధ్వపుండ్రాలు ధరించాలని చెప్పింది.

**లలాటే కేశవం విద్యాత్, కంఠే శ్రీపురుషోత్తమమ్।**
**నాభౌ నారాయణం దేవం, వైకుంఠం హృదయే తథా॥**
**దామోదరం వామపార్శ్వే, దక్షిణే చ త్రివిక్రమమ్।**
**మూర్ధ్ని, చైవ హృషీకేశం, పద్మనాభం చ పృష్ఠ తః॥**
**కర్ణయోర్యమునాంగంగాం, బాహ్వోః। కృష్ణం హరిం తథా।**
**యథాస్థానేషు తుష్యన్తి దేవతా ద్వాదశ స్మృతాః॥**

తా:- నుదిటిపై కేశవుణ్ణి భావిస్తూ పుండ్రాన్ని ధరించాలి. కంఠంపై పురుషోత్తముని, నాభిపై నారాయణదేవుని, హృదయంపై వైకుంఠుని, ఎడమవైపున (పార్శ్వభాగాన) దామోదరుని, దక్షిణ భాగాన త్రివిక్రముని, శిరస్సున హృషీకేశుని, వెనుకభాగాన పద్మనాభుని, కర్ణములకు క్రిందుగా గంగాయమునలను, రెండు బాహువుల యందు శ్రీకృష్ణ పరమాత్మను, శ్రీహరిని, ఇలా ఆయాస్థానాల్లో స్మరిస్తూ ఊర్ధ్వపుం డ్రధారణ చేయాలని పద్మపురాణం చెబుతుంది. స్థానాల విషయంలోను, స్మరంప దగిన నామాల విషయంలో స్వల్పమైన బేధం ఇతర గ్రంథాల్లో కనిపించినా, ద్వాదశోర్ధ్వపుండ్రధారణం పురాణ ప్రతిపన్నమని మనం గుర్తించాలి. ఇలా ఆయా స్థానాల్లో ఆయాదేవతలను స్మరిస్తూ పుండ్రధారణం చేసేవారిని దేవతలు పరితృప్తితోసానందంగా అనుగ్రహిస్తారని పద్మపురాణం చెబుతున్నది.

38 భక్తినివేదన - జూన్/2000

## 2. శ్రీచూర్ణము ధరించు పద్ధతి

ఓమ్ అచ్యుతాయనమః, ఓమ్ అనంతాయనమః, ఓమ్ గోవిందాయనమః, అనుచు మూడుపర్యాయములు జలమును గ్రహించి వాసుదేవునికి చేతులు జోడించి నమస్కరిస్తూ....

**అచ్యుతానంత గోవింద - నామోచ్చారణ భేషజాత్,**
**నశ్యంతి సకలా రోగాః - సత్యం సత్యం వదామ్యహమ్.**
**లలాటే సతతం దేవ్యాశ్రియా సహవిరాజితమ్।**
**చతుశ్చక్రం నమస్యామి కేవలం కనక ప్రభమ్॥**

రెండుకన్నులు మూసుకొని అంజలిహస్తుడై ధ్యానము చేయవలయును.

**శంఖచక్ర గదాపాణే ద్వారకా నిలయాచ్యుత।**
**గోవింద పుండరీకాక్ష రక్షమాం శరణాగతమ్॥**

శంఖ చక్రగదలను చేత ధరించినవాడా! ద్వారకలో నుండువాడా! అచ్యుతా! గోవిందా! పుండరీకాక్షా! శరణాగతుడనగు నన్ను రక్షించుము. అను ఈ మంత్ర మును నోట జెప్పక మనస్సులోనే ధ్యానించి "ఓం నమో భగవతే వాసుదేవాయ" అను మంత్రమును మనస్సున ముమ్మారుదలంచి వెనుక శరణాగతరక్షకా! రక్షించుము, అని మనస్సున దలంచుచు పురాణాచమనమును చేయుచు శ్రీచూర్ణమును ధరించవలయును.

**3. గోపీచందన! పాపఘ్న! విష్ణుదేహ సముద్భవ!**
**చక్రాంకిత! నమస్తుభ్యం ధారణాన్ముక్తిదో భవ!**

అను శ్లోకమును పఠించుచూ గోపీచందనమును గ్రహించి విష్ణుదేహము నుండి పుట్టిన దానవును, పాపములను నశింపజేయుదానవును, శ్రీ మహావిష్ణువు పాదములందుగల చక్ర చిహ్నములచేనంకితమైనదానవునునగు నోగోపీచంద నమా! నీకు నమస్కారము. నిన్ను ధరించుచున్నాను నాకు ముక్తినొసంగుము.

## 14. త్రికాల సంధ్యావందనము

**సంధ్యాముపాసతే యేతు సతతం సంచిత వ్రతాః।**
**విధూతపాపాస్తేయాన్తి బ్రహ్మలోక మనామయమ్॥**

త్రికాలములయందు క్రమము తప్పక సంధ్యావందనమాచరించువాడు, సమస్త పాపముల నుండి విముక్తుడై పునరావృత్తి రహితబ్రహ్మలోకమును పొందును. సంధ్యోపాసనమనగా బ్రహ్మోపాసన. దీనినుపదేశించువాడు తండ్రి. బ్రహ్మజ్ఞాన ప్రాప్తికి ద్వారమగు సంధ్యాధిష్ఠాన దేవతయగు గాయత్రినుపదేశించిన తండ్రియే గురువగును.

సంధ్యావందనమునకు పూర్వము 15 ప్రాణాయామములు చేయవలసి యుండును. దీనికి పూర్వము ఆచమనము చేయవలయును.

సంధ్యావందనమున అర్ఘ్యమిచ్చునప్పుడు హస్తములచే గ్రహించిన జలము భూమిపై పడరాదు మరియు అర్ఘ్యమిచ్చు సమయమున బొటనవ్రేళ్ళు చూపుడు వ్రేళ్ళకు తగలరాదు.

## ప్రాతఃకాలమందు

(హస్తము చేత జలము గ్రహించి ఈ క్రింది మంత్రము పఠించి ప్రాతఃకాలమున మంత్రాచమనమొనర్చవలయును)

సూర్యశ్చ మా మన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః।
పాపేభ్యో రక్షన్తాం। యద్రాత్ర్యాపాప మకార్షం। మనసా
వాచా హస్తాభ్యాం। పద్భ్యా ముదరేణ శిశ్నా। రాత్రి స్తదవలు
మ్పతు। యత్కించ దురితం మయి। ఇదమహం మా మమృత యో
నౌ। సూర్యే జ్యోతిషి జుహోమి స్వాహా॥

త్రికాల సంధ్యావందనము 3, 25

## మధ్యాహ్నమందు

ఆపః పునన్తు పృథివీం పృథివీ పూతా పునాతు మాం।
పునన్తు బ్రహ్మణస్పతి ర్బ్రహ్మ పూతా పునాతు మాం।
యదుచ్ఛిష్ట మభోజ్యం యద్వా దుశ్చరితం మమ।
సర్వం పునన్తు మా మాపో ఽసతాంచ ప్రతిగ్రహగ్ం స్వాహా॥

త్రి.సం.వ-3, 27.

సాయాహ్నమందు

అగ్ని శ్చ మామమన్యు శ్చ మన్యుపతయ శ్చ మన్యుకృతేభ్యః।
పాపేభ్యో రక్షన్తాం। యదహ్నా పాప మకార్షం। మనసా వాచా
హస్తాభ్యాం। పద్భ్యా ముదరేణ శిశ్నా। అహస్తదవలుమ్పతు।
యత్కించ దురితం మయి। ఇద మహం మా మమృతయోనౌ।
సత్యే జ్యోతిషి జుహోమి స్వాహా॥ త్రికాల సంధ్యావందనము 3,4,28

మార్జన మంత్రము

(ఈ చెప్పబోవు మంత్రములు పఠింపుచు దర్భలతో మార్జనము చేసికొన వలయును)

దధిక్రావ్ణ్ణో అకారిషం। జిష్ణోరశ్వస్య వాజినః। సురభినో
ముఖాకరతు ప్రాణ ఆయుగ్ంషితారిషత్
ఓం ఆపోహిష్ఠా మయోభువః। తాన ఊర్జే దధాతన।
మహేరణాయ చక్షసే। యోవశ్శివతమో రసః।
తస్యభా జయతేహనః। ఉశతీరివ మాతరః।
తస్మా అరంగ మామవః। యస్యక్షయాయ జిన్వథ।
ఆపో జనయథాచనః॥ త్రి.సం.వందనము - 4

15. సూర్యనమస్కార ధ్యాన శ్లోకములు

1. బ్రహ్మ స్వరూపముదయే మధ్యాహ్నేతు మహేశ్వరమ్।
   సాయం ధ్యాయే త్సదా విష్ణు త్రిమూర్తిం చ దివాకరమ్।
   వినతా తనయో దేవః కర్మసాక్షీ సురేశ్వరః।
   సప్తాశ్వః సప్తరజ్జు శ్చ అరుణోమే ప్రసీదతు।
   ఆదిత్యస్య నమస్కారం యే కుర్వంతి దినేదినే।
   జన్మాంతర సహస్రేషు దారిద్ర్యం నోపజాయతే॥
2. వికర్తనో వివస్వాంశ్చ మార్తాండో భాస్కరో రవిః।
   లోకప్రకాశకః శ్రీమాన్ లోక చక్షుర్గ్రహేశ్వరః।

**లోకసాక్షీ త్రిలోకేశః కర్తాహర్తా తమిస్రహా।**
**తపనస్తాపన శ్చైవ శుచి స్సప్తాశ్వవాహనః॥**
**గభస్తిహస్తో బ్రహ్మా చ సర్వదేవ నమస్కృతః॥**
**ఏకవింశతి రిత్యేషస్తవ ఇష్టస్సదామమ ।**
**శరీరారోగ్య దశ్చైవ ధనవృద్ధి యశస్కరః॥**
**స్తవరాజ ఇతిఖ్యాత స్త్రిషు లోకేషు విశ్రుతః॥**
**సర్వ పాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్॥**

ఈ సూర్యస్తవమును సాంబుడు సంధ్యాకాలముల (ప్రాతఃసాయంకాలము) యందు నిష్ఠతో పఠించి కుష్ఠురోగ విముక్తుడయ్యెనని భవిష్య పురాణము చెప్పెను.

**3. పద్మాసనః పద్మకరో ద్విబాహుః,**
**పద్మద్యుతి స్సప్త తురంగ వాహః,**
**దివాకరో లోకగురుః కిరీటీ,**
**మయి ప్రసాదం విదధాతు దేవః.**

పద్మాసనుడు, పద్మములను చేతులయందు బట్టుకొనిన వాడును, రెండు చేతులు గలవాడును, పద్మకాంతి గలవాడును, ఏడు గుఱ్ఱములనెక్కి తిరుగు వాడును, దివాకరుడును, లోకగురుడును, కిరీటము ధరించిన దేవుడు నాకు ప్రసన్నుడగునుగాక!

(సూర్య భగవానుని సప్త రథాశ్వముల నామములు 1. జయము, 2. అజయము, 3. విజయము, 4. జితప్రాణము, 5. జితశ్రమము, 6. మనోజవము, 7. జితక్రోధము)

**4. 1. యద్య జ్జన్మ కృతం పాపం మయా జన్మసు సప్తసు,**
**తన్మే రోగం చ శోకం చ హరమే రథసప్తమే.**
**2. ఏత జ్జన్మకృతం పాపం యత్త జ్జన్మాంతరార్జితం,**
**మనోవాక్కాయజం యచ్చజ్ఞాతా జ్ఞాతే చ యే పునః.**
**3. ఏవం సప్త విధం పాపం స్నానాన్మే సప్త సప్తికే,**
**సప్తవ్యాధి సమాయుక్తం హరమే రథ సప్తమే.**

4. సప్త సప్త మహాసప్త సప్తద్వీపా వసుంధరా,
కోటి జన్మార్జితం పాపం వినశ్యతి చ తత్ క్షణాత్.

6. 1. హంసాయ భువనధ్వాంత ధ్వంసాయా౽మిత తేజసే।
హంసవాహన రూపాయ, భాస్కరాయ నమోనమః॥

2. వేదాంగాయ, పతంగాయ, విహంగారూఢమూర్తయే।
హరిద్వర్ణ తురంగాయ, భాస్కరాయ నమోనమః॥

3. భువనత్రయ దీప్తాయ, భుక్తిముక్తి ప్రదాయ చ।
భక్త దారిద్ర్యనాశాయ, భాస్కరాయ నమోనమః ॥

4. లోకాలోక ప్రకాశాయ సర్వలోకైక చక్షుషే ।
లోకోత్తర చరిత్రాయ, భాస్కరాయ నమోనమః ॥

5. సప్తలోక ప్రకాశాయ, సప్త సప్తి రథాయ చ ।
సప్త ద్వీప ప్రకాశాయ, భాస్కరాయ నమోనమః ॥

6. మార్తాండాయ ద్యుమణయే, భానవే చిత్రభానవే ।
ప్రభాకరాయ మిత్రాయ, భాస్కరాయ నమోనమః ॥

7. నమః కమలనాథాయ, నమస్తే కమల ప్రియ ।
నమః కమల హస్తాయ, భాస్కరాయ నమోనమః ॥

8. నమస్తే బ్రహ్మరూపాయ, నమస్తే విష్ణురూపిణే ।
నమస్తే రుద్రరూపాయ, భాస్కరాయ నమోనమః ॥

9. సత్యజ్ఞాన స్వరూపాయ, సహస్ర కిరణాయా చ ।
గీర్వాణ భీతినాశాయ, భాస్కరాయ నమోనమః ॥

10 సర్వదుఃఖోప శాంతాయ, సర్వపాప హరాయ చ ।
సర్వవ్యాధి వినాశాయ, భాస్కరాయ నమోనమః ॥

11 సహస్రపత్ర నేత్రాయ, సహస్రాక్ష స్థితాయ చ ।
సహస్ర నామదేహాయ, భాస్కరాయ నమోనమః ॥

12. నిత్యాయ నిరవద్యాయ, నిర్మల జ్ఞాన మూర్తయే ।
నిగమార్థ ప్రకాశాయ, భాస్కరాయ నమోనమః ॥

13. ఆదిమధ్యాంత శూన్యాయ, వేదవేదాంత వేదినే ।
నాదబిందు స్వరూపాయ, భాస్కరాయ నమోనమః ॥

14. నిర్మల జ్ఞాన రూపాయ, రమ్యతేజ స్వరూపిణే ।
బ్రహ్మతేజ స్వరూపాయ, భాస్కరాయ నమోనమః ॥

15. నిత్యజ్ఞానాయ సత్యాయ, నిర్మల జ్ఞానమూర్తయే ।
నిగమార్థ ప్రకాశాయ, భాస్కరాయ నమోనమః ॥

16. కుష్ఠువ్యాధి వినాశాయ, దుష్టవ్యాధి హరాయ చ ।
ఇష్టార్థదాయినే తస్మై, భాస్కరాయ నమోనమః ॥

17. భవరోగైక వైద్యాయ, సర్వరోగాపహారిణే ।
ఏకనేత్ర స్వరూపాయ, భాస్కరాయ నమోనమః ॥

18. దారిద్ర్య దోష నాశాయ, ఘోరపాప హరాయ చ ।
దుష్ట శిక్షణ ధుర్యాయ, భాస్కరాయ నమోనమః ॥

19. హోమానుష్ఠాన రూపాయ, కాలమృత్యు హరాయ చ ।
హిరణ్యవర్ణ దేహాయ, భాస్కరాయ నమోనమః ॥

20. సర్వ సంపత్ప్రదాత్రే చ, సర్వదుఃఖ వినాశినే ।
సర్వోపద్రవ నాశాయ, భాస్కరాయ నమోనమః ॥

21. నమోధర్మ నిదానాయ, నమస్సుకృత సాక్షిణే ।
నమః ప్రత్యక్ష రూపాయ, భాస్కరాయ నమోనమః ॥

22. సర్వలోకైక పూర్ణాయ, కాలకర్మాఘ హారిణే ।
నమః పుణ్య స్వరూపాయ, భాస్కరాయ నమోనమః ॥

23. ద్వంద్వ వ్యాధి వినాశాయ, సర్వదుఃఖ వినాశినే ।
నమఃతాపత్రయఘ్నాయ భాస్కరాయ నమోనమః ॥

24. కాలరూపాయ, కల్యాణమూర్తయే, కారణాయ చ ।
విద్యాయ భయ సంహర్త్రే, భాస్కరాయ నమోనమః ॥

7 అథశ్రీ సూర్యాష్టక ప్రారంభః

సాంబ ఉవాచ

1. ఆదిదేవ నమస్తుభ్యం ప్రసీద మమ భాస్కర ।
దివాకర నమస్తుభ్యం ప్రభాకర నమోస్తుతే ॥

2. సప్తాశ్వ రథమారూఢం ప్రచండం కశ్యపాత్మజమ్ ।
శ్వేతపద్మధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్ ॥

3. లోహితం రథమారూఢం సర్వలోక పితామహమ్ ।
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్ ॥

4. త్రైగుణ్యం చ మహాశూరం బ్రహ్మ విష్ణు మహేశ్వరమ్ ।
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్॥

5. బృంహితం తేజసాం పుంజం వాయురాకాశమేవ చ ।
ప్రభుస్త్వం సర్వలోకానాం తం సూర్యం ప్రణమామ్యహమ్॥

6. బంధూక పుష్ప సంకాశం హారకుండల భూషితమ్ ।
ఏకచక్రధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్ ॥

7. విశ్వేశం విశ్వకర్తారం మహాతేజః ప్రదీపకమ్ ।
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్॥

8. శ్రీవిష్ణుం జగతాం నాథం జ్ఞాన విజ్ఞాన మోక్షదమ్ ।
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్॥
(అంతర్జ్యోతి ర్బహిర్జ్యోతిః ప్రత్యగ్జ్యోతి ర్పరాత్పరః
జ్యోతిర్జ్యోతి స్స్వయం జ్యోతి రాత్మజ్యోతిః శివో౽స్మ్యహమ్ ॥)

9. సూర్యాష్టకం పఠేన్నిత్యం గ్రహపీడా ప్రణాశనమ్ ।
అపుత్రో లభతే పుత్రం దరిద్రో ధనవాన్ భవేత్ ॥

10. ఆమిషం మధుపానం చ యః కరోతి రవేర్దినే।
నప్తజన్మ భవేద్రోగీ జన్మజన్మ దరిద్రతా ॥

11. స్త్రీతైల మధుమాంసాని యస్త్యజేత్తు రవేర్దినే ।
న వ్యాధి శోక దారిద్ర్యం సూర్యలోకం న గచ్ఛతి ॥

ఇతి శ్రీశివప్రోక్తం శ్రీ సూర్యాష్టకం సంపూర్ణమ్ ॥

## 8. సూర్యహృదయ స్తోత్రము

1 ఓం ఖద్యోతాయ చ శాంతాయ కారణత్రయ హేతవే,
నివేదయామి చాత్మానం నమస్తే విశ్వరూపిణే.

2 నమస్తే ఘృణినే తుభ్యం సూర్యాయ బ్రహ్మరూపిణే,
త్వమేవ బ్రహ్మ పరమ మాపోజ్యోతీ రసోమృతం.

3 భూర్భువస్త్వం స్త్వమోంకార శ్శర్వో రుద్ర స్సనాతనః,
పురుషస్సన్మహోంతస్థం ప్రణమామిక పర్దినం.

4 త్వమేవ విశ్వం బహుధాజాతం యజ్జాయతే చ యత్
నమో రుద్రాయ సూర్యాయ త్వామహం శరణం గతః

5 ప్రచేతసే నమస్తుభ్యం నమో మీఢుష్టమాయ చ,
నమోస్తు నీలగ్రీవాయ నమస్తుభ్యం పినాకినే.

6 విలోహితాయ భర్గాయ సహస్రాక్షాయతే నమః,
తమో ౖపహాయతే నిత్యమాదిత్యాయ నమోస్తుతే.

7 నమస్తే వజ్రహస్తాయ త్ర్యంబకాయ నమోనమః,
ప్రపద్యే త్వాం విరూపాక్షం మహాంతం పరమేశ్వరం.

8 హిరణ్మయే గృహే గుప్తమాత్మానం సర్వదేహినాం,
నమస్యామో పరంజ్యోతిర్బ్రహ్మాణం త్వాం పరామృతం.

9 విశ్వం పశుపతిం భీమం నరనారీ శరీరిణం,
నమస్సూర్యాయ రుద్రాయ భాస్వతే పరమేష్ఠినే.

10 ఉగ్రాయ సర్వరక్షాయ త్వాం ప్రపద్యే సదైవహి,
ఏతద్వై సూర్యహృదయం జప్త్వా స్తవ మనుత్తమమ్.

11 ప్రాతఃకాలేఽథ మధ్యాహ్నే నమస్కుర్యాద్దివాకరమ్,
ఇదం పుత్రాయ శిష్యాయ ధార్మికాయ ద్విజాతయే,
ప్రదేయం సూర్యహృదయం బ్రహ్మణాతు ప్రదర్శితమ్,
సర్వపాప ప్రశమనం వేదసార సముద్భవమ్
బ్రాహ్మణానాం హితం పుణ్యమృషి సంఘైర్నిషేవితమ్ ॥

సూర్యస్మరణము

9. 1 ప్రాతః స్మరామి ఖలు తత్స వితుర్వరేణ్యం,
రూపం హి మండల మృచోఽథ తనుర్యజూంషి.
సామాని యస్య కిరణాః ప్రభవాది హేతు,
బ్రహ్మ హరాత్మక మలక్ష్య మచింత్యరూపమ్.

2 ప్రాతర్నమామి తరణిం తనువాఙ్మనోభి
ర్బ్రహ్మేంద్రపూర్వక సురైర్నుత మర్చితం చ
వృష్టి ప్రమోచన వినిగ్రహ హేతు భూతం
త్రైలోక్యపాలనపరం త్రిగుణాత్మకం చ

3 ప్రాతర్భజామి సవితార మనంతశక్తిం,
పాపౌఘ శత్రుభయ రోగహరం పరం చ,
తం సర్వలోక కలనాత్మక కాలమూర్తిం,
సంసారబంధన విమోచన మాదిదేవమ్.

4 శ్లోకత్రయ మిదం భానోః ప్రాతఃప్రాతః పఠేత్తుయః
స సర్వవ్యాధి నిర్ముక్తః పరం సుఖ మవాప్నుయాత్.

10. ఆదిత్య హృదయము

"ఆదిత్యహృదయ" మను స్తోత్రము కలికల్మషాపనోదకమై యితిహాసరత్న

మనంబడు శ్రీమద్వాల్మీకి రామాయణమున యుద్ధకాండమునందలి నూట యేడవ సర్గమున కనబడుచున్నది.
(ఆచమనముచేసి) మూడు పర్యాయములు ఆ హృదయము పఠించవలెను.

**1 తతో యుద్ధపరిశ్రాంతం సమరే చింతయా స్థితమ్ ।**
**రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్ ॥**

**2 దైవతైశ్చ సమాగమ్య ద్రష్టుమభ్యాగతో రణమ్ ।**
**ఉపాగమ్యా ఽబ్రవీద్రామ మగస్త్యో భగవాన్ ఋషిః ॥**

తా :- రావణుని యొక్క సారథి అతని యాజ్ఞ ప్రకారము రణరంగములో రథముంచిన తరువాత రామ-రావణ యుద్ధాన్ని చూచుటకై వచ్చిన దేవతలతో గూడ వచ్చినవాడును భూత భవిష్య వర్తమానములను మూడు కాలములు ఎఱిగిన యగస్త్య మహర్షి అంతవరకు రావణునితో జరిగిన యుద్ధములో అలసియున్నవాడై మరల యుద్ధము కొరకు వచ్చిన రావణుని యెదురుగజూచి పరత్వ ప్రకటన లేకుండ మనుష్యుడుగానే వ్యవహరించుచు నీతని చంపుటెట్లా యని చింతలో మునిగియున్న రాముని దగ్గరకు వచ్చి యాతనితో నిట్లు పలికెను.

**3 రామరామ మహాబాహో శృణు గుహ్యం సనాతనమ్ ।**
**యేన సర్వానరీన్ వత్స సమరే విజయష్యసి ॥**

**4 ఆదిత్య హృదయం పుణ్యం సర్వశత్రు వినాశనం ।**
**జయావహం జపేన్నిత్య మక్షయ్యం పరమం శివమ్ ॥**

**5 సర్వ మంగళ మాంగల్యం సర్వపాపప్రణాశనమ్ ।**
**చింతాశోకప్రశమనం ఆయుర్వర్ధనముత్తమమ్ ॥**

తా:- ఓ మహాబాహూ! నాయనా! రామా! రహస్యమైనది, వేదము వలె నిత్యమైనది యునగు స్తోత్రమును వినుము. దీనివలన యుద్ధమున సమస్త శత్రువులను జయింపగలవు. ఆదిత్యహృదయము పరమపావనమైనది. మనలోపలగల కామ క్రోధాలు అను అంతఃశత్రువులను, వెలుపల మనలను ద్వేషించువారిని, మనము ద్వేషించువారిని, (ఇటువంటి శత్రువులనందరిని) నశింపజేయుశక్తి యీ స్తోత్రములో ఉంది. శుభం కల్గుతుంది. లభించిన జయము, కూడిన శుభము కలకాలము నిలబడతాయి. సర్వమంగళములకును మంగళమునిచ్చును.

ఈ మహామంత్రము సకల పాపములను పోగొట్టి ఆయుస్సును పెంచి చింతాశోకములను రెంటినీ ఉపశమింపజేస్తుంది. ఇంతకుమించిన స్తోత్రము లేదు. కోరిక లేకుండా స్తుతించు భక్తులకు మోక్షమిచ్చును.

**6 రశ్మిమంతం సముద్యంతం దేవాసుర సమస్కృతమ్ ।**
**పూజయశ్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరమ్ ॥**

తా:- ప్రశస్త కిరణములు గలవాడును, అర్థోదయాదులు లేక చక్కగనుదయించు వాడును, సత్వరజస్తమోగుణములకు ప్రతీకలైన దేవాసుర నమస్కృతుడును, తన తేజముచే నితరతేజమును మఱుగుపఱుచువాడును, భాస్కరుడునగు భువనేశ్వరుని (పరమాత్మను) నారాధింపుము.

**7 సర్వదేవాత్మకోహ్యేష తేజస్వీ రశ్మిభావనః ।**
**ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః ॥**

తా:- సమస్త దేవతలు శరీరముగా గలవాడును, పరులనెదురించు సామర్థ్యము గలవాడును, నిత్యముక్తులను నిర్వహించువాడును, కలిగించువాడును, కిరణ ములచే పొందించువాడును అగు ఇతడు దైవ ప్రకృతిగల వారియొక్కయు, అసుర ప్రకృతి గలవారి యొక్కయు సమూహములను, జనములను కాంతిలేశ ములచే రక్షించుచున్నాడు.

భాస్కరుని ఉపాశించవలసిందని ఉపదేశించిన తరువాత దేవతలెందరో ఉండగా ఈ సూర్యునే ఏల పూజించవలయును? అను సందేహమును తొల గింప అగస్త్య మహర్షి యిటుల చెప్పుచున్నాడు. సకల దేవతలు ఆ భాస్క రునిలోనే మూర్తీభవించియున్నారు. దేవతలను రాక్షసులను సమభావముతో పోషించు సాత్త్విక స్వభావము సూర్యకిరణాలలో స్వతస్సిద్ధంగా ఉందట. ఈ సూర్యుడు మంచివారికి, చెడ్డవారికి, ఉన్నవారికి, లేనివారికి, పండితులకు పామ రులకు, పూరిగుడిసెలకు, రాజభవనములకు, జడములకు, చేతనములకు, పుణ్యాత్ములకు, పాపాత్ములకు అందరకు సమానంగా ప్రకాశము ప్రేరణ కలుగజేయుచున్నాడు.

**8 ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివస్స్కందః ప్రజాపతిః ।**
**మహేంద్రో దనదః కాలో యమస్సోమో హ్యాపాంపతిః ॥**

తా:- ఈతని శరీరమె సమస్త దేవతలు. ఇతడే బ్రహ్మ, విష్ణువు, శివుడు,

కుమారస్వామి, తొమ్మండుగురు ప్రజాపతులును, దేవేంద్రుడును, కుబేరుడును, మృత్యువును, యముడును, చంద్రుడును, సముద్రుడును (లేక) వరుణుడును,

**9 పితరో వసవస్సాధ్యాహ్యశ్వినౌ మరుతో మనుః ।**
**వాయుర్వహ్నిః ప్రజాప్రాణా ఋతుకర్తా ప్రభాకరః ॥**

సూర్యుని సర్వదేవాత్మకత్వము అంతటితో ఆగలేదు. వంశవృద్ధికరులైన పితరులు, ఎల్లప్పుడుండే వసువులెనిమిదిమంది, బ్రహ్మముఖము నుండి సృజింపబడి మంత్రమూర్తులైన సాధ్యులు పన్నెండుమంది, అధివ్యాధులు పోగొట్టు అశ్వినీదేవతలు, ప్రజలకు ప్రాణము పోయు ప్రజాపతి, ఆ ప్రాణములను హరించే యముడు, భూమిని సస్యశ్యామలము చేసే చంద్రుడు, ఆలోచనలను ఇచ్చు మనువు, గాలి, నిప్పు, ఊపిరి, ఋతువులు, పగలు, రాత్రి వీటన్నిటికి మూలాధారము సూర్యుడే. సూర్యుని సహాయముతోనే యీ పనులన్నియు యథావిధిగా సాగుచున్నవి. ఇట్లింతవరకు సూర్యభగవానుడు సర్వదేవతా స్వరూపుడైనందున సూర్యమండలాంతర్యామియగు పరబ్రహ్మోపాసన చేతనే సర్వదేవతోపాసన ఫలము సిద్ధించగలదని ఈ స్తోత్ర మహత్త్యము నిరూపింపబడినది.

ఈ స్తోత్రము నుండి ఆదిత్యహృదయస్తోత్రము ప్రారంభము.

**10 ఆదిత్య స్సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్ ।**
**సువర్ణ సదృశో భాను ❖ర్హి రణ్యారేతా దివాకరః ॥**

❖'సుపర్ణస్తపనో' అని పాఠాంతరము. ❖ 'స్వర్ణరేతా' అను పాఠాంతరము గలదు.

సుపర్ణస్తపనో:- (ద్వాసుపర్ణాసయుజాసఖాయౌ = ఇద్దఱు సుపర్ణులు కూడ నుండువారలును స్నేహితులును) అను శ్రుతి, జీవాత్మ పరమాత్మలను నిర్దేశించుచున్నది. సుపర్ణః = మంచి ఱెక్కలు గలవాడవు, తపనః = తపింపజేయువాడవు. లేక (సువతి = ప్రేరయతి జగదితి లోకములను పేరేచు (ప్రేరేపణ) వాడు. సూర్యః (సు తిజనాన్ కర్మణి సతి = జనులను కర్మలయందు ప్రేరేపించువాడు, లేక, స్థావరజంగమాత్మక జగదంతర్యామియగు సూర్యశబ్దవాచ్యుడు, సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ = ఈ జగత్తుకు ఆత్మ సూర్యుడు, అను శ్రుతిచేతను, "ధియో యోనః ప్రచోదయాత్" అను శ్రుతి చేతను) = సూర్యుడవు, ఖగః (ఖేగచ్ఛతి = లోకోపకారము కొఱకు) ఆకసమున దిరుగువాడవు, లేక (ఖం గచ్ఛతి ఇతి) =

దహరాకసమును బొందిన వాడవు, (అనగా నుపాసకులు దహరాకసమున నిను జూతు రనుట), పూషా = (పుష్ణాతివర్షేణ జగదితి=లోకమును వర్షమును గురించి) పోషించువాడవు. గభస్తిమాన్ = మంచి కిరణములు గలవాడవు,లేక గభస్తిః (గాం, దిశం వ్యాప్య-భాసతే ఇతి = దిక్కులందంతట వ్యాపించినది అనగా, లక్ష్మి (అమెను గలవాడవు. లక్ష్మి సర్వవ్యాపిని యనినందులకు 'యథాసర్వగతోవిష్ణుః తథై వేయం ద్విజోత్తమ' - ఓ బ్రాహ్మణుడా! విష్ణువెట్లు సర్వవ్యాపియో లక్ష్మియు నట్లే అను పరాశరవచన ప్రమాణము. సువర్ణసదృశః = బంగారపు వన్నెగలవాడు, "హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశ అప్రణఖాత్సర్వ ఏవ సువర్ణః" బంగారు మీసము గలవాడును, బంగారు వెంట్రుకలు గలవాడును, గోళ్ళు మొదలు శరీరమం తయు బంగారమే - అను శ్రుతి ప్రమాణము. భానుః = (తమేవ భాంత మను భాతిసర్వం," ప్రకాశించువాని ననుసరించియే యంతయు బ్రకాశించును. అను నట్లు) ప్రకాశించు వాడవు. హిరణ్యరేతాః = (అప ఏవ ససర్జాదౌ తా సు వీర్య మపా సృజత్, తదండమభవద్ధైమం సహస్రాంశు సమ ప్రభమ్" మొదట జలమునే సృజించెను. అందు వీర్యము నుంచెను. అది సూర్యుని వలె ప్రకాశించు సువర్ణాం డమయ్యెను. - (మనుస్మృతి) అనునట్లు బంగారు వికారమైన రేతస్సు గలవాడవు. (అనగా కారణమెట్టిదో కార్యమునట్లేయుండునుగాని అతని రేతస్సు హిరణ్మ యము గనుకనే బ్రహ్మాండము సైతము హిరణ్మయము నయ్యెననుట). దివా కరః = పగలు సేయువాడు, లేక, దివా = అహ్ని ప్రాణినశ్చేష్టాం కరోతి ఇతి - అనగా : పగలు ప్రాణులకు చేష్టలనుగలిగించువాడవు. లేక దివాంద్యుతిం కరోతి ఇతి = వెలుతురును (జ్ఞానమును) జేయువాడవు. అనగా "తేషాం సతత యుక్తా నాం భజతాం ప్రీతి పూర్వకమ్, దదామి బుద్ధియోగం తం యేన మాముప యాంతితే" - అజ్ఞానమును బోగొట్టి విజ్ఞానమును గలుగజేయువాడనుట.

గీత 10/10. తా సుగమము

**11 హరిదశ్వ స్సహస్రార్చి స్సప్త సప్తిర్మరీచిమాన్ ।**
**తిమిరోన్మథన శ్శంభు స్త్వష్టా మార్తాండ అంశుమాన్ ॥**

పచ్చని గుఱ్ఱములు గలిగి వేయి కిరణంబులతో నొప్పినవాడు. సప్తనామక (1.జయము, 2.అజయము, 3.విజయము, 4.జితప్రాణము, 5.జితశ్రమము, 6.మనోజవము, 7.జితక్రోధము) అశ్వములు గలవాడు. శంఖ చక్ర గదా పద్మ ములు ధరించువాడు. చీకటిని పోగొట్టినవాడును, సుఖమును గల్గించువాడును,

సమస్త రూపములను కృశింపజేయువాడును, మరణించిన అండమునుండి పుట్టినవాడును (మార్తాండుడు) కిరణములతో నొప్పువాడు అని తాత్పర్యము.

**12 హిరణ్యగర్భశ్శిశిరస్తపనో భాస్కరో రవిః ।**
**అగ్నిగర్భో௨దితేః పుత్రః శంఖశ్శిశిరనాశనః ॥**

హిరణ్యగర్భః = బంగారు వికారమగు అండమును గర్భము నందు గల వాడు. అందుకే అతడు హిరణ్యగర్భుడు. సృష్టికి అది అధారం ఆ హిరణ్యమే. ఈ హిరణ్యం సూర్యగర్భంలో పుష్కలంగా వుంది. ఎంత కాళరాత్రి గడిచినా సూర్యుడుదయించుటతో ఆశలు చిగురిస్తాయి. శిశిరంలో వున్న చల్లదనం, సుఖం సూర్యునివల్లే లభిస్తాయి. అనగా తాపత్రయతప్తులకు విశ్రాంతి స్థానము సూర్యుడే. ఆ సూర్యుడే మండు వేసవిలో తపనుడై భూమిని తపింపజేస్తాడు. కాంతినిచ్చే భాస్కరుడే చైతన్యాన్ని ప్రసాదించే అంతస్తేజస్సును వెలయించే రవియౌతాడు. అతని కడుపులో బంగారమున్నట్లే అగ్ని కూడ వున్నది. అదితికి అల్లారుబిడ్డగాన అతడున్నచోటు పవిత్రమౌతుంది. "శంఖ" అను శబ్దములో శం అను పదము సుఖమును ఖ అను శబ్దం ఆకాశాన్ని తెలుపునుగాన సూర్య గమనం ఆకాశానికి పావనత్వం యిస్తుంది. అతడున్నచోట మంచు నిల్వనందున మంచును హరించి మంచిని పెంచే మహనీయుడు సూర్యుడు.

**13 వ్యోమనాథ స్తమోభేదీ ఋగ్యజుస్సామపారగః ।**
**ఘనవృష్టి రపాంమిత్రో వింధ్యవథీ ప్లవంగమః ॥**

"వింధ్యవీధిః ప్లంవంగమః" అని పాఠాంతరము. వింధ్యవీధిః = (దక్షిణా యనమందు) వింధ్యపర్వతము మార్గముగా గలవాడు. లేక సుషుమ్నా మార్గము గలవాడు. ఆ మార్గగాములే నిన్ను పొందగలరు. ప్లవంగమః = వేగముగ నడుచువాడు. త్వరలో సిద్ధి బొందించువాడు. సమస్త కర్మ ఫలములను యిచ్చు వాడు. పారంగతుడు = దరిచేరినవాడు.

**14 ఆతపీమండలీ మృత్యుః పింగళస్సర్వతాపనః ।**
**కవిర్విశ్వో మహాతేజా రక్తస్సర్వ భవోద్భవః ॥**

ఎండగలవాడు, గుండ్రమైన యాకారముగలవాడు. అనగా కౌస్తుభాది భూషణములు గలవాడు. కోపం వస్తే కాలాగ్నిలా మండిపడును. సూర్య మండలం అతనికి జన్మకుండలి. ఆ మండలికి అతనే ప్రభువు. ఉదయకాలంలో

పింగళవర్ణంలో వుంటాడు. అవసరమైనప్పుడు ప్రాణులందరినీ తపింపచేస్తాడు. నూతనంగా ప్రపంచాన్ని సృష్టించగలవాడు గాన కవియను నామము ఈతనికి సార్థకము. విశ్వరూపుడైన అతని దివ్యతేజస్సులో రంజిల్లని అంశము లేదు. అన్ని భావాలకు, భవనములకు అతడే మూలము.

**15 నక్షత్ర గ్రహ తారాణా మధిపో విశ్వ భావనః ।**
**తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మ న్నమోஉస్తుతే ॥**

ఈ ద్వాదశాత్మస్తుతితోటి ఆదిత్య హృదయంలోని పూర్వభాగం అంటే స్తుతిభాగం ముగిసింది. ఆకాశంలో కనిపించే అశ్విని మొదలు రేవతి వరకు గల 27 నక్షత్రములకు కదలిక గల గ్రహములకు కదలిక లేని చుక్కలకు సూర్యుడే ప్రభువు, మరియు తేజస్వంతుడవు అనగా సమస్త తేజస్సుల నణచునట్టి మహాతేజస్సు గలవాడు.

**"ద్యౌస్స చంద్రార్క నక్షత్రం ఖం దిశో భూర్మహోదధిః,**
**వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః,,**

స్వర్గము చంద్ర సూర్య నక్షత్రములతో నుండు ఆకాశము, దిక్కులు, భూమి, సముద్రము ఇవన్నియూ మహాత్ముడగు వాసుదేవుని వీర్యము చేతనే నిలిచి యున్నవి - - అని మహాభారతము.

మన సూర్యునిలాంటి సూర్యులు అనేకమంది బ్రహ్మాండములో ఉన్నారు. వారికి ఆదిసూర్యుడు, ఆదిత్యుడు - అలాటి ఆదిత్యులు 12 మంది.

**"ఇంద్రోధాతాభగః పూషామిత్రోధ వరుణోర్యమా,**
**అర్చిర్వివస్వాన్ త్వష్టా చ సవితా విష్ణురేవ చ**

1.ఇంద్రుడు, 2.దాత, 3.భగుడు, 4.పూషుడు, 5.మిత్రుడు, 6.వరుణుడు, 7.అర్యముడు, 8.అర్చిస్సు, 9.వివస్వంతుడు, 10.త్వష్ట, 11.సవిత, 12.విష్ణువు - అని ద్వాదశాదిత్యులు. వీరియందంతర్యామియైనవాడా! నీకొఱకు నమస్కారము. - మరియు ఈ ద్వాదశాదిత్యుల - నామములతో కూడ ధ్యానిస్తుంటారు పెద్దలు. 1. ఓం మిత్రాయనమః, 2. ఓం రవయేనమః, 3. ఓం సూర్యాయనమ, 4. ఓం భానవేనమః, 5. ఓం ఖగాయనమః, 6.ఓం పూష్ణేనమః, 7.ఓం హిరణ్య గర్భాయ నమః, 8.ఓం మరీచియేనమః, 9. ఓం ఆదిత్యాయనమః, 10.ఓం

సవిత్రేనమః, 11. ఓం అర్కాయనమః, 12. ఓం భాస్కరాయనమః -

అదిత్యుడంటే సూర్యుడు. అమరకోశమందు 31 పేరికి 37 నామము లున్నవి. అవి యకారాది క్రమమున వ్రాయబడుచున్నవి. పఠించండి.

సూర సూర్యార్యమాదిత్య ద్వాదశాత్మ దివాకరాః ॥
భాస్కరా హస్కర బ్రధ్న ప్రభాకర విభాకరాః ।
భాస్వ ద్వివస్వ త్సప్తాశ్వ హరిదశ్వోష్ణ రశ్మయః ॥
వికర్తనార్క మార్తాండ మిహిరారుణ పూషణ : ।
ద్యుమణి స్తరణి ర్మిత్ర శ్చిత్రభాను ర్విరోచనః ।
విభావసుర్గ్రహపతి స్త్విషాంపతి రహర్పతిః ।
భానుర్హంస స్సహస్రాంశు స్తపన స్సవితా రవిః ॥ అమరకోశము - 31

1. అరుణ, 2. అర్క, 3. అర్యమా, 4. అహర్పతి, 5. అహస్కర, 6. ఆదిత్య, 7. ఉష్ణరశ్మి, 8. గ్రహపతి, 9. చిత్రభాను, 10. తపన, 11. తరణి, 12. త్విషాంపతి, 13. దివాకర, 14. ద్యుమణి, 15. ద్వాదశాత్మా, 16. ప్రభాకర, 17. పూషా, 18. భాను, 19. భాస్కర, 20. భాస్వాన్, 21. మార్తాండ, 22. మిత్ర, 23. మిహిర, 24. రవి, 25. బ్రధ్న, 26. వికర్తన, 27. విభాకర, 28. విభావసు, 29. విరోచన, 30. వివస్వాన్, 31. సప్తాశ్వ, 32. సవితా, 33. సహస్రాంశు, 34. సూర, 35. సూర్య, 36. హంస, 37. హరిదశ్వ.

16 నమః పూర్వాయ గిరయే పశ్చిమే గిరయే నమః ।
జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః ॥

యికమీద నుతిభాగము (అనగా) నమకం ప్రారంభం అవుతుంది.

సూర్యుడు తూర్పు దిక్కున ఉదయ పర్వతముపై యుదయించును. పడమర దిక్కున అస్తమన పర్వతముపై యస్తమించును. కావున ఆ పర్వతముల స్వరూపునిగానే భావించి యట్టి వేవెలుగుల ప్రభువునకు పగటికాలమునకు అధిపతియైన కాంతిదేవునకు నమస్కారము.

17 జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమోనమః ।
నమో నమస్సహస్రాంశో ఆదిత్యాయ నమోనమః ॥

ఎన్నడు అపజయమెరుగని జయస్వామికి నమస్కారము. మంగళముతో

గూడిన జయాన్ని ప్రసాదించే జయభద్రునకు నమస్కారము. పచ్చని గుఱ్ఱాల రథముపై పయనించే వేవెలుగుల దొరకు నమస్కారము.

**18 నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమోనమః ।**
**నమః పద్మ ప్రబోధాయ మార్తాండాయ నమోనమః ॥**

(ప్రచండాయ నమో ౽ స్తుతే)

వీరుడైన ఉగ్రమూర్తికి నమస్కారము. సంసారమందలి సారమును తెలిసిన వాడైనందున, తానుదానికి దూరంగా వుండి భక్తుల నా సంసారము నుండి తరింపజేయగల తరణికి నమస్కారము. వేకువన వీచే చల్లగాలికి హాయిగా నిద్రించు తామర కమలాలను తన యుదయ కిరణ స్పర్శచేత మేలుకొలిపే చిన్మయమూర్తికి నమస్కారము. సర్వసమర్థుడైన ఆ ప్రచండభానునికి నమస్కారము. (భక్తుల హృదయ కమలమును సదా వికసింపజేయువాడు)

**19 బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్య వర్చసే ।**
**భాస్వతే సర్వ భక్షాయ రౌద్రాయ వపుషే నమః ॥**

బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు నియామకుడును, చక్కని కాంతితో వెలుగుచుండువాడును, భయంకరమైన దేహముతో సమస్తమును భక్షించువాడును అగు సూర్యునకు నమస్కారము. ఈ శ్లోకము మత్స్య, నరసింహావతారములను సూచించును)

**20 తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే ।**
**కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః ॥**

చీకటిని పోగొట్టి మంచును చీల్చివేసి శత్రువులను సంహరించే సూర్యుడు అమితాత్ముడు. చేసిన మేలును మరచే వారిని నిర్దాక్షిణ్యంగా శిక్షించే ప్రభువు దయచేసే సరికి మనము మేలుకొని యా జ్యోతిర్మయునకు జలాంజలి (సంధ్యావందనము) యొసగుటే మన కృతజ్ఞత. అట్టి జ్యోతిర్మయునకు నమస్కారము.

**21 తప్త చామీ కరాభాయ + వహ్నయే విశ్వకర్మణే,**
**నమస్తే మో ౽ భినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే**

కాచిన బంగారమువలె కళకళలాడుచు, భక్తులను బాధించు సంసారమును పోగొట్టువాడును, మనకు లోపల వుండే అజ్ఞానమును, వెలుపల బాధించే

చీకటిని, పోగొట్టుచు కాంతి స్వరూపుడై, లోకమునకు సాక్షియు, సకల కార్యదక్షు డైన విశ్వకర్మకు నమస్కారము. యింతటితో నమకము ముగుస్తుంది.

✦ 'హరయే విశ్వకర్మణే' అని పాఠాంతరము. హరయే = పాపములను హరించు వాడవగు, 'ఘృణయే లోకసాక్షిణే' అని పాఠాంతరము. ఘృణయే = ప్రకాశ స్వరూపుడవగు.

**22 నాశయత్యేష వై భూతం తదేవ సృజతి ప్రభుః ।**
**పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః ॥**

ఈ సూర్యుడు ప్రాణి సమూహమునంతయు లయింపజేసి మరల ఆ ప్రాణి సముదాయమును సృజించుతాడు. అతడు తనవేడి కిరణాలతో మాడ్చి వేసి శిక్షిస్తాడు. ఆ కిరణాలతో మరల చల్లని వర్షమును ప్రసాదించి రక్షిస్తాడు.

**23 ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః ।**
**ఏష చై వాగ్ని హోత్రం చ ఫలం చైవాగ్ని హోత్రిణామ్ ॥**

మనము నిదురించు సమయమందుగూడ యీ సూర్యుడు మనలో అంత ర్యామియై యున్నందున సర్వకాల సర్వావస్థలందును మనకు తోడుగవుండి రక్షించును. దక్షిణాగ్ని, గార్హపత్యము, అవహనీయమను మూడగ్నులకు త్రేతాగ్ను లని పేరు. ఆ మూడింటిని నిత్యము సాయంకాలము, ప్రాతఃకాలము ఆరాధిం చుటకు అగ్నిహోత్రమని పేరు. ఆ స్వరూపము సూర్యుడే. అంతమాత్రమే గాదు దానిని శ్రద్ధగా ఆరాధించే యజమానులకు దీక్షితులని పేరు. వారికి యీ లోకంలో సకల సంపదలు సమకూరునని స్వర్గఫలం కూడ స్వాధీనమగుననియు, అదే అనుష్ఠానము నిష్కామంగా చేసేవారికి మోక్షం వస్తుందని వేదమాత యుపదేసించింది. ఈ చెప్పిన సకల ఫలముల స్వరూపంగా సూర్యభగవానుడే వున్నాడని భావము.

**24 వేదా శ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవ చ ।**
**యాని కృత్యాని లోకేషు సర్వఏషరవిః ప్రభుః ॥**

ముందు శ్లోకంలో చెప్పిన అగ్నిహోత్రము దానినాచరించినందున వచ్చే ఫలమేగాక "యావజ్జీవమగ్నిహోత్రంణాహంయాత్" జీవించి వున్నంత వరకు అగ్నిని హోమం ద్వారా ఆరాధించవలయును. అనియు అంతమాత్రమేగాక, సృష్టి

సంచలనము ప్రవాహ రూపంగా సాగిపోవుటకు మనకు గావలసిన ఇహ పర సుఖముల నివ్వగలవి యజ్ఞములు. ఆ యజ్ఞముల స్వరూపము, విధానము, ఫలము మొదలగు వానిని దెలిపే వేదములు, ఆ యాగములను యథావిధిగా అనుష్ఠానం చేసినందువలన ఆ సోమయాజుల వారికిని, లోకమునకును వచ్చే ఫలములు, మరియు లోకంలో సమస్త ప్రాణులు తమతమ మనుగడకై జరుపుకొనే సకల కార్యములకు సంధాత ప్రభువైనవాడు యీ సూర్యభగవానుడే.

యింతవరకు సూర్య మహిమ మూడు శ్లోకములతో తెలిపిరి.

**25 ఏనమాపత్సు కృచ్ఛ్రేషు కాంతారేషు భయేషు చ।**

**(కృఛ్రము = పాపము, బాధ)**

**కీర్తయన్ పురుషః కశ్చిన్నా వసీదతి రాఘవ ॥**

రఘురామా! మానవులకు ఆపదలు వచ్చుట సహజము. ఆ సందర్భమున ఎనలేనిభయము కలుగును. ఏమి చేయుటకు తోచదు. ఒకప్పుడు మార్గమున ప్రమాదవశమున దుర్గమారణ్యములందు చిక్కులుబడెదరు. ఇట్టి యిబ్బందులు ఎదురైన ఏ మానవుడైనను దీనిని (ఆదిత్యహృదయమును) కీర్తించిన యెడల వారు సమస్త దుఃఖములు తొలగి సుఖించును.

**26 పూజయస్వైన మేకాగ్రో దేవదేవం జగత్పతిం ।**

**ఏతత్త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయష్యసి ॥**

దేవతలకు ప్రభువై, జగత్తును పాలించువాడైన యీ ఆదిత్యుని యేకాగ్ర చిత్తముతో పూజింపుము. ఈ స్తోత్రాన్ని మూడుసార్లు జపించితివేని యుద్ధము నందు తప్పక జయించగలవు.

**27 అస్మిన్ క్షణే మహాబాహో రావణం త్వం వధిష్యసి ।**

**ఏవముక్త్వా తదాఽగస్త్యో జగామ చ యథాఽఽగతః ॥**

ఓ మహానుభావుడవైన రామా! ఈ క్షణంలోనే నీచేతిలో రావణ సంహారం జరుగుతుందని అగస్త్య మహర్షి రామునకు బోధిస్తాడు. తొలిపలుకుల్లో చేసిన 'మహాబాహూ' అను సంబోధనే మలిపలుకుల్లో కూడా చేసి రాముని బాహువులలో ఉపాస్యదైవమైన యాదిత్యదేవుని పరాక్రమము సంక్రమించిందని తెలిసి యగస్త్య మహర్షి వచ్చిన చోటునకే (గగనమార్గమునే) వెళ్ళెను.

**28 ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకో౽ భవత్తదా ।**
**ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్ ॥**

మహాపరాక్రమశాలియగు రఘురాముడు యీ ఆదిత్య హృదయమును విని శత్రుసంహారమునకు దైవానుగ్రహము కల్గినందులకు బాగుగ సంతసించినవాడై, చింతను విడిచి పెట్టెను. పవిత్రమైన యంతఃకరణముతో యీ స్తోత్రమును ధారణ చేసెను.

**29 ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వాతు పరం హర్ష మవాప్తవాన్ ।**
**త్రిరాచమ్య శుచిర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్ ॥**

శ్రీరాముడు మూడు పర్యాయములాచమించి, పరిశుద్ధుడై యాదిత్యుని దర్శించుచూ (సూర్యమండలాంతర్వర్తియైన పరమపురుషుడైన జగన్నాథుని ధ్యానించుచు) యీ ఆదిత్య హృదయమును (స్తోత్రము) ముమ్మారు జపించి యంతులేని సంతసముతో ధనుస్సును చేతగొనెను.

**30 రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధాయ సముపాగమత్ ।**
**సర్వయత్నేన మహతా వధే తస్య ధృతో౽భవత్ ॥**

స్తోత్రమును జపించుటవలన సంతోషము గలిగిన శ్రీరాముడు యుద్ధమునకు సన్నద్ధుడై రావణుని యెదుట నిలిచి సర్వయత్నముతో యతనిని సంహరింప సిద్ధుడయ్యెను.

**31 అథ రవిరవద న్నిరీక్ష్య రామం**
**ముదితమనాః పరమం ప్రహృష్యమాణః,**
**నిశిచరపతిసంక్షయం విదిత్వా**
**సురగణమధ్యగతో వచస్త్వరేతి.**

అప్పుడు దేవతల మధ్యనున్న రవి రాక్షస ప్రభువు యొక్క సంపూర్ణ నాశనమును నిశ్చయమని తెలిసికొని రామ ప్రభువును జూచి వారికి మిక్కిలి సంతసమును గల్గించుచున్నవాడై "రాక్షసరాజునకంతకాలము ప్రాప్తించెనని యెఱుంగుము : జాగు సేయకుము, యుద్ధము సేయుము. అని పలికెను.

**32 ఓమ్ తత్స దిత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకియే**
**చతుర్వింశతి సాహస్రికాయాం సంహితాయాం**
**యుద్ధకాండే సప్తోత్తర శతతమ స్సర్గః ॥**

ఇది ఆదిత్య హృదయము. దీన్ని చదవటానికి నాలుగు నిముషముల కంటె యెక్కువ పట్టదు. సూర్యుడు ఉదయించేందుకు ఎంతకాలం పడుతుందో సరిగ అంతేసమయంలో యీ స్తోత్రం చదువవచ్చు. యిలా లెక్క ప్రకారము వాల్మీకి మహర్షి వ్రాసారా అనిపిస్తుంది. ఈ ఆదిత్యహృదయం ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము మూడుకాలాలలో చదువ వచ్చును. నియమ నిష్ఠలతో చదువుట మిక్కిలి శ్రేయస్కరము. ఎప్పుడు చదివినా ఉదయించిన సూర్యబింబాన్ని మనసులో ఉంచుకొని చదవటం మంచిది. అర్థం తెలియకుండా చదివినా యీ స్తోత్రం అనిర్వచనీయమైన ఆనందాన్ని స్తుంది. మందు తయారు చేయు విధానం రోగికి తెలియకపోయిననూ ఔషధసేవ విశ్వాసముతో చేసిన యెడల ఆరోగ్యమునే గల్గించు విధముగా దీని పారాయణ చేతనే సకల శ్రేయస్సులు లభింపగలవు. అర్థము తెలిసికొని చదివిన గల్గు ఆనందమును గూర్చి యిక చెప్పునదేమున్నది ! ఆదిత్యహృదయ రహస్యము 103

ఆదిత్య హృదయము సంపూర్ణము.

**11 సూర్యనారాయణ మంత్రము**

**నమ స్సూర్యాయ శాంతాయ । సర్వరోగనివారిణే ।**
**ఆయురారోగ్య మైశ్వర్యం । దేహి దేవ జగత్పతే ॥**

జగత్పాలకుడవై సర్వరోగముల బోగొట్టు శాంతమూర్తివగు ఓ సూర్యదేవా నీకు నమస్కరించుచున్నాము. నీ భక్తులమైన మాకు ఆయురారోగ్యైశ్వర్యముల నొసంగుము.

**12. 1. ఓం నమో వివస్వతే బ్రహ్మన్ భాస్వతే విష్ణు తేజసే,**
**జగస్సవిత్రే శుచయే పవిత్రే కర్మదాయినే**

తా :- ఓ వివస్వంతుడా ! పరబ్రహ్మమా ! జాజ్వలంగా ప్రకాశించే ఓ విష్ణు తేజస్సు గలవాడా, జగత్ సవిత్రుడా, శుచిమంతుడా, కర్మఫలాన్నిచ్చే నీకు నా నమస్కారములు.

**2. ఓం జపాకుసుమ సంకాశం కాశ్యపేయం మహాద్యుతిమ్**
**తమోఽరిం సర్వపాపఘ్నం ప్రణతోఽస్మి దివాకరమ్**

**తా** :- ఓం మందార కుసుమ వర్ణతుల్యుడూ, కశ్యపుని పుత్రుడు, మహా శోభావంతుడు, అంధకారం నాశనం చేసేవాడు, సర్వపాపాల్ని పటాపంచలు చేసే దివాకరునికి, సూర్యునికి నా ప్రణామములు.

సూర్యస్తుతులు సంపూర్ణము

## 16. తులసిమాత

తులసిమాత యొక్క ప్రభావము, మహాత్మ్యము, పూజించుట తెలుసుకుందాము.

మన దేశమున తులసి చెట్టులేని గృహముండదు. స్త్రీలకు సమస్త సౌభాగ్యము లొసగుటకును, దైవభక్తికి ఇది ఆదర్శము.

**1. తులసీకాననం యత్రయత్ర పద్మవనాని చ।**
**సాలగ్రామశిలా యత్రతత్ర సన్నిహితో హరిః ॥**

భావము :- తులసివన మెచ్చట నున్నదో, పద్మవనమెచ్చటనున్నదో, సాలగ్రామశిల ఎచటగలదో అచట హరి సన్నిహితుడై యుండును.

**2. తులస్యారోపితా సిక్తా దృష్టా స్పృష్టా చ పాలితా**
**ఆరోపితా ప్రయత్నేన చతుర్వర్గ ఫలప్రదా ।**
**తులసీవిపిన స్యాపి సమంతా త్పావనస్థలం**
**యోజనత్రితయం జ్ఞేయం గాంగేయస్యేవ పాథసః ।**
**తులసీకాననం చైవ గృహే యస్యావతిష్ఠతే**
**తద్గృహం తీర్థభూతం హి నాయంతి మయకింకరాః ॥**

భావము :- తులసిని నాటినను, నీరుపోసినను, చూచినను, తాకిననూ, పోషించినను పురుషార్థము లొసంగును. తులసియున్న చోటు పావనస్థలముగా, తులసి తోటకు మూడామడల వరకు గంగా తీర్థముతో సమానమగు పావన స్థలముగా భావించవలెను.

**3. అనన్య దర్శనాః ప్రాతర్యే పశ్యంతి తపోధన ।**
**జగత్త్రితయ తీర్థాని తైర్దృష్టాని న సంశయః ॥**

భావము :- ఉదయముననే లేచి తులసిని చూచినచో సమస్త తీర్థములు చూచిన ఫలము లభించును.

4. తులసీ సన్నిధౌ ప్రాణాన్యే త్యజంతి మునీశ్వర ।
నతేషాం నిరయక్లేశః ప్రయాంతి పరమం పదమ్ ॥

భావము :- తులసి సన్నిధిలో నెవరు ప్రాణముల విడుతురో వారికి నరకబాధ లేదు సరికదా పరమ పదమునకు బోవుదురు. నిత్యసాధనచంద్రిక - 34

గమనిక :- తులసీదళములను స్త్రీలు కోయరాదు. పురుషుల చేతనే కోయించ వలెను. వారైనను యీ క్రింది శ్లోకములు పఠించుచూ, నమస్కరించి ప్రదక్షిణ చేసి తరువాత కోయవలెను. అదియునూ నిత్యమూ పసుపు, కుంకుమలతో బొట్లు పెట్టి పూజించు తులసి చెట్టు నుండి దళములు కోయరాదు. పూజ చేయకయున్న తులసిచెట్టు నుండి దళములు గ్రహించవచ్చును. మరియు నిత్యమూ కంఠమున ధరించు తులసి మాలతో జపము చేయకూడదు. జపము చేయు తులసి పూసల మాలను మెడలో ధరించరాదు. అని జ్ఞానవృద్ధుల ఉవాచ.

5. తులసీగ్రహణ ధ్యానము

తులస్యమృత జన్మాసి సదా త్వం కేశవప్రియే ।
కేశవార్థం లునామి త్వాం వరదాభవ శోభనే ॥
త్వదంగ సంభవైః పత్రైః పూజయామి యథా హరిమ్।
తథాకురు పవిత్రాంగం కలౌ మలవినాశినీ ॥

అని స్తోత్రము చేయుచు తులసిని పరిగ్రహించునది.

6. మోక్షైక హేతో ర్ధరణీ ప్రసూతే - విష్ణో స్సమస్తస్య గురోః ప్రియేతే।
ఆరాధనార్థం పురుషోత్తమస్య - లునామి పత్రం తులసి క్షమస్వ॥
ప్రసీద మమ దేవేశి ప్రసీద హరివల్లభే - క్షీరోదమథనోద్భూతే
తులసి త్వం ప్రసీదమే ॥ ని.సా.చం.-34

తులసీ దర్శన సమయమున

7. యన్మూలే సర్వతీర్థాని యన్మధ్యే సర్వదేవతాః ।
యదగ్రే సర్వవేదాశ్చ తులసీం త్వాం నమామ్యహమ్ ॥

**తులసి నామాష్టకము**

**8. బృందా బృందావని విశ్వపూజితా విశ్వపావనా ।**
**పుష్పసారా నందినీ చ తులసీ కృష్ణజీవనీ ॥**
**ఏత న్నామాష్టకం చైవ స్తోత్రం నామార్థ సంయుతమ్ ।**
**యః పఠేత్ తాం చ సం పూజ్యసో ఽశ్వమేథఫలం లభేత్ ॥**

అను ఈ తులసీనామాష్టకమును అనగా తులసీదేవికి ఎనిమిది నామము లున్నవి. వాటిని తులసిని పూజించిన తరువాత యీ ఎనిమిది పేర్లు చదివిన వ్యక్తి అశ్వమేథ యాగము నొనర్చిన ఫలమును పొందును. తులసి నామాష్ట కమును స్మరించినంత మాత్రముననే సంతానము లేని వార్కి సంతానమును, భార్య లేనివారికి భార్యయు, రోగపీడితులకు రోగ విముక్తియు, బంధనమందున్న వ్యక్తికి బంధవిముక్తియు, భయభీతులకు నిర్భయులుగాను, పాపి పాపముల నుండి విముక్తులగుదురు. విశ్వదేవార్చన దైవప్రార్థన - 13.

మన పూర్వీకులు తులసి చెట్టులేని గృహములోను, పుత్రులు లేని యింటిలోను గోమాత లేని గృహములోను భోజనము చేసేవారే కాదట !

" శ్రీకృష్ణ తులాభారము " అను నాటక ప్రదర్శనమున "తులసి" యొక్క మహాత్మ్యము, ప్రాశస్త్యము విశదముగా వివరించిన తీరు అందరకు తెలిసినదే!

బ్రహ్మవైవర్త పురాణములో తులసీ మహత్వమును, గురించి ఏముందో చూద్దాం.

బృందతో శ్రీకృష్ణుడు "మన ఇద్దరి శాపములును లోకమునకు ఉపకరించు నవే. నేను గండకీ నదిలో సాలగ్రామ శిలారూపమును దాల్చెదను. నీవు తులసి వృక్షమువై యుందువు. మన మిరువురమును త్రిలోకపూజ్యులము అగుదుము. నీవీ శరీరమును విడిచి రాసమండలమున లక్ష్మితో పాటు వుందుము. నీ శరీరము గండకీనదియై ప్రవహించును. నీ తలవెంట్రుకలు తులసీ వృక్షములగును. త్రిలోకములందును పూజా పుష్పములలోను పత్రములలోను తులసి ప్రధాన మగును. తులసి మొదట సర్వతీర్థము లందు నివసించును. సర్వదేవతలును అక్కడే వుందురు. ఎక్కడ తులసియాకు రాలునో అది పుణ్యక్షేత్రమగును. తులసీ జలముతో నన్ను (శ్రీకృష్ణుని) అభిషేకము చేసినచో అమృతకలశములతో అభిషేకించిన దానికంటె ఎక్కువ ఫలము లభించును. వేయిగోవుల నిచ్చిన దానికంటె ఒక్క తులసి దళము దానము చేయుట మిక్కిలి పుణ్య ప్రదము.

మరణశయ్యపై నున్న వారికి తులసి తీర్థము పోసినచో అతడు సర్వపాప విముక్తుడై విష్ణులోకమునకు బోవును. ప్రతి దినము భక్తితో తులసి తీర్థము సేవించినచో అతనికి గంగాస్నాన ఫలము లభించును. జీవన్ముక్తుడగును. ప్రతిదినము నన్ను (శ్రీకృష్ణ పరమాత్మను) తులసి పత్రములతో పూజించువాడు లక్షాశ్వమేథముల పుణ్యమును పొందును. తులసీదళములు శరీరము మీద ధరించి మృతి చెందినవాడు విష్ణులోకము చేరును. తులసి పూసల మాలికను కంఠమున ధరించిన వానికి అడుగడుగున అశ్వమేథఫలము లభించును.

అమావాస్యనాడు, పౌర్ణమినాడు, ద్వాదశినాడు, సూర్య సంక్రమణమునాడు, తులసీపత్రమును కోసినచో విష్ణుశిరస్సు ఖండించినట్లే. తలంటుకొనుచుగాని, స్నానము చేయకుండగాని, మధ్యాహ్నమందుగాని, అర్ధరాత్రి యందుగాని, సంధ్యాకాలమందుగాని, అశౌచములు (పురుడు, మైలలు) వచ్చినప్పుడు గాని, రాత్రి నిద్రించిన బట్టతో గాని తులసిని ముట్టుకొన్నను, త్రుంచినను విష్ణువు శిరస్సును ఖండించినంత పాపము వచ్చును. మూడురోజుల వరకును తులసీ పత్రమునకు నిర్మాల్యదోషమంటదు. తులసియాకు నేలమీద పడినచో దానిని కడిగి పూజలో ఉపయోగించవచ్చును. అష్టాదశ పురాణములు - 235

శ్రీమతే రామానుజాయ నమః



శ్రీరస్తు | అవిఘ్నమస్తు | శుభమస్తు

ఓమ్ శ్రీ గురుభ్యో నమః

ఓమ్ నమః పరమాత్మనే

# 17. నిత్య పూజా కార్యక్రమము

**ఓం సహ నావవతు । సహనౌ భునక్తు । సహవీర్యం కరవావహై తేజస్వి నా వధీతమస్తు । మా విద్విషా వహై ।**

**ఓమ్ శాంతిః శాంతిః శాంతిః**

ఆ పరమాత్మ మనలతో కూడ నుండి మనలను రక్షించుగాక! ఆ పరమాత్మ మనతో కూడనుండియే మనకు సుఖమును కలిగించుగాక! మన విద్యకు (అధీతి

బోధలకు) బలము కలుగునట్లుగా మనము కలసి ప్రయత్నించుదము. మన అధ్యయనము ఆచరణ ప్రచారములు కలుగునది అగుగాక! మనము ద్వేషభావము లేనివారమై ఉందుముగాక !

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః కఠోపనిషత్తు - 239-1



## శ్రీదీపము

భక్తి నివేదన - 2/2000=31

దీపానికి శ్రీవైష్ణవ సంప్రదాయంలో 'తిరువిళక్కు' అనిపేరు. తిరు అనగా శ్రీ అని అర్థం. విళక్కు అనగా దీపము అని అర్థము. అంటే తెలుగులో శ్రీదీపము అని.

దీపారాధన చేయుటకు పూర్వము మనం ఆచరించవలసిన ఆచారములనూ, దీనికి ముందుగా దేవతార్చనకు కావలసిన ఉపకరణములు తెలుసుకుందాము. పసుపు, కుంకుమ, అక్షతలు, గంధపుచెక్క, తులసిదళములు, తులసిమాల (జపమునకు) దర్భలు, శ్రీకృష్ణ పరమాత్మని విగ్రహము (అర్చితమూర్తి పంచలోహములతో 3 అంగుళములకు మించి ఉండరాదని పెద్దల ఉవాచ) దేవుని చిత్రపటములు, దీపపు సమ్మెలు రెండు, నాలుగు దూది వత్తులు, ఊదొత్తులు, ఆవునెయ్యి, పుష్పములు (కేసరములు లేని పుష్పములు పూజకు అనర్హము) తమలపాకులు, వక్కలు, అరటిపళ్ళు, కొబ్బరికాయ, బెల్లము (లఘునైవేద్యము) నైవేద్యము (పులగన్నము, వెన్న, పాలు, కూర) గంట, కర్పూరము, సాంబ్రాణి, పంచపాత్ర, ఉద్ధరిణి, పంచామృతము, జలము కావలయును. ఈ మంగళప్రద మైన వస్తువులయందు లక్ష్మి నివసించును కాన వీటిని నేలపై నుంచరాదు. అట్లుంచిన ధనహీనులగుదరు. వీటిని నేను భరించలేను అంటుంది భూమాత. తమలపాకులపై నుంచవలయును.

తదుపరి ఆచరించవలసిన ఆచారములు

"స్నానే చ భోజనే హోమే జప మౌనముపాశ్రయేత్" స్నానము, పూజ, జపము, భోజనము, మలమూత్ర విసర్జన సమయములందు మౌనముద్ర వహించుట మంచిది. పరిశుద్ధాంతఃకరణము గలవాడై శుద్ధ వస్త్రములు ధరించి (పించగోచీ పెట్టక పూజ మరియు ధర్మకార్యములు నిర్వర్తించ తగదు.) గురువును, నారాయణునితలంచుచూ, ఊర్ధ్వపుండ్రములను పెట్టుకొని, ముందుగా కుడికాలు మోపుతూ పూజాగృహములో ప్రవేశించవలయును. చాపపరచి, దానిపై జింక

చర్మము, ఆపైన శ్వేత వస్త్రము నుంచి కూర్చుండవలయును. (గీత 6/11) నీకంటె కొంచెము ఎత్తులో అర్చితమూర్తి విగ్రహమును, అర్చితమూర్తికి రెండు వైపుల రెండు దీపపు కుందులను, గంటను తమలపాకులపై నుంచవలయును. అర్చితమూర్తిని పంచామృతముల (ఆవుపాలు, పెరుగు, నెయ్యి, తేనె లేదా చెఱుకు రసము, ఫలోదకము లేదా పండ్ల రసముతో) అభిషేకము చేయించి పొడి వస్త్రముతో అద్ది గంధ, కుంకుమలతో బొట్టు పెట్టవలయును. దీనికి ముందుగా పసుపు ముద్దను గోపురాకారముగా చేసి విష్వక్సేనునిగా భావించి తమలపాకుపై నుంచవలయును. దీపపు కుందులకు పసుపు, కుంకుమ బొట్టులు పెట్టవల యును. తూర్పు దిశ నొక వత్తిని, ఉత్తరదిశనొక వత్తిని మొత్తం 4 వత్తులను రెండు దీపపు కుందులలో వుంచవలయును.

భారతీయ సంస్కృతిలో దీపానికి దీపారాధనకు ఎంతో ప్రాముఖ్యత వుంది. అశుభాన్ని తొలగించి శుభం చేకూరుస్తుంది. అది మంగళకరం. లక్ష్మీప్రదం, శక్తి దాయకం, ఆహ్లాదకరం - భగవంతుడు జ్యోతిస్వరూపుడు. మానవులు అజ్ఞానంతో కూడిన ప్రవర్తన వల్ల లోకం కలుషితమైపోగా, ఆ కాలుష్యాన్ని, ఆ మాలిన్యాన్ని, అజ్ఞాన తిమిరాన్ని అణచగల శక్తి జ్యోతికే వుంది. అదే జ్ఞానం, ఆ జ్ఞానశక్తి పరమాత్మ. కాబట్టి తనలో పేరుకున్న అజ్ఞానాంధకారాన్ని తొలగించి జ్ఞానాన్ని ప్రసాదించమని ఆ శ్రీకృష్ణపరమాత్మను అర్థించడమే దీపారాధన చేయుటలోని అంతర్యం అన్నమాట. 2491/ప్రభ

**"విష్ణుర్దేవానాం పరమః అగ్ని రవమః"** 7/2001=14 భక్తి నివేదన

దేవతలందరిలో విష్ణువు.గొప్పవాడు. అగ్ని చిన్నవాడు అంటుంది వేదం.

దీపం వెలిగేది అగ్నితోనే కదా! అతడే లక్ష్మిని ప్రసాదిస్తాడని వేదమంత్రం తెలియజేస్తోంది. "చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదోమ ఆవహ" అగ్నిదేవుడే నాకు లక్ష్మినిచ్చుగాక! అని అర్థం. 11/2001=25 భక్తి నివేదన

**ఉద్దీప్యస్వ జాతవేదో పఘ్నం నిర్ ఋతిం మమ ।**
**పశూగ్ం శ్చ మహ్యామావహ జీవనం చ దిశోదశ** ॥తైత్తరీయ అరణ్యకం

భావం:- దీపమునందు ప్రకాశించే అగ్నిదేవుడు, సాక్షాత్ భగవత్స్వరూపుడు. అతడు సకల శ్రేయస్సులను లక్ష్మిని ప్రసాదిస్తాడు. పాపమును పోగొట్టి మనలను రక్షించటం కోసం గొప్ప తేజస్సుతో ప్రకాశిస్తాడు.

**మానోహిగ్ం సిజ్ఞాతవేదోగామ శ్వం పురుషం జగత్ ।**

**అబిభ్రదగ్న ఆగహిశ్రియా మా పరిపాతయ ॥**

భావం:- అగ్నిదేవుని అనుగ్రహం వల్ల పాపములు మనలను హింసించవు. అతడు దయామయుడు కనుక మన పాపములను మనస్సున తలుపక మనకు కావలసిన వరములిచ్చి మనలను రక్షిస్తాడని భావం.

పై వేద మంత్రములు చెప్పిన ప్రకారము మనకు లక్ష్మీదేవి యొక్క అనుగ్రహాన్ని కలుగచేసేవాడు అగ్ని. కనుకనే దీపాలు వెలిగించి భగవత్ప్రార్థన చేయుట. అగ్ని అంటే కేవలం అగ్నిదేవుడని అర్థం చెప్పగూడదు. అతనిలో కూడ అంతర్యామిగా ఉండే పరమాత్మకే 'అగ్ని' అనిపేరు. అతడే మనకు సమస్త సంపదలూ ఇస్తాడు. ఆ పరమాత్మే ప్రకాశవంతమైన జ్యోతిస్వరూపుడు. అందుకే నమ్మాళ్వార్ తమ ప్రబంధంలో ' దీపారాధన అనగా పరమాత్మ ఆరాధన' అని అంటారు.

11/2001=2526 భక్తి నివేదన

ఆరాధనకై దీపం వెలిగించే ముందు గంట వాయించుచూ ఈ శ్లోకము పఠించవలయును

**హేఘంటే సుస్వరే పీఠే ఘంటాధ్వని విభూషితే ।**

**వాదయంతి పరానందే ఘంటాదేవం ప్రపూజయేత్ ॥**

**ఆగమార్థం చ(తు) దేవానం గమనార్థం తు రక్షసామ్ ।**

**కురు ఘంటారవం తత్ర దేవతాహ్వాన లాంఛనమ్ ॥**

దీపం వెలిగించే ముందు, దీపం వెలిగిస్తూ ఈ క్రింది శ్లోకం పఠించాలి.

**భో దీప బ్రహ్మరూపేణ, సర్వేషాం హృది సంస్థితః,**

**అతస్త్వాం స్థాపయామ్యద్య, మదజ్ఞాన మపాకురు.**

**ఇతి ఘంటానాదం కృత్వా ॥** వేదాంతచూర్ణిక (సంఖ్యాపాఠ్యము) ద్వితీయ భాగం - 134

దీపాన్ని వెలిగించిన తరువాత దీపాన్ని చూస్తూ

**దీపం జ్యోతిః పరబ్రహ్మ దీపం సర్వతమోపహమ్**

**దీపేన సాధ్యతే సర్వం సంధ్యాదీప నమోస్తుతే ॥**

అసాధ్యములను అన్నిటినీ సుసాధ్యం చేస్తూ, బాహ్యాంతరాంధకారాలను తొలగించే పరబ్రహ్మ స్వరూపమైన సంధ్యాదీపమా నీకు నమోవాకములు. అని అర్థం.

"జ్యోతిష్మతీం త్వాసాదయామి" అనే కృష్ణయజుర్వేదంలోని సగంహిత ప్రథమ కాండ నాల్గవ ప్రశ్నలోనూ, అరణ్యకంలో చిత్తిప్రశ్నగా పిలువబడే మూడవ ప్రశ్న లోనూ పఠింపబడే మంత్రాన్ని అనుసంధిస్తారు. వేదాధ్యయనం చేసిన వైదికులు దీపప్రజ్వలన సమయంలో.

2/2000=32 భక్తినివేదన మరియు శ్రీ వేదాంత దేశికులు అనుగ్రహించిన దీప ప్రకాశస్తోత్రము 3వ శ్లోకం

**దీపస్త్వమేవ జగతాం దయితా రుచిస్తే**
**దీర్ఘం తమః ప్రతినివర్త్యమిదం యువాభ్యామ్ ।**
**స్తవ్యం స్తవప్రియ మతః శరణోక్తి వశ్యమ్**
**స్తోతుం భవన్త మభిలష్యతి జన్తురేషః ॥**

భావం:- "ఓ లక్ష్మీపతీ! నీవు దీపానివి. నీ ఇల్లాలు జగన్మాత లక్ష్మీదేవి ఆ దీపకాంతి. మీ ఇద్దరి కలయికవల్ల లోకంలో ఆవరించిన గాఢ తమస్సు నశిస్తోంది. శరణన్న వారిని రక్షించే స్వభావం కల నీవు మాచే కొనియాడదగినవాడవు. మాస్తోత్రములచే సంతోషించేవాడవు. ఇట్టి నిన్ను నీ భార్య జగన్మాతయైన లక్ష్మిని స్తోత్రం చేయ వలెనని నా కోరిక". ఇదీ శ్లోక భావం.

పై శ్లోకాలు పఠించి దీపాలను వెలిగించి, దీపాల వద్ద, అర్చితమూర్తి వద్ద మిగతా దేవుళ్ళ చిత్రపటముల వద్ద పుష్పములు, అక్షతలు వుంచి నమ స్కరించాలి. 11/2001=26. భక్తి నివేదన

హరిఃఓమ్ అని ఒక నిముషకాలము మూలాధారము నుంచి శ్వాసము (ఊపిరి) యొక్క సహాయము చేత మెల్లగ ఉచ్చరించుచు సహస్రారమునందు లయింప జేయవలయును. ఇట్లు ఓం ఓం ఓం అని మూడుసార్లు ధ్యానించి శాంతి మంత్రమును పఠింపవలయును.

## శాంతిపాఠము

**ఓమ్ పూర్ణమదః పూర్ణమిదం - పూర్ణాత్పూర్ణ ముదచ్యతే ।**
**పూర్ణస్య పూర్ణమాదాయ - పూర్ణమేవావ శిష్యతే ॥**
**ఓం శాన్తిః శాన్తిః శాన్తిః**

పరమాత్మ విశుద్ధమైనవాడును సంపూర్ణుడును, ఆ పరమాత్మ సంపూర్ణముగ విశుద్ధత గలవాడగుటచే అతని నుండి బహిర్గతమైన ఈ భౌతిక ప్రపంచమంత యును సర్వవస్తు సముపేతమై నిండియున్నది. సంపూర్ణమైన దాని నుండి

వెలువడిన సర్వమును సంపూర్ణముగనే యుండును. ఆ పరమాత్మ సంపూర్ణుడు గాన అతని నుండి వెలువడిన పర్వమును సంపూర్ణముగనే యున్నను ఆ పరమాత్మ యెట్టి లోపమును లేకుండ సంపూర్ణుడుగనే యుండును.

ఈశావాస్యోపనిషత్తు

ఈ మంత్రము భగవత్తత్వము యొక్కటియేయని తెలుపును. సర్వకారణ మదియేయని బోధించును. దానికి వేరు కారణమెందును లేదనుట దీనస్పష్ట మగును. శ్రీ కృష్ణావతారతత్వము, 8వ భాగము - 98

**ఓమ్ శం నో మిత్రః। శం వరుణః। శం నో భవత్వర్యమా ।**
**శం న ఇంద్రో బృహస్పతిః। శం నో విష్ణురురుక్రమః ।**
**నమో బ్రహ్మణె। నమస్తే వాయో । త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాఽసి।**
**త్వమేవ ప్రత్యక్షం। బ్రహ్మ వదిష్యామి । ఋతం వదిష్యామి ।**
**సత్యం వదిష్యామి । తన్మా మవతు । తద్వక్తార మవతు ।**
**అవతుమాం అవతు వక్తారం ॥**

**ఓమ్ శాంతిః శాంతిః శాంతిః**

ఈ కలికాలంలో హరినామస్మరణమే సత్ఫలితాన్నిస్తుంది. తెలిసో తెలియకో ఏమైనా పొరపాటు చేసివుంటే వానినన్నింటిని శ్రీహరినామస్మరణం హరిస్తుంది. పవిత్రునిగా చేస్తుంది.

**అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతోఽపివా ।**
**యంః స్మరేత్ పుండరీకాక్షం సబాహ్యాభ్యంతర శ్శుచిః ॥**
**పుండరీకాక్ష! పుండరీకాక్ష! పుండరీకాక్షాయ నమః**

అపవిత్రుడుగా ఉన్నా, పవిత్రుడుగా ఉన్నా ఏ అవస్థలో ఉన్నప్పటికీ పుండరీ కాక్షుడైన శ్రీహరిని స్మరించునో వాడు అంతఃశౌచమును, బాహ్యశౌచమును పొందుతాడు. కావున పుండరీకాక్షుని ముమ్మారు స్మరించి జలమును శిరముపై ప్రోక్షించుకొనవలయును.

## 18 పురాణాచమనము

ఆచమనములు నాలుగు విధములు 1. పురాణాచమనము, 2. స్మృత్యా చమనము, 3. శ్రుత్యాచమనము, 4. మానసికాచమనము. ఇచట పురాణా

చమనమును చేయు విధానమును గూర్చి మాత్రమే తెలుపబడును. గ్రంథ విస్తరణను దృష్టిలో వుంచుకుని. తక్కిన మూడు అచమనముల పద్ధతిని తెలిసి కోదలచినవారు, నాచే సంకలనము చేయబడిన "వేదాంతచూర్ణిక (సంఖ్యా శాస్త్రము) ప్రథమభాగము 85 నుండి 112 పేజీల్లో చూడగలరు.

అచమించునపుడు పీటపైన గూర్చుండి పాదములు నేలమీద నుంచు కొనవలయును. పద్మాసనములు మొదలగు నాసనములు పట్టి యాచమింప రాదు. కాళ్ళు చాచుకొని గాని, మోకాలికి వెలుపల చేతులుంచిగాని యాచమింప రాదు. (బొడ్డులోతు) జలమందు దిగియుండునపుడు తప్ప ఇతరత్ర నిలుచుండి యేని, వంగియేని అచమింపగూడదు. కూర్చుండి అచమింపవలయును. అచమించునపుడు శబ్దము చేయరాదు, ఆ జలము నేలపై పడరాదు. అరచేయి గోకర్ణాకారముగా (అవుచెవి) బట్టి, అందు మినపగింజ మునుగునంతటి జలము గైకొని, యాచమించునది. అంతకంటె హెచ్చుతగ్గులున్న యెడల నది సురాపాన సమమగును.

**పవిత్రకర ఆచామేత్ శుచిః కర్మార్థ మాదరాత్ ।**
**స పవిత్రౌ సదర్భోవా కరౌ కుర్వీత నాన్యథా ॥** (త్రికాల సంధ్యావందనము 14)

తా :- "పవిత్రం వై హిరణ్యం" అని కలదు. కనుక బంగారుంగరముగాని, దర్భలు గాని వ్రేళ్ళకుంచుకొని, శుచియై కర్మార్థమాచరించునది. అట్లుగాక అచమించ రాదు. దర్భముడితో తయారు చేయించిన బంగారుంగరము మరీ మంచిది.

మన అరచేతియందు 1. దేవత, 2. మనుష్య లేక ఋషి, 3. పితృ, 4. బ్రహ్మ, 5. అగ్ని తీర్థములు కలవు. వాని స్థానములు నీ క్రింది విధముగా నున్నవి.

1. మన అరచేతి వ్రేళ్ళ యొక్క పై భాగమున దేవ తీర్థము గలదు.
2. చూపుడు చిటికెన వ్రేళ్ళ మధ్య భాగమున మనుష్య లేక ఋషి తీర్థము గలదు.
3. చూపుడు వ్రేలు, బొటనవ్రేలు మధ్య భాగమున పితృతీర్థము కలదు.
4. బొటన వ్రేలు, అరచేతికి దిగువన మణికట్టువైపున బ్రహ్మతీర్థము గలదు.
5. అరచేతి యందు (మధ్యలో) అగ్ని తీర్థము కలదు

కావుననే దేవతా కార్యముల నాచరించునప్పుడు విడచు జలమును వ్రేళ్ళ చివరల నుండి, పితృ కార్యముల జేయునపుడు అంగుష్ఠ తర్జనీ (బొటన చూపుడు

వ్రేళ్ళ) వ్రేళ్ళ మధ్య నుండియు, విడువవలెను. ఆచమించుట తీర్థాదుల గ్రహించుటలు బ్రహ్మతీర్థ స్థానమైన మణికట్టు పైగా పుచ్చుకొనవలయునని గ్రాహ్యము. ఋషి తీర్థముతోను, దేవతీర్థముతోను ఆచమనము చేయరాదు. బ్రహ్మ తీర్థముతో నాచమించవలెను. తైత్తరీయసంధ్యోపాసనము - 96

" అపః నారాయణః ఉదకం నారాయణ స్వరూపమ్ "

ఇత్యాది శ్రుతి వాక్కులచే జలము నారాయణ స్వరూపమనియు, అట్టి జలము, తదంతర్వర్తియగు నారాయణుడును, పరబ్రహ్మగనెంచి అపరబ్రహ్మమునకు (అక్షర) ప్రతీకమగు ఓంకారముచే, ఆ విషయమును గుర్తుంచుకొనుచు ఆ జలమును ప్రణవ, పల్లవములను జేర్చిన కేశవాది నామములతో పుచ్చుకొనుట, చల్లుకొనుట, తాకుట, తాకించుట వంటి క్రియలను జేయుటయే పురాణాచమనమని తెలిసినదియే. ఇట ఆ కేశవాది యిరువది నాలుగు నామములను ఆ విశేషములను తెలిసికొందము. సాంధ్యదీపిక - 20. 20

1. ఓం కేశవాయస్వాహా :. "ప్రశస్తాః కేశాః అస్యసన్తీతి కేశవః "

ప్రశస్తములైన నీల కేశములు గలవాడు కావున కేశవుడు అని కీర్తించబడెను. నున్ననివై నీలములైన శిరోజములచే శోభించువాడును, మందార పారిజాతముల ధరించి కొప్పువలె ఎత్తి కట్టబడిన కుంతలములు గలవాడు. పద్మపురాణము

బ్రహ్మరుద్రులను ప్రవర్తింప జేయువాడు, క+ఈ+ఇ+ఈశ+వ = బ్రహ్మను, లక్ష్మిని, కాముని, రుద్రునిం బ్రవర్తింప జేయువాడు, లేక వహించువాడు : కేశ+వ = సుఖ శ్రేష్ఠమున వహించువాడు. ప్రళయ సముద్రమున గాని, క్షీర సముద్రమునగాని యుండువాడు. బ్రహ్మను, రుద్రుని రక్షించువాడు (కేశవ - క+ఈశ+వ-) కేశియను రాక్షసుని చంపినవాడు. శ్రీ భగవద్గీత 1931 సం. 1/31=35

" కశ్చ ఈశశ్చ మహాతీతి కేశవః " = నాభియందు పద్మమున బ్రహ్మను సృజించి, తన ఎడమ భాగము నుండి రుద్రుని సృష్టించినవాడు కావున కేశవుడని భావం. కేశియను రాక్షసుని సృష్టి ఆదియందు సంహరించినవాడు కావున కేశవుడు అని. క్లేశములు హరించేవాడు కావున కేశవ అని భావం. నల్లని ఉంగరములు వంటి కేశములు గలిగినవాడు కావున కేశవుడు అని.

కరారవిందేన పదారవిందం.....మనసా స్మరామి, అని యస్మాత్త్వ మేష దుష్టాత్మా హతః కేశి జనార్ధన తస్మాత్ కేశవ నామ్నాత్వం - లోకే గోపో భవిష్యతి : (కేశి అను రాక్షసుని చంపటం అంటే) శరీరంలో ఉండే సర్వదుర్గుణములు

అనే రాక్షసులను సంహరించువాడు. కావునే కేశవ అనే పేరు వచ్చినది. మంత్ర శాస్త్రమున (ఉత్తరామ్నాయం) మోక్ష మార్గమైన ఊర్ధ్వ అమ్నాయం నందు కూడా ఈ నామమంత్రం ఈ విధంగా కలదు. " ఓం నమో కేశవాయస్వాహా " అని. కేశవాయ అనేది నామం కాదు - మోక్షమునకు దారిని చూపే మార్గం. దానిని సరిగా మనం స్మరిస్తే తప్పక శుభం చేకూర్చుతుంది. అంతేగాని కేశవ నామమే కదా అని (అశ్రద్ధగా - నమ్మకం లేక) స్మరిస్తే ప్రయోజనం శూన్యం. అంతేగాదు భగవంతుడు లోకక్షేమం కోరి ఒక మహామంత్రాన్ని జనులకు అచమనంలో ఒక నామంలా ప్రసాదించాడు. కావున ఈ నామం స్మరిస్తూ శబ్దం రాకుండా అచమనం భక్తి, శ్రద్ధలతో చేస్తే తప్పక మనకి శుభం చేకూరుతుంది. ఇందు సందేహం లేదు. అరాధన 9/97=13

ప్రపంచమును పరిపాలించుటకు బ్రహ్మ విష్ణు మహేశ్వరుల నామములతో నుండునట్టి యేకాకారుడగు పరమాత్మ నా పాపములను పొనఋంచుగాక.

తైత్తరీయ సంధ్యోపాసనము.

## 2. ఓం నారాయణాయ స్వాహాః

భావం - నారః+అయనం యస్యసః నారాయణః అపోవైనారా ఇతిప్రోక్తా అపోవై నరసూనవః తాయదస్వాయనం పూర్వం తేన నారాయణః స్మృతః - అపములు (నీరు) - నారములు అనబడును. అట్టి ఉదకములకు పరమాత్మ ఉనికిపట్టు. అదీగాక ఉదకం నిర్మలం. దానికి రూపం శూన్యం. కానీ ప్రతి జీవికి ఉనికిపట్టు పరమాత్మ.

అందుకే పరమాత్మకు నారాయణుడు అని పేరు. ఆ స్వామి రూపం కూడా శూన్యం. ఎందుకంటే ఆ స్వామి ఉదక స్వరూపుడు కావున నారాయణుడు అని పేరు వచ్చినది. అంతేగాదు. "విష్ణుపాదోద్భవీం గంగాం" అని విష్ణుపాదముల నుంచి గంగ ఉద్భవించి పవిత్రురాలు అయినది. అటువంటి గంగే, పాదముల నుంచి పుట్టి పవిత్రమైతే గంగ జన్మకు కారణమైన ఆ నారాయణుడు ఎంతో పవిత్రుడు. అంతేకాదు ఆ నామం కూడా చాలా పవిత్రమైనది. మోక్ష జ్ఞాన అర్థ, కామములకు ఈనామం అధారం అని మంత్రశాస్త్రం, పురాణం ఇతిహాస ములు, ధర్మములు, వేదములు చెప్పుచున్నవి. పంచ అమ్నాయములలో కూడా ఈ నామం విశేషంగా చెప్పినారు. " ఓం నమో నారాయణాయ " అని ఈ నామాన్ని

యోగులు, మునులు, వేత్తలు, సర్వజీవులు కూడా ఈ నామాన్నే ఉపాసన చేస్తారు. అంతేగాదు అంత్యకాలమందు సర్వజీవులు నారాయణ శబ్దాన్నే ఉచ్ఛరించుచూ తమ దేహాన్ని విసర్జించుచు ముక్తిని పొందుచున్నారు. (గీ 8/13) కావున ఈ నామం చాలా పవిత్రమైనది. ఈ నామం స్మరిస్తూ అచమనం భక్తి శ్రద్ధలతో శబ్దం రాకుండా చేస్తే తప్పక ఆ స్వామి కృప లభిస్తుంది. ఆరాధన - 13 9/97

శ్రీదేవి భూదేవి సహితుడైయున్న శ్రీమన్నారాయణుడు

ఆ నారాయణుడు నల్ల కలువవలె శ్యామలమైన దేహముగలవాడు. కోటి సూర్యప్రకాశము గలవాడు. యౌవనవంతుడు, స్నిగ్ధాంగుడు. కోమలావయవములు గలవాడు. వికసించిన ఎఱ్ఱని తామరలంబోలి యతి మృదువులయిన కరచరణములును వికసించిన ఎఱ్ఱ తామర రేకుల వంటి నేత్రములునుం గలవాడు. తీగెల వంటి మంచి కనుబొమలు, నువ్వు బువ్వువంటి నాసికయు, అద్దముల వంటి చెక్కిళ్ళును, శ్రీకారముల వంటి కర్ణపుటములును, పద్మము వంటి ముఖమును, పందు ముత్యముల వంటి దంతములును, చిఱునవ్వు గల పవడము వంటి అధరోష్ఠంబును, పున్నమ చంద్రునితో సమానమైన నవ్వుతో గూడిన ముఖకమలంబును గలవాడును, బాలసూర్యకాంతి గల మకరకుండలములచే ప్రకాశించువాడును, నున్ననివై నీలములైన వెంద్రుకలచే శోభించువాడును, మందార పారిజాతముల ధరించి కొప్పువలె ఎత్తి కట్టబడిన శిరోజములు గలవాడును. ఉదయార్కునివలె కౌస్తుభమణియు, ముత్యాల హారములును, స్వర్ణహారములును, వానితో గూడి మూడురేఖలు గలిగి శంఖము వలె నొప్పుచున్న కంఠము గలవాడును, సింగము మూపురముల వలె ఉన్నతములై బలిసిన మూపురములచే ప్రకాశించువాడును, బలిసినవియు వట్రువలును, దీర్ఘములు నగు చతుర్బాహువులు గలవాడును, ఉంగరములు, కంకణములు, భుజకీర్తులు అను నాభరణములచే నలంకృతుండును, కోటి బాలసూర్యుల కాంతివంటి కాంతిగల గొప్ప భూషణముల చేతను, వనమాలచేతను, ప్రకాశించు బొమ్మ గలవాడును, బ్రహ్మకు పుట్టినిల్లగు నాభికమలము గల వాడును, లేయెండుకెన యగు నున్నని పీతాంబరమును ధరించినవాడును, నానావిధరత్న ఖచితములయి చిత్రవిచిత్రములయిన కాళ్ళయందెలు గలవాడును, కోటి మన్మథులబోలిన సౌందర్య లావణ్యములకు నిధియైనవాడు, పుష్పమాలికలు ధరించినవాడు, శంఖచక్రములు ధరించి యున్నత బాహువులు వరదాన హస్తము అభయ

హస్తము అను చతుర్భుజములు గలవాడు నగు శ్రీమన్నారాయణునికి - కుడి పార్శ్వమున లోకమాతయగు లక్ష్మీదేవి సర్వలక్షణ సంపన్నురాలును, దివ్యాభరణ భూషితురాలును, హస్తములయందు స్వర్ణపద్మములను, ధనపాత్రమును, మాదీఫలమును, ధరించి అభయహస్తయై సుఖాసీనురాలైయున్నది. మరియు నద్దేవుని యెడమ పార్శ్వమున నల్లకలువ ఱేకుల వంటి కాంతిగలిగి, వివిధాలంకారములతోడను, విచిత్ర వస్త్రాభరణాదులతోడను గూడి రెండు హస్తముల యందు కలువ పుష్పములను, మరి రెండు హస్తములయందు ధాన్యపాత్రమును చిలుకను ధరించియున్న భూదేవి, లక్ష్మీదేవి సహితుడైయున్న శ్రీమన్నారాయణునికి నమస్కారము. పద్మపురాణము 52-67

246 నారాయణః = అంతట వ్యాపించి వుండువాడు.

❖ నరాణామ్ సమూహః నారాః నారాః అయనం యస్యసఃనారాయణః ❖

నారములనగా నిత్యవస్తువుల సమూహము. వానిని ఆశ్రయముగా గలవాడు.

విష్ణుసహస్రనామము

నారాయణః = అనిరుద్ధుడే సృష్టికి సాక్షాత్కారణుడు. ఈ అనిరుద్ధునకే మహావిష్ణువనియు, నారాయణుండనియు నామములు కలవు. నారాయణుడన జలములే స్థానముగా కలవాడని అర్థము. ఇచ్చట నారాయణుడు శ్రీకృష్ణుని చిత్ప్రకాశమగు ప్రేమ (క్షీర) సముద్రమందు శయనించి సృష్టిని సంకల్పించును. సృష్టి సంకల్పము యొక్క బహిర్విః సృత స్థితియే అతని నాభి నుండి వెడలిన తామరకాడ. ముకుళావస్థనున్న విశ్వమే తామరమొగ్గ. నారాయణుడే సృష్టికర్తయయ్యును, సృష్టిని పెంపొందించుపని తానే చతుర్ముఖ బ్రహ్మరూపము వహించి యొనర్చెను. గుణత్రయము యొక్క అత్యంత సంక్షోభము తామరమొగ్గ యొక్క ఱేకులు విడుట. కమలము వికసించినంతనే అందు అంతవఱకు శయనించియున్న చతర్ముఖబ్రహ్మ కన్నులు తెఱచి తానెవరో తనకు స్థానమగు కమలమేమిటిదో తెలిసికొనగోరి కమలనాళము వెంట దిగుటయు, దాని అంతు తెలియజాలక మఱల బయటకు వచ్చుటయు, అప్పుడా జలము నుండి "తపతప" "ధ్యానింపుము ధ్యానింపు" మని యెడి ఒక శబ్దము బయలు వెడలుటయు, మనము పురాణముల వలన తెలిసికొనిన విషయమే. బ్రహ్మ అపుడు అంతర్ముఖుడై ధ్యానించినంతనే నారాయణుడు ప్రత్యక్షమై "వత్సా" నీవు సృష్టికర్తవగు బ్రహ్మదేవుడవు. కావున భువన నిర్మాణమొనర్పుము" అనివచించెను. అర్చావతారము - 10

నారములు అంటే నరుల సమూహము, జలములు అయనముగా గల వాడు నారాయణుడు ఇది లౌకికార్థము. వేదాంతపరముగా నారాయణుడు అంటే జ్ఞాన నివాసి అని అర్థము.
జ్ఞానమే రూపముగా గల భగవానుడు నా దోషములను నశింపజేయుగాక.

తైత్తరీయ సంధ్యోపాసనము.

## 3 ఓం మాధవాయస్వాహా

❖ మాయాః ధవః మాధవః ❖

'మా' యనగా లక్ష్మి. ఆ లక్ష్మికి ధవః = పతి లక్ష్మీపతి. భూమియు లక్ష్మియు నీకు పత్నులు. - ఈ లక్ష్మికి స్వరూపమువలె నిత్య నిర్మల రూపము, స్వాభావికమగు పరమైశ్వర్యము, సకల జగత్తునకు తల్లిగా నుండుట, భగవంతునితో నిత్య సంబంధము, అదియు స్వాభావికముగా నుండుట మున్నగునవి. తత్వపర శాస్త్రంబులలో స్పష్టము. వేదమున గూడ శ్రీసూక్తము, మేధాసూక్తము, శ్రద్ధా సూక్తము, ఉత్తర నారాయణము, కౌషీతకీ బ్రాహ్మణము ఇత్యాదులందు ఇవి విస్తరింపబడినవి.

శ్రీరామాయణంబున సీత(లక్ష్మి) యొక్క చరిత్రమే అధికము. లక్ష్మీ సంబంధ ముండుట వలననే భగవంతుడు గూడ దేవుడయ్యె. వి.స.నా.

❖ మౌనాత్ ధ్యానాచ్చ యోగాచ్చ విద్ధి భారత మాధవమ్ ❖ (భా.ఉ)
అను నిరుక్త రీతిగా మౌన ధ్యాన యోగంబులు గలవాడు.

73- మాధవః = శ్రియఃపతి, 169 = మాధవః = 1. మాయకు(ను) పర విద్యకు స్వామి 2. మౌన ధ్యాన యోగంబులు గలవాడు : 741 = మాధవః = 1. లక్ష్మీపతి, 2. యదువంశంబున అవతరించినవాడు, 3. మౌనాదులంగలవాడు.

విష్ణు సహస్రనామ స్తోత్రము

**" మా విద్యాచ హరేః ఇతి ప్రోక్తా తస్యా ఈశో యతో భవాన్**
**తస్మాత్ మాధవ నామాసి ధవః స్వామితి శబ్దతః "**

'మా' యనగా మాయాశక్తి అంటే శ్రీహరి విద్య. ఆ మాయకు అధిపతి (భర్త) అగుట వలన మాధవుడు అని పేరు. ధవుడు అంటే భర్త - నాథుడు అని అర్థం. అంతేగాక అసురులను మాయచేసి సంహరించగల శక్తి కల్గినవాడు. కావున మాధవుడు అనియు శరీరంలో కల అసురత్వం అనే మాయను ఛేధించ కలవాడు కావున మాధవుడు అని పేరు. "ముక్తి, జ్ఞాన సిద్ధ్యర్థం - మాధవనామం స్మరేత్"

అని కూర్మపురాణంలో చెప్పబడినది. ముక్తికి, జ్ఞానమునకు, సర్వకాల సర్వావస్థల యందు మాధవనామం మహోత్తమమైనది అని చెప్పబడినది. మంత్ర శాస్త్రము నందు ఈ విధంగా ఈ నామం చెప్పినారు. "ఓం శ్రీం ఓం మాధవాయ మహ్యాం జ్ఞానం దేహి స్వాహా" అని పశ్చిమా మ్నాయ మందు చెప్పబడినది. కావున ఈ నామంతో ఆచమనం భక్తిశ్రద్ధలతో చేస్తే తప్పక ముక్తి జ్ఞానం లభిస్తుంది.

ఆరాధన 9/97=14

**మాద్రాక్షం క్షీణపుణ్యాన్ క్షణమపి భవతో భక్తిహీనాన్ పదాబ్జే**
**మాశ్రౌషం శ్రావ్యబంధం తవచరిత మపాస్యాన్యదాఖ్యానజాతమ్**
**మాస్మార్షం మాధవ! త్వా మపిభువనపతే! చేతసా ఽపహ్నువానాన్**
**మాభూవం త్వత్సపర్యావ్యతికర రహితో జన్మజన్మాంతరేపి.**

తా:- లోకనాథుడవగు ఓ మాధవా! (శ్రియఃపతీ) నీ పాదపద్మములందు భక్తిలేని పుణ్యహీనులను (పాపాత్ములను) క్షణకాలమైనను చూడకుందును గాక! నీ దివ్యచరిత్రమును విడచి, వినదగని రచన గల యితర చరితల సమూహమును వినకుందును గాక! మనసుతోనైనను నిను దూరువారిని స్మరియింపకుందును గాక! జన్మజన్మయందును నీసేవా సంపర్క శూన్యుడగాకుందును గాక :

ముకుందమాల

ప్రకృతి కధిష్ఠానమగు భగవంతుడు నా తప్పులను మన్నించుగాక.

తైత్తరీయ సంధ్యోపాసనము.

ఇప్పుడు మూడు పర్యాయములు తీర్థము తీసికొను విధానము చెప్పబడు తున్నది. అరచేయి, గోకర్ణాకారముగ (బొటనవ్రేలును, మధ్యమ వ్రేలియొక్క క్రింద మధ్యమ గణుపునకు తాకించినచో ఏర్పడునదే గోకర్ణాకృతి గోకర్ణాకారము) బట్టి, అందు మినపగింజ మునుగునంతటి జలము (అరచేతిలోని మధ్యగల రేఖ మునుగునట్లు)ను లోనికి పుచ్చుకొనవలయును. అంతకంటె హెచ్చుతగ్గ లగునెడలనది సురాపానమగును. మొదటి మూడు నామములతో నిటులే సలుపవలయును. 1,2,3 నామములను జెప్పుచు నాలుగు వ్రేళ్ళను కదియబట్టి (జేర్చి) బొటనవ్రేలి కొనను నడిమి పెద్ద వ్రేలి మధ్య కణుపు (పెద్దవ్రేలి మొదట) వద్ద జేర్చి గోకర్ణము వంటి హస్తమున (తో) జలమును గైకొని బొటనవ్రేలు, చిటికెనవ్రేలు వదలి మూడు పర్యాయములు త్రాగవలెను. ఈ మూడును ఆధ్యాత్మిక, అధి భౌతిక, అధి దైవిక బాధా నివృత్తిని దెలియజేయునవి. మిగిలిన

జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములైదు, ప్రాణములైదు, ఉపప్రాణములైదు, మనస్సుద్ధికి పనిముట్లు. క్రిందనుదహరించిన నామోచ్చారణములతో నావర్ను పనులను అచమనమందురు. దీనిలో బ్రాహ్మణుడు మొదట త్రాగిననీరు బొడ్డు వరకు పోయిన తర్వాత గాని రెండవసారి త్రాగగూడదు. క్షత్రియుడు కంఠము వరకు పోయిన వెనుక త్రాగవలెను. వైశ్యునికి దవడల వఱకుపోయిన చాలును.

మూడుమార్లు తీర్థమును త్రాగి, వరుసగా అష్టాంగ స్పర్శరూప క్రియలు చేయువాడు శ్రీమన్నారాయణుని కృపకు పాత్రుడై వేదవిహిత కర్మకు తగి యున్నాడు.

**4. ఓం గోవిందాయ నమః ముందుగా కుడిచేతితో జలమును తీసికొని, ఎడమ అరచేతిని కడిగి కొనవలయును.**

గీత 1/32=గో=1. గంధర్వ విద్యలు, 2. ధేను భూమి, స్వర్గములును, రూపావ తారములును, జ్ఞానకిరణములును - వీనిని, విదంతి = పొందించువాడని యర్థము. లేక వేదముల చేత తెలియబడువాడు, వాక్కులకు విష్ణు జ్ఞానము నిచ్చువాడు. వాక్కు యజ్ఞానమును బోగొట్టువాడు. గోవింద = ఇంద్రియము లను పొందువాడు, ఇంద్రియము లధిష్ఠానముగా గలవాడు. 1931 గీత 1/32

**విక్రేతు కామాఖిల గోపకన్యా - మురారి పాదార్పిత చిత్తవృత్తిః ।**
**దధ్యాధికం మోహవశాదవోచద్ - గోవిన్ద దామోదర మాధవేతి ॥**

భావం :- మురారియగు శ్రీకృష్ణుని పాదకమలములందు లగ్నమైన చిత్తవృత్తి గల గోపికలందరు పెరుగు, పాలు అమ్ముకొనుటకై ఇంటి నుండి బయటకు వచ్చిరి. వారి మనస్సు మురారి చెంతనే ఉండెను. కావున వారు భక్తి పారవశ్యమున పెరుగు, పాలు కావలెనా? అను వాక్యమునకు బదులు ' గోవిందా ! దామోదరా ! మాధవా ! అని పెద్దగా పలుకదొడగిరి.

గోవిందదామోదరస్తోత్రము నుండి

**అహం కిలేంద్రో దేవానం త్వంగవాం ఇంద్రతాం గతః ।**
**గోవింద ఇతి లోకస్త్వాం స్తోష్యంతి భువి శాశ్వతమ్ ॥**

భావం:- దేవతలకు ఇంద్రుడు అగుటచేత ఆ స్వామికి గోవిందుడు అనీ, కృష్ణుడు గోవులకు ఇంద్రుడు కావున గోవిందుడు అని వేత్తలు, జ్ఞానుల నిర్ణయం. అందరికి ప్రభువు కావున గోవిందుడు అని, జ్ఞానమును ప్రసాదించువాడు కావున

గోవిందుడు అని పేరు. మంత్రశాస్త్రమున ఈ నామం గురించి విశేషమంత్రంగా చెప్పబడినది. ఓం క్లీం కృష్ణాయ గోవిందాయ గోపీజన వల్లభాయ స్వాహా - కావున ఈ నామంతో భక్తిశ్రద్ధలతో అచమనం చేస్తే తప్పక స్వామి కృప లభిస్తుంది.

అరాధన 9/97 = 14

భూమి యందంతటను వ్యాపించియుండు నాత్మకు నమస్కారము.

తైత్తరీయసంధ్యోపాసనము

5 ఓం విష్ణవేనమ : ఎడమచేతితో జలమును తీసికొని కుడి అరచేతిని కడిగికొనవలెను.

❖ నతదస్తి వినాయత్స్యాన్మయా భూతం చరాచరమ్ ❖

అర్జునా ! అన్ని భూతములకును నేనే మూల బీజము. చరాచర వస్తువులలో నేను కానిది యేదియు లేదు. గీత 10/39

2 విష్ణు: = అంతట వ్యాపించుయుండు వాడు, 259, 663 = వ్యాపించిన వాడు.

❖ వేవేష్టి వ్యాప్నోతీతి విష్ణు: ❖ ఇట్లు తనశక్తిచే లోకంబును వ్యాపించినవాడు

+ యస్మాద్వ్యిష్టమిదం సర్వం తస్య శక్త్యా మహాత్మనః

తస్మాత్సప్రో చ్యతే విష్ణుః విశేర్ధాతోః ప్రవేశనాత్ + విష్ణుసహస్రనామం

ఆ మహనీయుడు తనశక్తిచే ఈ ప్రపంచమంతయు వ్యాపించియుండుటచే వానిని విష్ణువు అని యందురు. విష్ణుసహస్రనామం

వ్యాపిత్వా త్సర్వ భూతానాం విష్ణురిత్యభిధీయతే,

యో సౌ సర్వగతో దేవస్స ఏవ పరమేశ్వరః.

భావం :- సర్వ భూతములందు వ్యాపించుటచే విష్ణువనబడెను. సర్వగతుడైన యా దేవుడే పరమేశ్వరుడు. బాలకాండ - 519 - 83/22.

ప్రణామ మీశస్య శిరః ఫలం విదు

స్తద్దర్శనం పాణి ఫలం దివౌకసః

మనః ఫలం తద్గుణ తత్త్వ చింతనం

వచః ఫలం తద్గుణ కీర్తనం బుధాః

తా. శిరస్సున్నందుకు భగవంతుని నమస్కరించుటయు, చేతులున్నందుకు దేవుని బూజించుటకు, మనస్సున్నందుకు పరమేశ్వరుని గుణముల యొక్క తత్త్వమును ధ్యానించుటయు, వాక్కున్నందుకు సర్వేశ్వరుని గుణముల కీర్తించుటయు, ఫలములని దేవతలు బండితులు తలంతురు. ముకుందమాల 58వ శ్లోకం

**"వేవేతి వ్యాప్నోతి ఇతివిష్ణుః - విశ్వపోషకో విష్ణుః"**

జగత్తుని కాపాడువాడు, పోషించువాడు కావున ఆ స్వామికి "విష్ణువు" అని పేరు వచ్చినది. అదీగాక 'విశ్' అనగా ప్రవేశించుట అని భావం. ఆ స్వామి సమస్త ప్రాణులలో ప్రవేశించి ఉన్నవాడు కావున "విష్ణువు" అని పేరు. ఈ నామం మంత్రశాస్త్రంలో ఒక మహామం త్రంగా ఉపాసింపబడుచున్నది. మంత్రం "ఓం ఓం విష్ణవే నమః" (దక్షిణామ్నాయంలో) కావున ఈ నామం మహా ఉన్నతమైనది. అచమనం చేసేటప్పుడు ఈ నామాన్ని భక్తిశ్రద్ధలతో స్మరిస్తే భోగం మోక్షం రెండు లభిస్తాయి. ఆరాధన - 14

సర్వపదార్థములందును సూత్రాత్మగ వ్యాపించియుండు దైవమునకు, నమస్కారము.

**6. ఓం మధుసూదనాయనమః ముందుగా ఐదువ్రేళ్ళను ముడిచి (పిడికిలిగా బిగించి) బొటనవ్రేలుతో పై పెదవిని (అడుగు పెదవియని తైత్తరీయ సంధ్యోపాసనము) తుడుచుచున్నాను.**

మధుసూదన = తేనె పూసిన యప్పము వలె సుఖలేశము కల సంసారమును పోగొట్టువాడు. లేక మధురముగా వండువాడైన భీముని నియమించువాడు. మధువనెడి దైత్యుని చంపినవాడు. భగవద్గీత -1/35=37

**74 మధుసూదనః ఇంద్రియములను శిక్షించువాడు**

కర్ణమిశ్రోద్భవుండైన మధువను రాక్షసుని వధించుటచే భగవానుడు "మధుసూదను" డాయెనని మహాభారతము భీష్మపర్వము నందున్నది.

విష్ణుసహస్రనామము

**కర్ణమిశ్రాద్భవం చాపి మధునామ మహాసురమ్**
**బ్రహ్మణోపచితం కుర్విన్ జఘాన పురుషోత్తమాః**
**తస్యతాతా వధా దేవదేవ దానవ మానవః**
**మధుసూదన ఇత్యాహుః ఋషయశ్చ జనార్దనమ్.**

బ్రహ్మకు ఉపకారము చేసి మధువు అనే రాక్షసుని జంపిన కారణం చేత ఆ పురుషోత్తమునకు జనులు జనార్దనుడు, మధుసూదనుడు అనే నామం సార్థకం అయినది. మంత్ర శాస్త్రంలో ఈ నామం ఒక మహామంత్రంగా వివరింపబడినది. (దక్షిణామ్నాయంలో) "ఓం నమో మధుసూదనాయ మహ్యాం జ్ఞానం ప్రయచ్ఛ స్వాహా" అని వున్నది. కావున ఈ నామం నామం కాదు. ముక్తికి సోపానం. కావున ఈ నామం భక్తి శ్రద్ధలతో స్మరిస్తే తప్పక ముక్తి జ్ఞానం లభిస్తుంది.

ఆరాధన 9/1997=14

మమకారమును పోగొట్టి జ్ఞానమును కలిగించు దేవునకు నమస్కారము. తై.సం.పా.

**7. ఓం త్రివిక్రమాయ నమః** ఐదు వ్రేళ్ళను ముడిచి బొటనవ్రేలుతో క్రింది పెదవిని (పైపెదవియని తైత్తరీయ సంధ్యోపాసనము) తుడుచుచున్నాను.

✦ త్రీన్ క్రమతే ఇతి త్రివిక్రమః " ✦ ఇట్టి మహామహిమశాలి యగుట చే 'త్రి' అనగా మూడు వేదంబులని మహర్షులందరు. వాని నన్నిటిని వ్యాపించి యుండు టచే నిన్ను త్రివిక్రముడందురు అని నిరుక్త రీతిగా సమస్త వేదంబులకును వీడే వాచ్యుడుగా నుండువాడు.

533 త్రివిక్రమః = వేదంబున వ్యాపించినవాడు. విష్ణు సహస్రనామం

విక్రములు అనగా పాదములు అని భావం. మూడు పాదముల చేత ముల్లోకములను అక్రమించినవాడు. కావున "త్రివిక్రముడు" అనే నామం వచ్చినది. అదీగాక విక్రమం అనగా శౌర్యం - (శక్తి) అని జగత్తులో ఆ శ్రీహరిని మించిన శక్తిశాలి వేరేవాడు లేడు కావున "త్రివిక్రముడు" అనిపేరు. మంత్ర శాస్త్రంలో ఈ నామం ఉపాసనకు సార్థకమైన విశేషమంత్రంగా చెప్పినారు. "ఓం నమోభగవతే త్రివిక్రమాయ ద్రవిణం దేహి స్వాహా" పూర్వ అమ్నాయ కల్పంలో వివరించ బడినది. కావున త్రివిక్రమాయ నమః అనేది ఒక నామం కాదు. ఒక మహా మంత్రం. కావున భక్తి శ్రద్ధలతో నమస్కరించినట్లయితే తప్పక ముక్తి భుక్తి ఐశ్వర్యం లభిస్తుంది. ఆరాధన 9/97=14,15

మూడు పాదములతో నెల్ల లోకముల నావరించి రక్షించు వానికి నమస్కారము.

తై.సం.పా.

**8 ఓం వామనాయ నమః = దర్భలతో శిరమున జలము చల్లుకొనవలెను.**

"అధవా బహునైతేన... (ఏ) మేకాం శేన స్థితో జగత్ "

అర్జునా ! వేయి మాటలెందుకు? ఈ మొత్తము జగత్తు నా విశాల

స్వరూపము లోని ఒక్కింత భాగము నందు అదిగి ఒదిగి యున్నది.

శ్రీగీతా తాత్పర్యప్రదీపము - 10/42

విష్టభ్య = విశేషముగా వ్యాపించి, స్థితః = ఉన్నాను. (ఇందులకు శ్రుతి -- పాదోఽస్య విశ్వాభూతాని" " ఈ పరమాత్మకు సమస్తమయిన ప్రపంచమును నొక పాదమని శ్రుత్యర్థము.

1931 సం.గీత 10/42

**ప్రణత కామదం పద్మ జార్చితం - ధరణి మండనం ధ్యేయ మాపది**
**చరణ పంకజం శన్తమం చతే - రమణ నః స్తనే ష్వర్ప యాధిహన్.**

భావం:- ఓ రమణుడా ! నీ చరణ కమలము శరణాగతులైన వారి కోర్కెలను తీర్చును. బ్రహ్మదేవుడు నిరంతరము నీ పాదములనే పూజించుచుండును. భూమాతకు నీ పాదమే భూషణమైయున్నది. ఆపదలు కలిగినపుడు నీ పాదములను ధ్యానించినచో అవి సర్వ క్షేమములను సమకూర్చును. అట్టి నీ పవిత్ర చరణ పంకజములను మా స్తనముల యందుంచి మా మనోక్లేశమును తొలగింపుము.

భగవానుని చరణముల వైభవమును గోపికలు ఈ శ్లోకంలో గానం చేస్తున్నారు. శ్రీ కృష్ణుని చరణ పంకజము శరణమనిన వారలకెల్ల కోరికలు దీర్చునని కీర్తిస్తున్నారు. గోపికలు - "పాదోఽస్య విశ్వభూతాని" ఈ విశ్వమంతయు భగవంతుని ఒక పాదమేనని వేదములోని పురుషసూక్తంలో తెలియజేయబడింది. కనుక ఈ విశ్వమును భగవంతుని పాదముగా దర్శించడము సత్యదృష్టి. జగత్తు జగత్తుగా మిధ్య. జగత్తు పరమాత్మగా లేక పరమాత్మ చరణ పంకజముగా సత్యము. కనుక జగత్తు చూసేవానికి జీవభ్రాంతి తొలగింది. ఆ స్థితిలో కోరికలావిర్భవించే అవకాశమేలేదు. కనుక శ్రీకృష్ణుని చరణ కమలము శరణమనిన వారి సకల కోర్కెలను తీర్చునని గోపికలు గానము చేయడంలోని అధ్యాత్మిక సత్యమిదియే. కోరికలను తీర్చడమంటే లేకుండా చేయడమని భావము.గోపికా గీతము

154 వామనః = సుఖమునిచ్చువాడు

చక్కగా సేవింపదగినవాడై "వామనః" అని కీర్తింపబడెను.

**" మధ్యే వామన మాసీనం విశ్వే దేవా ఉపాసతే "**

హృదయ మధ్యమున ఆసీనుడైయున్న వామనుని విశ్వదేవతలు సేవించుచున్నారు. అని కఠోపనిషత్తు తెలియజేసినది. ఇచట వామనుడనగా ఆత్మ విశ్వదేవతలనగా ఇంద్రియములు - బలిచక్రవర్తిని వామనమూర్తి యై మూడడుగుల భూమిని దానమడిగిన కారణము చేత గూడా తాను వామనుడాయెను.

బలిచక్రవర్తి యజ్ఞసభలోకి వామనమూర్తి రూపములో ప్రవేశించి భగవానుడు దానము కోరెను. దానమడిగిన బ్రహ్మచారికి బలి దానమిచ్చి శాశ్వత కీర్తి నార్జించెను. బలినుద్ధరించిన భగవానుడే వామనమూర్తి. విష్ణు సహస్రనామం

" మననేవ దృశ్యతి స్వయంవా మనః " శ్రీ విష్ణువు తన అయిదవ అవతారమున పొట్టివాడుగా అవతరించి, బలిచక్రవర్తిని యాచించి మూడు అడుగులతో ముల్లోకములను ఆక్రమించెను. ఆ పురాణగాథ అందరికీ విదితమే. మరికొన్ని పురాణములయందు ఈ విధంగా వివరణ ఇచ్చియున్నారు. "మధ్యే వామన మాసీనం విశ్వేదేవా ఉపాసతే " స్మరణ చేత భక్తుల హృదయములను ఆక్రమించి మోక్షమును ఇచ్చువాడు. స్మరణ చేత భక్తులకు దర్శనం ఇచ్చువాడు. కావున వామనుడు అని పేరు. మంత్రశాస్త్రము నందు మంత్రంగా ఉన్నవాడు. మనుః "ఓం శ్రీం నమో విష్ణవే వామనాయ స్వాహా " అని వున్నది. కావున ఈ నామాన్ని భక్తి శ్రద్ధలతో ధ్యానిస్తే తప్పక జ్ఞానసిద్ధి కలుగుతుంది. ఆరాధన 9/97-15

**హరిః ఓం త్రైలోక్యరాజ్య మాచ్ఛిద్య బలే రింద్రాయ యో దదౌ !**
**నమస్తస్మై సురేశాయ సదా వామన రూపిణే ॥** అష్టాదశ పురాణములు - 261

పొట్టివాడగు (అణువులలో నణువుగ నుండు) వానికి నమస్కారము. తై.సం.పా.

**9. ఓం శ్రీధరాయనమః దర్భలతో శిరముపై జలము చల్లుకొనవలయును.**

617 శ్రీధరః = లక్ష్మిని స్వతః ధరించినవాడు.

✦ శ్రియం ధరతీతి శ్రీధరః ✦ రత్నము కాంతిని, పువ్వు పరిమళంబును, చంద్రుడు వెన్నెలను, అమృతము మాధుర్యమును పొందియుండునట్లు లక్ష్మిని స్వభావముగా ధరించినవాడు. మనస్వియగు పురుషుడెట్లు కీర్తిని విడువజాలడో అటులే ఈ సీతను విడువజాలను. (రా. అ. 30.29)

సకల జీవంబులకు దల్లియగు లక్ష్మిని తన ఱొమ్మున ధరించువాడు (శ్రీధరుడు)

శం.భా. విష్ణు సహస్రనామం

శ్రీ+ధరః - అని శ్రీని ధరించినవాడు అగుట చేత ఆ శ్రీహరికి "శ్రీధరుడు" అనే నామం సార్థకం. శ్రీ అనగా లక్ష్మి (ధరః) - (ధవః) అనగా (భర్త) నాథుడు అని పేరు. అందుకే ఆ శ్రీధరుడు ధ్యాతవ్యుడు అగుచున్నాడు. మంత్రశాస్త్రంలో ఈ విధంగా నామ ప్రాశస్త్యమును మహామంత్రంగా పూర్వామ్నాయంలో చెప్పబడినది. " ఓం శ్రీం హ్రీం క్లీం శ్రీధరాయ స్వాహా " అని వున్నది. కావున ఈ

నామాన్ని భక్తి శ్రద్ధలతో ధ్యానిస్తే తప్పక ముక్తి జ్ఞానం, విద్య లభిస్తుంది.

ఆరాధన - 15

షడ్గుణైశ్వర్య సంపన్నునకు నమస్కారము. తైత్తరీయ సంధ్యోపాసనము

**10. ఓం హృషీకేశాయ నమః దర్భలచే ఎడమ అరచేతిని ప్రోక్షించుకొన వలయును.**

హృషీ కేశః = హృషీక = ఇంద్రియములకు, ఈశః = నియామకుడయిన శ్రీకృష్ణుడు (రామానుజభాష్యము)

హృషీకేశః = విషయేంద్రాదులకు ప్రేరకుడగుటచేతను, లేక సుఖమయములగు తలవెంట్రుకలు గలవాడగుట చేతను హృషీకేశుడు, హృషీక +ఈ+ఇ+ఈశ = సంతోషించిన బ్రహ్మ లక్ష్మి కాముడు, రుద్రుడును కలవాడని మధ్వభాష్యము

గీత 1/15

47. హృషీకేశః = ఇంద్రియములకు నీశుడు.

**+ సూర్యరశ్మిః హరికేశః పురస్తాత్ +**

సూర్య (చంద్ర) కిరణములు హరి ముంగురులని వేద ప్రవచనము.

హృషీకంబులనగా ఇంద్రియములు. వానిని నియమించువాడు. బ్రహ్మాదుల ఇంద్రియంబులు ఈతని యధీనంబులై యుండునపుడు వారు వీనినెట్లు పరిచ్ఛే దింపగలరు? అని భావము. కేశవా హృషీకములనగా ఇంద్రియములు. ఆ ఇంద్రియములకు ఈశ్వరుండగుటచే నిన్ను వేదములు హృషీకేశుండని చెప్పుచున్నవి. విష్ణు సహస్రనామం

**"హృషీకేశః హృషీకాణాం విషయేంద్రియాణాం ఈశః ।**
**పాలకః నియామకః ప్రేరకః యః సః హృషీకేశః "**

అనుటను బట్టి ప్రణవ ప్రతిపాదితుండై సన్నిధి మాత్రముచే ఇంద్రియములకు, తద్విషయములకు, ప్రభువు, నియామకుడు, ప్రేరకుడు, ఈశ్వరుడు అయిన ఓ హృషాకేశా! నీ రూపమైన జలమును సమ్మార్జనము జేసికొనుచున్నాను. కావున నా ఇంద్రియసంఘాతమును తద్విషయములను భవదున్ముఖముగ చేయ ప్రార్థించుచున్నాను. సౌందర్యదీపిక - 24

హృషీక+ఈశః = హృషీకములు (ఇంద్రియములు) ఈశః=(నాథుడు) భర్త అని అర్థం. ఇంద్రియ గణములకు నాథుడు, కావున ఆ శ్రీహరికి హృషీకేశుడు

అని పేరు. మంత్రశాస్త్రంలో ఈ నామాన్ని మహామంత్రంగా వివరించబడినది. "ఓం క్లీం హ్రాం హృషీకేశాయ తుభ్యం జ్ఞాన సిద్ధిం ప్రయచ్ఛ స్వాహా" కావున ఇది నామం కాదు. ఒక మహామంత్రం దీనిని భక్తి శ్రద్ధలతో ధ్యానిస్తే తప్పక కైవల్యం లభిస్తుంది. 9/97 - ఆరాధన - 15

జ్ఞానేంద్రియములను, కర్మేంద్రియములను నియమించువానికి నమస్కారము.

తై.సం.పా.

**11. ఓం పద్మనాభాయనమః అనుచు జలమును రెండు పాదములపై జల్లుకొనవలెను.**

48. పద్మనాభః = పద్మమును నాభిలో గలవాడు (198, 348)

✦ పద్మః నాభౌ యస్యసః పద్మనాభః ✦ బ్రహ్మదేవుని ఉత్పత్తి స్థానమైన పద్మమును నాభిలో గలవాడు. భగవంతుని నాభిలో పద్మము పుట్టును. తామరను నాభిలో గలవాడు. పద్మనాభ, హిరణ్యనాభ నామంబుల (198, 196) యర్థము బ్రహ్మాండ పురాణంబున స్పష్టము - సంకల్పంబుచే నిద్రించువాని నాభి నుండి పృథివీ సంబంధమై అష్టదళంబులతో గూడిన పెద్ద తామఱ ఒకటి గలిగే. దానికి సువర్ణమయంబగు మేరు పర్వతమే తామరదుద్దుగానయ్యె.

పద్మము వలె మిక్కిలి గుండ్రవైన నాభి గలవాడు లేక హృదయ పద్మము యొక్క మధ్యమునందు ప్రకాశించువాడు (పద్మనాభుడు) విష్ణు సహస్రనామం

తన పాదపద్మములకు నమస్కరించిన వారిని కృతార్థులునుగా జేయువాడు. "పద్మమివ నాభిః యస్యసః పద్మనాభః ! పద్మము వంటి నాభిని గలవాడు.

వి.సవా. - గౌడీయమఠం

1. పద్మమును నాభియందు గల వానికి నమస్కారము.
2. పద్మమాలను కంఠము నందు ధరించిన వానికి నమస్కారము.
3. పద్మ చిహ్నములైన పాదములు గలవానికి నమస్కారము.
4. పద్మలోచనుడగు వానికి నమస్కారము.
5. పద్మము వంటి నాభిని గలవానికి నమస్కారము.

పద్మ+నాభః = పద్మనాభః అని, నాభి యందు బ్రహ్మను సృష్టించినవాడు. కావున శ్రీహరికి "పద్మనాభుడు" అని పేరు కల్గినది. విష్ణు నాభియందు పద్మము కలిగి దానియందు బ్రహ్మ కూర్చొని తన సృష్టిని ప్రారంభించెను. కావున ఆ

శ్రీహరికి పుండరీ కాక్షుడు, పద్మనాభుడు అనే నామాలు కల్గినవి. మంత్రశాస్త్రంలో పశ్చిమామ్నాయంలో "ఓం - ఓంద్రాం శ్రీం విష్ణవే పద్మనాభాయ సురపతయే స్వాహా" అని మంత్రం - కావున ఇది మహామంత్రం. కాని సామాన్య నామం కాదు. దీనిని భక్తి శ్రద్ధలతో స్మరిస్తే తప్పక విద్య, ముక్తి లభిస్తుంది.9/97 ఆరాధన-15

నాభి కమలమున కుండలి ఆకారమున నున్నవానికి నమస్కారము. తై.సం.పా.

**12. ఓం దామోదరాయ నమః** దర్భలచే శిరమున ఉదకము చల్లుకొనవలయును.

369 దామోదరః = 1. లోకములను ఉదరము (కడుపు) న గలవాడు, 2. సుఖమునిచ్చువాడు, 3.దామమును (త్రాటిని) ఉదరమున గలవాడు.

✦ దామానిఉదరే యస్యసః దామోదరః ✦ 1. దామ అని పేరొందిన లోకములు ఉదరంబున ఉండుటచే వాడు దామోదరుండని పేరొందెను. అను నిరుక్త రీతిగా లోకములను కడుపులో గలవాడు. 2. దేవతలకు సుఖంబొనరించు వాడగుటచే దామోదరుండగును. అను నిరుక్త రీతిగా దేవతలకు సుఖంబొనరించువాడు. 3. త్రాటిచే కట్టబడుటచే వాడు దామోదరుండయ్యె. అనినట్లు లక్ష్మియు గోరదగిన చాతుర్యము గలవాడయ్యు ఆశ్రితులయందు వాత్సల్యంబుచే యశోద యొక్క కట్టుకు లోబడియుండెను. గాన దామమును త్రాటిని ఉదరంబున గలవాడు. దామములు అనగా లోకములు. ఆంధ్ర భాష్యము 124

1. దమాది సాధనములచే గలిగిన జ్ఞానముచే బొందదగినవాడు. 2. లేక యశోదచే త్రాటితో నడుమున గట్టబడినవాడు. 3. లేక దామములనగా లోకములు వానిని దనయందుంచుకొన్నవాడు. శంకరభాష్యము - 73

దామములు అనగా లోకములు (పాశము) (త్రాడు) అని భావము. లోకములను తన ఉదరమునందే కల్గినవాడు కావున "దామోదరుడు" అని పేరు. భక్తి అనే పాశమునకు బద్ధుడు కావున శ్రీహరికి దామోదరుడు అని పేరు. 9/97 ఆరాధన - 15

నవ విధ భక్తులనెడి త్రాళ్ళతో బంధింపబడిన వానికి నమస్కారము. తై.సం.ము.

**13. ఓం సంకర్షణాయనమః -**

1. వ్రేళ్లు పిడికిలిగా బిగించి నాయీ చుబుకమును (గడ్డమును) స్పృశించుచున్నాను అని సాంధ్యదీపిక
2. వ్రేళ్ళను ముడిచి వ్రేళ్ళపాదు యొక్క వెనుక పాదుతో గడ్డమును స్పృశించవలయు నంటోంది తైత్తరీయ సంధ్యోపాసనము.

3. సర్వాంగుళి మూలములతో గడ్డమును తాకవలయునని 'త్రికాల సంధ్యావందనము' అంటోంది.

ఆచరించు విధానము తుది నిర్ణయము పాఠకులదే !

556. సంకర్షణః = సంకర్షణుడు

✦ సంకర్షతీతి సంకర్షణః ✦

వాడెవ్వడనగా చేతనాచేతనంబులను తమయందు ఒకటిగా చేరునట్లు ఆకర్షించు సంకర్షణ భగవంతుడు.

:- సంకర్షణో ఉచ్యుతః :- సంహార సమయమందొక్కమాటుగా జనులను దనలోనికి లాగుకొనువాడు లేక స్వస్వరూపము నుండి నశింపనివాడు. - 'సంకర్షణో ఉచ్యుతః' అని ఒకే నామము. శంకర భాష్యము

'సంకర్షణో ఉచ్యుతః' హిరణ్యాక్షుని సంపూర్ణముగ ఆకర్షించినవాడు. ప్రళయ సమయమున ప్రజలను అందఱను ఒక్కమారె తనలోనికి ఆకర్షించుకొనువాడు. 'అచ్యుతః' స్వస్వరూపము నుండి జాఱిపోనివాడు. గౌడీయమఠం

ప్రళయకాలమున సర్వ జీవులను ఆకర్షించువాడు కావున సంకర్షణుడు అని పేరు. ఆ శ్రీహరి సహజ సుందర స్వరూపం (భక్తులను) సర్వజీవులను ఆకర్షించుచున్నది కావున సంకర్షణుడు. 9/97 ఆరాధన - 16

లెస్సగ పాపములను నశింపజేయు వానికి నమస్కారము. తై.సం.మూ

**14. ఓం వాసుదేవాయ నమః** ముందుగా బొటన, చూపుడు వ్రేళ్ళ కొనలను కలిపి కుడి ముక్కురంధ్రమును తాకవలయును.

**✦ వసతి వాసయతి ఆచ్ఛాదయతి సర్వమితి వాసుః ద్యోతతే స్తూయతే ఇతిదేవః వాసూశ్చా సౌ దేవశ్చ ఇతి వాసుదేవః ✦**

అను వ్యుత్పత్తి ననుసరించి ప్రణవ ప్రతిపాద్యుడు, సర్వత్ర నివసించువాడు, సర్వమును అచ్ఛాదించియున్నవాడు, ప్రకాశించువాడు, స్తుతించబడువాడు నగుటచే పరమాత్మకు వాసుదేవుడని నామము ప్రసిద్ధము.

334 వాసుదేవః = వ్యాపించుచు క్రీడించువాడు (700, 714)

**✦ వాసుశ్చా సౌ దేవశ్చ వాసుదేవః ✦** వాసుః అనగా సూర్యుడు తన కిరణంబులచే ఆవరించునట్లు ప్రపంచంబున వ్యాపించి తనయందు దానిని వసింపజేసి తానును వానియందు వశించువాడు. 'దేవః అనగా క్రీడించువాడు, జయము గోరువాడు, ప్రకాశించువాడు, స్తోత్రము చేయబడువాడు, పోవువాడు అని

వాసుదేవునకు అర్థము.
1. సమస్త లోకములను, సూర్యుడు కిరణంబులచే ఆవరించియున్నట్లు నేను ఆవరించియున్నాను. సమస్త భూతంబులకును ఉనికి పట్టుగా అగుదును. కనుక నన్ను వాసుదేవుడందురు. 2. వీడు అంతట వసించును వీని యందును అన్నియు వసించును. కనుకనే వీనిని వాసుదేవుడందురు.
వాసుదేవాయ = భూతముల కన్నిటికిని నివాస స్థాన భూతుడు.

రామానుజ భాష్యము 190

**వాసనా ద్వాసు దేవస్య వాసితన్తే జగత్రయం ।**
**సర్వ భూత నివాసోఽసి వాసుదేవ నమోఽస్తుతే ॥**

శ్రీ వాసుదేవ నమోస్తుత ఓం నమ ఇతి.

వాసుదేవా ! అంతటను నిండిన నీవు వసించుట చేతనే మూడు లోకములు నిలిచియున్నవి. సర్వ భూతముల యందు నివసించిన నీకు నమస్కారము. (ఓం నమస్కారము)

విష్ణు సహస్రనామం - 30

714. వాసుదేవః = జగత్తును మాయచే గప్పిపుచ్చువాడు. శంకరభాష్యము 106
ప్రేమ వశుడై యాదవులతోను, పాండవులతోను ఎల్లప్పుడు వుండువాడు, వారితో క్రీడించువాడు. గౌడీయమఠం 94

**" ద్యౌస్స చంద్రార్క నక్షత్రం ఖం దిశో భూర్మహోదధిః**
**వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః "**

భావం:- స్వర్గము చంద్ర సూర్య నక్షత్రములతో నుండు అకసము (ఆకాశము) దిక్కులు, భూమి, సముద్రము ఇవన్నియు మహాత్ముడగు వాసుదేవుని వీర్యము చేతనే నిలిచియున్నవి. అని మహాభారతము. ఆదిత్య హృదయము 54

**'న వాసుదేవం ప్రణిపత్యసీదతి'** వాసుదేవుని సేవించిన దుఃఖము నొందదు.

విష్ణుధర్మము - 70

కృష్ణునకు సృష్టి సంకల్పము కలిగినప్పుడు తనయందు శుద్ధ సత్త్వ రూపముతో నున్న సృష్టి బీజమునకు సంకల్ప స్పందము తాకుటచే గుణ సంక్షోభమునకు ఉన్ముఖతావస్థ అను ప్రథమ స్థితి యేర్పడుచున్నది. తదుపరి అస్పష్ట సంక్షోభ మను రెండవ స్థితియు, సంకుచిత సంక్షోభమను మూడవ స్థితియు, విస్పష్ట సంక్షోభమను నాల్గవ స్థితియు - ఆ సృష్టి బీజమునకు కలుగుచున్నవి. సృష్టి బీజము యొక్క శుద్ధ సత్త్వ రూపమునకు ఆశ్రయ స్థానము శ్రీకృష్ణుడగుటచే

అతనినే సృష్టికి మూల కారణునిగా గాని, లేక కారణ కారణునిగా గాని చెప్పు చున్నారు. పైని చెప్పిన ఉన్ముఖతావస్థకు ఆశ్రయ స్థానము, శ్రీకృష్ణుని రూపాం తరమగు వామదేవుడనియు, అస్పష్ట సంక్షోభమునకు ఆశ్రయ స్థానము సంకర్షణుడనియు, సంకుచిత సంక్షోభమునకు ఆశ్రయ స్థానము ప్రద్యుమ్ను డనియు, విస్పష్టసంక్షోభమునకు ఆశ్రయరూపము అనిరుద్ధుడనియు, భాగవత ధర్మములందు జెప్పబడినది. పై నాల్గు స్థితులకు ఆశ్రయములైన రూపములకు చతుర్వ్యూహమని పేరు. గుణక్షోభము విస్పష్టము, సంపూర్ణము అయినగాని సృష్టి కలుగదు. కావున విస్పష్ట సంక్షోభమునకు ఆశ్రయ రూపుడగు అనిరుద్ధుడే సృష్టికి సాక్షాత్కారణుడు. ఈ అనిరుద్ధునికే మహావిష్ణువనియు నారాయణు డనియు నామములు గలవు. నారాయణుడన జలమునే స్థానముగా గలవాడని అర్థము.

అర్చావతారము - 9,10

**" ఛాదయామి జగత్ సర్వం భూత్వా సూర్య ఇవాం సుభిః**
**సర్వ భూతాది వాసశ్చ వాసుదేవస్తుతః వ్రతః**
**వాసనాత్ సర్వ భూతానాం వసుత్వా ద్ధేవ యోనితః**
**వాసుదేవస్తుతో జ్ఞేయో యోగిభిస్తత్వ దర్శిభీః "**

భావం:- జగత్తు అంతటికి సూర్యకిరణముల వలె ఆ స్వామి (రూపం) (మాయ) ఆవరించి ఉండుట చేతను సర్వ భూతములు ఆ స్వామిచే వెలయుట చేతను దేవకీ గర్భ సంజాతుడు అవుట చేత ఆ పరమాత్మకు వాసుదేవుడు అని పేరు వచ్చినది.

(ఉదా)

**"కృష్ణస్తు భగవాన్ స్వయం వసుదేవసుత :**
**అవతార పురుషో వాసుదేవః శ్రీకృష్ణః "**

మంత్రశాస్త్రంలో ఈ నామాన్ని మహామంత్రంగా వివరింపబడినది. దక్షిణామ్నా యంలో "ఓం నమో భగవతే వాసుదేవాయ" అని, కావున ఇది నామం కాదు. ఒక మహామంత్రం. దీనిని భక్తి శ్రద్ధలతో స్మరిస్తే తప్పక భగవత్ కృప లభిస్తుంది.

ఆరాధన - 16

ఎనుబది నాలుగు లక్షల జీవరాసులయందు నివసించువానికి నమ స్కారము.

తై.సం.ము.

**15 ఓం ప్రద్యుమ్నాయనమః బొటనవ్రేలు, చూపుడు వ్రేళ్ళ కొనలను కలిపి ఎడమ ముక్కు రంధ్రమును తాకవలయును.**

646. ప్రద్యుమ్నః = పురుషోత్తముడు. "ప్రకృష్టం ద్యుమ్నం బలమస్య ప్రద్యుమ్నః"

విశేష ధనము గలవాడై భగవానుడు 'ప్రద్యుమ్నః' అని స్తుతించబడినాడు. లక్ష్మీపతియైన తనకు సంపదలో కొరత ఏమున్నది? కనుక తన నాశ్రయించు భక్తులకు భౌతిక సంపదను, భావ సంపదను, ఆధ్యాత్మిక సంపదను ఒనగూర్చు వాడైయున్నాడు. అదియును గాక ప్రద్యుమ్నుడనగా భగవానుని వ్యూహావతార ములలో ఒకటియని గుర్తుంచుకొన వలయును. భగవానుడు ప్రద్యుమ్నుడై ఎలా విశేషసంపదను గలిగియున్నాడో అలాగే విశేష పరాక్రమము కూడా కలిగి యున్నాడు. విష్ణు సహస్రనామము

ఓం ప్రద్యుమ్నాయ నమః అనగా విశేష ధనము కలవాడు అని భావం. భగవంతుని నాలుగు వ్యూహములలో ప్రద్యుమ్నవ్యూహం మూడవదిగా తెలుప బడెను. తనని ఆశ్రయించిన భక్తులకు భోగ, మోక్షములను ప్రసాదించువాడు. అనిపేరు కావున దీనిని విశేషనామంగా కీర్తించారు. ఆరాధన 9/97=16.

స్వప్రకాశ స్వరూపునకు నమస్కారము. తై.సం.ము

**16 ఓం అనిరుద్ధాయ నమః ముందుగా బొటనవ్రేలు, ఉంగరపువ్రేలు కలిపి కుడికన్నును తాకవలయును.**

187 అనిరుద్ధః = అడ్డగింప సాధ్యముగాని వాడు (644)

మరొకరు ఎదురించువారు లేనివాడై "అనిరుద్ధ" అని కీర్తించబడెను. "ధర్మోరక్షతి రక్షితః" అని ఉపనిషద్వచనము. ధర్మము నెవరైతే రక్షింతురో వారు ధర్మముచే రక్షింపబడుదురు. భగవానుడు ధర్మస్వరూపుడు గనుక తననెదురించు శక్తి ఎవ్వరికిని లేదని భావము. అదియును గాక భక్తుల నుద్ధరించుట యందు ఎవరు అడ్డగించినను లెక్క చేయని వాడని భావము. విభీషణుడు శ్రీరాముని శరణు జొచ్చినపుడు శత్రువు సోదరుడైన విభీషణుని ప్రవర్తన అనుమానాస్పద మనియు అతనిని దగ్గర జేర్చుట సముచితము కాదని, పైగా ప్రమాదభరితమని ఎందరు హెచ్చరించిననూ శ్రీరాముడు తన నిర్ణయమును మార్చుకోలేదు. అందుచేతనే భగవానుడు అనిరుద్ధుడాయెను.

తనను ఎదురించువారు లేక సత్పురుషులకు పరమగతియైన విష్ణుమూర్తి

దేవతలకు కూడా ఆనందము నిచ్చువాడైయున్నాడు.

వ్యూహములు నాల్గింటిలో నాల్గవ వ్యూహమైన అనిరుద్ధుడైనందున 'అనిరుద్ధః' అని స్తుతించబడెను. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులు, 4 వ్యూహములనబడెదరు. 1. వాసుదేవుడు = పరమాత్మ 2. సంకర్షణుడు = జీవుడు (అనగా బలరాముడు) 3. ప్రద్యుమ్నుడు = మనస్సు అనగా శ్రీ కృష్ణుని కుమారుడు, 4. అనిరుద్ధుడు = అహంకారము అనగా శ్రీకృష్ణుని మనుమడు.

**నమః కృష్ణాయ రామాయ । వసుదేవ సుతాయ చ ।**
**ప్రద్యుమ్నాయానిరుద్ధాయ । సాత్వతాం పతయే నమః ॥**

భావం :- వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అనునీ చతుర్వ్యూహాత్మక సాత్వతపతియగు శ్రీకృష్ణునకు నమస్కారము.

ఈ నాలుగు వ్యూహములలో విచారణ జరిపినచో తెలియబడు తత్త్వము వాసుదేవ తత్త్వమైయున్నది. శత్రువులచే అడ్డగింపబడని అనిరుద్ధుడైనందున భగవానుడు ప్రతిపక్షము లేనివాడై యున్నాడు. విష్ణు సహస్రనామం

భారతము - ద్రోణ పర్వము - రెండవ రోజు యుద్ధములో భగదత్తునిచే ప్రయోగింపబడిన వైష్ణవాస్త్రమును అర్జునుని పై రాక పూర్వమే శ్రీకృష్ణుడు తన వక్షస్థలమున స్వీకరించెను. ఆ అస్త్రము శ్రీకృష్ణుని వక్షస్థలమున వైజయంతీ పుష్పమాలిక వలె ఆయెను. అంతట సిగ్గునొందిన అర్జునునితో ఆ అస్త్ర ప్రభావ మట్టిది వినుమని శ్రీకృష్ణుడు చెప్పదొడంగెను. ఓ అర్జునా ! లోకములను రక్షించు టకు ఉద్యుక్తుడనయిన నేను ఎల్లప్పుడునూ నాలుగు మూర్తులుగ నా స్వరూప మును విభజించి లోకములకు హితము నాచరించుచుందును. 1. నా యొక్క స్వరూపము భూమియందుండి తపశ్చర్య చేయుచుండును. 2. నా యొక్క మూర్తి మంచి చెడుల నాచరించు జగమును చూచుచుండును. 3. మరియొక మూర్తి మనుష్యలోకము నందున్నదై కర్మాచరణ చేయుచుండును. 4. నాలుగవ మూర్తి వేయి సంవత్సరములు నిద్రపోవు చుండును.

1వ మూర్తి నరనారాయణ రూపమై బదరికాశ్రమమున యున్నది. 2. రెండవ మూర్తి జగత్తునకు సాక్షి రూపమైయున్నది. 3. మూడవ మూర్తి జీవరూపమై క్షేత్రజ్ఞుడని పిలువబడుచు కర్మలను చేయుచున్నది. 4. నాల్గవ మూర్తి జలము నందు శయనించుచున్నది. కావుననే బ్రహ్మ సూత్రముల యందు " అంతస్త ధర్మోపదేశాత్" అనెడి 1-1-20 సూ, యొక్క భాష్యమున "హిరణ్యశ్మశ్రుః"

మొదలుగాగల రూపము ఉపపన్నము కాదు అని చెప్పబడెను.

శ్రీ మహాభారత సారోద్ధారము. తృతీయ భాగము

అ - నివృద్ధః - ఆ పరమాత్మను నిరోధింపగలవారు ఎవ్వరూ లేరు. కావున ఆ స్వామికి అనిరుద్ధుడు అని పేరు. భక్తులకు వచ్చు (చిక్కులను) అడ్డంకులను నిరోధించువాడు కావున ఆ శ్రీహరికి అనిరుద్ధుడు, అనంతుడు అని పేరు. మంత్రశాస్త్రంలో ఒక మహామంత్రంగా చెప్పబడినది. (దక్షిణామ్నాయం) " ఓం అచ్యుత అనంతో అనిరుద్ధాయ నమః " అని మహామంత్రం కావున ఇది నామం కాదు. మంత్రంగా భావించి ధ్యానిస్తే పునరావృత్తి రహితమైన మోక్షప్రాప్తి లభిస్తుంది. ఆరాధన 9/97

భక్తి (లేక)గాక, నితరవస్తువుతో నిరోధించుటకు వీలుకాని వానికి నమస్కారము.

తై.సం.ము. 9/97=16

17. ఓం పురుషోత్తమాయనమః బొటన వ్రేలు, ఉంగరపు వ్రేలు కలిపి ఎడమ కన్నును తాకవలయును.

**యస్మా త్క్షర మతీతో ఽహ మక్షరాదపి చోత్తమః**
**అతో ఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః** శ్రీ భగవద్గీత 1931 15/18=507

క్షరుని కంటెను మఱియు నక్షరుని కంటె
నెంతయును :నుత్తముడ నయి యెసగు చుంట
వివిధ లోకమ్ములందును : వేదమందు
నాకె : పురుషోత్తముడనను నామ మబ్బె.

క్షరుని కంటెను అక్షరుని కంటెను విలక్షణుడనై యొప్పుచుండుట చేత అన్ని లోకములలోను వేదములందును నాకు మాత్రమే పురుషోత్తముడను ఖ్యాతి కలుగు చున్నది.

భక్తులు పరమాత్మయని, పురుషోత్తముడని కీర్తించుచుండు వాని రూపము వర్ణింపబడినది.

తా : లోకమందును, శ్రుతుల యందును భగవన్నామమునకుగల ప్రసిద్ధిని దెలియజేయుచు సర్వోత్కృష్టుడగు సర్వేశ్వరుడను నేనేయని తన పరతత్త్వమును శ్రీకృష్ణ స్వామి విశదీకరించుచున్నాడు. ఎట్లనిన :- అర్జునా ! అశ్వత్థమని చెప్ప బడు సంసార మాయా వృక్షము యొక్క సంపర్కము లేక దాని నతిక్రమించియు, సంసార వృక్షమునకు బీజమగు నక్షరమున కంటె నధికుడనయ్యు నున్నవాడ

నగుటం జేసి లోకమందు భక్త జనులెల్ల పురుషోత్తముడని నన్ను బొగడుదురు. శ్రుతి : '+ ఏతావానస్య మహిమా, అతో జ్యాయాగ్ంశ్చ పూరుషః + అని వేదమందు ప్రసిద్ధుడనైయున్నాను. మరియ గ్రంథకర్తలు వేదోప బృంహణములగు సద్గ్రంథ ముల యందు నన్నట్టి సంజ్ఞ చేతనే పొగడి వ్రాయుచున్నారు.

శ్రుతి ॥ ఇన్ద్రియేభ్యః పరం మనో మనస్సత్త్వ ముత్తమమ్ ।
సత్త్వాదపి మహా నాత్మా మహతో ఽవ్యక్త ముత్తమమ్ ।
అవ్యక్తాత్పరః పురుషో వ్యాపకో ఽ లిఙ్గ ఏవ చ।
యం జ్ఞాత్వా ముచ్యతే జన్తు రమృతత్వం చ గచ్ఛతి ॥

తా : ఇంద్రియముల కన్న మనస్సు గొప్పది. మనస్సున కంటె సత్త్వ గుణము గొప్పది. సత్త్వ గుణము కంటె జీవాత్మ గొప్పవాడు. జీవాత్మ కన్న మాయ గొప్పది. మాయ కన్న పరబ్రహ్మము గొప్పది. అట్టి పరబ్రహ్మమనబడు స్వస్వరూపము నెఱుంగువాడు మాయా మూలకములగు సంసారముల నుండి విడువబడి బ్రహ్మత్వమును పొందును అను నధర్వ వేదోక్త కఠోపనిషత్ శ్రుతి ఇందుకు ప్రమాణము. 652. శ్రీ భగవద్గీతా - గూడార్థదీపికా

24. పురుషోత్తమః = పురుషుల కన్న నుత్తముడు. వి.స.వా.

"పురుషేభ్యః ఉత్తమః పురుషోత్తమః ॥

లోక సాధారణంబులకు లక్షణంబులు భగవంతున కున్నట్లు చెప్పుటచే అతడు సాధారణుడేమో అని శంకింపవలదు. వాడు పురుషోత్తముడు. పురుషుల కన్న ఉత్కృష్టుడు. బ్రహ్మమే వికారంబు నొందునను పక్షము నిరసింపబడియె. బ్రహ్మ (పరం బ్రహ్మ) మే వికారంబు నొందును. అనియు, బ్రహ్మమే జనన మరణాది సంసారంబు నొందుననియు, శ్రీమన్నారాయణుని కన్న నతిరిక్తమగు బ్రహ్మమొకటి గలదనియు, అవ్యక్తమును, దాని నుండి విడబడిన ముక్తులును ఈశ్వరుడును బ్రహ్మమున లయించి దాని నుండి యుత్పత్తి నొందుచున్నారు. అనియు ఇత్యాది పక్షములు. పురుషోత్తమ పదంబుతోను సమస్త వేదాంత సిద్ధాంతములతోను విరోధించును. 76. రామానుజ భాష్యము - విష్ణు సహస్రనామం 50

పురుషః + ఉత్తమ ః = పురుషోత్తమః పురుషులలో ఉత్తముడు కావున పురుషోత్తముడు అని పేరు. ఈ జగత్తులో పురుషులు ముగ్గురు - 1. క్షర పురుషుడు, 2. అక్షర పురుషుడు, 3. పురుషోత్తముడు. 1. నశించే స్వభావం కలవాడు క్షర పురుషుడు. 2. నీటిలో ప్రతిబింబం లాగా కనిపించే జీవుడు అక్షర

పురుషుడు. 3. క్షరాక్షర పురుషులకంటె అధికమగువాడు కావున పురుషోత్తముడు - అని పేరు సార్థకం. వైఖానస ఆగమంలో పిళ్ళై లోకాచార్యులు గారు వ్రాసిన గ్రంథంలో ఈ నామాన్ని మహామంత్ర విధానంగా వివరించారు. " ఓం నమో పురుషోత్తమాయ ప్రజ్ఞాం ప్రయచ్ఛ స్వాహా " కావున ఇది నామం కాదు మహా మంత్రం కావున దీనిని భక్తి, శ్రద్ధలతో ధ్యానిస్తే జ్ఞాన ప్రాప్తి కల్గుతుంది.

9/97 ఆరాధన 16.

ప్రకృతిని నడిపించు ఉత్తమ పురుష స్వరూపునకు నమస్కారము. తై.సం.ము.

**18 ఓం అధోక్షజాయ నమః ముందుగా బొటన వ్రేలు, ఉంగరపు వ్రేలు కలిపి వానితో కుడి చెవిని తాకవలయును.**

416. అధోక్షజః = తగ్గకుండువాడు.

స్వరూప స్థితి నుండి ఎన్నడును జాఱనివాడై భగవానుడు "అధోక్షజః" అని స్తుతించబడెను.

**"అధో నక్షీయతే జాతు యస్మాత్తస్మాదధోక్షజః"**

అని మహాభారతము. ఉ. పర్వము తెలుపుచున్నది. అనగా ఎల్లవేళల అంతర్ముఖుడై యుండువాడని భావము. భగవానుడు ఎన్నడు నశించువాడు కాడు. ఎన్నడు ఎండని, మట్టము తగ్గని సముద్రము వలె భగవానుడు అమృతాంబోధియై విరాజిల్లుచున్నాడు.

**" అక్షయం మధుహంతారం జానామిత్వాం సురోత్తమమ్ "**

భగవాన్ ! మధుసూదనుడి వని, అక్షయ స్వరూపుడివని, సురోత్తముడవని, నిన్ను నేనెరుంగుదును. కనుక భగవానుడు అవ్యక్తమై యున్నాడు. అట్టివాడు వ్యక్తమగునా! కాదా? విష్ణు సహస్రనామం

శకటాసురుని నాశము చేసినవాడు ఎన్నడును స్వరూపము నుండి జారిపోనివాడు. అక్షము అనగా ఆకాశము. అధః అనగా భూమి. ఈ రెండింటి నడుమ భగవానుడు విరాడ్రూపముతో ఆవిర్భవించువాడు. లేదా ఇంద్రియములు అంతర్ముఖము కాగా ఆవిర్భవించువాడు అనగా తెలియబడువాడు. గాడీయమఠము

**" అధోనక్షీయతే జాతం యస్మాత్త స్మాదధోక్షజః "**

ఎప్పుడు తన దివ్యత్వము నుండి జారినవాడు కాడు. కావున అధోక్షజుడు అయ్యెను. ఆ శ్రీహరికి సహస్రాక్షుడు అనే నామం కూడా వున్నది. తన అధో

భాగమున ఉన్న భూలోకమును చూచేవాడు ఈ భూ లోకము మీద తనకి ఉన్న ప్రేమ చేత ఈ భువిలో నివసించుచూ తన భక్తులను కాపాడుచూ సర్వ జీవులను రక్షించువాడు కావున అధోక్షజుడు అయ్యెను. 9/97 ఆరాధన - 16.

అతీంద్రియ విషయమునకు నమస్కారము. తైత్తరీయ సంధ్యోపాసనము

**19. ఓం నారసింహాయనమః ఉంగరపు వ్రేలు బొటనవ్రేలుతో కలిపి దానిని ఎడమ చెవిని తాకవలయును.**

✦ నారసింహస్యవపుః యన్యసః నారసింహవపుః ✦

నరుని బోలిన, సింహమును బోలిన అవయవములు గలవాడై 'నారసింహ వపుః' అని కీర్తించబడెను. మహాభక్తుడైన ప్రహ్లాదకుమారుని రక్షించుటకు శ్రీమహావిష్ణువు నరసింహమూర్తియై అవిర్భవించెను. దారి తప్పిన హేతువాది యగు హిరణ్యకశిపుని హతమార్చి లోక కల్యాణము చేకూర్చుటకు ఆదిదేవుడు అవతరించెను. భగవానుడు లేని చోటంటూ లేదని నిరూపించుచూ స్తంభము నుండి జనించి దైత్యుని హతమార్చెను.

**' యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ'**

ఇచట ఏది కలదో అదియే అచ్చట గలదు. అని కఠోపనిషత్తు తెలియజేయు చున్నది. ఈ సత్యమునే నరసింహమూర్తి ప్రదర్శించి చూపెను. విష్ణు సహస్రనామం.

శ్రీహరి నాల్గవ అవతారం నారసింహునిది. భక్తునిలో కల రాక్షస స్వభావ మును సంహరించువాడు కావుననే ఆ స్వామికి నారసింహుడు అనేపేరు కల్గినది. ఇది నామం కాదు మహామంత్రం. దీనిని దక్షిణ, పూర్వ, పశ్చిమ, ఉత్తరామ్నా యములలో ఈ విధంగా వివరింపబడినది. " ఓం క్ష్రాం నరసింహాయ హుం ఫట్ " అని, కావున ఇది నామం కాదు ఒక మహామంత్రం. దీనిని భక్తి శ్రద్ధలతో స్మరిస్తే తప్పక "ముక్తి" లభిస్తుంది. 9/97 ఆరాధన = 16

ఉత్తమ జ్ఞాన స్వరూపునకు నమస్కారము. తైత్తరీయ సంధ్యోపాసనము

**20. ఓం అచ్యుతాయ నమః చిటికెనవ్రేలు, బొటనవ్రేలు కలిపి వానితో నాభివితాకవలయును.**

**అచ్యుతానంత గోవింద నామోచ్చారణ భేషజాత్ ।**
**నశ్యంతి సకలా రోగాః సత్యం సత్యం వదామ్యహమ్ ॥**

భావం :- అచ్యుత అనంత గోవింద అను నామంబులు నుచ్చరించుటయను మహౌషధంబుచే సమస్త రోగములును నశించును. ఇది సత్యము సత్యము. నేనే చెప్పెదను (విష్ణువు) విష్ణుధర్మము - 29

“అపి చే త్సు దురాచారః - ఎంతచెడు నడవడిక గలవాడయ్యు నన్ను పొందినం తనే పరమ గతి నొందును.

**యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,**

**త స్యాహం న ప్రణశ్యామి స చ మేన ప్రణశ్యతి.** గీత 6/30

ఏకత్వమును దర్శించువానికి భగవానుడు కనపడకపోడు. యోగజన్యజ్ఞానముచే సమస్త భూతములందు నా స్వరూపమును, నాయందు సమస్త భూతములును నుండునట్లు చూచెడి యోగికి నేను కనపడకపోను, వాడును వాకు కనబడకపోడు. పరస్పరము ప్రత్యక్ష స్వరూపులుగానే యుందుము. ఇది యోగము నందుగల నాలుగు పరిపాక దశలలో రెండవ పరిపాక దశయని మధుసూదన సరస్వతీ యము. 1951 సం॥ గీత 6/30

101 అచ్యుతః = పీడనివాడు, 320 - జాఱనివాడు, 557 - జాఱనివాడు ✦ న చ్యుతః అచ్యుతః ✦ శరణంబు నొందిన వారిని వదలక యుండువాడు. 1. నేనెప్పుడును శరణాగతులను వదలకుండుటచే అచ్యుతుండను నామము నాకు గల్గె. 2. వారలకు నేను నశింపను. 3. శరణంబని వచ్చిన వారలను విడువను. విష్ణు సహస్రనామం

ప్రజమును పాలించువాడు, అచంచలమైన భావము గలవాడు, పుట్టుట, పెరుగుట, ఉండుట, మార్పునొందుట, క్షీణించుట, నశించుట అను ఆఱు విధములగు వికారములు లేనివాడు. గౌడీయమతం

చ్యుతి అనగా పతనం అని భావం. చ్యుతి లేనివాడు కావున ఆ శ్రీహరికి అచ్యుతుడు అను నామం సార్థకం. అందుకే పరమాత్మను శ్రుతి ఈ విధంగా కీర్తించుచున్నది. (మంత్రపుష్పం) “శాశ్వతగ్ం శివమచ్యుతమ్” శివ అనగా మంగళం అని, మంగళ స్వరూపుడు, శాశ్వతుడు, అచ్యుతుడు అని భావం. మంత్ర శాస్త్రంలో ఈ విధంగా నామం మహామంత్రంగా వివరింపబడినది. ఓం అచ్యుతా, అనంత, గోవిందా అని కావున అది నామం కాదు. ఒక మహామంత్రం. దీనిని భక్తి శ్రద్ధలతో ఉపాసిస్తే తప్పక భోగక్షేమం కలుగుతుంది. ఆరాధన - 17

కాలత్రయము నందును నాశము లేని వానికి (త్రికాలాబాధ్యునకు)

నమస్కారము. తై.నం.ము.

**21. ఓం జనార్ధనాయనమః ఐదు వ్రేళ్ళచే (అరచేయి అని తైత్తరీయ సంధ్యోపాసనము) హృదయమును తాకవలయును.**

జన = పుట్టని వాడును, అర్దన = సంహరించువాడును, లేక పుట్టుకను పోగొట్టు వాడు, మంచి జనులను మంచిగతిని పొందించువాడు, చెడు జనులను చెడుగతిని పొందించువాడు : సజ్జనులను యాచించువాడు : దుర్జనులను హింసించువాడు. జనార్దన = జనులను చంపువాడు, సంహారకర్త.

గీత 1/36 మధ్వాచార్యుల భాష్యము

**పృథివీం రత్న సంపూర్ణాం యః కృష్ణాయ ప్రయచ్ఛతి,**
**తస్యాప్యన్య మనస్కస్య సులభో న జనార్దనః.**

భావం :- రత్నములుండిన యీ భూమండలంబునంతయు భక్తి లేక కృష్ణునకు సమర్పించినను, భక్తిలేదు గాన జనార్దనుడు వాని సులభుడు కాజాలడు.

విష్ణు ధర్మము.

128 జనార్దనః = జనంబులను పీడించువాడు.
:- జనాన్ అర్దయతీతి జనార్దన :- రక్షణ విరోధులను అనగా భక్త విరోధులను నిరపేక్షుడై నిరసించువాడు :- దస్యుత్రాణాజ్జనార్దనః :-
(భా.ఉ.71.6) దొంగల నుండి కాపాడియుండుటచే జనార్దనుడనబడును.

విష్ణు సహస్రనామావళి

అనిరుద్ధుడు భూమిలో వసుభాండంబును భూభాగమున జనార్దన రూపం బుతో సేవ సాదించుచున్నాడు అను ఋషుల నిరుక్త రీతిగా భూమిలో వసుభాండంబను క్షేత్రంబున జనార్దన రూపంబుతో నుండు అనిరుద్ధస్వరూపుడు.

విష్ణు సహస్రనామము

**"తస్య తాతా వధా దేవ దానవ మానావః**
**మధుసూదన ఇత్యా హుః ఋషయశ్చ జనార్దనమ్ "**

బ్రహ్మకు ఉపకారము చేసిన కారణం చేత ఆ స్వామికి జనార్దనుడు అనే నామం కల్గినది. (జనులు) జీవులు జ్ఞానం కోసం అర్థించినంత మాత్రముననే ముక్తి, జ్ఞానం ప్రసాదించు వాడు కావున జవార్దనుడు అని పేరు. 9/97 ఆరాధన - 17 తై.నం.ము.

పంచజనుడను రాక్షసుని సంహరించిన వానికి నమస్కారము. తై.నం.పా.

**22. ఓం ఉపేంద్రాయనమః ఐదువ్రేళ్ళతో (చేతికొనను) శిరమును తాకవలయును.**

153 ఉపేంద్రః = ఇంద్రుని తమ్ముడు

**మయోపరి యథేంద్రస్త్వం స్థాపితో గో భిరీశ్వరః,**
**ఉపేంద్ర ఇతి కృష్ణత్వాం గాస్యంతి భువిదేవతాః.**

కృష్ణ ! ఇంద్రుడనైన నాపై ఇంద్రుడుగా నిన్ను వేదములు నిలిపినవి. కావున లోకమున నిన్ను ఉపేంద్రుడని దేవతలు స్తుతించగలరు. అని హరివంశము నందున్నది.

ఉపేంద్రుడనగా ఇంద్రునికి తమ్ముడు అను అర్థము కూడా గలదు. ఇంద్రుని తల్లియైన అదితికి వామనమూర్తి అవతారమెత్తినపుడు కుమారునిగా జన్మించుటచే ఇంద్రునికి తమ్ముడై భగవానుడు ఉపేంద్రుడని పిలువబడెను. ఇంద్రునికి పైనుండు వాడు అనెడి మొదటి భావము ననుసరించి చూడగా ఇంద్రుడు ఇంద్రియములకు ప్రభువు. ఇంద్రునకు పైనున్నవాడనగా ఇంద్రియ ములకు అగోచరుడైన భగవానుడు అని భావము. 'ఉప' అనగా దగ్గరయని కూడా ఒక అర్థము. "ఉపేంద్ర" అనగా ఇంద్రియములు ప్రవర్తించుటకు కారణమై దగ్గరగా వుండువాడు అని భావము. విష్ణుసహస్రనామం

ఉప+ఇంద్రః - ఉపేంద్రః = ఇంద్రుని తమ్ముడు అగుటచేత ఉపేంద్రుడు అని పేరు వచ్చినది. అదితి పుత్రునిగా జన్మించిన కారణం చేత (ఉప) (పైన) సమీపమున అని అర్థం. ఇంద్రుని కంటే అధికుడు కావున ఆ శ్రీహరికి ఉపేం ద్రుడు అనే నామం సార్థకం. ఇంద్రుడు అనగా ఇంద్రియములకు అధియగు మనస్సు అని. మనస్సు కంటె అధికమైనది ఆత్మ కావున దానికి అధిపతి అగుట చేతను మన మనస్సులో వుండి మనం ప్రార్థించినంత మాత్రమే ప్రసన్నమగు స్వభావం కావుననే ఉపేంద్రుడు అని పేరు. 9/97 - ఆరాధన - 17

సత్యవస్తువును తెలిసికొనిన ఇంద్రునకు, అనుకూల దైవమునకు నమస్కారము. తై.సం.ము.

**23. ఓం హరయేనమః ఐదు వ్రేళ్ళ కొనలను కలిపి, దానితో కుడి భుజమును తాకవలయును.**

656 హరిః = హరి, తొలగించువాడు.

గోవర్ధన పర్వతంబున హరియను నామముతో విచ్చేసియుండువాడు. రా.భా

సంసారమును గారణముతో నశింపజేయువాడు. శంకర భాష్యం

కేశియను దానవుని చంపి దేవతలయొక్క గోపాలుర యొక్క మనస్సులను హరించినవాడు. అవిద్యయనెడు కారణముతో గూడిన సంసారమును హరించువాడు. గాడీయమతం

హరియను రెండక్షరముల నెవ్వడు ఒకమారు తలంచునో వాడు మోక్షమున కేగదగినవాడు. విష్ణుధర్మము

**శమాయాలం జలం వహ్నేః తమసో భాస్కరోదయః ।**
**శాంతిః కలే రఘౌఘస్య నామ సంకీర్తనం హరేః ॥**

నిప్పు నార్ప నీరును, చీకటిని తొలగింప సూర్యోదయమును జాలును. అటులే కలిదోషము చే నేర్పడిన పాపములను దొలగింప హరినామస్మరణమే చాలును. విష్ణు ధర్మము

**యథాగ్నిరుద్ధత శిఖః కక్షం దహతి సానిలః ।**
**తథా చిత్త స్థితో విష్ణుః యోగినాం సర్వకిల్బిషమ్ ॥**

జ్వాలతో గూడిన అగ్ని, గాలితో గూడిన గడ్డివామిని దహించునట్లు యోగుల హృదయంబున నుండు విష్ణువు సమస్త పాపంబును తొలగించును. విష్ణు ధర్మము

"నాథ! యోని సహస్రేషు ॥ ఓ నాథా సహస్ర జన్మము లెత్తినను ఆ జన్మములలో నీ (విష్ణువు) మీద భక్తియే స్థిరముగా నుండవలయును. విష్ణు పురాణము.

**చక్రాయుధస్య నామాని సదా సర్వత్ర కీర్తయేత్ ।**
**నాశౌచం కీర్తనే దస్య పవిత్రం భగవాన్ హరిః ॥**

తా :- విష్ణు నామములను ఎల్లప్పుడును ఎచటనయినను చెప్పవచ్చును. వానిని ఉచ్చరించు విషయమున అపరిశుద్ధి లేదు. ఏలయనగా అతడు స్వతశ్శుద్ధుడు గదా ! విష్ణు ధర్మము

**శ్లో॥ రత్యంతరే మూత్ర పురీష యోర్వా ।**
**చండాల వేశ్మ న్యథవా శ్మశానే ।**
**కృత ప్రయత్నోఽ ప్యకృత ప్రయత్నః ।**
**సదా స్మరేత్ కేశవ నామధేయం ॥**

తా :- రతి కాలమందుగాని, మలమూత్ర విసర్జన సమయమందుగాని, మాలపల్లె యందుగాని, శ్మశాన భూమి యందుండి గాని, స్నాన సంధ్యాది కృత్యములచే శుచితో గూడిగాని, లేక కాళ్ళు చేతులు కడుగకనే గాని, సర్వేశ్వర స్మరణ ధ్యాన కీర్తనముల జేయవచ్చునని వైశ్వానరస్మృతి చెప్పుచున్నది.

- అని శ్రీ శుష్కవేదాంత తమోభాస్కరము 64వ పేజిలో వున్నది.

శ్లో ॥ తపోన కల్కో ऽధ్యయనం న కల్కః
స్వాభావికో వేద విధిర్న కల్కః
ప్రసహ్య చిత్తాహరణం న కల్కః
తాన్యేవ భావోప హతాని కల్కః

తా:-తపోదోషము దోషము కాదు, అధ్యయన దోషము దోషము కాదు, స్వాభావికమైన వేదవిధి దోషము కాదు, బలాత్కారముగా మనసు నీడ్చుటయు దోషము కాదు, అభిప్రాయముచే నేర్పడిన దోషమే దోషమగును. భారతము - ఆదిపర్వము

శ్లో॥ భావశుద్ధిః మనుష్యాణాం ప్రమాణం సర్వవస్తుషు ।
అన్యధా లింగ్యతే కాంతా స్నేహేన దుహితాన్యధా ॥

తా :- మనుష్యులకు సమస్త విషయంబునను భావశుద్ధియే ప్రమాణము గాని క్రియలు గావు. ఏలయనగా లోకమున ప్రియ నాయికను ఒక విధమగు స్నేహముతోను, పుత్రికను మరొక విధమగు స్నేహముతోను కౌగలించు కొనుచున్నాము గదా ! విష్ణుతత్వము

" అప్రాప్యః కేశవోరాజన్ । ఇంద్రియై రజితైః నృణామ్ ॥
ఇంద్రియ జయము లేనివాడు, భగవంతుని పొందజాలడు. కఠోపనిషత్తు

" నావిరతో దుశ్చరితాత్ నా శాంతో నా సమాహితః ॥
చెడు నడత నుండి విరమింపనివాడును, ఇంద్రియ జయము లేనివాడును, స్థిరమయిన సమాధి లేనివాడును, భగవంతుని పొందలేడు. కఠోపనిషత్తు

శ్లో॥ నమ ఇత్యేవయో బ్రూయాత్ మద్భక్తః శ్రద్ధయాన్వితః ।
తస్యాక్షయో భవేల్లోకః శ్వపాకస్యాపి నారద ॥

నారదా ! నా యందు భక్తి కలవాడై శ్రద్ధ కలిగి నమః అని యెవ్వడు చెప్పునో వాడు చండాలుడే యయినను అక్షయమైన లోకము నొందును. విష్ణు ధర్మము

**శ్లో॥ ధ్యాయన్ కృతే, యజన్ యజ్ఞైస్త్రే తాయాం, ద్వాపరే౽ర్చయన్।**
**యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్ ॥**

కృతయుగంబున ధ్యానించియు, త్రేతాయుగంబున యాగంబు చేసియు, ద్వాపరయుగంబున పూజించియు, లభించు ఫలితమును ఈ కలియుగంబున కేవల నామసంకీర్తన మాత్రంబు చేతనే పొందుచున్నాడు. విష్ణు పురాణము

కృతయుగమున ఒక పాపమును పోగొట్టుకొనుట కొక లక్షగాయత్రిని నిలబడి చేయవలయునని విధియున్నచో, కలియుగమునందాపాప పరిహారము నకే కూర్చుండి శతగాయత్రి చేసిన ఆ పాపము పోవునని నిర్ణయించు అధికారము పరాశరునకొచ్చినది. మహాభారతోపన్యాసములు 1వ భా - 42

**'ధ్యాయేన్నారాయణం దేవం స్నానాదిషు చ కర్మసు**
**ప్రాయశ్చిత్తిర్హి సర్వస్య దుష్కృతస్యేతివై శ్రుతిః ।**

స్నానాది సమస్త కర్మముల యందును దేవుడయిన శ్రీమన్నారాయణుని ధ్యానింపవలయును. సమస్త పాపంబులకును అదియే ప్రాయశ్చిత్తమగునని శ్రుతి.

యాజ్ఞవల్క్యస్మృతి

**వరంహుతవహ జ్వాలా పంజరాన్తర్వ్యవస్థితః ।**
**న శౌరి చింతావిముఖ జన సంవాస వైశసమ్ ॥**

అగ్ని జ్వాల యొక్క మధ్యలో నుండు గూటిలో వసించుట శ్రేష్ఠము. అయితే విష్ణు ధ్యానము కొంచెమయినను లేని జనుల మధ్య వసించు దుఃఖము మాత్రము వలదు.

**గోవింద భక్త్యభ్యధికం శ్రేయశ్చాన్యాన్న విద్యతే,**

గోవింద భక్తికన్న నుత్తమమయిన వేఱు శ్రేయస్సు లేదు. విష్ణు ధర్మము

**హరామ్యఘం చస్మర్తౄణాం హవిర్భాగం క్రతుష్వహం**
**వర్ణశ్చమే హరిర్వేతి తస్మాత్ హరీ హరి ఇతి స్మృతం ॥**

స్మరించు వారి పాపములను హరించేవాడు, క్రతువుల హవిర్భాగమును తీసికొని ముక్తిని ఇచ్చువాడు. ఆ స్వామి శరీర వర్ణము చేతను ఆ శ్రీహరికి హరి అని పేరు సార్థకం. కావున ఈ నామాన్ని నిత్యం స్మరణ శ్రద్ధా భక్తి చేత చేస్తే తప్పక కైవల్యప్రాప్తి కల్గుతుంది. 9/97 ఆరాధన-17

భక్తుల పాపములను నశింపజేయు శ్రీహరికి నమస్కారము. తై.నం.ము

**24 ఓం శ్రీకృష్ణాయ నమః ముకుళిత హస్తముతో ఎడమ భుజమును తాకవలయును.**

+ కృష్ణాను స్మరణం పరమ్ +

శ్రీకృష్ణుని స్మరించుట ఉత్తమము. ఇత్యాద్యనేక వాక్యములలోని అనుస్మరణం అను చిన్తనం అను పదములందు 'అను' అనునది నిహీనార్థకము. స్వాభావికమైన దాస్యమునే ఆ నిహీనత చెప్పును. ఆదాస్యమును అనుసంధించుచు ఉపాసించుటయే అనుస్మరణము. భక్తికి నామ సంకీర్తనాదులు శరీర స్థానములనియు ప్రమాణములు గలవు.

అనేక జన్మముల యందు తపస్సు, ధ్యానము మున్నగు వానిచే పాపము తొలగిన నరులకు కృష్ణుని మీద భక్తి కలుగును.

**అజ్ఞానతో జ్ఞానతోవా వాసుదేవస్య కీర్తనాత్ ।**
**తత్సర్వం విలయం యాతి తోయస్థం లవణం యథా ॥**

తెలిసి కాని తెలియక కాని వాసుదేవుని కీర్తించినచో వాని పాపమంతయు ఏటిలో పడిన ఉప్పు వలె నశించును. విష్ణు ధర్మము

**ప్రాతర్దేవేతి కృష్ణేతి గోవిన్దేతి చ జల్పతామ్ ।**
**మధ్యాహ్నే చా పరాహ్ణే చ యోవ సాదస్ప ఉచ్యతామ్ ॥**

ప్రాతః కాలమున దేవా! అనియు కృష్ణా అనియు గోవిందా! అనియు చెప్పు వారలకు మధ్యాహ్నమునను అపరాహ్ణమునను ఏ కష్టము కల్గును. (అనగా కష్టములుండవని భావము) విష్ణుధర్మము 89వ శ్లోకము

**జగత్ప్రభుం దేవదేవం అనన్తం పురుషోత్తమమ్ ।**
**స్తువన్నామ సహస్రేణ పురుషః సతతోత్థితః ॥**

లోక స్వామియును, దేవతలకు దేవుడును, అంతములేని వైభవము గలవాడై యుండు పరమోదారుడగు విష్ణుదేవుని సహస్రనామములచే స్తోత్రము చేసినను, ధ్యానించినను అది పరమ ప్రియముగాను, ఉండునని శ్రుతి స్మృతి సిద్ధము.

శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రమ్

శ్రీకృష్ణుడొక్కరుండే జరాసంధుని సహస్రాక్షౌహిణీ సైన్యంబును అర్ధయామము (యామము అనగా జాము, అనగా 71/2 గడియలు. గడియకు 24 నిముషములు. అంటే 180 నిముషములు అనగా మూడు గంటలు కాలము. అర్ధయామమనగా 180/2=90 నిముషములు. ఒక గంట ముప్పది నిముషముల) లోపల నిహితంబు గావించె. పద్మపురాణము 250

**కృష్ణ ! త్వదీయ పదపంకజ పంజరాన్త !**
**మద్యైవమే విశతు మానస రాజహంసః ।**
**ప్రాణ ప్రయాణ సమయే కఫవాత పిత్తైః ।**
**కంఠావరోధన విధౌ స్మరణం కుతస్తే.**

తా :- ఓ కృష్ణా ! నా మానసమనెడి రాజహంస యిపుడే నీ పాదపద్మములనెడి పంజరము ప్రవేశించుగాక ! ప్రాణములు పోవు సమయమున వాతపిత్త శ్లేష్మములచే కంఠము డగ్గుత్తిక పడగా నీ సంస్మరణమెట్లు కలుగును ? ముకుందమాల - 7

**శ్రీ వల్లభేతి వరదేతి దయాపరేతి,**
**భక్త ప్రియేతి భవలుంఠన కోవిదేతి,**
**నాథేతి నాగశయనేతి జగన్నివాసే,**
**త్యాలాపనం ప్రతిపదం కురు మే ముకుంద.**

తా :- ఓ ముకుందా ! మోక్షప్రదాతా ! లక్ష్మీపతీ ! వరదాయకా ! దయాపరా ! భక్త వల్లభా ! సంసార నాశన నిపుణా ! నాథా ! శేష శయనా ! జగదాధారా ! యనెడి యాలాపన మెల్లపుడును నాకు గల్గునట్లు చేయుము. ముకుందమాల - 1

**ప్రణామ మీశస్య శిరః ఫలం విదు,**
**స్తద్దర్శనం పాణిఫలం దివౌకసః**
**మనః ఫలం తద్గుణ తత్త్వ చింతనం**
**వచః ఫలం తద్గుణ కీర్తనం బుధాః**

తా:- శిరస్సున్నందుకు భగవంతుని నమస్కరించుటయు, చేతులున్నందుకు దేవుని పూజించుటయు, మనస్సున్నందుకు పరమేశ్వరుని గుణముల యొక్క తత్త్వమును ధ్యానించుటయు, వాక్కున్నందుకు సర్వేశ్వరుని గుణముల కీర్తించుటయు ఫలములని దేవతలు పండితులు తలంతురు. ముకుందమాల - 58

కృష్ణః = పూర్ణమైన సుఖము గలవాడు, దైత్యులను తపస్సును గూర్చి ఆకర్షించు వాఁడు, ఛేదింపబడిన దైత్యుల ప్రాణంబును బలంబును గలవాడు, దేవతలకీయ బడిన ప్రాణంబును, బలంబును గలవాడు. గీత 1/29 - మధ్వ

వృద్ధక్షత్రుడు (సైంధవుని తండ్రి) తన పుత్రుని శిరమునెవ్వడు భూమిపై పడ వేయునో వాని శిరము నూరువ్రక్కలగునట్లు వరమును పొందినాడు. కావున అర్జునునితో ఈ శిరము అడవిలో తపస్సు చేసికొనుచున్న వృద్ధక్షత్రుని తొడయం దుంచునట్లు నీ యస్త్రప్రభావమును చూపుమనిరి భగవానులు. ఈ రహస్యము లెవ్వరెరుగుదురు? సృష్టికర్తయై ప్రతివాని అంతఃకరణమునందును అంతర్యా మియై చరించును గావున ఆతడెరుగును. కృష్ణుడు మనదృక్పథమున మనుష్య మాత్రుడగుచో మనకంటె పశువులు వేరు లేరని భావించుడు.
శ్రీకృష్ణుని సైంధవునకై మాయా యోగమును చేయునప్పుడు వ్యాసులేమని వర్ణించిరో చూడుడు.

**✦ యోగీ యోగేన సంయుక్తో యోగినామీశ్వరోహరిః ✦**

శ్రీకృష్ణులు సహజముగనే యోగియై యుండెనట. యోగి యగుట కాదు. యోగులగువారందరకును అతడీశ్వరుడట. ఈతని మనుష్యుడను కొనుటకంటె మూఢత్వమేమున్నది. ద్రోణపర్వం - మహాభారతతాత్పర్యములు, 4వ భా - 78

**✦ అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ✦** శ్రీ భగవద్గీత 9/11

భగవంతుడు మనకెంత దూరమునందుండెను? అతడెప్పుడైనా మనలను తలచునా? అతడు మనపెట్లు ప్రేమించును? ఎంత ప్రేమించును? అను ప్రశ్నల కిందొక సమాధానమున్నది. - 1. భగవంతునకు మనమెంత సమీపము నందుంటిమో ఆతడును మనకంత సమీపమునందుండును. 2. ఆతనిని మనమెట్లు ప్రేమింతుమో ఆతడును మనలనట్లే ప్రేమించును. 3. మనమే క్షణము నందాతని తలంతుమో ఆతడును మనల కాక్షణమునందే దర్శనమీయ గల సమర్థుడు. భగవానులొక ఘట్టమునందం దించిన దివ్యసందేశమును వినుడు.
రుక్మిణీ కల్యాణమున రుక్మిణి శ్రీకృష్ణుని కొరకై ఒక బ్రాహ్మణుని పంపగా ఆ బ్రాహ్మణునకు శ్రీకృష్ణుడు చెప్పిన సమాధానము.
రుక్మిణి నా కొరకై యెట్లు విరహము ననుభవించుచుండెనో నేనును అమె కొరకై అంత విరహమునూ అనుభవించుచుంటినని చెప్పెను.

**" యథా వినిద్రా మచ్చిత్తా రుక్మిణీ రుచిరాననా "**

శ్రీకృష్ణుని యీ దివ్య సందేశ మొక్కటి చాలును. అదియే భారతీయాధ్యాత్మిక రహస్యము. మహాభారతోపన్యాసములు, సభా పర్వము 1వ భా. 214

**" యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్ "**

ఎవ్వరు తమ్మ ఎట్లు ఉపాసింతురో వారి వారిని అట్లే తానును అనుగ్రహించునట. అనగా భక్తిచే ఆరాధించువారికి పరమ పవిత్రమును అప్రాకృతమునగు తన దివ్య దేహమును చూపును. శ్రీ భగవద్గీత 4/11

**✦ కృష్ణామి మేదినీం పార్థ భూత్వా కృష్ణాయ సోమహాన్,**
**కృష్ణో వర్ణశ్చమే యస్మాత్ తేన కృష్ణోఽహమర్జున. ✦**

భావం:- అర్జునా! నేను నల్లని కొయ్యు గుద్దలినై భూమిని చీల్చి యుండుట వలనను కృష్ణ వర్ణుండగుట వలనను నన్ను కృష్ణుడని యందురు. శ్రీవిష్ణుతత్త్వము

కృష్ణః = కృష్ అనునది భూవాచకము. అనగా సత్తార్థకము 'ణ' అనునది నిర్వృతి (ఆనంద) వాచకము. సత్త, ఆనందము అను రెండు భావములు గలుగుటచే విష్ణువు కృష్ణుడనబడును. అని మహాభారతము. ఉద్యోగపర్వము 70.5 లో వ్యాసభగవానుడు చెప్పుట వలన కృష్ణుడనగా సచ్చిదానంద స్వరూపుడని యర్థము లేదా నల్లనిరంగు గలవాడగుట చేత కృష్ణుడనియు చెప్పవచ్చును.

58. కృష్ణః = ఆనందించువాడు. శ్రీవిష్ణు సహస్రనామం

554 కృష్ణః = కాలమేఘుంబువలె నల్లని శరీరము గలవాడు.

"కృష్ణతీతి కృష్ణః "ఇట్టి లీలా రసంబుచే మిక్కిలియానందించువాడు.

**కృష్ణస్తు భగవాన్ స్వయమ్.** అన్నది భాగవతము.

**"ముఖారవిందమ్ దశమమ్ ప్రఫుల్లమ్ "**

ప్రఫుల్లమైన భగవానుని ముఖారవిందమే భాగవతములోని దశమస్కంధము అని భావము.

**✦ కృష్ణ ద్వైపాయనః కృష్ణద్వైపాయనం వ్యాసం,**
**విద్ధి నారాయణం ప్రభుమ్, కోహ్యన్యః. ✦**

**పుండరీకాక్షాన్మహాభారత కృద్భవేత్, ఇతి విష్ణుపురాణ వచనాత్.**

కృష్ణ ద్వైపాయనుడను వేదవ్యాసుడు ప్రభువగు నారాయణుడేయని గ్రహింపుము. నారాయణుడు కానిచో మహాభారతము వ్రాయుటకు ఎవ్వరికి సాధ్యము. అని విష్ణుపురాణము తెలుపుచున్నది. కృష్ణద్వైపాయన స్వరూపుడు (శ్రీకృష్ణుడు)

✦ కృష్ణేతి మంగళం నామ యస్య వాచి ప్రవర్తతే ।
భస్మీ భవంత రాజేంద్ర మహాపాతక కోటయః ॥ ✦

ఎవరి నాలుకపై కృష్ణ నామము కదలుచుండునో అట్టివాడు చేసిన కోటి పాపములైనను భస్మమై పోవును. విష్ణుపురాణము

శ్రీకృష్ణ నామ నిర్వచనము.

1. క, 2. ఋ, 3. ష, 4. ణ, 5. అ, 6. విసర్గములు.

1. 'క' కకారమునకు కమలాకుంతడని యర్థము.
2. 'ఋ' ఋకారము రాముడని అర్థము.
3. 'ష' షకారము షడ్గుణపతియని అర్థమొనంగును. మరియు శ్వేతద్వీప నివాసి యనియు అర్థము.
4. 'ణ' ణకారము నారసింహుడను భావము దెల్పును.
5. 'అ' అకారమక్షరుండని, అగ్ని భుక్కనియు వర్థము దెల్పును.
6. 'విసర్గములు' నరనారాయణులను మునులని భావము వెలిబుచ్చును.

ఈ కృష్ణ శబ్దమున గల యాఱు వర్ణములు పూర్ణుడని తెలుపుచున్నది.

షడ్గుణపతి = 1. ఐశ్వర్యము, 2. వీర్యము, 3. యశము, 4. శ్రీ, 5 జ్ఞానము, 6. వైరాగ్యము.

ఇవి భగవంతుని గుణములు. వేదాంతచూర్ణిక (సంఖ్యాశాస్త్రము) ప్రథమ భాగము - 178

విండు హృదయంతో, ఏకాగ్రచిత్తంతో శ్రీకృష్ణపరబ్రహ్మమును ధ్యానిస్తున్న, అంపశయ్యపైనున్న, భీష్మాచార్యులను, కనులు మూసి చింతిస్తున్న శ్రీకృష్ణుని దర్శించి ధర్మరాజు యిలా అన్నాడు. "మహానుభావా! అందరూ నిన్ను ధ్యానిస్తూ వుంటే నీవు ఎవరిని గూర్చి చింతిస్తున్నావు?" అంత భక్త జనహృదయమున నివసించువాడును, పరమ పురుషుడును అగు వాసుదేవుడిలా అన్నాడు. "నన్ను ప్రార్థిస్తూన్న భక్తుల చెంతకు నేనే వెళతాను" రమ్మన పాండవులు శ్రీకృష్ణు ననుసరించారు. వారు వడివడిగా వెళ్ళి యుద్ధభూమిలో అంపశయ్య పైనున్న భీష్ముని చూచారు. భక్తుని దగ్గరకు దేవుడే తరలి వెళ్ళుట లోని అంతర్యమేమి?

భీష్ముడు జీవన్ముక్తుడైన లోకైకవీరుడు. జీవన్ముక్తుడన ఈ దేహమును ధరించియుండియు అతడు ముక్తుడేనని అర్థము.

మనం కనుక భగవంతుని దగ్గర కొంచెం శిరసు వంచగల్గితే, ఆయన సర్వాత్మనా మనకు దాసుడైపోయి మనం ఏం చెబితే అది చేస్తాడు అంటుంది వేదం. అది నిరూపించుకున్నాడు శ్రీకృష్ణుడు. అందుకే బిరాన వచ్చాడు శౌరి.

భీష్మస్తవరాజమను ఒక మహాస్తవము (61 శ్లోకములు) శాంతిపర్వము నందున్నవి. ఈ స్తవము ధర్మజుడు శ్రీకృష్ణుని దగ్గరకు వచ్చునప్పటికి భీష్ముడు శ్రీకృష్ణుని ధ్యానించుచున్న భాగము. ఇక్కడ 15 శ్లోకములు మాత్రం పొందు పరచెదను.

**హిరణ్యవర్ణం యం గర్భమదితేర్దైత్యనాశనం,**
**ఏకం ద్వాదశథా జజ్ఞే తస్మై సూర్యాత్మనే నమః.**

మహాభారతోపన్యాసములు 5వ భాగము పేజీలు 7 నుండి 20

తా : ఎవడు సువర్ణ వర్ణము గలిగియుండెనో, రాక్షస సంహారమునకై అదితి ఎవనిని గర్భమున ధరించెనో, తానొక్కడే యయ్యును పండ్రెండు నామముల ధరించి సూర్యరూపమున వెలుగుచుండెనో అట్టి సూర్యరూపునకు నమస్కరించు చున్నాను. అనగా మిత్ర, రవి, సూర్య, భాను, ఖగ, పూషణ, హిరణ్యగర్భ, మరీచి, ఆదిత్య, అర్క, సవితృ భాస్కరులను పండ్రెండు పేర్లతో నున్న పండ్రెండు మూర్తులయందును ఒక్కటే చైతన్యము. పూసలలోని దారము వలెనున్నదని భావము.

**శుక్లే దేవాన్ పితౄన్ కృష్ణే తర్పయత్యమృతేన యః,**
**యశ్చరాజా ద్విజాతీనాం తస్మై సోమాత్మనే నమః.**

తా: - ఏ అఖండ చైతన్యము చంద్రుడై శుక్లపక్షమున దేవతలను, కృష్ణ పక్షమున పితృదేవతలను తృప్తుల గావించుచు బ్రాహ్మణులకు తాను ప్రత్యేకముగ రాజై బ్రాహ్మణులను పాలించుచుండెనో అట్టి సోమరూపునికి నమస్కరించుచున్నాను.

**చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాం పంచభిరేవ చ,**
**హూయతే చ పునర్ద్వాభ్యాం తస్మై హోమాత్మనే నమః.**

తా:- యజ్ఞముల యందు "ఆశ్రావయ - అస్తు శ్రౌషట్ - యజ - యేయజామహే

- వౌషట్ " అను పదముల పఠించుచు ఋత్విక్కులు హోమము చేయుచుం దురో అట్టి హోమస్వరూపుడైన వానికి నమస్కరించుచున్నాను.

**పాదాంగం సంధిపర్వాణం స్వరవ్యంజన భూషణం,**

**యమాహరక్షరం దివ్యం తస్మై వాగాత్మనే నమః.**

తా :- ఎవడు పద, వాక్య, సంధి స్వరూపములతోడను, అచ్చులు, హల్లులనను అక్షరసమూహము తోడను వాగ్రూపమున వెలయుచుండెనో, ఎవ్వడు ప్రణవాక్షర మున కీర్తింపబడునో అట్టివాగ్రూపునకు నమస్కరించుచున్నాను.

**సంక్షభ్య సర్వభూతాని కృత్వాపై కార్ణవం జగత్ ,**

**బాలస్వపితి యశ్చైకః తస్మై మాయాత్మనే నమః.**

తా:- ఎవ్వడీ భూతముల నన్నింటిని తనలోనికిగొని సర్వభక్షకుడై జగత్తునంతను ఉదకమయము గావించి ఆ ఉదక మధ్యమున బాలకుడై తానొక్కడును నిద్రించుచుండెనో అట్టి మాయాత్మకు నమస్కారము. అతడే వటపత్రశాయి.

**యస్యాగ్నిరాస్యం ద్యౌర్మూర్ధా ఖం నాభి శ్చరణౌ క్షితిః,**

**సూర్యశ్చక్షుర్దిశః శ్రోత్రే తస్మై లోకాత్మనే నమః.**

తా:- ఎవ్వనికి అగ్ని ముఖముగను, స్వర్గము శిరముగను, ఆకాశము బొడ్డుగను, భూమి పాదములుగను, సూర్యుడు నేత్రములుగను, దిక్కులు, శ్రోతములుగను ఉండెనో అట్టి లోకస్వరూపునకు నమస్కారము.

**దివంతే శిరసావ్యాప్తం పద్భ్యాం దేవీ వసుంధరా,**

**విక్రమేణ త్రయోలోకాః పురుషోసి సనాతనః.**

తా :- పరమేశ్వరా ! నీవు లేని చోటు లేదు. స్వర్గము నీ శిరముచే వ్యాపించగా భూదేవిని నీ పాదములు వ్యాపించినవి. నీ విక్రమమ్ము ముల్లోకములు వ్యాపిం చినది. కావుననే నీవు సనాతనుడవు. ఓ సనాతన పురుషా నీకు నమస్కారము.

**అతసీపుష్ప సంకాశం పీతవాస సమచ్యుతం,**

**యే నమస్యంతి గోవిందం. న తేషాం విద్యతే భయం.**

తా:- హే భగవన్ ! ఎవ్వరు వల్ల అగిశె పూవు రంగు దగిలి, పట్టు పుట్టము ధరించిన నీ దివ్యమంగళ విగ్రమును గోవిందా! అచ్యుతా! అని పిలిచి నమస్క

రింతురో వారికి భయమెక్కడిది? మృత్యువు వారి ముఖము నుండి వెడలి వచ్చు అ పదముల విని పారిపోవును.

**ప్రాణకాంతార పాథేయం, సంసారోచ్ఛేద భేషజం,**
**దుఃఖ శోకపరిత్రాణం హరిరిత్యక్షరద్వయం.**

తా:- హరియను రెండక్షరములు జీవనారణ్యమున ఆహారరూపమైనది. సంసారమును ఛేదించు ఔషధమట, దుఃఖ శోకముల నుండి రక్షింప దగిన కవచమట, అట్టి భగవానునకు నమస్కారమని భీష్ముడు స్తుతించినాడు.

**ఏకో ఽపి కృష్ణస్య సకృత్ప్రణామః,**
**దశాశ్వమేథావ భృథేన తుల్యః,**
**దశాశ్వమేధీ పునరేతి జన్మ,**
**కృష్ణ ప్రణామీ న పునర్భవాయ.**

తా :- శ్రీకృష్ణతేజమునకు ఒక్కమారు నమస్కరించగా పది యశ్వమేథ యాగములు గావించిన ఫలమబ్బును. కాని అశ్వమేథములు గావించిన కర్తకు పునర్జన్మ యున్నది. కాని కృష్ణ ప్రణామము గావించిన వానికి పునర్జన్మ లేదు.

**కృష్ణ వ్రతాః కృష్ణమనుస్మరంతో,**
**రాత్రౌ చ కృష్ణం పునరుత్థితాయే,**
**తే కృష్ణదేహాః ప్రవిశంతి కృష్ణ,**
**మాజ్యం యథా మంత్రహుతం హుతాశే.**

తా:- ఏ మహనీయులు దర్మసంస్థాపనార్థముగ అవతరించిన ఈ దేవకీనందనుని అరాధించు వ్రతముననే వ్రతదీక్షితులై, ఈతని నామముననే స్మరించుచు, నిద్రా కాలముననను, నిద్రనుండి మేల్కాంచు సమయముననను ఎవ్వరు స్మరించు చుందురో వారి దేహములు సారూప్యమున శ్రీకృష్ణదేహములై శ్రీకృష్ణుని యందే వారు లీనమగుదురట.! - అగ్నియందు వ్రేల్చబడు అజ్యాహుతివలె.

- అనగా సామాన్యమగు అజ్యము (నేయి) సామాన్యమే అయినది. మంత్రములచే సంస్కరింపబడిన నేయి మంత్ర స్వరూపమునొంది అగ్నియందు ప్రవేశించి అజ్యరూపమును కోల్పోయినది. అట్లే జీవులును నిరంతర కృష్ణ భక్తిచే వారి దేహములు ప్రాకృత రూపముల వీడి కృష్ణమయములై శ్రీకృష్ణుని యందే లయమగునని భావము.

**యథా విష్ణుమయం సత్యం తథా విష్ణుమయం జగత్,**
**యథా విష్ణుమయం సర్వం పాప్మా మే నశ్యంతు తథా.**

తా :- పాపహరమగుటకు త్రికాల సత్యమగు ఒకమాటను నిర్ణయించుకొనినాడు భీష్ముడు. ఏమది? సత్యమనునది విష్ణుమయమట. అట్లే జగత్తు కూడా విష్ణు మయమే, సర్వమును విష్ణుమయమే, విష్ణుమయము కాని పరమాణువు కూడ లేదు. అది ఎట్లో అట్లే నా పాపలేశములు కూడా సర్వనాశము కాగలవని స్తుతించినాడు.

**త్వాం ప్రపన్నాయ భక్తాయ గతిమిష్టాం జిగీషవే,**
**యచ్ఛ్రేయః పుండరీకాక్ష తద్ధ్యాయస్వ సురోత్తమ.**

తా :- హే భగవన్ ! ప్రపన్నార్తి హరుడవగు నిన్ను ప్రపన్నుడనై శరణువేడుచున్నాను. పుండరీకాక్ష, నా శ్రేయోమార్గమును నీవు ధ్యానింతువు గాక !

**ఇతి విద్యా తపో యోనిరయోనిర్విష్ణురీరితః,**
**వాగ్యేనార్చితో దేవః ప్రీయతాం మే జనార్దనః.**

విద్యా తపోయోగములకు స్థానమును అస్థానముకూడనగు శ్రీమహావిష్ణువు నామౌనరూపమగు అర్చనకు తృప్తుడౌగాక అని ధ్యానించి నారాయణునికంటె వేరులేదని భావించినాడు.

**నారాయణః పరం బ్రహ్మ నారాయణ పరం తపః,**
**నారాయణః పరోదేవః సర్వం నారాయణస్సదా.**

నారాయణుడే సర్వము - పాఠకులారా ! శరతల్పమున పరుండియున్న భీష్ముడు భగవానుని యిట్లు ధ్యానించగా ఆ భీష్మునకు ఇవ్వదగు జ్ఞానమును ప్రసాదించుటకై అతని హృదయ పుండరీకమును వసించి, తరువాత మరల తన యవతార దేహమునందు ప్రవేశించినారు భగవానులు. అట్టి సమయముననే ధర్మనందనుడు శ్రీకృష్ణుని దగ్గరకు వెళ్ళుట జరిగినది. తరువాత ధర్మజునితో మాట్లాడినారు, ధర్మజుని ప్రబోధముచేత, అనగానేమి? ఎవ్వరు తన్ను ఆరాధింతురో వారి వారికి దర్శనమిచ్చుట గాని, అంతరంగమును ప్రబోధించుట గాని భగవంతుడు చేయుచుండును. ఈ ఘట్టమున భగవంతుని గీతాశాస్త్ర సందేశ మును స్మరింపుడు. మహాభారతోపన్యాసములు 5వ భాగము పే 7నుండి 20

**'యే యథా మాం ప్రపద్యంతే తాం స్త థైవభజామ్యహమ్,**
**"కృష్ణామి పృథివీం పార్థ భూత్వా కర్షాయ సాహలః**
**కృష్ణో వర్ణ శ్చమే యస్మా త్తస్మాత్ కృష్ణోహమ్**
**అర్జున - భక్త దుఃఖ కర్శిత్వాత్ కృష్ణః"** గీత 4/11

భక్తుల దుఃఖమును హరించేవాడు, సర్వజీవులను ఆకర్షించు (నీల) శరీర వర్ణము చేతను కృష్ణుడని నామం సార్థకం అయినది. నల్ల ఇనుముతో చేసిన నాగలితో భూమిని దున్నుట వలన ఆ స్వామికి కృష్ణుడని పేరు. 9/97 ఆరాధన - 17

సకల జగమును సృష్టించి పెంచువానికి నమస్కారము. తైత్తరీయసంధ్యోపాసనము.

ఈ విధముగా పురాణాచమనము చేసిన యెడల శ్రీమన్నారాయణునితో సమానుడగునని శాస్త్రమంటుంది.

## 19. భూతోచ్చాటనము

భూతోచ్చాటనమనగా, భూతములను తొలగించుట. స్థూలముగ నాలోచించిన ఇయ్యదియు శుద్ధి కొఱకు కావింపబడు క్రియయేయని తెలియగలదు.

**ఓం ఉత్తిష్ఠన్తు భూత పిశాచాః ఏతే భూమి భారకాః ।**
**ఏ తేషా మ విరోధేన బ్రహ్మ కర్మ సమారభే ॥** త్రి.సం.ము 1

నాతో ప్రారంభింపబడుచున్న యీ బ్రహ్మ కర్మ యనెడు సంధ్యోపాసనకు, భూభారకములైన ఏ భూతాదు లడ్డుగ నిలిచియున్నవో అవియన్నియు నాయీ కర్మానుష్ఠానమునకు విరోధముగాకుండ తొలగిపోవుగాక అనిభావము.

అవిద్యాకార్యములగు వానిని నానుండి తొలగించి జ్ఞానమును ప్రసాదించి తద్వారా బ్రహ్మానుభూతిని కలుగజేయగోరుచున్నాను.

పై మంత్రమును చెప్పుటకు ముందుగా కొద్దిగా అక్షతలు తీసికొని, మంత్రానంతరము, అక్షతలను వాసనచూచి ఎడమప్రక్కగా వెనుకవైపునకు వేయవలయును. ఆ అక్షతలను చూడరాదు.

## 20 పాపవిమోచన మంత్రము

హస్తమున జలము గైకొని, అందు ఈ క్రింది మంత్రము పఠింపుచు నిశ్వాసము (నిట్టూర్పు) విడచి, యాజలము తనకు ఎడమవైపున విడువవలయును. మరల నా జలము చూడదగదు.

ద్రుపదా దివ ముంచతు । ద్రుపదా దివే న్ముముచానః ।
స్విన్న స్స్నాత్వీ మలా దివ । పూతం పవిత్రేణే వాజ్యం ।
ఆప శ్శుంధంతు మైన సః ॥ ప్రాతఃసంధ్యావందనము - 5

ద్రుపదమనగా బొండకొయ్య. నేరమొనర్చినవారిని బొండకొయ్య గొట్టెదరు. అట్టి బొండకొయ్య వలన విడుదల చేయబడిన పిదప వాడొనర్చిన దోషము పోయి అతడు శుద్ధుడనబడును. చెమటలోనగు శరీర మాలిన్యము గలవాడు స్నానమొనర్చిన శుద్ధుడని వ్యవహరింపబడును. పవిత్రము చేత ఉత్పూతమైన అజ్యము పరిశుద్ధమయి హోమార్హమగును. పైవాని వలె జలములు నన్ను పాపముల నుండి పరిశుద్ధుని చేయుగాక.

## 21. జలప్రోక్షణ మంత్రము

"ఉత్తిష్ఠతో విశ్వావశో౽న్యా మిచ్ఛ
ప్రపూర్వ్యా చ్ఛ సత్యా సహ ॥

అని ఈ పై మంత్రముతో ప్రోక్షించిన అపరిశుద్ధత తొలగి పరిశుభ్రమగును. పూవులపై జలము జల్లిన పరిశుద్ధమగును.

## 22. ప్రాణాయామము

పరమాత్మ ధ్యానము తక్క నితరతలంపులను తొలగించుటయే ప్రాణాయామము.

ఐదు వ్రేళ్ళును కలిపి ముక్కు కొనను పుచ్చుకొనుచూ...

ఓమ్ భూః । ఓమ్ భువః । ఓగ్ంం సువః । ఓమ్ మహః ।
ఓమ్ జనః । ఓమ్ తపః । ఓగ్ంం సత్యం ।
ఓమ్ తత్స వితుర్వరేణ్యం । భర్గో దేవస్య ధీమహి ।
ధియో యోనః ప్రచోదయాత్ । ఓ మాపో జ్యోతీరసో౽మృతం
బ్రహ్మ భూర్భువస్సువరోమ్ ॥

తా :- మూలజ్యోతి ఈశ్వరుని చిహ్నముగను, దానిలో నుండి వెలిగించిన చిన్న జ్యోతిని జీవుని చిహ్నముగను భావించి, చిన్న జ్యోతిని మూలజ్యోతిలో చేర్చినప్పుడు జీవాత్మ పరమాత్మలో ఐక్యమును బొందినట్లు సర్వులు భావించవలయును.

ఓమ్ = సర్వపరిపూర్ణమగు పరమాత్మ ఓంకారము స్వస్వరూపసంధానము - 40
1. భూః = భూలోకము, 2. భువః = భువర్లోకము, 3. సువః = స్వర్గలోకము, 4. మహః = మహర్లోకము, 5. జనః = జనలోకము, 6. తపః = తపోలోకము, 7. సత్యః = సత్యలోకము (ఇవన్నియు) ఓం = ప్రణవము చేత ప్రతిపాదింపబడుచున్నది. భూః నుండి సత్యం వరకు గల పదములు ఏడును భూతాది సప్తలోక వాచకములు. ఇవి సప్త వ్యాహృతులనబడును. వ్యాహృతులనగా చెప్పబడినవి అని అర్థము.

ఈ సప్త వ్యాహృతులను ఉచ్చరించునప్పుడుగాని, మనస్సుచేత తలచునప్పుడుగాని "సర్వం ఖల్విదం బ్రహ్మ" (చరాచర రూపంబున మనకు గోచరంబగునది యంతయు బ్రహ్మమే) యను వాక్యార్థము ననుసరించి సకల లోకములును పరబ్రహ్మమేయని భావించవలయును. త్రి.సం.ము - 23

భూః, భువః, సువః అని మూడే వ్యాహృతులు. మహాచమస్యుడనే ఋషి 'మహః' అనే నాలుగో వ్యాహృతిని దర్శించేడు. ఈ మహః అన్న నాలుగో వ్యాహృతే బ్రహ్మ.

**" భూరితి వా అగ్నిః, భువ ఇతి వాయుః, సువరిత్యాదిత్యః,**
**మహ ఇతి చంద్రమాః చంద్రమసా వావ సర్వాణి**
**జ్యోతీంషి మహీయంతే"**

భూః అన్నది అగ్ని, భువః అన్నది వాయువు, సువః అన్నది ఆదిత్యుడు, మహః అన్నది చంద్రుడు. చంద్రుని వల్లనే జ్యోతి ప్రకాశనం జరుగుతోంది. ఇట్లాంటి భావనతో వీటినుపాసించాలి.

భూః అన్న వ్యాహృతి ఋగ్వేదం, భువః అన్నది సామవేదం, సువః అన్నది యజుస్సు, మహః అన్నది బ్రహ్మ. వాటియందు ఈ భావన చెయ్యి. ఇది తెలిసినందున బ్రహ్మ విద్య ఏర్పడుతుంది. భక్తినివేదన 7/2001=9,10

ప్రాణాయామము వలన ఆయుస్సు పెరుగును. ఆరోగ్యము బావుండును. కనీసము 5 ప్రాణాయామములు చేయవలయును. ప్రాణాయామాభ్యాసమునకు ముందు యమము, నియమము, ఆసనము అను మూడింటిని అభ్యసింపవలయును. ప్రాణాయామములో పూరకము (నాలుగు సెకన్లు) కుంభకము (పదియారు సెకన్లు) రేచకము (ఎనిమిది సెకన్లు) గాలిని ముక్కు రంధ్రముల గుండా పీల్చుట, నిల్పుట, వదలుట - ఈ అభ్యాసమును గురువు ద్వారా

నేర్చుట మంచిది. 1. ఋగ్వేదము ప్రజ్ఞానం (బ్రహ్మ) 2. యజుర్వేదము (అహం బ్రహ్మాస్మి) 3. సామవేదము (తత్వమసి) 4. అధర్వవేదము (అయమాత్మాబ్రహ్మ)

## 23. సంకల్పము

ఎడమచేతిలో కుడిచేతిని అర్ధముగా బోర్లించి సంకల్పము చెప్పాలి. ద్విరాచమ్య (రెండు పర్యాయములు ఆచమనము చేసి) త్రిఃప్రాణానాయమ్య (మూడు సార్లు ప్రాణాయామము చేసి) గురుమూర్తిని హృదయమున తలచి శ్రీగురుభ్యో నమః హరిః ఓమ్ (ఓమ్ అను ఓంకార నాదమును ముమ్మారు దీర్ఘముగా అని) శుభాభ్యాం శుభే శోభనే అభ్యుదయముహూర్తే శ్రీ గోవింద గోవింద మహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయపరార్థే, శ్వేతవరాహ కల్పే, వైవస్వతమన్వంతరే, అష్టావింశన్మహాయుగే, కలియుగే, ప్రథమపాదే, పంచాశత్కోటి యోజన విస్తీర్ణ మహీమండలే, లక్షయోజన విస్తీర్ణ జంబూద్వీపే, భరతవర్షే, భరతఖణ్డే, మేరోర్దక్షిణ దిగ్భాగే, శ్రీ వేంకటాచలాదుత్తరప్రదేశే, శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే, కృష్ణాగోదావర్యోర్మధ్య దేశే, స్వగృహే సమస్తదేవతా బ్రాహ్మణ భగవద్భాగవతాచార్య సన్నిధౌ, అస్మిన్వర్తమాన వ్యావహారిక చాంద్ర(సార)మాన.......సంవత్సరే....అయనే....ఋతౌ.....మాసే....పక్షే.. ...నక్షత్రే......తిథౌ....వాసరే (వాసరయుక్తానాం) శుభనక్షత్రే, శుభయోగే, శుభకరణే, ఏవంగుణ విశేషణ, విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్ శ్రీమతః...గోత్రస్య.....నామధేయస్య, ధర్మపత్నీ సమేతస్య, మమ అస్మాకం సహకుటుంబానాం, మమ ఉపాత్తదురితక్షయ ద్వారా శ్రీకృష్ణపరమాత్మ ప్రీత్యర్థం, సమస్తపాప నివృత్యర్థం సర్వదురితక్షయద్వారా, పుణ్యఫల ప్రాప్త్యర్థం ఆత్మశుద్ధ్యర్థం భూమండలే చరాచర ప్రాణికోటీనాం క్షేమ సిద్ధ్యర్థం, భక్తి జ్ఞాన, వైరాగ్య ఫల సిద్ధ్యర్థం, మమ అభీష్ట ఫల సిద్ధ్యర్థం, ప్రతిబంధ రహిత శ్రీకృష్ణపరమాత్మ సాక్షాత్కార జ్ఞాన సిద్ధ్యర్థం, శ్రీకృష్ణ పరమాత్మ ప్రీత్యర్థం చ సంభవతా నియమేన సంభవద్భిర్ద్రవ్యైః సంభవద్భిరుపచారైశ్చ యావచ్ఛక్తి శ్రీగీతాదేవతాముద్దిశ్య శ్రీగీతాదేవతా ప్రీత్యర్థం ధ్యానావాహనాది షోడశోపచార పూజామహం కరిష్యే.. అని (అంగుష్ఠ అనామిక వ్రేళ్ళను కలిపి) తీర్థమును ముట్టుకుని (స్పృశించి)

ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం, శ్రీమహాగణాధిపతి పూజాం కరిష్యే (అంగుష్ఠ అనామిక వ్రేళ్ళను కలిపి తీర్థమును, స్పృశించి) విష్వక్సేనః పూజాం

కరిష్యే (అం. అ. తీర్థమును తాకి) తదంగ కలశారాధనం కరిష్యే (తీర్థమును తాకి) కలశం గంధ పుష్పాక్ష తైరభ్యర్చ్య..(పిమ్మట కలశమును గంధ పుష్పాక్షతలతో నలంకరించి - ఈ క్రింది మంత్రమునుచ్చరించుచూ అందలి జలమును పువ్వుతో స్పృశించదగును).

**గంగేచ యమునే కృష్ణే గోదావరి సరస్వతి,**
**నర్మదే సింధు కావేరి జలేఽస్మిన్సన్నిధిం కురు.**

అయాంతు శ్రీమహాగణాధిపతి పూజార్థం, శ్రీ విష్వక్సేన పూజార్థం, శ్రీకృష్ణపరబ్రహ్మ పూజార్థం మమదురితక్షయ కారకాః కలశోదకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష్యదే(ద్రై) వమాత్మానం చ సంప్రోక్ష్య--

(తదుపరి ఆ కలశోదకమును దర్భలతోగాని, పూవుతోగాని, తమలపాకుతో గాని స్పృశించిన జలమును పూజాద్రవ్యముల మీద, ఆరాధించు దైవ చిత్ర పటముల పైన, అర్చితమూర్తి మీద, తన శిరస్సు పైన జల్లుకొని శుచిర్భూతుడు కావలెను. మరియు శ్రీమహాగణపతికి, శ్రీ విష్వక్సేనునికి, శ్రీకృష్ణపరమాత్మకు ధ్యానావాహనాద్యుపచారములు గావించవలెను).

## 24. కలశ ప్రార్థన

1. **ఓం ఆజిఘ్ర కలశం మహ్యా, త్వావిశం, త్వింధవః పునరూర్జా, నివర్తస్వ, సానః, సహస్రం, ధుక్ష్వో రుధారా, పయస్వతీ, పునర్మా, విశతా, ద్రయిః,** యజు ఆది మం42 - స్వస్వరూపసంధానము - 125

తా :- హే పరాత్పరా? హేజ్యోతిర్మయా? కలశమున నీ యొక్క తేజమును ప్రవేశింపజేయుము. సర్వసుఖములను ప్రవేశింపజేయుము. ఉత్సాహాభి వృద్ధులను పెంపొందింపుము. మాకు అమిత శ్రేయోప్రదములగునట్టి అమృత కిరణములను అమితముగా ప్రసాదింపుము. ఎల్లప్పుడును ఆనందైశ్వర్యములను ప్రాప్తింపజేయుము.

కలశపూజ

2. **కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్రస్సమాశ్రితః ।**
**మూలే తత్రస్థితో బ్రహ్మ మధ్యే మాతృ గణాస్స్మృతాః ।**
**కుక్షౌతు సాగరా స్సర్వే సప్త ద్వీపా వసుంధరా ॥**

ఋగ్వేదో ఽథ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః ॥
అంగైశ్చ సహితా స్సర్వే కలశాంబు సమాశ్రితాః ।
ఆకలశేషు ధావతి పవిత్రే పరిషిచ్యతే - ఉక్థైర్యజ్ఞేషు వర్థతే।
"ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వభూతాన్యాపః ప్రాణావా ఆపః,
పశవ ఆపో ఽ న్న మాపో ఽ మృతమాపస్సమ్రాడాపో విరాడాప
స్స్వరాడాపశ్ఛందాగ్ం ష్యాపోజ్యోతిగ్ం ష్యాపో యజూగ్ం
ష్యాప స్సత్యమాపస్సర్వా దేవతా ఆపో భూర్భువస్సువరాప ఓమ్॥

ఆపోవా... తా :- ఇక్కడ కలశంలో జలాన్ని దేవతగా చెప్పబడింది. దాన్ని మంత్రించి పరబ్రహ్మగా పూజిస్తారు. "ఆపోనారాయణః" అంటే జలమే నారాయణుడు. జీవరాసులకు ఆధారభూతమైనది జలం. అనావృష్టి సమయంలోనూ, సదా వానదేవుణ్ణి ఆహ్వానించడం సర్వసాధారణమే. ఇక్కడ ఈ మంత్రాలతో వానదేవుణ్ణి స్తుతిస్తున్నారు. 'బ్రహ్మవారిని' అంటే జలరూపంలో ఉన్న పరబ్రహ్మన్ని స్తుతిస్తున్నారు. శ్రీరామకృష్ణులు గంగాజలాన్ని బ్రహ్మవారి అనేవారు. కలశారాధన సమయంలో పఠించే మంత్రాల భావం : 'అప్' అంటే జలం. "మనం చూస్తున్నదంతా జలమే. సృష్టించబడిన సర్వజీవరాసులూ జలమే. శరీరంలోని ఉచ్ఛ్వాస నిశ్వాసలు జలమే. నాలుగు కాళ్ళ జంతువులూ జలమే. పంటలూ జలమే. అమృతం కూడా (ద్రవం గనుక) జలమే - సంరాట్ - నిరంతరమూ జ్వలించేది జలమే. విరాట్ - వివిధ రూపాలు ప్రయోజనాలూ ఉన్నవి. సర్వం జలమే. స్వరాట్ - స్వయం ప్రకాశకాలైనవన్నీ జలమే. - (సంరాట్, విరాట్, స్వరాట్‌ల భావాలు భట్టభాస్కరుని వ్యాఖ్యానాలు). ఛందస్సు జలమే. జ్యోతిగ్ం - ప్రకాశవంతమైనవన్నీ జలమే. యజూగ్ం వేదాలు జలమే. సత్యమూ జలమే, సర్వదేవీదేవతలూ జలమే - భూర్భువస్సువః - భూమి, అంతరిక్షం, స్వర్గం - అన్నీ జలమే. వీటన్నిటికీ మూలాధారం పరబ్రహ్మ. బ్రహ్మ చిహ్నం "ఓంకారం". వర్షాలు పుష్కలంగా పడి పంటభూములు ఆర్ద్రంగా (ఆర్ద్ర = తడిసినది) ఉండటానికి ఈ మంత్రాన్ని పఠిస్తారు. శ్రీరామకృష్ణ ప్రభ 3/2002=20

గంగే చ యమునే కృష్ణే గోదావరి సరస్వతి
నర్మదే సింధు కావేరి జలే ఽ స్మిన్, సన్నిధిం కురు

ఓం.........ఓం...........ఓం- అనుచు కలశోదకమును అభిమంత్రించవలెను.
ఆయాంతు శ్రీకృష్ణపరమాత్మ దేవతా పూజార్థం, మమదురితక్షయ కారకాః

కలశోదకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య - అనుచు పువ్వుతో గాని, తమలపాకుతో గాని కలశోదకమును అభిమంత్రించి తదుపరి ఆ జలమును పూజా ద్రవ్యముల మీద, దేవుళ్ళపైన, తన శిరస్సుపైనను చల్లుకొనవలయును.

ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం గణాధిపతి పూజాం కరిష్యే, శ్రీవిష్వక్సేన పూజాం కరిష్యే, శ్రీకృష్ణపరమాత్మ పూజాం కరిష్యే. అనుచు జలమును మూడు తూర్లు తాకదగును. (బొటనవ్రేలు ఉంగరపునవ్రేలు కలిపి జలమును తాకవలెను)

## 25. ఇష్ట దేవతా ప్రార్థన

(తలపై ఆచార్యపాదాలైన తిరువడి వస్త్రాన్ని ధరించాలి)

1. "శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే.

తా:- తెల్లని వస్త్రములను ధరించినట్టియు, విష్ణువు వలె జగమెల్లను వ్యాపించి నట్టియు, చంద్రునివలె స్వచ్ఛమైన కాంతిని గలిగినట్టియు, నాలుగు చేతులు గలట్టియు, శాంతిగల ముఖమును గలిగినట్టియు, గణపతిని సకల విఘ్నము లను నివారించుట కొఱకు ధ్యానింపగలను.

తా:- తెల్లని వస్త్రమును ధరించి, చంద్రుని వంటి దేహకాంతియు, నాల్గు భుజము లును గల్గి ప్రసన్నముఖముతో వెలయు శ్రీ మహావిష్ణువును సమస్త విఘ్నము లును తొలగుటకై ధ్యానింపగలను.

2. వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ,
అవిఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా.

తా:- ఓ వినాయకా, వక్రతొండం, మహాదేహం, కోటి సూర్యబింబ ప్రకాశంతో సమానమైన తేజస్సు కలవాడా, ఎల్లప్పుడు, నాకు కార్యసిద్ధి ప్రసాదించు.

3. యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్,
విఘ్నం నిఘ్నన్తి సతతం విష్వక్సేనం త మాశ్రయే.

తా:- ఎవనియొక్క పరిచారకులగు ద్విరదవక్త్రుడు మొదలగువారు తన్ను ధ్యానించువారల విఘ్నములను సదా తొలగించుచుందురో, అట్టి విష్వక్సేనులను (అనగా విష్ణువు యొక్క సేనానాయకులను) ఆశ్రయించెదను.

4. విష్వక్సేనం సకల విబుధ ప్రౌఢ సైన్యాధినాథం
ముద్రా చక్రే కరతలయుగే శఙ్ఖదణ్డౌ దధానమ్
మేఘశ్యామం సుఫణిమకుటం పీతవస్త్రం శుభాంగం
ధ్యాయే దేవం విజితదనుజం సూత్రవత్యా సమేతమ్.
శ్రీమతే విష్వక్సేనాయ నమః
శ్రీరంగ - చంద్రమస మిందిరయా విహర్తుం,
విన్యస్య విశ్వ చిదచిన్నయనాధికారం,
యో నిర్వహత్యనిశ మంగుళి ముద్రయైవ,
సేనాన్య మన్య విముఖాః త మిహాశ్రయామః.
శ్రీమతే విష్వక్సేనాయ నమః.
లోకాచార్యాయ గురవే కృష్ణపాదస్య సూనవే,
సంసార - భోగి - సందష్ట జీవ జీవాతవే నమః.
శ్రీ లోకాచార్యాయ నమః.
శ్రీకృష్ణ - పాద - పాదాబ్జే నమామి శిరసా సదా,
యత్ప్రసాద ప్రభావేన సర్వసిద్ధి రభూన్మమ.
శ్రీకృష్ణ పాదాయ నమః.

5 వ్యాసం వసిష్ఠ నప్తారం, శక్తేః పౌత్ర మకల్మషం,
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్.

తా:- వసిష్ఠ మహామునికి మునిమనుమడైనట్టియు, శక్తి మహామునికి మనుమడై నట్టియు, పరాశరమునికి పుత్రుడైనట్టియు, శుకమహర్షికి జనకుడైనట్టియు, నిర్మలుడైనట్టియు, తపమను ధనరాశి గలిగిన వ్యాసులవారిని గూర్చి నమస్కారము చేయుచున్నాను.

6 సమ్యఙ్న్యాయ కలాపేన మహతా భారతేన చ,
ఉపబృంహితవేదాయ నమో వ్యాసాయ విష్ణవే.

తా :- న్యాయ కలాపములతో గూడిన మహాభారమును, పఞ్చమ వేదముగ సృజించిన విష్ణురూపుడగు వ్యాసునకు నమస్కారము.

7 వ్యాసాయ విష్ణురూపాయ, వ్యాసరూపాయ విష్ణవే,
నమో వై బ్రహ్మనిధయే, వాసిష్ఠాయ నమోనమః

తా:- విష్ణురూపుడైన వ్యాసుల వారి కొఱకును, వ్యాసరూపముతో నున్న విష్ణువు కొఱకును, వేదములకు గనియైన వానికొఱకు నమస్కారము. వసిష్ఠుని వంశ మందు జన్మించిన వ్యాసునికి నమస్కారము.

8 అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే,
సదైకరూప రూపాయ విష్ణవే సర్వజిష్ణవే.

తా:- వికారరహితుడును, పరిశుద్ధుడును, శాశ్వతుడును, ఆత్మస్వరూపుడును, అన్ని రూపములు తానేయై ప్రకాశించు విష్ణువు కొఱకు నమస్కారము.

9 అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే,
ప్రణత క్లేశ నాశాయ గోవిందాయ నమోనమః.

తా:- వికారరహితుడును, పరిశుద్ధుడును, శాశ్వతుడును, ఆత్మస్వరూపుడును, నమస్కరించువారి దుఃఖమును పోగొట్టు గోవిందునకు నమస్కారము.

10 అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరో హరిః,
అఫాలలోచన శ్శంభుః భగవాన్ బాదరాయణః.

తా:- నాలుగు ముఖము లేని బ్రహ్మయట, రెండే బాహువులు గల శ్రీమహా విష్ణువట, మూడవ నేత్రములేని ఈశ్వరుడట. అనగా త్రిమూర్త్యాత్మకుడని యర్థము. చూచితిరా ! భారతకర్త శ్రీవేదవ్యాసమహర్షి ఎట్టివాడో, భగవంతుని అంశ.

11 సరస్వతీ నమస్తుభ్యం వరదే కామరూపిణీ పెద్దబాలశిక్ష
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా,
పద్మపత్ర విశాలాక్షీ పద్మ కేసర వర్ణినీ,
నిత్యం పద్మాలయా దేవీ సా మాం పాతు సరస్వతీ.

12 శ్రీ వేంకటాచలాధీశం శ్రియాధ్యాసిత వక్షసం పెద్దబాలశిక్ష
శ్రితచేతన మందారం శ్రీనివాసమహం భజే,
కరద్వయేన కమలే ధారయంతీం స్వలీలయా
హారనూపుర సంయుక్తాం లక్ష్మీం దేవీం నమామ్యహమ్.

13 నమో ఽ స్త్వనంతాయ సహస్రమూర్తయే
సహస్రపాదాక్షి శిరోరు బాహవే,
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే
సహస్రకోటీ యుగధారిణే నమః.

(సహస్ర కోటీ యుగధారిణే నమః ఓం నమ ఇతి)

బ్రహ్మచెప్పెను :- అంతములేనటువంటిన్ని, వేయి రూపములతో ప్రకాశించు చున్నటువంటిన్ని, వెయ్యి పాదములు, వెయ్యి కన్నులు, వెయ్యితలలు, వెయ్యి తొడలు, వెయ్యి భుజములు, వెయ్యి నామములు కలిగియున్న నిత్యుడైన పురుషుని కొరకు నమస్కారము. సహస్రకోటియుగములను ధరించిన విష్ణువు నకు నమస్కారము. శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రము

సహస్రకోటి యుగములు ధరించినవానికి నమస్కారము. ఓం నమ స్కారము. శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః.... ఆవాహయామి... ఆవాహయామి.

14 ఓమ్ కృష్ణం కమల పత్రాక్షం పుణ్యశ్రవణ కీర్తనమ్,
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్.

తా:- కమలపత్రముల వంటి నేత్రములు కలవారును, పవిత్రమగు కీర్తి కల వారును, వసుదేవుని కుమారుడును, జగత్తునకు బీజభూతులును, నారాయణు డును హరియు అగు శ్రీకృష్ణునకు నమస్కరించుచున్నాను.

15 ఓమ్ కృష్ణాయ యాదవేంద్రాయ జ్ఞానముద్రాయ యోగినే,
నాథాయ రుక్మిణీశాయ నమో వేదాంతవేదినే.

తా:- యాదవశ్రేష్ఠుడు, జ్ఞానముద్రతో నొప్పువాడు, యోగీశ్వరుడు, భక్తజన రక్షకుడు, రుక్మిణీపతి, వేదవేదాంత స్వరూపుడగు శ్రీకృష్ణునకు నమస్కారము.

16 ఓం ప్రపన్న పారిజాతాయ తోత్రవేత్రైకపాణయే,
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః

తా:- శరణాగతులగు భక్తులకు కల్పవృక్షమువలె వాంఛిత వస్తువుల నొసగు వారును, ఎడమచేతియందు కొరడాను, కుడిచేతియందు జ్ఞానముద్రను ధరించిన వారును, గీతయను అమృతమును పితుకువారును అగు శ్రీకృష్ణపరబ్రహ్మ మునకు నమస్కారము.

**17 ఓమ్ సారథ్య మర్జునస్యాదౌ కుర్వన్ గీతామృతం దదౌ,**
**లోకత్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః.**

తా:- ఏమహనీయుడు పూర్వము అర్జునునకు రథసారథ్యము చేయుచునుగూడ ముల్లోకములకు మహోపకారము చేయు నిమిత్తము అతనికి గీతామృతము నొసంగెనో అట్టి శ్రీకృష్ణపరమాత్మకు నమస్కారము.

**18 కృష్ణో రక్షతునో జగత్రయగురుః :కృష్ణం నమస్యామ్యహమ్**
**కృష్ణే నామరశత్రవో వినిహతాః, కృష్ణాయ తస్మై నమః.**
**కృష్ణా దేవ సముత్థితం జగదిదం : కృష్ణస్య దాసోస్మ్యహమ్**
**కృష్ణేతిష్ఠతి విశ్వమే తదఖిలం : హే కృష్ణ సం రక్షమామ్.**

తా:- ముల్లోకముల బాలించు శ్రీకృష్ణుడు మనల రక్షించుగాక ! నేను శ్రీకృష్ణునికి నమస్కరింతును. రాక్షసహంతకుండగు శ్రీకృష్ణునికి నమస్కారము. ఈ జగమం తయూ శ్రీకృష్ణుని నుండియే పుట్టినది. నేను కృష్ణుని దాసుడను. ఈ లోకమెల్ల కృష్ణుని యందే ఉన్నది. విశ్వరూపుడవగు కృష్ణా ! నన్ను రక్షింపుము.

**19 చిరమిహ వృజినార్త స్తప్యమానో౽నుతాపై**
**రవితృష షడమిత్రో౽లబ్ధశాన్తిః కథంచిత్,**
**శరణద సముపేతస్త్వ త్పదాబ్జం పరాత్మన్**
**అభయమృతమశోకం పాహిమా౽౽ పన్నమీశ.**

తా:- శరణప్రదాతా ! పరమాత్మా ఈశా ! నేనీ లోకమున చాలాకాలము కర్మఫల ముచే పీడితుడను, అనుతాపములచే తప్తుడను. తృష్ణాపీడితములైన ఇంద్రియ శత్రువుల తాడనములచే శాంతిశూన్యుడనునై దైవవశమున సత్యము, అభ యము, అశోకమునగు నీ పాదపద్మమును శరణు బొందితిని. ఆపదలో జిక్కు కొనిన నన్ను రక్షింపుము. శ్రీమద్భాగవతము - 10-51-57

20 యావన్నమే నరదశా దశమీ దృశోఽపి
రంధ్రాదుదేతి తమిరీకృత సర్వభావా,
లావణ్య కేళి భవనం తవ తావదేతు
లక్ష్మ్యాః సముత్క్వణిత వేణు ముఖేన్దు బింబమ్.

తా:- శ్రీకృష్ణా ! నన్ను వార్ధక్యము చుట్టుకొని నాకు చూపుమందగించి ప్రపంచ మంతయు అంధకార బంధురము కాక మునుపే లక్ష్మీ విహారస్థానమగు నీముఖమును వేణుగానమొనర్చు నీ ముఖారవిందమును ఒకసారి చూపుము.

శ్రీరామకృష్ణప్రభ

21 వసుదేవ సుతం దేవం కంసచాణూరమర్దనం,
దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుమ్.

తా:- వసుదేవుని పుత్రుడును, దివ్య స్వరూపధారియు, కంసచాణూరులను, సంహరించినవారును, దేవకికి పరమానందకారకులును జగద్గురువులు నగు శ్రీకృష్ణపరమాత్మకు నమస్కరించుచున్నాను.

22 గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః,
గురుస్సాక్షాత్పరంబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః.
ధ్యానమూలం గురోర్మూర్తిః పూజామూలం గురోఃపదమ్
మంత్రమూలం గురోర్వాక్యం మోక్షమూలం గురోఃకృపా.

తా:- గురువే బ్రహ్మస్వరూపుడు. గురువే విష్ణు స్వరూపుడు. గురువే మహేశ్వరుడు. గురువే సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపుడు. కావున అటువంటి మహనీయుడైన గురువునకు నమస్కరిస్తున్నాను. ధ్యానానుష్ఠానానికి ఆధారం గురుదేవుని మూర్తి, పూజోపచారాలు ఆచరించడానికి నిలయం గురునాథుని పాదపద్మములు, మననం చేసుకోడానికి ఆలంబనం గురుమహనీయుని ప్రబోధాలు, గురుకృపా కటాక్షాలు మోక్ష ప్రాప్తికి మూలం.

23 బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిమ్
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యమ్
ఏకం నిత్యం విమిలమచలం సర్వధీ సాక్షిభూతమ్
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.

తా:- పరమ సుఖదాయకమైన బ్రహ్మానంద స్వరూపుడు, కేవలం మూర్తీభవించిన జ్ఞానస్వరూపుడు, రాగద్వేష, సుఖదుఃఖాది ద్వంద్వ వికారాల కన్నింటికి అతీతుడు, ఆకాశంలా దేనినీ అంటని విశాల స్వరూపుడు, "తత్వమసి" మున్నగు వేదాంత మహావాక్యాలు ప్రబోధించే పరమాత్మ స్వరూపుడు, ఏకైక అద్వయానంద స్వరూపుడు శాశ్వతమైనవాడు, స్వచ్ఛమైనవాడు, నిశ్చల స్వభావుడు, సర్వబుద్ధీంద్రియ వ్యాపారాలకు అతీతుడు, మనోభావాలకు అందనివాడు. సత్త్వరజస్తమోగుణాలు మూడు లేనివాడు అయిన సద్గురు మహనీయునికి నా హృదయపూర్వక ప్రణామాలర్పిస్తున్నాను.

24 వందే గురూణాం చరణారవిందే
సందర్శితస్వాత్మ సుఖావబోధే
జనస్యయే జాంగలికాయమానే
సంసార హాలాహలమోహ శాంత్యై.
వందే గురుపదద్వంద్వ మవాఙ్మానసగోచరమ్,
రక్తశుక్ల ప్రభామిశ్ర మతర్క్యంత్రైపురం మహః.
శ్రీ శైలేశ దయాపాత్రం ధీభక్త్యాది గుణార్ణవమ్,
యతీంద్ర ప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్.
లక్ష్మీనాథసమారంభాం నాథయామునమధ్యమామ్,
అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరామ్.
(అస్మద్గురుసమారంభాం నాథయామునమధ్యమామ్,
లక్ష్మీవల్లభపర్యంతాం వందే గురుపరంపరామ్).
నారాయణ సమారంభాం, శంకరాచార్య మధ్యమామ్,
అస్మదాచార్య పర్యంతాం వందేగురుపరంపరామ్.

తా:- శ్రీమన్నారాయణునితో నారంభించినదియు, శంకరభగవత్పాదులు మధ్యగా గలదియు, అస్మదాచార్యుడు తుదిగా గలదియునగు గురుపరంపరకు నమస్కరించుచున్నాను.

## 25.గాయత్రీ ధ్యానమ్

**ముక్తా విద్రుమ హేమ నీల ధవళ చ్ఛాయై ర్ముఖైస్త్రీక్షణైః ।**
**యుక్తా మిందు నిబద్ధ రత్న మకుటాం తత్త్వార్థ వర్ణాత్మికాం ।**
**గాయత్రీం వరదా భయాం కుశ కశాః శుభ్రం కపాలం గదాం**
**శంఖం చక్ర మథారవిందయుగళం హస్తై ర్వహన్తీం భజే ॥**

తా:- ముత్యములు, పగడములు, బంగారపు నీలమణులు, స్ఫటికము వంటి తెల్లనిరంగులును గలిగిన మూడు కన్నులును, ఐదు ముఖములు గలదియు, బాలచంద్రునిచేత అలంకబడియున్న రత్నమయ కిరీటము గలదియు, బ్రహ్మతత్త్వమిట్టిదని తెల్పెడి యక్షరములే దేహముగా గలదియు, పదిచేతులందు 1. అభయ, 2.వరదముద్రలు, 3.అంకుశము, 4.కశము, 5. కపాలము, 6.గద, 7.శంఖము, 8.చక్రము, 9.10.కమలద్వయము ధరించియుండునదియునగు గాయత్రీదేవిని ప్రార్థించుచున్నాను. (సేవించుచున్నాను)

త్రికాలసంధ్యావందనము 12,34

స్త్ర = పండితుల సూచన, స్త్రీ = సాంధ్యదీపిక, స్త్రీ = త్రి.సం.ము.

గాయత్రీమాత పదిచేతులలోను, ఎడమభాగము ఐదుచేతులలో పైచేతినుండి క్రిందకు, కుడిభాగము ఐదుచేతులలో క్రింది నుండి పైకి క్రమముగా... 1.తామరపువ్వు, 2.శంఖము, 3.తెల్లని కపాలము, 4.అంకుశము, 5.వరదముద్ర, 6.అభయముద్ర, 7.కశా (కశీకర్ర(అశ్వాదులను తోలుటకు త్రాడుకట్టిక కర్ర), 8.గద, 9.చక్రము, 10.తామరపువ్వు వుండును. శ్రీశైలప్రభ 6/84=47

**26 మూలాధారే హుతవహకళా విశ్రుతా భూర్భువ స్స్వః,**
**బ్రహ్మస్థానే పరమగహనే తత్స వితుర్వరేణ్యం,**
**భర్గోదేవం శశికళయుతం ధీమహీత్యేకరూపం,**
**ధియోయోనః పరమ మమృతం చోదయంతీ పురస్తాత్.**

**27 సచ్చిదానందరూపాయ కృష్ణాయా క్లిష్టకారిణే,**
**నమో వేదాంత వేద్యాయ గురవే బుద్ధి సాక్షిణే.**

సత్+చిత్+ఆనందస్వరూపుడును, క్లేశము లేకుండ, సర్వకార్యములను జేయు వాడును, ఉపనిషత్తులయందు దెలియదగినవాడును, లోకమున కంతకును గురువైనవాడును, బుద్ధికి సాక్షియైనవాడునునగు శ్రీకృష్ణపరమాత్మకు నమస్కారము.

**28 కృష్ణద్వైపాయనం వ్యాసం సర్వలోకహితే రతమ్,**
**వేదాబ్జ భాస్కరం వందే శమాది నిలయం మునిమ్.**

సమస్తలోకుల యొక్కయు హితము నందు ఆసక్తి కలవాడును, వేదములనెడి తామరపువ్వులకు సూర్యునివంటివాడును, శమము మొదలగు గుణములకు స్థానమైనవాడును, మునియైనవాడును, కృష్ణద్వైపాయనుడనుపేరుగల వేద వ్యాసునికి నమస్కరించుచున్నాను.

**29 ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణ పింగళం,**
**ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయవై నమోనమః.**

తా:- స్వతస్సిద్ధుడైన స్వరూపము గలవాడు, నిరంజనుడు, నిత్యుడు, నిర్మోహుడు, నిత్యసంకల్పుడు, స్వయంప్రకాశుడు, ప్రపంచాధారుడు, పింగళవర్ణముగలవాడు, ఊర్ధ్వరేతస్కుడగు శ్రీకృష్ణునకు నమస్కారము.

## 26 ధ్యానం సమర్పయామి

**1 ఆగచ్ఛానంత దేవేశ । భోగమోక్షప్రదాయక**
**నాకేశ ముఖలోకేశ। వందితాంఘ్రి ద్వయాంబుజ॥**
శ్రీమత్ ॥ ఆవాహనం సమర్పయామి.

**2 రత్నసింహాసనం వందే । సంగృహాణ సమర్పితం**
**చంద్రమండల సంకాశ । సస్మితానన పంకజ ॥.**
శ్రీమత్ ॥ అనేక మణిమయ రత్నఖచిత సింహాసనం సమర్పయామి.

**3 పాద్యం గృహాణ భోస్వామిన్ । మయానీతం శుభప్రదం।**
**కృష్ణవేణీ జలంభక్త్యా । తీర్థపాద జగద్గురో ॥**
శ్రీమత్ ॥ పాదయోః పాద్యం సమర్పయామి.

4 అర్ఘ్యం దాస్యామ్యహం భక్త్యా । తవపాణితలేవిభో।
గోదావరీజలం హేమ । కలశస్థం సువాసితం ॥
శ్రీమత్ ॥ హస్తయోః అర్ఘ్యం సమర్పయామి.

5 ఆచమ్యతాం మయాదత్తం । హేగురో యమునాజలం।
త్వదర్థం కృపయా భావ । భవబాధా నికృంతనః ॥
శ్రీమత్ ॥ ఆచమనీయం సమర్పయామి.

6 శర్కరాదధి మధ్వాజ్య । క్షీరమిశ్రమిదం విభో।
పంచామృతం మయాదత్తం । స్నానం కురు జగత్పతే ॥
శ్రీమత్ ॥ పంచామృతస్నానం సమర్పయామి.

7 తప్తకాంచన కుంభస్తం । కించిదుష్ణం సువాసితం।
మయానీతం జహ్నుకన్యా । జలస్నానం కురు ప్రభో ॥
శ్రీమత్ ॥ శుద్ధోదకస్నానం సమర్పయామి.

8 వస్త్రయుగ్మం మయాదత్తం । త్వదర్థం స్వర్ణతంతునా।
నిర్మితం నిర్మల స్వామిన్ । నిత్య కల్యాణపావన ॥
శ్రీమత్ ॥ వస్త్రయుగ్మం సమర్పయామి.

9 కార్పాసతంతునా శుభ్రం । రచితం తేఽర్పితంమయ।
సంగృహాణ ఇదం యజ్ఞ । సూత్రం పాత్రం దయానిధే ॥
శ్రీమత్ ॥ యజ్ఞోపవీతం సమర్పయామి.

10 కిరీటం కుండలం రత్న । కంకణాదీని తేమయా।
సంగృహ్యతాం భూషణాని । అర్పితాని నిరంజన ॥
శ్రీమత్ ॥ సర్వాభరణ భూషణాన్ సమర్పయామి.

11 మలయాచల సంభూతం । కర్పూర కలితం విభో।
విలేపనం త్వదర్థంభో । గృహ్యతామర్పితం మయా ॥
శ్రీమత్ ॥ గంధం సమర్పయామి.

12 తండులాన్ ధవళాకారాన్ । హరిద్రా చూర్ణమిశ్రితాన్।
గృహ్యతామక్షతాన్ దేవ । మయాదత్తాన్ మనోహరాన్ ॥
శ్రీమత్ ॥ అక్షతాన్ సమర్పయామి.

ఆరామ పుష్పాణి మనోహరాణి - జలాశయస్థాని సుపల్లవాని ।
సువర్ణపుష్పాణిమయార్పితాని - గృహాణ శ్రీవత్సధర ప్రసీద ॥
శ్రీమత్ ॥ నానావిధ పరిమళ పత్రపుష్పం సమర్పయామి.

అచలగురుపూజావిధానము - 4.

27 అథ అంగ పూజ

1. తీర్థపాదాయ నమః । పాదౌ పూజయామి
2. నిగమ మంజీరాయ నమః । గుల్ఫౌ పూజయామి
3. స్మర తూణీర జంఘాయ నమః । జంఘౌ పూజయామి
4. ముక్తి కాంతా సేవితాయ నమః । జానునీ పూజయామి
5. రత్న స్తంభోరు యుగళాయ నమః । ఊరూ పూజయామి
6. పులినతల జఘనాయ నమః । జఘనౌ పూజయామి
7. మణికాంచన కలాప శోభితాయ నమః । కటిం పూజయామి
8. గంభీర నాభిమండలాయ నమః । నాభిం పూజయామి
9. విశ్వోదరాయ నమః । ఉదరం పూజయామి
10. దయార్ద్రహృదయాయ నమః । హృదయం పూజయామి
11. విశాల వక్షసే నమః । వక్షస్థలం పూజయామి
12. కంబుగ్రీవాయ నమః । కంఠం పూజయామి
13. వరదాన ధురీణాయ నమః । హస్తాన్ పూజయామి
14. ఉన్నత స్కంధాయ నమః । స్కంధాన్ పూజయామి
15. స్మిత వక్త్రాయ నమః । వక్త్రం పూజయామి
16. చంపక నాసాయ నమః । నాసికాం పూజయామి
17. పల్లవాధరాయ నమః । అధరం పూజయామి

18. పుండ్రేక్షు కార్ముక భ్రువే నమః । భ్రూయుగ్మం పూజయామి
19. కరుణాకటాక్ష వీక్షణాయ నమః । నేత్రౌ పూజయామి
20. పుష్టకర్ణాయ నమః । కర్ణౌ పూజయామి
21. రాకాసుధాంశు వదనాయ నమః । ముఖం పూజయామి
22. సులలాటాయ నమః । లలాటం పూజయామి
23. నీలకుంచిత మూర్ధ్నిజాయ నమః । కేశాన్ పూజయామి
24. సువృత్త శిరస్కాయ నమః । శిరః పూజయామి
25. సర్వాత్మనే నమః । సర్వాంగాని పూజయామి

శ్రీమత్ ॥ అథ అంగ పూజాం సమర్పయామి.

## 28 అథ పత్ర పూజ

1. అచింత్యాయ నమః । బిల్వపత్రం సమర్పయామి
2. బృందారకవందితాయ నమః । తులసీదళం సమర్పయామి
3. భువనరక్షణ తత్పరాయ నమః । వకుళ పుష్పం సమర్పయామి
4. భూరి విభవాయ నమః । పున్నాగ పుష్పం సమర్పయామి
5. జగజ్జనన కారణాయ నమః । కేతకీ పుష్పం సమర్పయామి
6. చరాచర గురవే నమః । చామంతికా పుష్పం సమర్పయామి
7. సుప్రభావాయ నమః । చంపక పుష్పం సమర్పయామి
8. సుప్రసన్నాయ నమః । పాటలీ పుష్పం సమర్పయామి
9. అపవర్గప్రదాయ నమః । శతపత్రపుష్పం సమర్పయామి
10. అనంతాయ నమః । జాజి పుష్పం సమర్పయామి
11. మోహవర్జితాయ నమః । కరవీర పుష్పం సమర్పయామి
12. ముకుందాయ నమః । రసాల పుష్పం సమర్పయామి
13. ప్రకృతి పురుష విలక్షణాయ నమః । మాలతీ పుష్పం సమర్పయామి
14. నిత్యాయ నమః । కల్హర పుష్పం సమర్పయామి

15. ఆగ్నేయ చక్ర నిలయాయ నమః। అతసీ పుష్పం సమర్ప
యామి
16. నాదబిందు కళా తీతాయ నమః। పారిజాత పుష్పం సమర్ప
యామి
17. భూతాత్మనే నమః। అశోక పుష్పం సమర్పయామి
18. మండలత్రయాతీతాయ నమః। నీలోత్పల పుష్పం సమర్ప
యామి
19. అనంతాయ నమః। మల్లికా పుష్పం సమర్పయామి
20. అవ్యక్తాయ నమః। మాలతీ పుష్పం సమర్పయామి

అథ పత్ర పూజాం సమర్పయామి అచలగురుపూజావిధానము - 12

నానావిధ పరిమళ పత్రపుష్పాణి సమర్పయామి

29 1 చందనాగరు కర్పూర। శర్కరాజ్య సమన్వితం
ధూపోయం గృహ్యతాం స్వామిన్। త్వమిదం తే మయార్పితం
శ్రీమత్ ॥ ధూపమాఘ్రాపయామి.

2 వహ్ని నాయోజితం సాధ్యం। దీపం వర్తి త్రయాన్వితం
గృహాణ జ్ఞాన తిమిర। హరజ్ఞాన ప్రవర్ధనం ॥
శ్రీమత్ ॥ దీపం దర్శయామి.

30 గురు పరంపరాది

1 జీయర్ స్వామి తనియన్
వేదాన్త ద్వయ తత్త్వజ్ఞం - మంత్రమంత్రార్థదం గురుం
శ్రీమన్నారాయణాచార్య - రామానుజయతిం భజే ॥

2 జయంతి తనియన్
ఉత్తరాభాద్ర నక్షత్రే - శ్రావణే సౌమ్యవత్సరే
ఆవిరాసీ ద్గురు శ్రీమా న్నారాయణ యతీశ్వరః.

3 శ్రీ చిన్న జీయర్ స్వామి వారి తనియన్ (పాదుకలు శిరమున దాల్చి)
దుర్ముఖ్యబ్దే తౌళి శుక్ల - ప్రథమే స్వాతిభే శుభే.
ప్రాదుర్భూతం గురుం వన్దే - శ్రీమన్నారాయణం మునిమ్॥.
నారాయణార్య యతిశేఖర పాద భక్తం.
గోపాల దేశిక వరాప్త సమస్త బోధమ్ ।.
శ్రీజానకీశ చరణార్పిత మానసాబ్జం.
నారాయణార్య యతివర్య మహం ప్రపద్యే ॥
కాశ్యపాన్వయ సంజాతం - నారాయణ పదాశ్రితం ।.
శ్రీమన్నారాయణం వన్దే - యతీశ్వర శ్రియా జుషమ్ ॥

4 వాక్య గురు పరంపర
శ్రీమన్నారాయణ రామానుజ యతిభ్యో నమః
ఓమ్ అస్మద్గురుభ్యో నమః
ఓమ్ అస్మత్పరమ గురుభ్యో నమః
ఓమ్ అస్మత్సర్వ గురుభ్యో నమః
ఓమ్ శ్రీమతే రామానుజాయ నమః
ఓమ్ శ్రీ పరాంకుశ దాసాయ నమః
ఓమ్ శ్రీమద్యామున మునయే నమః
ఓమ్ శ్రీరామ మిశ్రాయ నమః
ఓమ్ శ్రీపుణ్డరీకాక్షాయ నమః
ఓమ్ శ్రీమన్నాథమునయే నమః
ఓమ్ శ్రీమతే శఠకోపాయ నమః
ఓమ్ శ్రీమతే విష్వక్సేనాయ నమః
ఓమ్ శ్రియై నమః । ఓమ్ శ్రీధరాయ నమః

5 1 శ్లోక గురు పరంపర ఆరోహణక్రమము భక్తినివేదన 5/2000=31
2 అస్మద్దేశిక, మస్మదీయ పరమాచార్యా, నశేషాన్ గురూన్।
(అస్మద్దేశికం, అస్మదీయ పరమాచార్యాన్, అశేషాన్ గురూన్)

3 శ్రీమల్లక్ష్మణ యోగిపుంగవ, మహాపూర్ణౌ, మునింయామునం,
4 రామం, పద్మవిలోచనం, మునివరం నాథం, శఠద్వేషిణం,
5 సేనేశం, శ్రియ, మిందిరా సహచరం నారాయణం సంశ్రయే॥

1 శ్లోక గురు పరంపర - అవరోహణ క్రమం

భక్తినివేదన 5/2000=39

2 శ్రీశం మాంచ, చమూపతిం, శఠరిపుం నాథం, సరోజేక్షణం,
3 రామం, యాముక పూర్ణదేశిక యతీన్ గోవింద కూరాధిపౌ
4 భట్టార్యం నిగమాంతయోగి కలిజిత్ కృష్ణాన్ జగద్దేశికం
5 శ్రీశైలేశ గురు సదా మునివరం శ్రీసౌమ్య జామాతరమ్.

1 నిన్దితాచార కరణం । నివృత్తం కృత్య కర్మణః ।
పాపీయాంస మమర్యాదం । పాహి మాం వరద ప్రభో ॥
2 త్వమేవ మాతా చ పితాత్వమేవ। త్వమేవ బన్ధుశ్చ గురుః త్వమేవ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ। త్వమేవ సర్వం మమ దేవదేవ॥
3 కాశ్యపాన్వయ సంజాతం । కల్యాణ గుణ సాగరం
కాంక్షితార్థప్రదం వన్దే । కృష్ణమార్యం గురూత్తమం ॥

31 యదృచ్ఛయా శ్రుతో మంత్రః । ఛన్నేనాఽథ ఛ్ఛ లేనవా ।
పత్రేక్షితో వా వ్యర్థ స్స్యాత్ । ప్రత్యుతాఽనర్థదో భవేత్ ॥

తా:- మరియొకనికి చెప్పునపుడు వినిగాని, మోసము చేసిగాని, కాగితమును చూచి నేర్చుకొనిగాని, జపించిన మంత్రము వ్యర్థమగుటయే గాక కీడును గూడ కలిగించును.

ఆచార్య ముఖతః సక్రమముగ ఉపదేశమును పొందినట్టినది మాత్రమే మంత్రమగును. అట్టిది మాత్రమే రక్షించును. గురుపరంపర

తులసిమాలిక యొక్క పూసలను ముందు ప్రతిష్ఠ జేసి పిమ్మట మాత్రమే ఆ మాలికలనుపయోగించవలెను. బజారులోకొన్న మాలికలను నూనె, గోమయము, పసుపులలో చాలాకాలముంచి అందుండి తీసిన తర్వాత మంచినీళ్ళలో కడిగి పిమ్మట ప్రతిష్ఠ చేసి పిమ్మట ఉపయోగించవలెను. జపము చేసుకొను మాలను మెడలో వేసుకొనరాదు. మెడలో ధరించిన మాలతో జపము చేయరాదు. వాటికై

ప్రత్యేకముగా వేరే మాలికను ఉపయోగించవలెను. మాలికకు గల మేరుపూసను దాటకుండగ లెక్కపెట్టవలెను. మాలికతో ఒక ఆవృత్తి అయిన తర్వాత తిరిగి మాలికను వెనుకకు త్రిప్పి మాత్రమే జపము చేయవలెను. లెక్కపెట్టునపుడు తర్జన (చూపుడు)వ్రేలు నుపయోగించరాదు. జపమును పైకి అందరికిని వినిపించునటుల గట్టిగా చేసినదానికంటె, పెదిమలు కలుపుచు తనకు మాత్రము వినిపించునటుల జపము చేయుటయును ఉపాంశువుగ జేయుట శ్రేష్ఠము. ఈ విధానము కంటెను మానసికముగ జపమాచరించుట సర్వోత్తమము.

నా.అ.మం.వై-4

## 32 నారాయణ అష్టాక్షరీ మంత్ర మాహాత్మ్యము

**ద్వే బ్రహ్మణీ వేదితవ్యే శబ్దబ్రహ్మ పరం చ తత్ ।**
**శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరబ్రహ్మాధి గచ్ఛతి ॥**

బ్రహ్మకు రెండు రూపములు : ఒకటి శబ్ద బ్రహ్మము, రెండవది పర బ్రహ్మము. శబ్ద బ్రహ్మ యందలి నిష్ఠయే పరబ్రహ్మను పొందుటకు సాధనము. అట్టి శబ్ద బ్రహ్మయే మంత్రమనబడును. నారాయణ అష్టాక్షరీ మంత్రమాహాత్మ్యము -1

విష్ణుదేవతాకమైన మంత్రములను ఇంటిలో జపము చేయుట కంటెను, గోశాలలో జపము చేసినచో పదిరెట్లు హెచ్చు ఫలితము కలుగును. గోశాల కంటెను వనము : వనము కంటె జీవనదియొడ్డు : దానికంటెను సముద్రతీరము, దానికంటెను మర్రిచెట్టు క్రింద కాని, అశ్వత్థవృక్షము క్రిందగాని, దానికంటెను విష్ణ్వాలయము - దానికంటెను విష్ణుదేవతాకమైన పర్వత శిఖరము శ్రేష్ఠము. నా.అ.మం.మా-2

**శ్రుతి॥ "యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ॥** (తైత్తరీయో)

భగవంతుని గురించి వేదపురుషుడే వాక్కుతో చెప్పజాలక పోయెను. మనస్సుతో ఊహించజాలకపోయెను. అందుచే వేదవాక్కులు మనస్సుతో సహా ఆ భగవద్వర్ణనమునుండి విరమించుకొనవలసి వచ్చెను. గనుకనే శ్రీరంగరాజ స్తవములో

**"ఆస్తాం తే గుణరాశివత్ గుణపరీవాహాత్మనాం జన్మనాం పంఖ్యా"**

"ఓ శ్రీరంగనాయకా! నీయొక్క కల్యాణగుణములు అనంతములైనవి.

అటులనే ఆ కల్యాణ గుణములను ప్రకాశింపజేయునట్టి నీయవతార విశేష ములు సంఖ్య కూడా అనంతమైనది" అని భట్టరువారు వర్ణించిరి.

నా.అం.మం.మహాత్మ్యము 6

శ్రీరామాయణము అయోధ్యకాండలో 2సర్గ 25 శ్లోకమున

**"భహవో నృపః కల్యాణ గుణాః పుత్రస్య సంతి తే ॥**

"ఓ దశరథ మహారాజా! నీ కుమారుడైన శ్రీరామునికి అసంఖ్యేయములైన కల్యాణ గుణములు గలవు" అని ప్రజలు వర్ణించిరి.

గీత 4/5 - **"బహూనిమే వ్యతీతాని జన్మాని తవ చార్జున"॥**

అని స్వయముగా భగవంతుడే భగవద్గీతయందు తన యవతారములు అసంఖ్యే యములని తెలిపియున్నాడు.

ఇట్టి పరిమితమైన భగవత్స్వరూప స్వభావములను ప్రతిపాదించు మంత్ర ములు అవ్యాపక మంత్రములనబడును. ఇవి పరిమిత శక్తివంతములు, రామ, కృష్ణ, నరసింహ, హయగ్రీవ, గోపాల ఇత్యాది మంత్రములన్నియు అవ్యాపక మంత్రవర్గములోనివి. నా.అ.మం.మహాత్మ్యము - 7

వ్యాపక మంత్రములు. శ్రుతి **'తస్య యజు రేవ శిరః'**

అన్ని వేదములలో శిరోభూషణమైనది యజుర్వేదము. అందు తైత్తరీయారణ్య కమను అరణ్యమున నారాయణానువాక మనెడు వృక్షమునకు పుష్పము వంటి మంత్రపుష్పమున పరిమళభాగమగు నారాయణ గాయత్రి కలదు.

**"నారాయాణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి**

**తన్నో విష్ణుః ప్రచోదయాత్ " అనునదియే ఆ గాయత్రి.**

తా:- శ్రీమన్నారాయణుడే మాకు సర్వకాలములయందు సేవింపబడువాడు. అతడే మమ్మందరిని రక్షించువాడు. యాతడే మాకు పూజ్యుడగుచున్నాడు.

తా.2:- శ్రీమన్నారాయణుని మేము తెలిసికొందుము. శ్రీవాసుదేవుని మేము ధ్యానించెదము. ఆ విష్ణువు (వ్యాపకస్వరూపుడగు పరమాత్మ) మమ్ములను (దృఢాపరోక్షజ్ఞానమునకై) ప్రేరణ చేయుగాక.

3. ఈ నారాయణ గాయత్రిలో మూడు మంత్రములు కూర్చబడియున్నవి. ఒకటి నారాయణాష్టాక్షరి. రెండవది వాసుదేవద్వాదశాక్షరి. మూడవది విష్ణుషడక్షరి.

ఈ మూడు మంత్రములును వ్యాపక మంత్రములనబడును.
నారాయణ మంత్రమునే అష్టాక్షరి యని, మూలమంత్రమని, తిరుమంత్రమని యందురు.

'నారాయణ' యని ఒకనికి పేరుగా పెట్టుకొని పిలిచిన గాని, పరిహసించుటకు వాడినగాని, ఊతపదముగ వాడినగాని, దీనిచే నొకని నవమానపరచుటకు వాడినగాని, ఏ విధముగా దీని ననుసంధించినను సమస్త పాపములను నశింప జేయునని భాగవత విష్ణు పురాణాది ప్రబంధముల యందు ప్రతిపాదింపబడినది.

అధర్వశిరోపనిషత్తు : "ఓ మి త్యేకాక్షరం నమ ఇతిద్వే అక్షరే నారాయణా యేతి పంచాక్షరాణి ఏతద్వై నారాయణస్యా ౭ ష్టాక్షరం" పదం

మొదట ప్రణవమును (ఒక అక్షరము) పిమ్మట "నమః" పదమును (రెండు అక్షరములు) అటుపిమ్మట "నారాయణాయ" అను పదము (అయిదు అక్షరములు)ను పలుకవలెను. ఇటుల మొత్తము యీ మంత్రము ఎనిమిది అక్షరములు గలది.

హారీతస్మృతియందు చెప్పబడునటుల సమస్త వేదములు, ఇతిహాసములు, పురాణములు, వేదవేదాంతపారంగతులైన మహాత్ములు, మునులున్ను సారాం శముగ తెలుపునట్టి అర్థపంచకమనబడు

1. పొందబడునట్టి పరమాత్మను గూర్చి జ్ఞానము,
2. పొందునట్టి జీవుని గురించిన జ్ఞానము,
3. పరమాత్మను పొందుటకు సాధనమును గూర్చిన జ్ఞానము,
4. తత్ప్రాప్తికి ఫలమును గూర్చిన జ్ఞానము,
5. అందులకు విరోధులైన వాటిని గూర్చిన జ్ఞానము.

అనునీయైదు జ్ఞానములను విశదముగను, సులభముగను తెలుపు నదగుటచేతను, "అష్టాక్షరీ మంత్రము యొక్క సిద్ధి మాత్రముచే వ్యాధులుగాని, ఆధ్యాత్మిక, అధిదైవిక, అధిభౌతిక బాధలుగాని, కరువులుగాని, అతివృష్టి అనా వృష్టులుగానిఏమియు నుండజాలవు" అని తెలుపబడియుండుట చేతను, మంత్రములన్నిటికంటెను ఈయష్టాక్షరీ మంత్రమొక్కటియే సర్వశ్రేష్ఠమైనదై దీనికి మించిన ప్రభావము కలదిగాని, దీనికి మించిన శక్తివంతమైనదిగాని, దీనికి మించిన వైభవము కలదిగాని వేరొకటి లేదు.

కావునవీ యష్టాక్షరీ మంత్రమే అందరకును ఉపదేశార్హమైనది. అందరకును అచరింపతగినది. అన్ని యాపత్తులను పోగొట్టునది. విశ్వ కల్యాణము సమ కూర్చునది. ॥

**అర్తా విషణ్ణా శ్శిథిలా శ్చ భీతాః ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః,**
**సంకీర్త్య నారాయణ శబ్దమాత్రం విముక్త దుఃఖా స్సుఖినో భవంతి ॥**

అర్తులేగాని, దుఃఖితులేగాని, శిథిల మనస్కులేగాని, భయగ్రస్తులేగాని, ఘోరమైన వ్యాధులచే బాధపడువారలేగాని "నారాయణ" అను కేవల శబ్దమాత్ర మునే కీర్తించినచో అన్నిదుఃఖముల నుండియు విముక్తులగుదురు. సుఖుల గుదురు.

**'ఓం నమో నారాయణాయేతి - మంత్రోపాసకో వైకుంఠభువనం గమిష్యతి'**

నారాయణాష్టాక్షరీ మంత్రమును ఉపాసించువాడు శ్రీ వైకుంఠమును బొందగలడు.

మేలుకొనియున్నను, నిద్రబోవుచున్నను కూడ "నమో నారాయణ" అని అనుచుండవలయును. తినునట్టి వస్తువులనేగాని, త్రాగునట్టి వస్తువులనేగాని, నాకునట్టి వస్తువులనేగాని, "నమో నారాయణ" అని ఎవడైతే స్పృశించి అభి మంత్రించి భుజించునో అట్టివాడు పరమపదమును పొందును.

నారాయణుని మాత్రమే ఎపుడైనను స్మరించవచ్చును. ఇతర దేవతలను అశుచిగా యుండినపుడు స్మరించరాదు. ఏలనన నారాయణుడు తానే మనకు శుచిత్వమిచ్చును. ఇతర దేవతలన్నవో మన శుచిత్వముపై ఆధారపడి యుందురు. 18

ఉపాసకుడైనవాడు గురువు వలన ఉపదేశమును బొంది, వారిని ధ్యానించి ప్రతిదినమును ఈ అష్టాక్షరీ మంత్రమును ఎనిమిదివేల పర్యాయములు జపానుష్ఠానము చేయవలెను.నారాయణ అష్టాక్షరీ మంత్ర మాహాత్మ్యము. 1,6,7,8,9,11,15,18

## 33 నారాయణోపనిషత్

**సహనావవతు - ఇతి శాంతిః**

**ప్రథమః ఖండః - (నారాయణాత్ సర్వచేతనా చేతన జన్మ)**

**మంత్రం : అథ పురుషోహవైనారాయణో ౭ కామయత । ప్రజాః సృజేయేతి। నారాయణాత్ ప్రాణో జాయతే ॥ మనః సర్వేంద్రియాణి చ। ఖం**

**వాయుర్జ్యోతిరాపః ॥ పృథివీ విశ్వస్యధారిణీ । నారాయణాద్బ్రహ్మా జాయతే॥ నారాయణాత్ రుద్రో జాయతే । నారాయణా దింద్రో జాయతే । నారాయణాత్ ప్రజాపతయః । ప్రజాయన్తే నారాయణాత్ ద్వాదశాదిత్యా రుద్రావసవస్సర్వాణి చ చందాగ్ంసి నారాయణాదేవ సముత్పద్యంతే । నారాయణే ప్రవర్తన్తే నారాయణే ప్రలీయన్తే॥ ఏతదృగ్వేదశిరో ఽధీతే ॥**

తా: సృష్ట్యాదిని పరమపురుషుడగు నారాయణుడు ప్రాణుల సృజింపదలచెను. అపుడు సమష్టి (సమష్టి అనగా సమస్తమని అర్థము) సూక్ష్మ స్వరూపియగు హిరణ్యగర్భుడు పుట్టెను. పిదప ఆకాశము, వాయువు, అగ్ని, జలము, ఈ భూమియు పుట్టినవాయెను. ఇటుల నారాయణుని నుండియే బ్రహ్మదేవుడు జన్మిం చెను. నారాయణుని నుండియే రుద్రుడు, ఇంద్రుడు, మరీచి, కశ్యపుడు మున్నగు ప్రజాపతులు, ద్వాదశాదిత్యులును, ఏకాదశరుద్రులును, అష్టవసువు లును, సకల వేదములును ఆవిర్భవించినవి. ఇట్లు సకల చరాచరములును నారాయణు నుండియే ఉత్పన్నములగుచున్నవి. కడకు నారాయణునియందే ఇవియన్ని యును లయమగుచున్నవి. (మోక్షము గలుగు పర్యంతము సకల జీవులును ఇట్లు మరల మరల జనన మరణములను బొందుచునే యుండును. ఇది సృష్టి తత్త్వము) నారాయణ అష్టాక్షరి మంత్ర మహాత్మ్యము 40

## 2 ద్వితీయః ఖండః (నారాయణస్య సర్వాత్మత్వమ్)

**మం : అథ నిత్యో నారాయణః। బ్రహ్మానారాయణః। శివశ్చ నారాయణః॥ శక్రశ్చ నారాయణః । ద్యావా పృథివ్యోచ నారాయణః। కాలశ్చ నారాయణః। విదిశశ్చ నారాయణః । ఊర్ధ్వం చ నారాయణః । అధశ్చ నారాయణః। అంతర్బహిశ్చ నారాయణః । నారాయణ ఏవేదగ్ం సర్వం। యద్భూతం యచ్చ భవ్యం॥ నిష్కళంకో నిరంజనో నిర్వికల్పో నిరాఖ్యాతః। శుద్ధో దేవ ఏకో నారాయణో న ద్వితీయో ఽస్తి కశ్చిత్। య ఏవం వేద స విష్ణురేవ భవతి స విష్ణురేవ భవతి. ఏ తద్యజుర్వేద శిరో ఽధీతే ॥**

తా: నారాయణ డొక్కడు మాత్రమే జనన మరణాది రహితుడై శాశ్వతమై యున్నాడు. మూల తత్త్వమును బట్టి పరిశీలించి చూచినచో బ్రహ్మ నారా యణుడే, శివుడును నారాయణుడే, ఇంద్రుడును నారాయణుడే, భూమ్యా

కాశములు నారాయణుడే. కాలతత్త్వము నారాయణుడే. దశదిశలు నారాయణుడే. ఊర్ధ్వభాగము నందున్నదెల్ల నారాయణుడే. భూమికి క్రింది భాగము నందున్నదెల్ల నారాయణుడే. లోపలను వెలుపలను ఉన్నదంతయూ నారాయణ స్వరూపమే. మధ్య భాగమున నున్నదియు ఈ దశదిశల నుండునదంతయును నారాయణ స్వరూపమే. భూతభవిష్యద్వర్తమాన కాలములలో ఏదిఏదిగలదో అదియెల్ల నారాయణస్వరూపమే. నా.అ.మం.మహాత్మ్యము-40

నిర్గుణ బ్రహ్మతత్త్వము : అవయవరహితుడును, మాయకతీతుడును, మార్పునొందువాడును, వాక్కుద్వారా నిర్వచింపనలవి కానివాడును, శుద్ధుడును, అద్వితీయుడునై, దేవుడగు నారాయణుడు ప్రకాశించుచున్నాడు. పరమార్థతః అతడొక్కడే కలడు. రెండవదేదియును లేదు (వానికి భిన్నముగా ఏదియులేదనియర్థము.) ఈవిషయమును ఎవడు అనుభవ పూర్వకముగా గుర్తించుచున్నాడో అతడు విష్ణువేయగుచున్నాడు. (సమస్తము విష్ణుమయమని యెరిగినవాడు తానును విష్ణువే యగునని అర్థము) ఆ భగవత్తత్త్వానుభవము ద్వారా పరమ శ్రేయస్సును గూర్చి శ్రీఅష్టాక్షరీ మహామంత్రోపదేశము చేయబడుచున్నది.

## 3 తృతీయః ఖండః (నారాయణాష్టాక్షర మంత్రః)

**మం॥ ఓ మిత్యగ్రే, వ్యాహరేత్ । నమ ఇతి పశ్చాత్ । నారాయణాయేత్యుపరిష్టాత్ । ఓ మిత్యేకాక్షరమ్। నమ ఇతి ద్వే అక్షరే। నారాయణాయేతి పంచాక్షరాణి । ఏ తద్వై నారాయణస్యాష్టాక్షరం పదమ్ । యోహ వై నారాయణస్యాష్టాక్షరం పదమధ్యేతి । అనపబ్రువః । సర్వమాయురేతి । విందతే ప్రాజపత్యగ్ం రాయస్పోషం గౌపత్యం తతోఽమృతత్వమశ్నుతే. తతోఽమృతత్వ మశ్నుత॥ ఇతి॥ య ఏవం వేద. ఏతత్సామవేదశిరోఽధీతే ॥**

తా॥ మొదట "ఓం" అని ఉచ్చరింపవలెను. ఆతరువాత "నమో" అని ఉచ్చరింపవలెను. తరువాత "నారాయణాయ" అని ఉచ్చరింపవలెను. 'ఓం' అను అక్షరము ఒకటి, "నమో" అను అక్షరములు రెండు, "నారాయణాయ" అను అక్షరములు ఐదు. ఇదియే 'శ్రీ నారాయణాష్టాక్షర'మహామంత్రము. ఎనిమిది అక్షరములు గల యీ మంత్రమును ఎవడైతే భక్తిశ్రద్ధలతో అత్యంత ప్రీతితో, అత్యధిక విశ్వాసముతో స్మరణము చేయుచున్నాడో అతడు దీర్ఘాయుష్యము గల వాడగును.

ప్రజాపతిత్వమును బ్రహ్మపదవిని అలంకరించుచున్నాడు. స్వర్గాధిపత్యమును బొందుచున్నాడు. ధనధాన్యాది ఐశ్వర్య సంపన్ను డగుచున్నాడు. (ఇది వాని వాని అర్హతననుసరించి యేర్పడెడి సకామోపాసనా ఫలము) ఎవడు నిష్కామ భక్తితో ఈ మంత్రమును స్మరణ చేయుచున్నాడో అతడీ ఉపాసనా బలముచేత మోక్షమును బడయుచున్నాడు. ఎవ్వడు దీనిని ఎరుగునో (ఎరిగి అచరించు చున్నాడో) అతడు మోక్షమును బడయుచున్నాడు. నారాయణోపనిషత్తు

**4 చతుర్థః ఖండః (నారాయణ ప్రణవః)**

**మం॥ ప్రత్యగానందం బ్రహ్మ పురుషం ప్రణవస్వరూపమ్ । అకార ఉకారో మకార ఇతి। తానేకధా సమభవ(ర)త్తదేతదోమితి। యముక్త్వా ముచ్యతే యోగీ జన్మ సంసార బంధనాత్ । ఓం నమో నారాయణాయేతి మంత్రోపాసకో (క) వైకుంఠ భువనలోకం గమిష్యతి । తదిదం పరం పుండరీకం విజ్ఞాన ఘనం । తస్మాత్తటిదాభమాత్రమ్. బ్రహ్మణ్యో దేవకీపుత్రో బ్రహ్మణ్యో మధుసూదన ఇతి । సర్వ భూతస్థమేకం. వై నారాయణం కారణపురుష మకారణకం పరం బ్రహ్మోమ్। ఏతదథర్వ శిరో ఽ ధీతే॥** 40. నా.అ.మం. మహాత్మ్యము నారాయణోపనిషత్తు

తా॥ "అ, ఉ, మ" అను నీమూడక్షరములు కలిపి "ఓం" అగుచున్నది. ఈ ప్రణవమునకు అర్థమగు పరబ్రహ్మ ప్రత్యక్కును అనందస్వరూపుడును నైయున్నాడు.(ప్రత్యక్కు అనగా ఈ సమస్త దృశ్యవర్గమున కంటెను స్వరూప స్వభావములచేత వేరుగా నుండువాడని అర్థము.) పైన దెలిపిన ప్రణవమును అర్థయుక్తముగా ఏ యోగియైతే స్మరణ చేయుచున్నాడో అతడు జనన మరణాది బంధము నుండి విడివడుచున్నాడు. " ఓం నమో నారాయణాయ" అను ఈ మంత్రమును ఉపాసించువాడు ప్రకాశవంతమగు వైకుంఠలోకమును లభింపజేసికొనుచున్నాడు. సర్వవ్యాపకమగు ఆ పరబ్రహ్మ ఈ హృదయ పుండరీకమందును విజ్ఞాన ఘనమై అంతర్యామిగా, అంతరాత్మగా ప్రకాశించు చున్నది. అయ్యది (బుద్ధి వృత్తుల సంధులలోను, శబ్దముల సంధులలోను, రూపముల సంధులలోను) మెరుపువలె మెరసి మరుగుపడుచున్నది. పరమ పురుషుడగు నా నారాయణుడు బ్రహ్మణ్యుడు, వేదము, తపస్సు, జ్ఞానము - ఇవి గలవారికి హితమును గూర్చువాడు. ఆ బ్రహ్మణ్యుడు, దేవకీపుత్రుడు,

మధుసూదనుడు, భక్తులకానందము గల్గించువాడు, స్వరూపజ్ఞానము ద్వారా అజ్ఞానమును పారద్రోలి కర్మబంధమును విచ్ఛిన్నము చేయువాడు. ఆబ్రహ్మ స్తంభ పర్యంతము సమస్త భూతములయందును ఒక్కడే నారాయణుడంత ర్యామియై వెల్గొందుచున్నాడు. పరబ్రహ్మమగు అతడే సర్వవ్యాపియై ఈ కనబడు సర్వమునకు కారణమై తనకు వేరొక కారణమేదియు లేనివాడై యున్నాడు.

**మం: ఏతదథర్వశిరో యోఽధీతే ప్రాతరధీయానో రాత్రికృతం పాపం నాశయతి । సాయమధీయానో దివసకృతం పాపం నాశయతి । మాధ్యంది న మాదిత్యాభిముఖోఽధీయానః పంచపాతకోప పాతకాత్ప్ర ముచ్యతే। సర్వవేద పారాయణపుణ్యం లభతే । నారాయణ సాయుజ్య మవాప్నోతి। య ఏవం వేద ఇత్యుపనిషత్ ॥**

తా: నాలుగు వేదములకును శిరస్సు అగు ఈ ఉపనిషత్తును ఎవడు ప్రాతః కాలమున పారాయణ చేయునో, అతడు అజ్ఞానవశమున రాత్రియందొనరించిన పాపమును నశింపజేసికొనుచున్నాడు. ఎవడు సాయంకాలమున దీనిని పారయణ చేయునో అతడు పగటియందు చేసిన పాపమును నశింపజేసి కొనుచున్నాడు. మధ్యాహ్నకాలమున సూర్యునకు అభిముఖముగానుండి యెవడు దీనిని పారాయణము చేయునో, అతడు పంచమహాపాతకములను, ఉప పాతకములను పరిహరింప జేసికొనుచున్నాడు. ఈ నారాయణ ఉపనిషత్తులు పారాయణము చేయువాడు నాలుగు వేదములను పారాయణము చేసిన పుణ్యమును లభింపజేసికొనుచున్నాడు. మరియు నీయుపనిషత్పారాయణ పరుడు అంతిమ దశయందు నారాయణ సాయుజ్యమును బడయుచున్నాడు. ఎవడు దీనిని ఎరుగునో (ఎరిగి అట్లు మెలగునో) అతడు నారాయణ సాయుజ్య మును బడయుచున్నాడు. ఇట్లు ఉపనిషత్తు చెప్పుచున్నది.

నారాయణ అష్టాక్షరీ మంత్ర మహాత్మ్యము-40 మరియు నారాయణోపనిషత్తు 191 (8 పుస్తకముల సంపుటి)

**ఓం నారాయణాయ విద్మహే । వాసుదేవాయ ధీమహి।**
**తన్నో విష్ణుః ప్రచోదయాత్ ॥ నారాయణ గాయత్రి మంత్రము.**
**ఓం సహనా వవతు । సహనౌ భునక్తు । సహ వీర్యం ।**
**కరవావహై । తేజస్వి నావధీతమస్తు । మా విద్విషావహై ॥**
**ఓం శాంతిః శాంతిః శాంతిః**

## 34 శ్రీమదష్టాక్షరీ మహామంత్ర జప విధానము

(తలపై ఆచార్య పాదాలైన తిరువడి వస్త్రాన్ని ధరించి మంత్రం, గురుపరంపర మూడు మంత్రములు జపించాలి).

**"అఖిల భువన జన్మస్థేమ భంగాదిలీలే**
**వినత వివిధభూతవ్రాత రక్షైక దీక్షే।**
**శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే**
**భవతుమమ పరస్మిన్ శేముషీ భక్తి రూపా"**
**శ్రీమన్నారాయణ। అశరణ్య శరణ్య। అనన్య శరణః**
**త్వత్పాదారవింద యుగళం శరణ మహం ప్రపద్యే.**

అష్టాక్షరీ మంత్ర జపము ప్రారంభించుటకు పూర్వము, రెండు పర్యాయములు ఆచమనమున్ను, మూడు ప్రాణాయామములున్ను చేయదగును.

**అస్మద్గురుభ్యో నమః**
**శ్రీమతే రామానుజాయ నమః**
**శ్రీమతే నారాయణాయ నమః**

శ్రీమన్నారాయణ అష్టాక్షరీ మా.మ - 41

## 35 శ్రీమదష్టాక్షరీ మంత్ర జప లఘు విధానము

స్నాన సంధ్యాది నిత్యానుష్ఠానానంతరము, పాణిపాద శుచిర్భూతుడై అతి మనోహరమైన, ఏకాంతమైన, నిర్భయ స్థలమున, నిశ్శబ్దవాతావరణమున, సమతల ప్రదేశమున, స్వగృహమున దర్భాసనముపై జింక చర్మము, ఆపైన తెల్లని వస్త్రమును పరచి, దానిపై సుఖాసీనుడై (పద్మాసనము) తూర్పు ముఖముగాని, ఉత్తరాభిముఖముగా గాని కూర్చుండి జపము ప్రారంభింప దగును. పద్మాసనములో కూర్చుని ఎడమ అరచేయిపై కుడి అరచేయి నుంచి ధ్యానము చేయదగును. అంగన్యాస, కరన్యాసానంతరము. గీత 6/11

**1 "కృతం చ కరిష్యామి భగవన్నిత్యేన**
**భగవత్ప్రీ త్యర్థేన మహా విభూతి చాతురాత్మ్య**

**భగవద్వాసుదేవ పాదారవిందార్చనేన,**
**అష్టాక్షరీ మంత్ర జపేన, భగవత్కర్మణా,**
**భగవన్తం వాసుదేవ మర్చ యిష్యామి "**

**2 "భగవతే బలేన, భగవతో వీర్యేణ,**
**భగవత స్తేజసా, భగవతః కర్మణా,**
**భగవతః కర్మ కరిష్యామి, భగవతో వాసుదేవస్య".**

శ్రీపాద తీర్థమును తీసికొనవలయును.

శ్రీపాద తీర్థమును తీసుకొను విధానము.

మద్గురువరేణ్యులు శ్రీశ్రీశ్రీ జీయర్ స్వామివారి వివరణ.

**1. ప్రశ్న : శ్రీపాద తీర్థం, అష్టాక్షరీ మంత్రానికి ముందు తీస్కోవాలా, తర్వాతనా ? సాయంకాలం, చరమ శ్లోకం, తీర్థం తీస్కోవాలా ?**

శ్రీవారి ఉవాచ : ఉదయము స్నానమెప్పుడు చేస్తే, అపుడే, బొట్టు పుండ్రం ధరించాలి. తీర్థం (కణికతో) కలిపి పెట్టుకోవాలి. తలపై ఆచార్యపాదాలైన తిరువడి వస్త్రాన్ని ధరించి మంత్రం, గురుపరంపర, 3 మంత్రాలు జపించాలి. ఆపై కలిపియున్న శ్రీపాదతీర్థం తీస్కోవాలి. ఆపై తిరుమంత్రం కొంతసేపు జపించాలి. తర్వాత పూజాదులు చేస్కొని ప్రసాదం తీస్కొని మనమన పనులకు వెళ్ళాలి. ఈ పద్ధతి ఒకసారే చేస్తేచాలు. ఆ తర్వాత రోజంతా ద్వయమంత్రాన్ని అనుసంధించుకొంటూ ఉండవచ్చు. చరమ శ్లోకార్థాన్ని ఎప్పుడూ తలచుకోవాలి. రాత్రి స్నానానంతరం ఇక శ్రీపాదతీర్థం ఇత్యాదులు అవసరం లేదు. ఆరాధన మాత్రం రెండుపూటలా చేస్కోవాలి. రాత్రి ఆలస్యమైనా పర్వాలేదు.

**భక్తి నివేదన 9/2001=30వ పేజి**

**2. ప్రశ్న : శ్రీపాద తీర్థం ఎన్నిసార్లు, ఏం చదువుతూ తీసుకోవాలి ? చరమ శ్లోకం ఎలా ఎన్నిసార్లు జపించాలి ?**

**శ్రీవారి ఉవాచ :** ఆచార్య శ్రీపాదతీర్థాన్ని సమాశ్రితులు రెండుసార్లు ఆచార్యులను స్మరింపజేసే శ్లోకాలను చదువుకొంటూ తీస్కోవాలి. చరమ శ్లోకం ఒక్కసారి

జపించితే చాలు. కాని దాని అర్థం మాత్రం అనుక్షణమూ స్మరించుకోవడం అవసరం. ఏ పని మనం చేస్తున్నా అది భగవంతుడు ఇచ్చిన శక్తితో మాత్రమే జరుగుతోంది కనుక, ఫలితాన్ని అతని శ్రీపాదాల వద్దే సమర్పిస్తున్నా. దీని లాభ నష్టాలతో నాకేమీ సంబంధం లేదు. నీ దయ అని విశ్వాసంతో భగవదర్పణ బుద్ధితో జీవితాన్ని సాగించడమే కదా చరమశ్లోకతాత్పర్యం. అలాంటి వారి బాధ్యత తావే వహిస్తానని ప్రతిజ్ఞ చేసాడు. అదే అతనికి జ్ఞాపకం చేస్తూంటా మన్నమాట.

భక్తినివేదన 8/2003=23

శ్రీభగవదనుజ్ఞయా భగవత్ప్రీత్యర్థం, భగవద్భాగవతాచార్య కైంకర్యరూపం, శ్రీమదష్టాక్షరీ మహామంత్రజపం కరిష్యే. అంగుష్ఠ, అనామికలతో జలమును తాకదగును.

3 అస్య శ్రీమదష్టాక్షర మహామంత్రస్య బదరికాశ్రమవాసీ అంతర్యామీ శ్రీమన్నారాయణ ఋషిః దేవీ గాయత్రీ ఛందః.

4 పరమాత్మా భగవాన్ శ్రీమన్నారాయణో దేవతా, శ్రీరధిష్ఠాన దేవతా అం(ఓం) బీజం, అయ శక్తిః, మం కీలకం.

5 శ్రీం హ్రీం కవచం, ఐం అస్త్రం, బుద్ధి స్తత్వం, శుక్లాదిర్వర్ణః ఉదాత్తాది స్స్వరః శ్రీవైకుంఠ క్షేత్రం

6 జీవ పరమాత్మనోః స్వస్వామి భావ స్సంబంధః శ్రీమన్నారాయణ ప్రీత్యర్థే జపే వినియోగః అష్టాక్షరీ మంత్రేణ అంగుళ్యగ్ర్య మారభ్య బాహుమూల పర్యంతం త్రివారం స్పర్శన ద్వారా హస్తౌ విశోధ్య అథ న్యాసం కృత్వా.

ఓం ఓం అంగుష్ఠాభ్యాం నమః
ఓం నమః తర్జనీభ్యాం నమః
ఓం నారాయణాయ మధ్యమాభ్యాం నమః
ఓం ఓం అనామికాభ్యాం నమః
ఓం నమః కనిష్ఠికాభ్యాం నమః

ఓం నారాయణాయ కరతల కరపృష్ఠాభ్యాం నమః
ఓం ఓం జ్ఞానాయ హృదయాయ నమః
ఓం నమః ఐశ్వర్యాయ శిరసే స్వాహా,
ఓం నారాయణాయ శక్త్యై శిఖాయై వౌషట్,
ఓం ఓం బలాయ కవచాయ హుమ్
ఓం నమః తేజసే నేత్రాభ్యాం వౌషట్
ఓం నారాయణాయ వీర్యాయ అస్త్రాయ ఫట్.

అస్త్రమంత్రేణ దశదిగ్బంధః అథవా సబిందుకైర్మంత్రాక్షరైరష్ట. దిగ్బంధః ప్రణవేన ఊర్ధ్వాధో దిగ్బంధః॥ అథ కర ద్వయేన అష్టాక్షరం చక్రం కృత్వా ఆత్మనః ప్రాదక్షిణ్యేన॥ "సుదర్శనాయహేతిరాజాయ నమః" (అని చక్రముద్రతో మూడుసార్లు త్రిప్పిన రక్షామయమైన దిగ్బంధము అగును) సుదర్శనాయ హేతి రాజాయ నమః సుదర్శనాయ హేతి రాజాయ నమః

ఇతి త్రిర్భ్రామయిత్వా, చక్రముద్రయా రక్షాం కుర్యాత్, దక్షిణేతరభుజయోః పర్యాయేణ పద్మగదా చక్ర శంఖానాం ప్రణవాది నమోంతన్యాసః. అస్త్రమంత్రేణ.... నుండి....నమోంతన్యాసః వరకు ఈ మంత్రము యొక్క భావము = ఈ అస్త్ర మంత్రము చేత దశదిక్కులకు బంధము చేయవచ్చును. ప్రణవము చేత ఊర్ధ్వ అధో దిక్కుల బంధము, రెండు చేతులతో అష్టాక్షర చక్రము పట్టి తనకు ప్రదక్షిణముగా త్రిప్పి "సుదర్శనాయహేతి రాజాయ నమః" అనుచు చక్రముద్రతో మూడుసార్లు త్రిప్పిన రక్షామయమైన దిగ్బంధము అగును. చక్ర బంధము చేయు విధానము = ఎడమ అరచేయిపైన, కుడి అరచేతిని బోర్లించుచు, ఎడమ అరచేతి బొటనవ్రేలుపై కుడి అరచేతి చిటికెన వ్రేలు నుంచి చక్రము వలె త్రిప్పగా కుడిచేయి క్రిందనుండగా ఎడమచేయిపై నుండును. ఇటుల మూడు పర్యాయములు చేయదగును. గురుముఖముగా చేయదగును.

7. ఇదే విధముగా శ్రీమన్నారాయణుని సర్వావయవములనూ శరీరమున ధ్యానము చేయు విధానము యీ క్రింది విధముగా యున్నది.

కిరీటము శిరస్సు నందు, శ్రీవత్సము కుడి రొమ్మున, కౌస్తుభము రొమ్ము మధ్యమున, వనమాల పార్శ్వములయందు, శ్రీ బీజ సంయుక్తమైన 'శ్రీదేవి,

దక్షిణ పార్శ్వమున, హ్రీం బీజంతో 'పుష్టిదేవి' వామపార్శ్వమున, ద్రాం బీజంతో వెనుకవైపున 'నిద్రాదేవినీ', అట్లే 'గమ్ గరుడాయ నమః' అని తొడల యందు, క్లీం పృథివ్యై అని 'భూదేవిని' పాదములయందు, కాంత్యై అని 'కాంతిదేవిని' ఊర్ధ్వ దేహమునందు 'ఓం నమో నారాయణాయ' అని మంత్రమూర్తియైన నారాయణుని సర్వ శరీరమునందునూ వరుసగా న్యాసము చేయవలయును.

**"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,**

**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః "**

సర్వ ధర్మములను వీడి సత్వరముగ, - నన్ను శరణంబు పొందుము, నిన్ను, నేను, సర్వ పాప విముక్తుగా నలిపివైతు, - దుఃఖపడకుము, ఫల్గునా! దుఃఖపడకు.

**36 నామ పంజరము**

**1 ' ఓం వాసుదేవాయ నమః । ఓం సంకర్షణాయ నమః,**
**ఓం ప్రద్యుమ్నాయ నమః । ఓం అనిరుద్ధాయ నమః.**

**2 నమస్తే వాసుదేవాయ । నమః సంకర్షణాయ చ,**
**ప్రద్యుమ్నాయా నిరుద్ధాయ । సాత్వతాం పతయే నమః.**

**3 నమః కృష్ణాయ రామాయ । వసుదేవ సుతాయ చ,**
**ప్రద్యుమ్నాయా నిరుద్ధాయ । సాత్వతాం పతయే నమః.**

**4 ఓం నమో నారాయణాయ । పురుషాయ మహాత్మనే,**
**విశుద్ధ సత్త్వ ధిష్ణ్యాయ । మహా హంసాయ ధీమహి.**

**5 నమో ధర్మాయ మహతే నమః కృష్ణాయ వేధసే,**
**బ్రాహ్మణేభ్యో నమస్కృత్య ధర్మాన్ వక్ష్యామి శాశ్వతాన్.**

**6. నమోఽనంతాయ బృహతే నమః కృష్ణాయ వేధసే,**
**సాంఖ్యయోగ వితానాయ - బ్రహ్మణే పరమాత్మనే.**

**7. భూభారహరణార్థాయ యదువంశేఽవతీర్య చ,**
**మర్దయామాస కంసాదీం స్తస్మై కృష్ణాయతే నమః.**

**8. ఋతగ్ం సత్యం పరబ్రహ్మ పురుషం కృష్ణ పింగళమ్.**
**ఊర్ధ్వరేతం విరూపాక్షం విష్ణురూపాయ వై నమో నమః.**

| | | |
|---|---|---|
| తూర్పు | పురస్తాత్ కేశవః పాతు,<br>చక్రీ జాంబూనద ప్రభః। | కేశవుడు |
| పడమర | పశ్చాన్నారాయణ శ్శంఖీ,<br>నీల జీమూత సన్నిభః। | నారాయణుడు |
| పై భాగము | ఇందీవరదళ శ్యామో,<br>మాధవోర్ధ్వం గదాధరః। | మాధవుడు |
| దక్షిణము | గోవిందో దక్షిణే పార్శ్వే,<br>ధన్వీ చంద్ర ప్రభో మహాన్। | గోవిందుడు |
| ఉత్తరము | ఉత్తరే హలధృ గ్విష్ణుః,<br>పద్మకింజల్క సన్నిభః। | విష్ణువు |
| ఆగ్నేయము | ఆగ్నేయ్యామరవిందాభో, ముసలీ<br>మధుసూదనః। | మధుసూదనుడు |
| నైఋతి | త్రివిక్రమః ఖడ్గపాణిః, నైఋత్యాం<br>జ్వలన ప్రభః। | త్రివిక్రముడు |
| వాయవ్యం | వాయవ్యాం వామనో వజ్రీ తరుణాదిత్య<br>దీప్తిమాన్ ॥ | వామనుడు |
| ఈశాన్యం | ఈశాన్యాం పుండరీకాభః శ్రీధరః<br>పట్టసాయుధః ॥ | శ్రీధరుడు |
| క్రింద | విద్యుత్ప్రభో హృషీకేశో హ్యవాచ్యాం<br>దిశి ముద్గరీ ॥ | హృషీకేశుడు |
| హృత్పద్మము | హృత్పద్మే పద్మనాభోమే, సహస్రార్క<br>సమప్రభః | పద్మనాభుడు |
| దేహమునకు లోపలబయట గూడవ్యాపించి రక్షించుగాక వాడు | సర్వాయుధ స్సర్వ శక్తిః, సర్వజ్ఞ స్సర్వతోముఖః।<br>ఇంద్రకోపక సంకాశః, పాశహస్తో౽పరాజితః ॥<br>సబాహ్యాభ్యంతరం దేహం, వ్యాప్య దామోదరః స్థితః<br>ఏవం సర్వత్ర నిశ్ఛిద్రం, నామ ద్వాదశ పంజరం।<br>ప్రవిష్టో౽హం నమే కించిత్, భయమస్తి కదాచనం. | పరాజయము లేని వాడగు దామోదరుడు |

తా: తూర్పువైపున చక్రమును ధరించి స్వర్ణకాంతులు గల కేశవుడును, బడమట నీలమేఘ శ్యాముడును, శంఖమును ధరించిన నారాయణుడును, నల్లకలువల

వంటి శరీరకాంతి గలిగి గదను ధరించిన మాధవుడు పై భాగమును, గొప్ప చంద్రకాంతులు గలిగి గదను ధనుస్సును ధరించిన గోవిందుడు దక్షిణ దిశను, పద్మకేసర సన్నిభుడై నాగలిని ధరించిన విష్ణువు ఉత్తర దిక్కును, పద్మకాంతుల నీనుచు రోకలిని ధరించిన మధుసూదనుడాగ్నేయ దిక్కును, అగ్నితో సమానమైన కాంతులు గలిగి ఖడ్గమును ధరించు త్రివిక్రముడు నైఋతి దిక్కును, బాల సూర్యప్రభాభాసమానుడును వజ్రమును ధరించినవాడును నగు వామనుడు వాయవ్య దిక్కును, తెల్లకలువవలె నుండిన పట్టసాయుధమును ధరించిన శ్రీధరుడు ఈశాన్య దిక్కును, విద్యుత్కాంతులు గలిగి ముద్గరమును ధరించిన హృషీకేశుడు, క్రింది దిక్కును, వేయి సూర్యుల కాంతి గలిగిన పద్మనాభుడు హృత్పద్మమందును, సర్వాయుధములను ధరించినవాడును. సర్వశక్తిమంతుడును, సర్వజ్ఞుడును, అంతటను వ్యాపించినవాడును, ఇంద్రగోపకముతో సమానముగ నుండువాడును, పాశహస్తుడును, పరాజయము లేనివాడును అగు దామోదరుడు దేహమునకు బయట లోపల గూడ వ్యాపించి రక్షించుగాక! ఇట్లు సర్వత్ర నిచ్ఛిద్రమగు పండ్రెండు భగవన్నాములతో గూడిన పంజరములో నేను ప్రవేశించితిని, కావున నెన్నటికిని నాకు కొంచమైనను భయము కలుగజాలదు.

నారాయణ అష్టాక్షరీ మంత్ర మహాత్మ్యము, 48, నిత్యానుష్ఠానక్రమము - 48

## 36 ధ్యానం

సవ్యం పాదం ప్రసార్య శ్రిత దురితహరం దక్షిణం కుంచయిత్వా,
జానున్యాదాయ సవ్యేతర మితరభుజం నాగభోగే నిధాయ,
పశ్చాద్బాహు ద్వయేన ప్రతిభట శమనే ధారయన్ శంఖచక్రే,
దేవీ భూషాది జుష్టో, జనయతు జగతాం శర్మ వైకుంఠనాథః ॥

తతః నిమీలితనేత్రః, శాంతసుమనస్కః, హృత్పద్మస్థిత శ్రీమన్నారాయణం, సంపశ్యన్, అష్టాక్షరీ మంత్రార్థ మనుస్మరన్, ప్రీతి ప్రేరితమనసా ఆరాధయన్, మౌనేన యథా మనసా ఆరాధయన్ మౌనేన యథాశక్తి శ్రీమదష్టాక్షరీ మహామంత్రజపం కుర్యాత్ ॥

**37 మూలమంత్రము (తిరుమంత్రము) అష్టాక్షరి అని మంత్రరాజమని అంటారు.**

**" ఓం నమో నారాయణాయ "**

పద్మాసనములో కూర్చుని ఎడమ అరచేయిపై కుడి అరచేయి నుంచి తులసి మాలతో లెక్కించకుండా కూడా ధ్యానము చేయవచ్చును.

హృదయములో ఇష్టదైవమైన నారాయణుని అంతరింద్రియంలో చూస్తూ మంత్రాన్ని లెక్కపెట్టకుండా మననము చేయుటయే ధ్యానము.

అతికష్టమైన తపస్సు ఏదంటే ఇంద్రియాలను మనస్సును వాటి విషయాల నుంచి మరల్చి ఆత్మపైన కేంద్రీకరించి విలపడమే. దీనికే ధ్యానమని పేరు.

మహర్షులు తమ తీవ్రమైన ధ్యానావస్థలో అనుభవించిన పరమ సత్యము యొక్క ప్రకటనలే ఉపనిషత్తులు. కఠోపనిషత్తు - 139

శ్రుతులు, ఉపనిషత్తులు శ్రీమద్భగవద్గీత ఓంకారమును గూర్చి ఏమి చెప్పినవో క్లుప్తముగా తెలుసుకుందాము.

1. శ్రుతి॥ ఓంకార ప్రభవా వేదా । ఓంకార ప్రభవాస్స్వరాః ।
ఓంకార ప్రభవం సర్వం । త్రైలోక్యంస చరాచరమ్ ॥

తా:- ఓంకారమను బ్రహ్మము నుండి సమస్త వేదములును, ఓంకారమందుండియే సర్వస్వరములున్ను, (నాద, బిందు, కళలు), ఓంకారమందుండియే సమస్త చరాచరములైన ఈ ప్రపంచమంతయు నుద్భవించినది.

శ్రీశుష్కవేదాంతతమోభాస్కరము 199.

2. శ్రుతి॥ ఏతద్ధ్యే వాక్షరంబ్రహ్మ । హ్యే(ఏ)తదేవాక్షరం పరం ।
ఏ తద్ధ్యే వాక్షరం జ్ఞాత్వా । యో యదిచ్ఛతి తస్యతత్ ॥

తా : ఈ అక్షరమే పరబ్రహ్మము, ఈ అక్షరమే పరమ పదము, ఈ అక్షర రహస్యము తెలిసికొనినవాడు ఏది కోరునో వానికి అది అంతయు సాధ్యమగును.

శ్రీశుష్కవేదాంతమోభాస్కరము 198, కఠోపనిషత్తు - 2-16(పేజీ 91)

3. శ్రుతి॥ ఏ తదాలంబనం శ్రేష్ఠ । మేతదాలంబనం పరం ।
ఏ తదాలంబనం జ్ఞాత్వా । బ్రహ్మలోకే మహీయతే ॥

తా : ఈ ఆలంబనము చాలా శ్రేష్ఠమైనది. ఇదియే పరమ శ్రేష్ఠమైన ఆలంబనము. ఎవడైతే ఇట్టి ఆలంబనమును తెలిసికొనుచున్నాడో. అట్టివాడు తప్పక బ్రహ్మలోకమును పొంది ఆనందించుచున్నాడు. కఠోపనిషత్తు - 2.17

4. శ్రుతి॥ ప్రణవోహి పరబ్రహ్మ । ప్రణవః పరమం పదం ।
ప్రణవం సర్వవేదాద్యం । సర్వవేదమయం విదుః ।
సర్వేషాం చైవ మంత్రాణాం । ప్రణవః ప్రాణ ఉచ్యతే ॥

తా : ప్రణవమే పరబ్రహ్మము. ప్రణవమే పరమ పదము. ప్రణవము సమస్త వేదములకు ఆదికారణము. సమస్తమైన మంత్రములకు ప్రణవమే ప్రాణబీజమై యున్నది. ప్రణవ రహిత మంత్రమునకు ప్రాణశక్తి లేదు. మరియు ప్రాణులకు శిరస్సు ప్రధానముగా యున్నట్లు మంత్రమునకు ప్రణవము శిరస్సుగా యున్నది. ప్రణవము లేని మంత్రము మొండి శరీరము వంటిది.

శ్రీశుష్కవేదాంతతమోభాస్కరము - 199

5 ప్రణవోధనుః శరోహ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే ।
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్ తన్మయో భవేత్ ॥

తా : 'ఓం' అనే ప్రణవమంత్రమే ధనుస్సు1' లోనున్న ఆత్మయే 2 బాణం. బ్రహ్మమే లక్ష్యం 3. ఏమరుపాటులేని 4 మనస్సుతో ఆలక్ష్యాన్ని ఛేదించాలి. బాణం లక్ష్యాన్ని ఛేదించి దానితో ఒకటై పోయినట్లే బ్రహ్మంతో ఐక్యమైపోవాలి. - ప్రణవమును ధనుస్సుగా గావించి, ఆత్మను శరముగా నుంచి, పరబ్రహ్మమును లక్ష్యముగా చేయవలయును.

వివరణ :-

1. ధనుస్సు : భాణం ముందుకు పోవడానికి విల్లు తోడ్పడినట్లే ఓంకార జపం ఆత్మబ్రహ్మంతో ఐక్యం కావడానికి సహకరిస్తుంది. అందుచేత ఓంకారం ధనుస్సుగా చెప్పబడింది.
2. లోనున్న ఆత్మ జీవాత్మ వాస్తవానికి ఇది బ్రహ్మమే అయినా శారీరక మానసిక ఉపాధులవలన తద్భిన్నంగా తోస్తూ, పరిచ్ఛిన్నమైనది.
3. లక్ష్యం: ఆత్మ బ్రహ్మం కంటే వేరు కాకపోవడం చేత ఆత్మకు లక్ష్యం ఆత్మ సారమే అవుతుంది. అయితే సగుణ బ్రహ్మోపాసకులకు, బ్రహ్మోపాసకులకు, ధ్యేయానికి ఆత్మకు గల భేదం నిలుస్తుంది. ఇక్కడ కూడా ధ్యానంలో ఉన్నతస్థాయిలో మనస్సు ధ్యేయంలో ఎంతగా మగ్నమవుతుందంటే అది తన ప్రత్యేకతను కూడా కోల్పోతుంది.
4. ఏమరపాటులేని : ప్రాపంచక వాసనలు ఆలోచనల వలన పరధ్యానం

లేని తుపాకిచే వేటాడువాడు గురిపెట్టినపుడు అణుమాత్రము చలించి నను, ఏలాగు గురి తప్పిపోవునో ఆలాగుననే చిత్తైకాగ్రము లేని వారి ధ్యానము వ్యర్థము. ముండకోపనిషత్తు 2-2-4.

**6. సర్వద్వారాణి సంయమ్య మనోహృది నిరుధ్య చ,**
**మూర్ధ్న్యా ధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్.**

తా : సర్వేంద్రియములను నిగ్రహించి, మనస్సును హృదయకమలము నందు (అనాహత చక్రమునందు) నున్న అక్షరుడనైన నాయందు నిలిపి, అందు వశీకృతమైన మనసుతో హృదయము నుండి ప్రాణవాయువును, ఊర్ధ్వగామి యగు సుషుమ్నానాడిచే నూర్ధ్వముగా నారోహించి తన సహస్రారము నందు నిలిపి ఇట్లు యోగధారణ చేయువాడై

**7. ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మా మనుస్మరన్,**
**యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాంగతిమ్.**

తా : పరబ్రహ్మ వాచకమైన "ఓం" అనెడి యేకాక్షరమును ఉచ్చరించుచూ ఓంకార స్వరూపుడనైన నన్ను చింతించుచూ నెవడు దేహమును వదలుచున్నాడో, అట్టివాడు పరమోత్కృష్టమైన మోక్షపదమును బొందుచున్నాడు. గీత 8/12, 13

8. విషయ సుఖముల నన్నిటిని దూరముగజేసి, దృష్టిని భ్రూమధ్యము నందు (కనుబొమలకు మధ్యగా నిలిపి) ముక్కున చలించు ప్రాణాపాన వాయువులను సమముగ నియమించి, మానస బుద్ధీంద్రియములను నిగ్రహించి, కామక్రోధములను జయించి మోక్షమందే ధ్యానము గలిగిన వాడైన యోగి ఎల్లప్పుడు మోక్షము నొందును. గీత 5/27,28

9. యోగము నభ్యసించు విధమును ఇంకను వివరించుచున్నాడు. శరీరము, శిరస్సు, కంఠప్రదేశము మూడును సమముగా స్థిరముగా ఉండునట్లు నిలిపి, దృష్టిని దిక్కులకు బోవనీయక సూటిగా ముక్కుకొనయందుండునట్లు (తనకొనముక్కుమీద) చేయవలయును. భయమును విడచిపెట్టి శాంతముతో గూడియుండి, బ్రహ్మచర్యవ్రతము నాచరించుచు మనసును భగవంతుని యందే నిలిపి పరమాత్మ సాక్షాత్కారము నకై యత్నింపవలయును. గీత 6/13,14

**10. ఆత్మాన మరణిం కృత్వా । ప్రణవం చో త్తరారణిం**
**ధ్యానవిర్మ థనాభ్యాసా । ద్దేవం పశ్యే న్ని గూఢవత్ ॥**

తా : తనమనస్సును క్రింద అరణిగా గావించి, ఓంకారమును పైగా నిలిపి ధ్యానము చేయునపుడు అరణి నుండి అగ్ని ఉద్భవించునట్లు, సూక్ష్మమైన పరమాత్మను దర్శించును. అరణి యనగా యాగాగ్ని కొరకు చేయు కొయ్యల పేరు. దీనికి మరియొక దృష్టాంతము గలదు. పెరుగు మర్ధన చేయునపుడు వెన్న యెట్లుద్భవించునో, అలాగుననే హృదయమందు ప్రణవమను కవ్వము నిలిపి ధ్యానమను మర్ధనము చేయునపుడు అప్రత్యక్షమైన శ్రీకృష్ణపరమాత్మ ప్రత్యక్షమగును. అని ఉత్తరగీత శ్రీ.కు.త.భా-199.

**11. తైలధార మివాచ్ఛిన్నం । దీర్ఘ ఘంటా నినాదవత్ ।**
**అవాచ్యం ప్రణవప్రాప్యం । యస్తం వేద స వేదవిత్ ॥**

తా : అవిచ్ఛిన్నమైన తైలధారవలె, దీర్ఘ ఘంటానినాదము వలెను, అవాచ్యమైన ఓంకారమును ఎవడు ఎరుంగునో వాడే వేదవేదాంతమెరిగిన మహనీయుడు. అని ఉత్తరగీత. శ్రీ.కు.వే.త.భా - 200

**12. యావజ్జీవం జపేన్మంత్రం । ప్రణవం బ్రహ్మణో వపుః ।**
**హ్రస్వో దహతి పాపాని । దీర్ఘో మోక్ష ప్రదాయకః ।**
**ప్లుతస్తు సర్వ సిద్ధ్యైస్యాత్ । ప్రణవ స్త్రివిధస్మృతః ॥**

శ్రీ.కు.త.మో.భా. 200

తా : పరబ్రహ్మ స్వరూపమైన ప్రణవ మంత్రము జీవితపర్యంతము జపము చేయవలెను. అది హ్రస్వమనియు, దీర్ఘమనియు, ప్లుతమనియు, ఉచ్చారణము త్రివిధములు. హ్రస్వముచే నమస్త పాపములు భస్మమగును. దీర్ఘము మోక్ష దాయకము. ప్లుతముచే సర్వసిద్ధియును గలుగును. ఇట్లు సన్యాస సముచ్చ యము. 2 మాత్రల సమయము హ్రస్వము, 3 మాత్రలు దీర్ఘము, 4 మాత్రల సమయము ప్లుతము. ఒక్క అకారము ఉచ్చరించెడి సమయమునకు మాత్ర యని పేరు.

**13. సూ॥ "తజ్జప స్త దర్థ భావనమ్ "**

తా : ప్రణవ ధ్యానమందు దాని అర్థమైన పరమాత్మ భావన కూడా ఉండవల యును. అట్లు జేయువారికి ఆత్మదర్శనము సిద్ధించును. అని పతంజలి భగవం

తుని అభిప్రాయము. దీనికంటె పవిత్రమైన వస్తువు ముల్లోకములలో లేదు. దీనిని ధ్యానించువాడు నిండా శ్రద్ధాభక్తులతో గూడియుండవలయును.

ముండకోపనిషత్తు 3-2-3, లోను, కఠోపనిషత్తు 1-2-23 లోను వున్న ఒకే శ్లోకభావాలు చూడండి.

14. నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహూనా శ్రుతేన ।
యమే వైష వృణుతే తేన లభ్య
స్తస్యైష ఆత్మా వివృణుతే తనుం స్వాం ॥

వృణుతే = హృదయపూర్వకంగా వరిస్తాడో, వివృణుతే = ప్రకటిస్తుంది. గొప్ప ఉపన్యాసాలు ఇవ్వడంచేత గాని, చాలా శాస్త్రాలు అధ్యయనం చేయడం వలన గాని ఎన్నో గూఢార్థాలు మహాత్ములవద్ద వినడం వలనగాని ఆత్మప్రాప్తి జరుగదు. ఆ ఆత్మకోశం హృదయపూర్వకంగా ఆరాటపడినవానికే ఆత్మసాక్షా త్కారం లభిస్తుంది. అట్టివానికే ఆత్మ తన స్వరూపాన్ని వెల్లడిస్తున్నది.

(వివరణ : 1. ఆత్మ తన స్వరూపాన్ని వెల్లడిస్తున్నది. ఆత్మ ఎప్పుడూ అంతర్యంలో మానవుని నిజస్వరూపమే. అందుచేత దానిని మరో చోటినుండి తీసుకు రావల సిన పనిలేదు. అజ్ఞానం మాత్రమే దానిని ఆవరించి ఉంటుంది. నిజమైన ఆరా టం ఆత్రుత ఆ అజ్ఞానాన్ని తుడిచివేస్తుంది. అప్పుడు అన్ని కాలాలలోనూ ఉన్న ఆత్మ స్వయంగా ప్రకాశిస్తుంది.

అనుష్ఠానికంగా అర్థం చెప్పినపుడు ఈ శ్లోకం భగవత్కృప సిద్ధాంతానికి సాధికార ప్రకటనగా నిలిచింది. అదృష్ట్యా అనువాదం ఇలా చెప్పవచ్చు. "భగవం తుడు ఉపన్యాసాల వలన మేధా పాటవం వలన బహుశాస్త్ర శ్రవణం వలన లభించడు. ఆయన ఎవరిని ఎన్నుకుంటాడో అతడే ఆయనను పొంద గలడు. అతనికి మాత్రమే ఆయన తన స్వరూపాన్ని ప్రకటిస్తాడు.

ముండకోపనిషత్తు - తృతీయముండకము, ద్వితీయఖండం, 3వ శ్లోకం 3-2-3

కేవల పుస్తకజ్ఞానమే కాదు. ఇది మనకు తెలిసిన అన్ని శ్రుతులయందలి యేకాభిప్రాయము. భాషావశములోన్ను అతితేలిక పదముల నుపయోగించు శైలిగల విశ్రుతి గ్రంథములలోని శబ్దార్థములను గురించి సంస్కృత భాషా లక్షణములు తెలిసిన ప్రతివ్యక్తి అంతులేకుండా చర్చించగలడు. యథార్థ జ్ఞాన ముచే సంపాదింపబడిన అనుగ్రహ రూపమును, ఉపనిషత్సిద్ధాంత భూతమును చైతన్య కారణమును అగు మనలోని ఆత్మయొక్క స్వకీయాను భవమును

గూర్చి ధనము కొఱకు దేవాలయములలో మాట్లాడువారిని, శబ్దా డంబరమును వ్యక్తపరచువారిని అనుగ్రహించుటకు శ్రుతిమాత నిరాకరించుచున్నది.

కఠోపనిషత్తు, ప్రథమాధ్యాయము, ద్వితీయవల్లి 23వ శ్లోకం - 1-2-23.

**15 నా విరతో దుశ్చరి తాత్ నాశాన్తో నా సమాహితః ।**
**నాశాన్త మానసోవాపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్ ॥**

తా : దుశ్చరితముల నుండి మరలనివాడును, ఇంద్రియ నిగ్రహము లేనివాడును, ఏకాగ్ర మనస్సు లేనివాడును, మనస్సును శాంతపఱచని వాడును కేవలము జ్ఞానముచేత ఆత్మను పొందలేడు. కఠోపనిషత్తు 1-2-24.

**16** "బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" బ్రహ్మమును తెలిసికొనువాడు బ్రహ్మమేయగుచున్నాడు అని ఉపనిషద్వాక్యము. 4/9 గీతామకరందము

మంత్ర జపానంతరము మరల అంగన్యాస, కరన్యాసములు చేసి "అస్త్రమంత్రేణ దశ దిగ్విమోకః" అని చెప్పి, అదౌ అంతే, ఏకైక మాలానంతరం చ విష్ణుగాయత్రీం చ జపం కుర్యాత్ ॥

**విష్ణుగాయత్రి**

**ఓం నారాయణాయ విద్మహే**
**వాసుదేవాయ ధీమహి**
**తన్నో విష్ణుః ప్రచోదయాత్ ॥**

శ్రీమన్నారాయణుడే మాకు సర్వకాలముల యందు సేవింపబడువాడు. అతడే మమ్మందరిని రక్షించువాడు. యాతడే మాకు పూజ్యుడగుచున్నాడు.

పేజి. 40. మంత్రపుష్పము 1967 సం॥

**37** ద్వయమంత్రము రెండు వాక్యాలు గలది. మంత్రరత్నము అంటారు.

**"శ్రీ మన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే**
**శ్రీమతే నారాయణాయ నమః"**

**38. చరమ శ్లోకము** భగవానుడు ప్రసాదించినది. గీత 18/66

**సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।**
**అహం త్వా సర్వ పాపే భ్యో మోక్ష యిష్యామి మాశుచః ॥**

**సర్వ ధర్మములను వీడి సత్వరముగ,**
**నన్ను శరణంబు బొందుము నిన్ను, నేను**
**సర్వ పాప విముక్తుగా సలిపి వైతు,**
**దుఃఖ పడకుము, ఫల్గునా । దుఃఖ పడకు.**

నీ పనులన్నీ ధర్మస్వరూపుడనైన నాసేవగా తలచుకో. నీ పాపములన్నీ తొలగించు కొంటాను. నీకే బాధ అవసరములేదు విచారించకు. భక్తినివేదన 10/2001=48

## 39 శ్రీరామ చరమ శ్లోకము



**1. సకృదేవ ప్రపన్నాయ - తవాస్మీతి చ యాచతే ।**
**అభయం సర్వభూతేభ్యో - దదామ్యేతత్ వ్రతం మమ॥**

ఒక్కసారి "నేను నీకు శరణాగతుడను, నీవాడను" అని యాచించు వారికి సర్వభూతముల నుండి అభయమును ప్రసాదించుచున్నాను. ఇది నావ్రతము అని శ్రీరామచంద్రమూర్తి సెలవిచ్చెను. "స్మరణ మాత్ర సంతుష్టాయ" యని శ్రీరామ కవచము నందలి వాక్యములను బోల్చి చూచిన పై విషయము స్పష్టమగును. ఇట్టి శ్రీరామునికంటెను ప్రేమస్వరూపిణి సీతాదేవి.

**మిత్రభావేన సంప్రాప్తం - న త్యజేయం కథంచన (కదాచన) ।**
**దోషో యద్యపి తస్యస్యాత్ - సతామేతత్ అగర్హి తమ్ ॥**
**మైత్రి భావించి తాన సంప్రాప్తుడైన**
**వాని నెటులేని చేవీడు వాడగాను**
**వాని యెడనుండెనేని నేదేని దోష**
**మద్ది గర్హ్యంబు గాదు సదాళులకును** శ్రీమదాంధ్రవాల్మీకిరామాయణము

సీతా చరమ శ్లోకము

**2 పాపానాం వా శుభానాం వా - వధార్హాణాం ప్లవంగమ ।**
**కార్యం కరుణ మార్యేణ - న కశ్చిన్నాఽ పరాధ్యతి ॥**

రావణ వధానంతరము కపిశ్రేష్ఠుడు సీతమ్మవారి చెంతకరగి, అమ్మా మిమ్ము లను అనేక చిత్రహింసలకు గురిచేసిన యీ రాక్షస స్త్రీలను వధించుట కనుమ తించమని కోరగా, అప్పుడు సీతమ్మవారు ఇలా చెప్పారు. హనుమా ! ప్రభువు చెప్పినట్లు వీరు అచరించారేకాని, వీళ్ళదోషమేమియు లేదు. తప్పులు చేసిన

వారిని దండించక ఓర్పుతో, క్షమతో, దయను ప్రదర్శించుటే సజ్జనుల లక్షణము. తప్పులు చేయని వారెవరు ?

1. చూచి రమ్మన లంకను కాల్చి వచ్చిన నీవు తప్పు చేయలేదా?
2. కామించి వచ్చిన శూర్పణఖను ఒంటరిగానున్న లక్ష్మణుని చెంతకర గుమన్న శ్రీరాముడు తప్పు చేయలేదా?
3. వరముల నెపముతో నొకదానికి రాము నడవి పంపించుటకును, రెండవదానితో తన కొడుకు భరతునకు పట్టాభిషేకము జేయుటకు కోరిన కైకేయిపై లక్ష్మణుడు కత్తిదూయలేదా?
4. మాయ లేడిని సంహరించిన శ్రీరాముని కంఠస్వరముతో మారీచుడు " హా సీతా, హా లక్ష్మణా " అన్న ఆర్తనాదమును విని ఆర్యపుత్రుల కాపద సంభవించినది లక్ష్మణుని వెళ్ళమని కోరగా, అతను వెళ్ళుటకు నిరాకరించినప్పుడు నేను కోపముతో "భరతుడు రాజ్యము పొందగా, నీవు నన్ను కాంక్షిస్తున్నావా? అనుచు లక్ష్మణుని దూషించి నేను తప్పు చేయలేదా? అందుచేతనే లంకలోని రాక్షస స్త్రీలచే బాధించబడ్డాను. లక్ష్మణుడు పరమభాగవతోత్తముడు.

శూర్పణఖను గూర్చి

శూర్పణఖ కామము ధర్మ విరుద్ధము. విధవయయ్యు రతికోరుటచే దండింపబడెను. ఇచట ముక్కు చెవులు కోసెనని కలదు. ఇవి స్తనోష్ఠములకుప లక్షణము. అనగా ముక్కు చెవులు మాత్రమే కాక చన్నులు పెదవులుకూడా కోయబడెనని యర్థము. కామాంధులైన స్త్రీల కిటుల చేసిన మరల వ్యభిచరింప కుందురని కాబోలు రాముని అభిప్రాయము. "లక్ష్మణః తూర్ణ ముత్థాయ కరవాలేన వీర్యవాన్" కర్ణౌనసౌ నాసికాంచ అచ్ఛినద్రామ శాసనాత్ ॥ అని

శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, అరణ్యకాండము 209వ పేజి యందు కలదు.

మహేశ్వరతీర్థీయము = నికృత్త (నఱకబడినది) కర్ణనాసోష్ఠాం చకార రఘునందనః

రావణాసురుడు దేవతా స్త్రీలను, మనుష్య స్త్రీలను జెఱపట్టి, పతివ్రతల జెఱచి దుఃఖపెట్టుచుండ, శ్రీమహాలక్ష్మి సహింపజాలక, వేదస్వరము నుండి వేదవతియన నయోనిజయై జనించి రావణాసురు శపియించి మరల నయోనిజయై సీతయై పుట్టి, శ్రీరాము చేపట్టి యాయనవెంట నడవులకు మెట్టి రావణాసురుని మట్టు పెట్టింప గారణము గల్పింప జింకను బట్టి తేర భర్తనంపి

రావణునకు జిక్కి వానిని భస్మీకరింప గలిగియు, భస్మీకరింపనొల్లక భర్తచే నతని సపుత్ర మిత్ర బాంధవముగ జంపించి లోకమున కానందము కలిగించెను. ఎంత దయావతిగాక పరులకై తాను కష్టపడి వారి గష్టము దప్పించునా? లోకమున దంద్రికంటెను తల్లి దయావతి గదా ! ఇక జగన్మాత విషయమేమి చెప్పవలయును?

రాముని భజించి విసిగి "నను బ్రోవుమని చెప్పవే ఓ సీతమ్మా" అని గోపన్న యేడ్చు వరకు నాయనకు కారాగార గృహ విముక్తి కలుగకపోయెను. భక్తులకెల్ల నీయనుభవవిదితము. శ్రీమదాంధ్రవాల్మీకిరామాయణము, సుం.కాండ 3,4

శ్రీ వరాహ చరమ శ్లోకము

**3 స్థితే మనసి సుస్వస్థే-శరీరే సతియో నరః ।**
**థాతుసామ్యే స్థితే స్మర్తా-విశ్వరూపం చ మామజం ॥ (మామిదం)**
**తతస్తం మ్రియమాణంతు-కాష్ఠ-పాషాణ-సన్నిభం ।**
**అహం స్మరామి మద్భక్తం-నయామి పరమాం గతిమ్ ॥**

మామిదం = శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణము-ఉత్తరకాండ - 563

దేహమారోగ్యముగ నుండగా మనస్సు తన స్వాధీనమందుండగా నజుడను విశ్వరూపుడనైన నన్ను నెవరు స్మరింతురో యట్టివాడు మరణకాలమున గఫ వాతాదులచే స్మృతిదప్పి కొయ్యవలె రాతివలె బడియుండగా నాభక్తుని నేను స్మరించి పరమపదమునకు దీసికొనిపోదును. ఒకవేళ నారోగ్యవంతుడై మనస్సు స్వస్థముగా నుండు వాడయ్యేనేని యా యవసాన కాలమున స్వామిత్వము, సౌశీల్యము, వాత్సల్యము లోనగు గుణములుగలనన్ను నారాయణ స్వేచ్ఛాగత శరీరుని నుద్దేశించి శ్రీమన్నారాయణస్వామీ । వేరు రక్షకుడు లేనివాడనై నీపాదముల శరణు జొచ్చితిని. అని యొకసారి స్మరించెనేని ఇతరోపాయముల వదలి యా యవస్థయందుండి కొయ్యవలె రాతివలె బడియుండు వానిని, గదలలేకయుండువానిని, నాశ్రితపరతంత్రుడనగు నేను స్మరించి నాదయా ప్రవాహము ప్రకాశింపజేయనర్చిరాది మార్గము వదలి గరుడుని మూపుపై వానిని నెక్కించుకొని యధేష్టముగా నే యడ్డము లేక పరమపదమునకు తీసికొని పోదును.

ఆ కాలమున సరయున మునిగిన వేలకొలది పశుపక్ష్యాదులు దివ్య

కాంతులతో, సంతోషముతో పరమపదమునకు బోగా వానరులు, రాక్షసులు, ఎలుగులు ఆక్షణమందే సరయున తమ దేహములు విడిచి స్వర్గమునకు బోయిరి. శ్రీమదాంధ్రవాల్మీకిరామయాణము. ఉ.కాండ 563.

మనసు స్థిరమై, శరీరము స్వస్థమై, ధాతువులన్నియు సమమైయుండు నపుడు ఏనరుడు జగద్రూపుడై, జన్మము లేనివాడైయుండు నన్ను చింతించునో, పిమ్మట శరీరము విడుచునపుడు కేవలము కాష్ఠపాషాణాదులకు సముడై యుండు నాభక్తుడగు వానిని నేనేస్మరించి సద్గతిని పొందజేయుదును.

శ్రీనారసింహ చరమ శ్లోకము

4 సత్యం బ్రవీమి మనుజాః - స్వయ మూర్ధ్వ బాహుః
యో మాం ముకుంద - నరసింహ జనార్దనేతి ।
జీవన్ జపత్యనుదినం - మరణే ఋణీవ
పాషాణ కాష్ఠ సదృశాయ - దదామి ముక్తిమ్ ॥

1. మనుజులారా । స్వయముగ నేను జేయెత్తి సత్యము పలికెదను. జీవించి యుండు సమయంబున నెవ్వడు ప్రతిదినము ముకుందా ! నరసింహా! జనార్దన యని నన్ను పలుమాఱు పిలుచు చుండునో, నా నామము, జపించుచుండునో యట్టివాడు నిర్యాణ సమయమున బాషాణము వలెను, కట్టె వలెను, స్మృతిలేక పడియుండినను, నప్పుకొన్నవాడు మరల నప్పు చెల్లించిన విధమున వానికి ముక్తి నిచ్చెదను. వా.రామాయణము, బాలకాండ 69

2 ఓ జనులారా ! రెండు చేతులనెత్తి సత్యమైన సంగతిని చెప్పుచున్నాను. ఏ జీవుడనవరతము ముకుందా ! నరసింహా ! జనార్దనా ! యని జపించునో : మరణ సమయమునగాని, యుద్ధమునగాని, మూర్ఛాదులచే రాతి వలె కట్టె వలె స్మృతి లేక పడియుండినను, నప్పుగొన్నవాడు మరల నప్పు చెల్లించిన విధమున వానికి ముక్తి నిచ్చెదను. ముకుందమాల - 37

3 మోక్షమునకు మార్గములు రెండు :- అందొకటి యుపాయము, రెండవది పురుషకారము. ఈరెంటిలో భారతమందుపాయము విస్తరింపబడెను. రామాయణమందు బురుషకారము సవిస్తరముగ చెప్పబడెను. శ్రీమద్భాగవతము నందు దేనికంటె గొప్పతత్త్వము లేదో అట్టి విష్ణుతత్త్వము చెప్పబడెను. ఉపాయము = సాధనము. ఏయోగమును సాధనముగాగొని మోక్షము సాధింప

వెంతుమో దానికి నుపాయమని పేరు. భక్తి - జ్ఞాన - కర్మయోగాదులుపాయ ములే. అన్నియుపాయములలో శ్రేష్ఠమైనది సిద్ధోపాయము. - భగవంతుడే. సేవకుల యనుగ్రహము నంపాదించుకొని వారి మూలమున ప్రభునను్రగహము నంపాదించుటకంటే, భగవంతునేనమ్మి యాయననే యుపాయముగాగొని యాయన పాదములపై బడుట సిద్ధోపాయము.

భారతమున పాండవులు శ్రీకృష్ణపరమాత్మనే సాధనముగ గొనిరి.

పురుషకారము :- తనకొక కార్యమొకని వలన గావలసి యుండెనేని యందు ప్రీతి గలిగి యితరునియందు వాల్లభ్యము గలిగి కార్యము జక్కబఱచు మధ్య వర్తికి పురుషకారమని పేరు. రామాయణమున సీత - హనుమంతుడు పురుషకారములే.

శ్రీరంగ చరమ శ్లోకము

5. మామేవా ఒనుస్మరస్వ త్వం - త్వామహం సంస్మరామి చ ।
ఉపాయ మపవర్గస్య - రహస్య మపి మే శ్రుణు ॥
సర్వ కర్మాణి సంత్యజ్య - సర్వ - కర్మ - ఫలాని చ ।
శరణం మాం ప్రపద్యస్వ - సర్వ - బంధ - విముక్తయే ॥

శ్రీ సుదర్శన చరమ శ్లోకము

6. సుదర్శన మహాజ్వాల! కోటి సూర్య సమప్రభ ।
అజ్ఞానాంధస్య మే దేవ - విష్ణోర్మార్గం ప్రదర్శయ ।

శ్రీ పాంచజన్య చరమ శ్లోకము

7. పాంచజన్య నిజధ్వాన - ధ్వస్త - పాతక - సంచయ ।
పాహి మాం పాపినం ఘోర - సంసారార్ణవ - పాతినమ్ ॥

మనవాళ మామునుల తనియ.

8. శ్రీశైలేశ - దయాపాత్రం - ధీ భక్త్యాది - గుణార్ణవమ్ ।
యతీంద్ర - ప్రవణం వందే - రమ్యజామాతరం మునిమ్॥

శ్రీ వరవరమునయే నమః

తిరువాయ్ మొళి పిళ్ళై తనియ

9. నమ శ్రీశైల నాథాయ - కుంతీ - నగర - జన్మనే ।
ప్రసాదలబ్ధపరమ - ప్రాప్య కైంకర్య శాలినే ॥
శ్రీశైలనాథాయ నమః
పిళ్ళై లోకాచార్యుల తనియ.

10. లోకాచార్యాయ గురవే - కృష్ణపాదస్య సూనవే ।
సంసార - భోగి - సందష్ట - జీవ - జీవాతవే నమః ॥
శ్రీ లోకాచార్యాయ నమః
వడక్కు తిరువీధిపిళ్ళై తనియ.

11. శ్రీకృష్ణ - పాద - పాదాబ్జే - నమామి శిరసా సదా ।
యత్ప్రసాద ప్రభావేన - సర్వసిద్ధి రభూ న్మమ ॥
శ్రీకృష్ణపాదాయ నమః
నంబిళ్ళ తనియ.

12 వేదాంత వేద్యా ఽ మృతవారిరాశేః
వేదార్థసారామృత పూర్వమగ్ర్యమ్.
ఆదాయ వర్షం త మహం ప్రపద్యే
కారుణ్యపూర్ణం కలివైరిదానమ్ ॥ శ్రీకలివైరిదాసాయ నమః
సంజీయర్ తనియ

13 నమో వేదాంత వేద్యాయ - జగన్మంగళ - హేతవే ।
యస్య వాగమృతాసార - పూరితం భువనత్రయమ్ ॥
శ్రీవేదాన్తినే నమః
భట్టరు తనియ

14. శ్రీ పరాశర భట్టార్యః - శ్రీరంగేశ పురోహితః ।
శ్రీవత్సాంకసుత శ్రీమాన్ - శ్రేయసే మే ఽ స్తు భూయసే॥
శ్రీపరాశర భట్టార్యాయ నమః
ఎంబారు తనియ

15. రామానుజ పదచ్ఛాయా - గోవిందాహ్వ ఽనపాయినీ ।
తదాయత్త-స్వరూపా సా - జీయా న్మద్విశ్రమస్థలీ ॥
శ్రీగోవింద భట్టార్యాయ నమః
ఎంబెరు మానార్ల తనియ

16. యో నిత్య మచ్యుతపదాంబుజ యుగ్మ రుక్మ
వ్యామోహత స్త దితరాణి తృణాయ మేనే ।
అస్మద్గురో ర్భగవతో ఽస్య దయైక సింధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥
శ్రీమతే రామానుజాయ నమః
పెరియ నంబి తనియ

17 కమలాపతి కల్యాణ - గుణామృత - నిషేవయా ।
పూర్ణకామాయ సతతం - పూర్ణాయ మహతే నమః
శ్రీమహాపూర్ణాయ నమః
శ్రీఆళవందార్ తనియ

18. యత్పాదాంభోరుహధ్యాన - విధ్వస్తా ఽశేషకల్మషః ।
వస్తుతా ముపయాతో ఽహం - యామునేయం నమామ్యహమ్।
శ్రీయామునాచార్యాయ నమః
మణక్కాల్నంబి తనియ.

19 అయత్నతో యామున మాత్మదాసం - అలర్కపత్రార్పణ
నిష్క్రయేణ ।
యః క్రీతవానాస్థిత యౌవరాజ్యం - నమామి తం రామ
మమేయసత్త్వం॥
శ్రీరామమిశ్రాయ నమః
ఉయ్యక్కొండార్ తనియ

20.నమః పంకజ-నేత్రాయ - నాథ శ్రీపాదపంకజే ।
న్యస్త సర్వ భరాయాస్మత్ - కులనాథాయ ధీమతే ॥
శ్రీ పుండరీకాక్షాయ నమః
శ్రీమన్నాథమునుల తనియ

21.నమో౽చింత్యాద్భుతా౽క్లిష్ట - జ్ఞానవైరాగ్యరాశయే ।
నాథాయ మునయే౽గాధ - భగవద్భక్తి సింధవే ॥
శ్రీమన్నాథమునయే నమః
నమ్మాళ్వార్ తనియ.

22.మాతా పితా యువతయ - స్తనయా విభూతిః
సర్వం యదేవ నియమేన - మదన్వయానామ్ ।
ఆద్యస్య నః కులపతే - ర్వ కుళాభిరామం
శ్రీమత్తదంఘ్రి యుగళం - ప్రణమామి మూర్ధ్నా ॥
శ్రీమతే శఠకోపాయ నమః
సేన ముదలియార్ తనియ.

23.శ్రీరంగ - చంద్రమస మిందిరయా విహర్తుం
విన్యస్య విశ్వ చిదచి న్నయనాధికారమ్।
యో నిర్వహత్యనిశ మంగుళిముద్రయైవ
సేనాన్య మన్య విముఖాః త మిహాశ్రయామః ॥
శ్రీమతే విష్వక్సేనాయ నమః
పెరియ పిరాట్టి తనియ.

24.నమ శ్శ్రీరంగనాయక్యై - యద్భ్రూ - విభ్రమ - భేదతః ।
ఈశేషితవ్య - వైషమ్య - నిమ్నోన్నత - మిదం - జగత్ ॥
శ్రీ శ్రియై నమః
పెరియ పెరుమాళ్ళ తనియ.

25.శ్రీ స్తనాభరణం తేజః - శ్రీరంగేశయ మాశ్రయే ।
చింతామణి మివోద్వాంత - ముత్సంగే ౽నంత భోగినః ॥
శ్రీ శ్రీధరాయ నమః
భట్టరు సాధించినది

26.భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ
శ్రీభక్తి సార కులశేఖర యోగి వాహాన్ ।
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్ర మిశ్రాన్
శ్రీమత్ పరాంకుశమునిం ప్రణతో ౽స్మి నిత్యమ్ ॥

భక్తి నివేదన 1?/2000/19

అడియేన్ రామానుజ దాసః (దాసీ)
శ్రీమతే రామానుజాయ నమః
తిరుమంత్రార్థ తాత్పర్యము.

27. సమస్త జగత్తు యొక్క నిరుపాధిక సృష్టి - స్థితి - లయ మోక్షకర్తయు, మూలకారణుడును : నిరుపాధిక సర్వరక్షకుడై : సమస్త కళ్యాణ గుణాత్మకుడై, : సర్వశేషియైన శ్రీమన్నారాయణునికి మాత్రమే దాసుడను. తదితరులెవ్వరికిని, నాకు నేనుగాని దాసుడను కాను. నేను భగవద్భాగవతాచార్యులకు సర్వదేశ సర్వకాల సర్వావస్థల యందును, పరతంత్రుడనై సర్వ విధముల శేషభూతుడనై కైంకర్యమును చేయుచుందును గాక. (సర్వేశ్వరునికే శేషభూతుడనైన నేను నాకు దాసుడను గాకుండ నుండును గాక! సర్వశేషియైన నారాయణునికే అన్ని కైంకర్యములను చేయుచుందునుగాక)

ద్వయ మంత్ర తాత్పర్యము

28 శ్రియః పతియై, సర్వసులభుడైన నారాయణుని, శ్రీపాదములనే అభిమత సిద్ధికిన్ని, తద్విరోధి నివృత్తికిన్ని ఉపాయముగా ఆశ్రయించుచున్నాను. శ్రియః పతియై సర్వస్వామియునైన నారాయణుని నిత్యకైంకర్యమును అహంకార మమకార రహితుడనై చేయుచుందును గాక.

చరమ శ్లోక తాత్పర్యము

29 "ఇతరోపాయముల నన్నింటిని సవాసనగ విడిచి నన్నే
ఇతరోపాయ నిరపేక్షకునిగా నమ్మియుండుమా ! సర్వ
శక్తిమంతుడనైన నేను నిన్ను అన్ని ప్రతి బంధకముల నుం
డియు విడిపింతును. దుఃఖింపకుమా" అని భగవంతుడు ప్రతిజ్ఞా పూర్వ
కముగా నుపదేశించెను. గురుపరంపరాది.

(నీ పనులన్నీ ధర్మస్వరూపుడనైన నాసేవగా తలచుకో. నీపాపములన్ని తొలగించుకొంటాను. నీకే బాధా అవసరం లేదు. విచారించకు) భ.సి. 10/2001.48.

## 40 శ్రీ కృష్ణ పరమాత్మ స్తోత్రములు



ముందుగా హయగ్రీవ స్తోత్రము

1. ఓమ్ జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం,
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే.
శ్రీహయగ్రీవ స్వామినే నమః
గర్గ సంహితోక్త శ్రీకృష్ణస్తవః

2. నమశ్శ్రీకృష్ణ చంద్రాయ పరిపూర్ణ తమాయ చ,
అసంఖ్యాండాధిపతయే గోలోక పతయే నమః
శ్రీరాధాపతయే తుభ్యం వ్రజాధీశాయతే నమః
నమఃశ్రీ నందపుత్రాయ యశోదా నందనాయ చ.
దేవకీసుత గోవింద వాసుదేవ జగత్పతే.
యదూత్తమ జగన్నాథ పాహిమాం పురుషోత్తమ.
వాణీ సదాతే గుణవర్ణనే స్యాత్కర్ణౌ
కథాయాం మమదోశ్చ కర్మణి,
మనస్సదా త్వచ్చరణారవిందయో
ర్దృశౌ స్ఫురద్ధామ విశేష దర్శనే.

శ్రీకృష్ణావతారతత్త్వము 6వ భా.

ఇతి బ్రహ్మ పురాణాంతర్గత స్తుతిః, విష్ణు పురాణాంతర్గత స్తుతిః
గర్గ సంహితాంర్గత శ్రీకృష్ణస్తుతిశ్చ.

3 కృష్ణాయ వాసుదేవాయ దేవకీనందనాయ చ,
నందగోప కుమారాయ గోవిందాయ నమోనమః
నమః పంకజ నాభాయ నమః పంకజ మాలినే, భాగ-10-59-26
నమః పంకజ నేత్రాయ నమస్తే పంకజాంఘ్రయే.
నమః కృష్ణాయ శుద్ధాయ బ్రహ్మణే పరమాత్మనే,
ప్రణత క్లేశనాశాయ గోవిందాయ నమోనమః.
నమో ఽ స్త్వనంతాయ సహస్రమూర్తయే
సహస్ర పాదాక్షి శిరోరు బాహవే,
సహస్ర నామ్నే పురుషాయ శాశ్వతే
సహస్ర కోటీ యుగధారిణే నమః.
సహస్ర కోటీ యుగధారిణే నమః, ఓం నమ ఇతి.
హరేమత్సమః పాతకీనాస్తి భూమౌ
తథా త్వత్సమోనాస్తి పాపాపహరీ,
ఇతి త్వం చ మత్వా జగన్నాథదేవ
యథేచ్ఛా భవేత్తే తథా మాం కురుత్వమ్. శ్రీకృష్ణావతారతత్త్వము. 8వభా.-38

శ్రీకృష్ణ నామ రత్నములు

4 కృష్ణః పీతాంబరః కంసధ్వంసీ చ విష్టర శ్రవాః,
దేవకీనందనశ్శ్రీశో యశోదానందనో హరిః.
సనాతనో ఽ చ్యుతో ఽ నంతస్సర్వేశస్సర్వరూప ధృక్,
సర్వాధారః సర్వగతిస్సర్వ కారణకారణమ్.
రాధాబంధూ రాధికాత్మా రాధికా జీవనస్స్వయమ్,
రాధాప్రాణో రాధికేశో రాధికారమణస్స్వయమ్.
రాధికా సహచారీ చ రాధా మానస పూరణః,
రాధాధనో రాధికాంగో రాధికాసక్త మానసః.
రాధికాచిత్తచోరశ్చ రాధా ప్రాణాధికః ప్రభుః,

పరిపూర్ణతమం బ్రహ్మ గోవిందో గరుడధ్వజః.
నామాన్యేతాని కృష్ణస్య శ్రుతాని మన్ముఖాద్భుది.

(శ్రీకృష్ణ జన్మఖండము) శ్రీకృష్ణావతారతత్త్వము. 2వ భా. 352.

5 యశోదకడ బాలకృష్ణుడు స్తన్యము త్రావి ఆవులించెను.

ఖం రోదసీ జ్యోతిరనీక మా శాః
సూర్యేన్దు వహ్ని శ్వసనాంబుధీం శ్చ ।
ద్వీపాన్ నగాం స్త ద్దుహితౄర్వనాని
భూతాని యాని స్థిరజంగమాని ॥

(ఒకనాడు యశోదాదేవి శ్రీకృష్ణుని తొడపై కూర్చుండబెట్టుకొని పుత్రప్రేమచే స్రవించు స్తనదుగ్ధములను త్రావించుచుండెను. బాలకృష్ణుడు స్తన్యపానము చేయుట దాదాపుగ పూర్తియయ్యెను. యశోదాదేవి మనోహరమగు చిరునవ్వుతో గూడిన బాలుని వదనమును ముద్దిడికొనుట మున్నగువాని ద్వారా లాలించు చుండెను. ఇంతలో బాలకృష్ణుడు ఆవులించెను.)

యశోదాదేవి బాలుని నోటిలో ఆకాశము, స్వర్గము, మర్త్యము, జ్యోతిశ్చక్రము, దిక్కులు, సూర్యుడు, చంద్రుడు, అగ్ని, వాయువు, సముద్రములు, ద్వీపములు, పర్వతములు, నదులు, వనములు, స్థావరజంగమాత్మకములగు ప్రాణులు ఉండుట చూచెను. భాగ. 10-7-36

2 నీవు మట్టిని తినినచో నోటిని తెరువుము. యశోదకు కృష్ణుడు మరల విశ్వరూపము చూపుట.

నాతత్ర దదృశే విశ్వం జగత్ స్థాస్ను చ ఖం దిశః ।
సాద్రి ద్వీపాబ్ధి భూగోలం సవాయ్వగ్నీన్దు తారకమ్ ॥
జ్యోతిశ్చక్రం జలం తేజో నభస్వాన్ వియదేవ చ ।
వైకారికాణీన్ద్రియాణి మనో మాత్రా గుణాస్త్రయః ॥
ఏతద్విచిత్రం సహ జీవకాల - స్వభావ కర్మాశయలింగ భేదమ్
సూనో స్తనౌ వీక్ష్య విదారితాస్యే-వ్రజం సహాత్మానమవాప శంకామ్॥

యశోదాదేవి పలికినదాని ననుసరించి కృష్ణుడు నోటిని తెఱచెను. ఆమె దానిలో స్థావరజంగమములను, అంతరిక్షమును, దిక్కులను, పర్వతములను, ద్వీపములను, సముద్రములను, భూతలమును, ప్రవహించు వాయువును, అగ్నిని, చంద్రుని, తారకలను, జ్యోతిశ్చక్రమును, జలమును, తేజస్సును, పవనమును, ఆకాశమును, అహంకారజాతములగు భూతములను, ఇంద్రియములను, మనస్సును, తన్మాత్రలను, సత్వరజస్తమస్సులను జీవకాల స్వభావకర్మ సంస్కారాశయ కృత చరాచర శరీరభేద యుక్తమగు ఈ విచిత్ర విశ్వమును, తనతోపాటు వ్రజధామమును దర్శించి పుత్రునకు అనిష్టము కలిగినదని శంకించి భీతయయ్యెను. భాగ-10-8-37,38,39.

**3 ఆ లలితాంగి కనుంగొనె**
**బాలుని ముఖమందు జలధి, పర్వత, వనభూ**
**గోళ శిఖి తరణి శశి ది**
క్పాలాది కరండమైన బ్రహ్మాండంబున్. భాగ-10-341

6 బ్రహ్మకృత శ్రీకృష్ణస్తుతిః

1 సహస్ర శీర్షా త్వమసి సహస్రాక్ష స్సహస్రపాత్,
త్వం వేదపురుషః పూర్వం దేవదేవ స్సనాతనః.

2 భూతపూర్వం భవిష్యచ్చ వర్తమానం చ యద్విభో,
అమరత్వం త్వయాదత్త మస్మాకం చ రమాపతే

3 ఏతావాన్మహిమాతే ఽస్తి కోనువేత్తి జగత్రయే,
త్వం కర్తా హ్యవితాహం తా త్వం సర్వగతిరీశ్వరః.

శ్రీకృష్ణావతారతత్త్వము 2 భా-173

శ్రీ వాసుదేవుని స్తుతించుట

7 1 శ్రియః కాంత నమస్తే ఽస్తు శ్రీపతే పీతవాససే,
శ్రీద శ్రీశ శ్రీనివాస నమస్తే శ్రీ నికేతన.

2 ఆద్యం పురుషమీశానం సర్వేశం సర్వతోముఖం,
నిష్కలం పరమం కృష్ణ ప్రణతో ఽస్మి సనాతనం.

3 శబ్దాతీతం గుణాతీతం భావాభావ వివర్జితం,
నిర్లేపం నిర్గుణం సూక్ష్మం సర్వం సర్వభావనమ్.

4 ప్రావృణ్మేషు ప్రతీకాశం గోబ్రాహ్మణ హితే రతం,
సర్వేషామేవ గోప్తారం వ్యాపినం సర్వ భావినమ్.

5 శంఖచక్ర ధరం దేవం గదా ముసల ధారిణమ్,
నమస్యే వరదం దేవం నీలోత్పల దళచ్ఛవిమ్.

6 నాగపర్యంకశయనం క్షీరోదార్ణవ వాసినమ్,
నమస్యే ఉహం హృషీకేశం సర్వపాపహరమ్ హరిమ్,
పునస్త్వాం దేవదేవేశం నమస్యే వరదం విభుమ్,
సర్వలోకేశ్వరమ్ విష్ణుం మోక్షకారణ మవ్యయమ్.

శ్రీకృష్ణావతారతత్త్వము 2. భాగ-11 పుట.

## శ్రీ కృష్ణ ద్వాదశనామ స్తోత్రము

8 ప్రథమం తు హరివంద్యా । ద్వితీయం కేశం తథా ।
తృతీయం పద్మనాభం తు । చతుర్థం వామనం తథా ।
పంచమం వేదగర్భం చ । షష్ఠం చ మధుసూదనం ।
సప్తమం వాసుదేవం చ । వరాహం చా ష్టమం తథా ।
నవమం పుండరీకాక్షం । దశమం తు జనార్ధనమ్ ।
కృష్ణమేకాదశం ప్రోక్తం । ద్వాదశం శ్రీధరం తథా ॥

9 శ్రీ కృష్ణ స్తుతిః
అస్తి స్వస్తరుణీ కరాగ్రవిలసత్కల్ప ప్రసూనా ప్లుతం
వస్తు ప్రస్తుత వేణునాదలహరీ నిర్వాణ నిర్వ్యాకులమ్,
స్రస్త స్రస్త నిరుద్ధ నీవి విలసద్గోపీ సహస్రా వృతమ్
హస్తన్యస్తనతాపవర్గమఖిలోదారం కిశోరాకృతిమ్ ॥

శ్రీ.త.-2వ.భా-180

10 శ్రీ కృష్ణుని దర్శించునపుడు పఠించు ధ్యానము.

కస్తూరీ తిలకం లలాట ఫలకే - వక్ష స్థలే కౌస్తుభం,
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కంకణం,
సర్వాంగే హరి చందనం చకలయన్ కంఠే చ ముక్తావళీం,
గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాల చూడామణిః ॥

11 కర్ణుడు శ్రీకృష్ణ పరమాత్మను యిలా ప్రార్థించాడు.

1 సత్యం శౌచం దయా దానం భక్తిరేకా జనార్దనే,
దమనం దక్షతా చైవ దేహిమే మధుసూదన.

తా : సత్యము, శౌచము, దయ, దానము, జనార్దనుని యందు భక్తి, ఇంద్రియ నిగ్రహము, నేర్పరితనము నాకనుగ్రహింపుము. భారతము

2 వ్యాధినా రహితో దేహః ఆధినా రహితో మనః,
స్థిరా శ్రీర్నిత్య భక్తిశ్చ దేహిమే మధుసూదన.

తా : వ్యాధిలేని దేహమును, చింతలేని మనస్సును, నిశ్చలమగు ఐశ్వర్యమును ఎల్లపుడూ భక్తి నాకనుగ్రహింపుము. భారతము.

12 సుదాముడు (మాలాకారుడు) శ్రీ కృష్ణుని ప్రార్థించుట.

సోఽభివవ్రేఽచలాం భక్తిం తస్మిన్నే వాఖిలాత్మని ।
తద్భక్తేషు చ సౌహార్దం భూతేషు చ దయాం పరామ్ ॥

తా : సుదాముడు సర్వాత్ముడగు శ్రీకృష్ణునియందు అచలమగు భక్తిని, ఆయన భక్తులయందు సౌహార్దమును, సర్వభూతములయందు పరమ కారుణ్యమును గలుగజేయవలసినదిగా ప్రార్థించెను. భాగ-10-41-51

13 శిబి చక్రవర్తి ఇంద్రుని - అగ్నిదేవుని ఇలా ప్రార్థించాడు.

1 అవశ్య నశ్వరో దేహో మృత్యు దంష్ట్రాగ్రతోఽన్వహమ్ ।
సంకటే సమనుప్రాప్తే ధర్మేమే స్థీయతాం మతిః ॥

శ్రీమదుత్తరమహాభారతసారోద్ధారము 5వభాగము-690-

తా: ఈ దేహము నిత్యమూ మృత్యుగ్రస్తమై క్షణ భంగురమయినది. ఎన్ని ఇక్కట్లు సంభవించినను నామనస్సు ధర్మము నందే స్థిరముగానుండుగాక.

2 అకారణాత్కారణా ద్వా, కారణా కారణాన్న చ ।
శరీరగ్రహణం వ్యాపిన్ ధర్మత్రాణాయ కేవలమ్ ॥

తా : పాపులవలె నరకమనుభవించుటకుగాని, పుణ్యులవలె స్వర్గమనుభవించుటకుగాని, మనుష్యులవలె సుఖదుఃఖములనుభవించుటకు గాని నీవు శరీరము గ్రహించినవాడవు కావు. కేవలము ధర్మరక్షణ నిమిత్తమే శరీరమును ధరించితివి.

అరణ్యకాండము - 22/విష్ణుపురాణము - 5-1-50

## 14 ధర్మమును గురించి వ్యాసభగవానులేమనిరో చూద్దాం.

ధర్మము వలననే యర్థము కామము కలుగునని చేతులెత్తి యేడ్చినను నామాట ఒకడూ వినడేయని వ్యాసుడేడ్చెను. "ధర్మమూల స్సదైవార్థః కామోర్థ ఫలముచ్యతే" (భార12-12-34) అర్థమునకు ధర్మము మూలము. అర్థఫలము కామము. కావున నర్థకామములు గోరువారును వానికై ప్రత్యేకశ్రమము పడక ధర్మమునకై శ్రమించిన జాలును. అట్లుగాక ధర్మమును విడిచిన యెడల నర్థకామములు లభించవు. లభించినను నిలువవు.

వాల్మీకిరామాయణము, అయోధ్యకాండము 334

"ధర్మ ఏకో మనుష్యాణాం సహాయః పారలౌకికః" మనుష్యులకు పరలోకమునందు సహాయపడునది ధర్మమొక్కటియే. అర్థము కాదు, కామము కాదు. "ధర్మఏవహతోహంతి, ధర్మో రక్షతి రక్షితః"(భారతము) ధర్మమే తన్ను చంపిన వానిని చంపును, రక్షించినవానిని రక్షించును. అర్థకామములు తమ్ము జంపిన వానిని జంపజాలవు. రక్షించినవానిని రక్షింపజాలవు. - భారతయుద్ధమున దుర్యోధనుడు జయముగోరి మాతృ సమక్షమునకేగి "శివమా శం నమే మాతః యుధ్యమానస్యశత్రుభిః" శత్రువులతో యుద్ధము చేయునన్ను శుభము గలుగ దీవించుమని వేడగా "యతోధర్మస్తతో జయః" అనగా ధర్మమెచటగలదో అచట జయముండునని దీవించెను. ఫలితము? ధర్మము పాండవుల ప్రాపున వుంది. కనుకనే జయించారు. "రక్షతే భగవాన్ విష్ణుః భక్తానాత్మ శరీరవత్" భగవంతుడగు విష్ణువు తన భక్తులను తన శరీరమువలె రక్షించెను. "మమ ప్రాణాహిపాండవాః" పాండవులు నాకు ప్రాణములు అని కదా శ్రీకృష్ణ పరమాత్మ చెప్పెను.

గృహం శ్మశానం తవబింబ వర్జితమ్ ।
కథా విహీనాశ్చ గిరి శ్శివా రుతమ్ ।

**శ్వపుచ్ఛవద్దాస్య వినాకృతం వపు ।**
**ర్వదంతి హిత్వయ్యి నివేదితం సదా ॥**

భగవంతుడా! నీ బింబము లేని ఇల్లు శ్మశానము. నీకథలుగాక యుబును పోకకై మాటలాడు మాటలు నక్క ఊలలు. నీ దాస్యము లేని దేహము కుక్కతోక (కుక్కకు తోకయుండియు వ్యర్థము. గుదమును మూయుటకుగాని, ఈగలు వ్రాలినచో దోలుటకుగాని దేనికి బనికిరాదు) నీకు నివేదింపని యన్నము విషము అని పెద్దలు చెప్పుదురు.

**దైవబింబ శూన్య గృహము తలప, కాడు,**
**నలువ కథలులేని పదముల్ నక్క ఊళ,**
**కోరి మ్రొక్కని దేహము కుక్క తోక,**
**ఆరగింపనియన్నము గరళమౌను.**

14 కలియుగములో సత్యమును పలుకుట, దైవారాధన చేయుటయే సకల శుభములకును కారణమగును. "కలౌ సంస్మరణాన్ముక్తిః" (కలియుగములో భగవంతుని నామము కీర్తించినచో ముక్తి కలుగును). "యజ్ఞో వై విష్ణుః" అని వేదవచనము. యజ్ఞమే విష్ణు స్వరూపము. శ్రీమన్నారాయణుని ఆరాధించిన వానికి అపజయమన్నది లేదు.

**ఆరాధనానాం సర్వేషాం విష్ణోరారాధనం పరం ।**
**తస్మాత్పరతరం ప్రోక్తం తదీయారాధనం నృప ॥**

ఆయా దేవతలనారాధించటం కన్న విష్ణువు నారాధించటం మిన్న. ఆయన ఆరాధనం కంటెనూ ఆయన వారినారాధించటం ఇంకా మిన్న.

భక్తి నివేదన 7/2000/14

**"నరాణాం క్షీణం పాపానాం కృష్ణేభక్తిః ప్రజాయతే"**

పాపములన్నియు నశించినగాని కృష్ణభక్తి జనించదు.

శ్రీకృష్ణభగవానుడు భక్తి సులభుడు, ప్రేమమయుడు. తన బిడ్డల కందరికిని తనదర్శనము లభింపవలెననే అతడు సదా అభిలషించుచుండును. జ్ఞానికి బ్రహ్మప్రాప్తివలెను, యోగికి పరమాత్మ ప్రాప్తివలెను, భక్తునికి గూడా సమాధి స్థితియందే భగవద్దర్శనము లభించుచున్నది. అర్చావతారము - 14

"యమేవైషవృణుతే తేన లభ్యః తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ం స్వాం॥
భగవంతుడెవని ననుగ్రహించునో అతనికే తన స్వరూపమును ప్రకాశింపజేయు నననది ఉపనిషద్వాక్యము. ఇంతేకాక భగవంతునియందు ప్రేమ కలిగినవారికే భక్తుడు కోరిన స్వరూపముతో తాను దర్శనమిత్తునని భగవంతుడే చెప్పెను.

అర్చావతారం 16

దాక్షిణేశ్వరదేవాలయమునందు అర్చకుడుగా నుండిన శ్రీరామకృష్ణ పరమ హంసయొక్క తన్మయ స్థితియు, పారమార్థిక జీవనమును ఎవ్వ రెరుంగనిది?

అర్చావతారం 19

## 15 శ్రీకృష్ణ ప్రేమామృత స్తోత్రము

స్తోత్రములన్నిటిలోను అత్యుత్తమ స్తోత్రరత్నము ఈ శ్రీకృష్ణప్రేమామృత స్తోత్రము. "ఓం గోపీజనవల్లభాయ స్వాహా" అను విజయసిద్ధి మంత్రమును సదాశివునిచే నుపదేశింపబడి జపించినను సిద్ధిపొందని పరశురాముడు దాహము తీర్చుకొనుటకు ఒకనదికి వెళ్ళగా, అప్పుడే వచ్చిన మగలేడి తన భార్యతో ఇలా అన్నది. "ఇతడు భార్గవరాముడు. అగస్త్యుని యొద్ద "శ్రీకృష్ణ ప్రేమామృత స్తోత్రము"ను ఉపదేశమును పొంది, దానిని పునశ్చరణము చేసినపుడే సిద్ధి కలుగును." అనవిని అగస్త్యునిచే నుపదేశింపబడి సిద్ధిపొందెను.

బ్రహ్మాండపురాణము.

ఇది శ్రీకృష్ణుని 108 నామములు గలది. భగవంతునికా స్తుతిని పారాయణము చేయువారలయందత్యంత ప్రీతియుండును. సమాహిత చిత్తులై పఠించిన సర్వవాంఛితములు ఫలించును. అంతమున సాయుజ్యము కలుగును. ఇదియే యీ స్తోత్ర ఫలము.

శ్రీకృష్ణః కమలనాథో వాసుదేవ స్సనాతనః,
వసుదేవాత్మజః పుణ్యో లీలామానుష విగ్రహః.

1 శ్రీవత్స కౌస్తుభధరో యశోదావత్సలో హరిః,
చతుర్భుజాత్త చక్రాసి గదా శంఖాద్యుదాయుధః.

2 దేవకీనందనః శ్రీశో నందగోపప్రియాత్మజః,
యమునావేగ సంహారీ బలభద్ర ప్రియానుజః.

3 పూతనాజీవితహర శ్శకటాసురభంజనః,
నందవ్రజ జనానందీ సచ్చిదానంద విగ్రహః.

4 నవనీత విలిప్తాంగో నవనీత నటోఽనఘః,
నవనీత నవాహారా ముచుకుంద ప్రసాదకృత్.

5 షోడశ స్త్రీ సహస్రేశ స్త్రిభంగీ మధురాకృతిః,
శుకవాగమృతాబ్ధీందుర్గోవిందో యోగినాంపతిః.(గోవిదాంపతిః)

6 వత్సవాటచరోఽనన్తో ధేనుకాసురభంజనః,
తృణీకృత తృణావర్తో యమళార్జున భంజనః.

7 ఉత్తాలతాలభేత్తా చ తమాల శ్యామలాకృతిః,
గోపగోపీశ్వరో యోగీ కోటి సూర్యసమప్రభః.

8 ఇలాపతిః పరంజ్యోతి ర్యాదవేంద్రో యదూద్వహః,
వనమాలీ పీతవాసాః పారిజాతాపహారకః.

9 గోవర్ధనా చలోద్ధర్తా గోపాలః సర్వపాలకః,
అజో నిరంజనః కామజనకః కంజలోచనః.

10 మధుహా మధురానాథో ద్వారకానాయకో బలీ,
బృందావనాంతసంచారీ తులసీదామభూషణః.

11 శ్యమంతకమణేర్హర్తా నరనారాయణాత్మకః, (ణాకృతిః)
కుబ్జాకృష్ణాంబరధరో మాయీ పరమపూరుషః.

12 ముష్టికాసురచాణూరమల్లయుద్ధ విశారదః,
సంసారవైరీ కంసారీ మురారి ర్నరకాంతకః.

13 అనాదిబ్రహ్మచారీ చ కృష్ణా వ్యసనకర్షకః, (కర్శకః)
శిశుపాల శిరశ్ఛేత్తా దుర్యోధన కులాంతకః.

14 విదురాక్రూరవరదో విశ్వరూపప్రదర్శకః,
సత్యవాక్సత్య సంకల్ప స్సత్యభామారతో జయీ.

15 సుభద్రా పూర్వజో విష్ణు ర్భీష్మముక్తి ప్రదాయకః,
జగద్గురుర్జగన్నాథో వేణువాద్య(నాద) విశారదః.

16 వృషభాసురవిధ్వంసీ బాణాసుర కరాంతకః,
యుధిష్ఠిరప్రతిష్ఠాతా బర్హి బర్హా వతంసకః.

17 పార్థసారథి రవ్యక్తో గీతామృతమహోదధిః,
కాళీయఫణి మాణిక్యరంజిత శ్రీపదాంబుజః.

18 దామోదరో యజ్ఞభోక్తా దానవేంద్ర వినాశకః,
నారాయణః పరంబ్రహ్మ పన్నగాశనవాహనః.

19 జలక్రీడా సమాసక్త గోపీ వస్త్రాపహారకః,
పుణ్యశ్లోక స్తీర్థపాదో వేదవేద్యో దయానిధిః.

20 సర్వతీర్థాత్మకః సర్వగ్రహరూపీ పరాత్పరః,
ఇత్యేవం కృష్ణ దేవస్య నామ్నా మష్టోత్తరం శతమ్.

21 కృష్ణేన కృష్ణభక్తేన శ్రుత్వా గీతామృతం మహత్,
స్తోత్రం కృష్ణప్రియకరం కృతం తస్మాన్మయా శ్రుతం,
కృష్ణ ప్రేమామృతం నామ పరమానందదాయకమ్.

22 అత్యుపద్రవ, దోషఘ్నం, పరమాయుష్యవర్ధనమ్,
దానం వ్రతం తపస్తీర్థం యత్కృతం త్విహ జన్మని.
ఇతి కృష్ణ ప్రేమామృతస్తోత్రం సంపూర్ణము.

శ్రీకృష్ణావతారతత్త్వము, 12వ భాగము 210 పుట.

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.

## 16 శ్రీ కృష్ణ ష్టోత్తర శతనామావళి అర్థములు

1. ఓం శ్రీకృష్ణాయ నమః — శ్రీకృష్ణదేవునకు నమస్కారము.
2. ఓం కమల నాథాయ నమః — లక్ష్మీపతికి నమస్కారము.
3. ఓం వాసుదేవాయ నమః — వాసుదేవునకు నమస్కారము.

| | |
|---|---|
| 4. ఓం సనాతనాయ నమః | శాశ్వతుడైన వానికి నమస్కారము. |
| 5. ఓం వసుదేవాత్మజాయ నమః | వసుదేవుని కుమారునకు నమస్కారము. |
| 6. ఓం పుణ్యాయ నమః | పుణ్యనిలయునకు నమస్కారము. |
| 7. ఓం లీలామానుష విగ్రహాయ నమః | అద్భుతలీలలను ప్రదర్శించుటకై మానవాకృతిని ధరించిన వానికి నమస్కారము. |
| 8. ఓం శ్రీవత్సకౌస్తుభధరాయ నమః | శ్రీవత్సమనెడి పుట్టుమచ్చనీ, కౌస్తుభమణినీ ధరించిన వానికి నమస్కారము. |
| 9. ఓం యశోదావత్సలాయ నమః | యశోదాదేవి వాత్సల్యమునకు పాత్రుడైన వానికి నమస్కారము. |
| 10. ఓం హరయే నమః | శ్రీహరి యొక్క అవతారమూర్తికి నమస్కారము. |
| 11. ఓం చతుర్భుజాత్త చక్రాసిగదా శంఖ్యాద్యుదాయుధాయ నమః | శంఖ చక్ర గదాది అయుధములను, ధరించిన చతుర్భుజునకు నమస్కారము. |
| 12. ఓం దేవకీనందనాయ నమః | దేవకీ పుత్రునకు నమస్కారము. |
| 13. ఓం శ్రీశాయ నమః | ఐశ్వర్యములకు నాథుడైన వానికి నమస్కారము. |
| 14. ఓం నందగోపప్రియాత్మజాయ నమః | నందగోపుని ప్రియ పుత్రునకు నమస్కారము. |
| 15. ఓం యమునావేగ సంహారిణే నమః | యమునా నదీ ప్రవాహవేగమును నిరోధించిన వానికి నమస్కారము. |
| 16. ఓం బలభద్ర ప్రియానుజాయ నమః | బలరాముని ప్రియసోదరునకు నమస్కారము. |
| 17. ఓం పూతనాజీవిత హరాయ నమః | పూతన ప్రాణములను హరించిన వానికి నమస్కారము. |

| | |
|---|---|
| 18. ఓం శకటాసుర భంజనాయ నమః | శకటాసురుడను రాక్షసుని వధించిన వానికి నమస్కారము. |
| 19. ఓం నందవ్రజ జనానందినే నమః | నందగోకులమునందలి పుణ్యాత్ము లను ఆనందింప జేసినవానికి నమస్కారము. |
| 20. ఓం సచ్చిదానంద విగ్రహాయ నమః | సత్, చిత్, ఆనందములను దేహ ముగా గలవానికి నమస్కారము. |
| 21. ఓం నవనీత విలిప్తాంగాయ నమః | వెన్నచే పూయబడిన దివ్యదేహము గల వానికి నమస్కారము. |
| 22. ఓం నవనీత నటాయ నమః | వెన్నదొంగవలె నటించిన వానికి నమస్కారము. |
| 23. ఓం అనఘాయ నమః | పాపరహితుడైన వానికి నమస్కారము. |
| 24. ఓం నవనీత నవాహారాయ నమః | వెన్నను క్రొత్త ఆహారముగా స్వీకరిం చిన వానికి నమస్కారము. |
| 25. ఓం ముచు(చి)కుందప్రసాదకాయ నమః | ముచు(చి)కుందుని బ్రోచిన వానికి నమస్కారము. |
| 26. ఓం షోడశస్త్రీ సహస్రేశాయ నమః | పదువారువేల గోపికలకు నాథుడైన వానికి నమస్కారము. |
| 27. ఓం త్రిభంగినే నమః | మూడు భంగిమల నభినయించుచు నిలుచున్న వానికి నమస్కారము. |
| 28. ఓం మధురాకృతయే నమః | మధుర భావములను కలిగించే మోహనాకారునకు నమస్కారము. |
| 29. ఓం శుకవాగామృతాబ్ధీందవే నమః | శుకబ్రహ్మ వాక్సుధయనే సాగరము నకు చంద్రుడయిన వానికి నమస్కారము. |
| 30. ఓం గోవిందాయ నమః | వేదాంత వాక్యములను గ్రహించుట |

| | |
|---|---|
| | ద్వారా తెలియబడువానికి నమస్కారము. |
| 31. ఓం యోగినాం పతయే నమః | యోగులకు ప్రభువైన వానికి నమస్కారము. |
| 32. ఓం శ్రీవత్సవాట చరాయ నమః | గోశాలయందు చరించు వానికి నమస్కారము. |
| 33. ఓం అనంతాయ నమః | అనంతుడైన వానికి నమస్కారము. |
| 34. ఓం ధేనుకాసురభంజనాయ నమః | ధేనుకాసురుని వధించిన వానికి నమస్కారము. |
| 35. ఓం తృణీకృత తృణావర్తాయ నమః | తృణావర్తుడనే రాక్షసుని తృణ ప్రాయంగా సంహరించిన వానికి నమస్కారము. |
| 36. ఓం యమళార్జున భంజనాయ నమః | యమళార్జున వృక్షములను గూల్చిన వానికి నమస్కారము. |
| 37. ఓం ఉత్తాలతాలభేత్రే నమః | ఎత్తైన తాటి వృక్షములను ఛేదించిన వానికి నమస్కారము. |
| 38. ఓం తమాల శ్యామలాకృతయే నమః | తమాల వృక్షములవలె శ్యామల వర్ణము గలవానికి నమస్కారము. |
| 39. ఓం గోపగోపీశ్వరాయ నమః | గోపగోపీ జనమునకు ప్రభువైన వానికి నమస్కారము. |
| 40. ఓం యోగినే నమః | యోగీశ్వరునకు నమస్కారము. |
| 41. ఓం కోటిసూర్య సమప్రభాయ నమః | కోటి సూర్యులకు సమమైన కాంతి గలవానికి నమస్కారము. |
| 42. ఓం ఇలాపతయే నమః | ధరణీ నాథునకు నమస్కారము. |
| 43. ఓం పరంజ్యోతిషే నమః | ప్రకాశైక స్వరూపమునకు నమస్కారము. |
| 44. ఓం యాదవేంద్రాయ నమః | యాదవకుల నాయకునకు నమస్కారము. |

| | |
|---|---|
| 45. ఓం యదూద్వహాయ నమః | యదువంశమునకు శిరోభూషణమైన వానికి నమస్కారము. |
| 46. ఓం వనమాలినే నమః | తులసిమాల ధరించినవానికి నమస్కారము. |
| 47. ఓం పీతవాససే నమః | పీతాంబరమును ధరించిన వానికి నమస్కారము. |
| 48. ఓం పారిజాతాప హారకాయ నమః | పారిజాత వృక్షమును స్వర్గము నుండి తెచ్చిన వానికి నమస్కారము. |
| 49. ఓం గోవర్ధనాచలోద్ధర్త్రే నమః | గోవర్ధనగిరి నెత్తినవానికి నమస్కారము. |
| 50. ఓం గోపాలాయ నమః | గోవులను కాపాడినవానికి నమస్కారము. |
| 51. ఓం సర్వపాలకాయ నమః | సర్వజీవులను పాలించువానికి నమస్కారము. |
| 52. ఓం అజాయ నమః | పుట్టుక లేనివానికి నమస్కారము. |
| 53. ఓం నిరంజనాయ నమః | కల్మషరహితునకు నమస్కారము. |
| 54. ఓం కామజనకాయ నమః | మన్మథునికి తండ్రియైన వానికి నమస్కారము. |
| 55. ఓం కంజలోచనాయ నమః | కమలదళ నేత్రునకు నమస్కారము. |
| 56. ఓం మధుఘ్నే నమః | 'మధు' వనెడి రాక్షసుని వధించిన వానికి నమస్కారము. |
| 57. ఓం మధురా నాథాయ నమః | మధురానగరికి ప్రభువైన వానికి నమస్కారము. |
| 58. ఓం ద్వారకానాయకాయ నమః | ద్వారకా పట్టణమునకు ప్రభువైన వానికి నమస్కారము. |
| 59. ఓం బలినే నమః | దైవబలంతో శోభించువానికి నమస్కారము. |
| 60. ఓం బృందావనాంత సంచారిణే నమః | బృందావనమంతటా సంచరించు వానికి నమస్కారము. |

61. ఓం తులసీదామ భూషణాయ నమః తులసీపత్రమాలికచే అలంకృతుడైన వానికి నమస్కారము.

62. ఓం శమంతకమణేర్హర్త్రే నమః శమంతకమణిని అపహరించిన వానికి నమస్కారము.

63. ఓం నరనారాయణాత్మకాయ నమః నరనారాయణుల స్వరూపమైన వానికి నమస్కారము.

## నరనారాయణస్తుతి

తస్మై నమో భగవతే పురుషాయ భూమ్నే
విశ్వాయ విశ్వ గురవే పరదైవతాయ ।
నారాయణాయ ఋషయే చ నరోత్తమాయ
హంసాయ సంయతగిరే నిగమేశ్వరాయ ॥

తా : (మార్కండేయుడు నరనారాయణ రూపుడగు శ్రీహరితో విన్నవించుట) దేవా ! అందువలన నేను విశ్వమూర్తియు, విశ్వగురువు, పరమదైవతము, సర్వ వ్యాప్తియు, పురుష స్వరూపుడు నగు భగవానునకు : విశుద్ధుడు, సంయత వచస్కుడు, వేద మార్గప్రవర్తకుడునగు నరోత్తమునకు నారాయణ ఋషికి నమస్కరించుచున్నాను. భాగవతము 12-8-47

64. ఓం కుబ్జాకృష్టాంబర ధరాయ నమః కుబ్జను గ్రహించి అనుగ్రహించిన వానికి నమస్కారము.

65. ఓం మాయినే నమః మాయను తనయధీనము నందు ఉంచుకొన్న వానికి నమస్కారము.

66. ఓం పరమపురుషాయ నమః పరాత్పరుడైన పురుషోత్తమునికి నమస్కారము.

67. ఓం ముష్టికాసుర చాణూర మల్లయుద్ధ విశారదాయ నమః మల్లయుద్ధ నిపుణులైన చాణూర ముష్టికులను జయించినవానికి నమస్కారము.

68. ఓం సంసారవైరిణే నమః సంసారమనెడి అజ్ఞానమునకు శత్రు వైనవానికి నమస్కారము.

69. ఓం కంసారయే నమః కంసుని అంత మొందించినవానికి నమస్కారము.

| | |
|---|---|
| 70. ఓం మురారయే నమః | మురను అంతమొందించిన వానికి నమస్కారము. |
| 71. ఓం నరకాంతకాయ నమః | నరకాసురుని అంతమొందించిన వానికి నమస్కారము. |
| 72. ఓం అనాది బ్రహ్మచారిణే నమః | ఆదిలేని బ్రహ్మచారికి నమస్కారము. |
| 73. ఓం కృష్ణా వ్యసన కర్శకాయ నమః | ద్రౌపది బాధలను తొలగించినవానికి నమస్కారము. |
| 74. ఓం శిశుపాల శిరచ్ఛేత్రే నమః | శిశుపాలుని మస్తకమును ఛేదించినవానికి నమస్కారము. |
| 75. ఓం దుర్యోధన కులాంతకాయ నమః | దుర్యోధనుని కులమును అంతమొందించినవానికి నమస్కారము. |
| 76. ఓం విదురాక్రూర వరదాయ నమః | విదురునకు అక్రూరునకు వరముల నొసగినవానికి నమస్కారము. |
| 77. ఓం విశ్వరూప ప్రదర్శకాయ నమః | విశ్వరూపమును ప్రదర్శించినవానికి నమస్కారము. |
| 78. ఓం సత్యవాచే నమః | సత్యవచనములు గలవానికి నమస్కారము. |
| 79. ఓం సత్యసంకల్పాయ నమః | సత్యమైన సంకల్పములు గలవానికి నమస్కారము. |
| 80. ఓం సత్యభామారతాయ నమః | సత్యభామయందు ప్రత్యేక ప్రేమగలవానికి నమస్కారము. |
| 81. ఓం జయినే నమః | జయము గలవానికి నమస్కారము. |
| 82. ఓం సుభద్రా పూర్వజాయ నమః | సుభద్రాదేవి కంటె ముందు పుట్టినవానికి నమస్కారము. |
| 83. ఓం విష్ణవే నమః | సర్వవ్యాపకుడైన వానికి నమస్కారము. |
| 84. ఓం భీష్మముక్తి ప్రదాయకాయ నమః | భీష్మునకు మోక్షమును ప్రసాదించినవానికి నమస్కారము. |

| | |
|---|---|
| 85. ఓం జగద్గురవే నమః | జగద్గురువునకు నమస్కారము. |
| 86. ఓం జగన్నాథాయ నమః | జగన్నాయకునకు నమస్కారము. |
| 87. ఓం వేణునాద విశారదాయ నమః | వేణుగానముతో సమస్తమును సమ్మోహింపజేయువానికి నమస్కారము. |
| 88. ఓం వృషభాసుర విధ్వంసినే నమః | వృషభుడనే రాక్షసుని వధించినవానికి నమస్కారము. |
| 89. ఓం బాణాసురఖరాంతకాయ నమః | బాణాసురుడనే వానిని సంహరించినవానికి నమస్కారము. |
| 90. ఓం యుధిష్ఠరప్రతిష్ఠాత్రే నమః | ధర్మజుని వైభవమునకు కారణమైనవానికి నమస్కారము. |
| 91. ఓం బర్హిబర్హావతంసకాయ నమః | నెమిలి పింఛమును ఆభరణముగా గలవానికి నమస్కారము. |
| 92. ఓం పార్థసారథయే నమః | పార్థునికి సారథియైనవానికి నమస్కారము. |
| 93. ఓం అవ్యక్తాయ నమః | వ్యక్తముకాని దివ్యదేహునకు నమస్కారము. |
| 94. ఓం గీతామృతమహోదధయే నమః | భగవద్గీతయనెడి అమృతమునకు సాగరము వంటివానికి నమస్కారము. |
| 95. ఓం కాళీయఫణి మాణిక్యరంజిత శ్రీపదాంబుజాయ నమః | కాళీయుని పడగలపైగల మాణిక్యములచే అలంకరించబడిన చరణకమలములు గలవానికి నమస్కారము. |
| 96. ఓం దామోదరాయ నమః | అపజయములేని దామోదరునకు నమస్కారము. |
| 97. ఓం యజ్ఞభోక్త్రే నమః | యజ్ఞ ఫలము ననుభవించు వానికి నమస్కారము. |
| 98. ఓం దానవేంద్ర వినాశకాయ నమః | రాక్షస నాయకులను వధించినవానికి నమస్కారము. |

| | |
|---|---|
| 99. ఓం నారాయణాయ నమః | నారాయణునకు నమస్కారము. |
| 100. ఓం పరస్మైబ్రహ్మణే నమః | బ్రహ్మలకు బ్రహ్మయైనవానికి నమస్కారము. |
| 101. ఓం పన్నగాశనవాహనాయ నమః | సర్పములను భుజించు గరుడుని వాహనముగా గలవానికి నమస్కారము. |
| 102. ఓం జలక్రీడా సమాసక్తగోపీ వస్త్రాపహారకాయ నమః | జలకములాడు గోపికల వస్త్రములను అపహరించినవానికి నమస్కారము. |
| 103. ఓం పుణ్యశ్లోకాయ నమః | పుణ్యాత్ములచే స్తుతింపబడు వానికి నమస్కారము. |
| 104. ఓం తీర్థపాదాయ నమః | చరణముల యందు పుణ్యతీర్థము గలవానికి నమస్కారము. |
| 105. ఓం వేదవేద్యాయ నమః | వేదములచే తెలియబడు వానికి నమస్కారము. |
| 106. ఓం దయానిధయే నమః | కరుణకు నిధియైన వానికి నమస్కారము. |
| 107. ఓం సర్వ తీర్థాత్మకాయ నమః | సమస్త పుణ్యతీర్థముల స్వరూపమైన వానికి నమస్కారము. |
| 108. ఓం సర్వగ్రహరూపీ పరాత్పరాయ నమః | సర్వగ్రహరూపుడై దేవతలం దరికి అదిదేవుడైనవానికి నమస్కారము. |

శ్రీకృష్ణాష్టోత్తర శతనామావళి అర్థములు సంపూర్ణము.

చైతన్య భాగవతము

## 17 శ్రీకృష్ణ పరబ్రహ్మ స్తోత్రము

1. శ్రీకృష్ణాయ యాదవేంద్రాయ జ్ఞానముద్రాయ యోగినే,
నాథాయ రుక్మిణీశాయ నమో వేదాంత వేదినే.

2. స శంఖచక్రం స కిరీట కుండలం స పీతవస్త్రం సరసీరుహేక్షణం,
సహారవక్షస్థల శోభికౌస్తుభం నమామి విష్ణు శిరసాచతుర్భుజం.

3. అప్రమేయ హరే విష్ణో కృష్ణ దామోదరాచ్యుత,
గోవిందానంత సర్వేశ, వాసుదేవ నమోస్తుతే.

4. గోవింద కేశవ జనార్దన వాసుదేవ విశ్వేశవిశ్వ,
మధుసూదన విశ్వరూప శ్రీపద్మనాభ పురుషోత్తమ.

5. యజ్ఞేశాచ్యుత గోవింద మాధవానంత కేశవ,
కృష్ణ విష్ణో హృషీకేశ వాసుదేవ నమోస్తుతే.

6. నమః కృష్ణాయ దేవాయ బ్రహ్మణే౽నంత మూర్తయే,
యోగీశ్వరాయ యోగాయ త్వాం మహం శరణంగతః.

7. కృష్ణాయ వాసుదేవాయ దేవకీ నందనాయ చ,
నందగోప కుమారాయ గోవిందాయ నమోనమః.

8. నమః పరమ కల్యాణ నమస్తే విశ్వభావనా,
వాసుదేవాయ శాంతాయ యదూనాంపతియేనమః.

9. నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణ హితాయ చ,
జగత్హితాయ కృష్ణాయ గోవిందాయ నమోనమః.

10. ఏకో౽పి కృష్ణస్య సకృత్ప్రణామః । దశాశ్వమేథావ బృథేన తుల్యః,
దశాశ్వమేథీ పునరేతి జన్మ । కృష్ణ ప్రణామీ న పునర్భవాయ.

11. సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాల నందనః,
పార్థోవత్స స్సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్.

12. గీతాశాస్త్ర మిదం పుణ్యం యఃపఠేత్ ప్రయతః పుమాన్,
విష్ణోః పదమవాప్నోతి భయశోకాది వర్జితః.

13. ఆతామ్రపాణీ కమల ప్రణయ ప్రతోద,
మాలోలహార మణీ కుండల హేమసూత్రమ్.

14. అవిశ్రమాంబుకణ మమ్బుదనీల మవ్యా,
ధాద్య ధనంజయ రథా భరణం మహోన.

15. వ్యాసం వశిష్ఠ నప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్,
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్.

16. వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః ।

శ్రీకృష్ణ పరబ్రహ్మస్తోత్రము సంపూర్ణము

స్వస్వరూప సంధానము - 54

## 18 శ్రీకృష్ణాష్టకమ్

1. వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్,
దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుమ్.

2. అతసీపుష్ప సంకాశం హారనూపురశోభితమ్,
రత్నకంకణకేయూరం కృష్ణం వందే జగద్గురుమ్.

3. కుటిలాలకసంయుక్తం పూర్ణచంద్ర నిభాననమ్,
విలసత్కుండలధరం కృష్ణం వందే జగద్గురుమ్.

4. మందారగంధసంయుక్తం చారుహాసం చతుర్భుజమ్,
బర్హి పింఛావ చూడాంగం కృష్ణం వందే జగద్గురుమ్.

5. ఉత్ఫుల్ల పద్మపత్రాక్షం నీలజీమూతసన్నిభమ్,
యాదవానాం శిరోరత్నం కృష్ణం వందే జగద్గురుమ్.

6. రుక్మిణీకేళి సంయుక్తం పీతాంబరసుశోభితమ్,
అవాప్తతులసీగంధం కృష్ణం వందే జగద్గురుమ్.

7. గోపికానాం కుచద్వంద్వ కుంకు మాంకితవక్షసం,
శ్రీనికేతం మహేష్వాసం కృష్ణం వందే జగద్గురుమ్.

8. శ్రీవత్సాంకం మహోరస్కం వనమాలా విరాజితమ్,
శంఖ చక్ర ధరం దేవం కృష్ణం వందే జగద్గురుమ్.

9. కృష్ణాష్టకమిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్,
కోటిజన్మకృతం పాపం స్మరణేన వినశ్యతి.
శ్రీకృష్ణాష్టకమ్ సంపూర్ణము. స్తోత్రరత్నములు - 37

19 శ్రీ కృష్ణాష్టక స్తోత్రము

1. చతుర్ముఖాది సంస్తుతం సమస్త సాత్వతానుతం,
హలాయుధాది సంయుతం నమామి రాధికాధిపమ్.

2. బకాది దైత్య కాలకం గోపాలగోపిపాలకమ్,
మనోహరాశి తారకం నమామి రాధికాధిపమ్.

3. సురేంద్ర గర్వభంజనం విరించి మోహభంజనం,
వ్రజాంగనానురంజనం నమామి రాధికాధిపమ్.

4. మయూరపింఛ మండనం గజేంద్ర దంతఖండనం,
నృశంస కంసదండనం నమామి రాధికాధిపమ్.

5. ప్రదత్త విప్రదారకం సుదామధన్యకారకమ్,
సురద్రు మాపహారకమ్ నమామి రాధికాధిపమ్.

6. ధనంజయే జయావహం మహా చ మూక్షయావహమ్,
పితామహవ్యథాపహం నమామి రాధికాధిపమ్.

7. మునీంద్రశాపకారణమ్ యదు ప్రజాపహారణమ్,
ధరా భరావతారణం నమామి రాధికాధిపమ్.

8. సువృక్షమూల శాయినం మృగారి మోక్షదాయకం,
స్వకీయధామయాయినం నమామి రాధికాధిపమ్.

9. ఇదం సమాహితోహితం వరాష్టకం సదాహితం,
జపజ్జనో జనుర్జరాది తోధృతః ప్రమోదతే.

ఈకృష్ణాష్టకస్తోత్రము ప్రతిదినము మిక్కిలి నిష్ఠతో పఠించుచుండిన యెడల తనకు దారిద్ర్యదుఃఖపాపములు నశించును. 131-266.

## 20 శ్రీకృష్ణ పరమాత్మ ధ్యానము.

పరమేశ్వరా! పరమపావనా! పరమకల్యాణ గుణాభరణా! పాపహరణా! పుండరీకవరదా! పురాణపురుషోత్తమా! భక్తవత్సలా! భవబంధ విమోచనా! పుండరీకనయనా! భుజగేంద్రశయనా! కరుణాకరా! కామితార్థప్రదా! నందకుమారా! నవనీతచోరా! ఇందిరారమణా! ఇభరాజగమనా! సుందరాకారా! మందారోద్ధారా! అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! ఆదిమధ్యాంతరహితా! అప్రమేయా! ఆనందరూపా! అనాథరక్షకా! ఆపద్బాంధవా! కవిలోకరంజనా! కాళీయ గర్వభంజనా! సదానందా! సచ్చిదానందా! ముకుందా! గోవిందా! గజరాజవరదా! గరుడధ్వజా! దానవమర్దనా! జనార్దనా! ధర్మవర్ధనా! దీనజనశరణ్యా! గోవర్ధనోద్ధరణా! గోపికావస్త్రాపహరణా! మునిజనవందితా! ముచుకుందవందితా! ముక్తిప్రదాయకా! మురళీగానవినోదా! కనకమయవసనా! కంసవిధ్వంసనా! రాధామనోహరా! రాకేందువదనా! నీలమేఘశ్యామా! నిర్మలనామా! సర్వేశ్వరా! సర్వతోముఖా! సర్వలోకపూజితా! సత్యసంకల్పా! సత్యపరాయణా! సత్యజనకా! సత్యనిలయా! సత్యాశ్రయా! సత్యనేత్రా! సత్యసంధా! సజ్జనప్రియా! శాంతస్వభావా! అర్జునసఖా! అభిమానరహితా! పాండవపక్షా! ద్రౌపదీమానరక్షకా! దేవకీనందనా! యశోదానందవర్ధనా! అనంతా! అచ్యుతా! అవాఙ్మానసగోచరా! అమోఘశాసనా! నరకాంతకా! నరవరేశ్వరా! నిర్గుణా! నిష్కళంకా! నిరుపద్రవా! నిరంజనా! నిరింద్రియా! నిర్వికల్పా! నిరాకారా! నిర్వికారా! మధుసూదన! అధోక్షజ! నారాయణ! నారసింహా! దామోదరా! వాసుదేవా! వామన! వైకుంఠవాసా! విశ్వంభర! పరమపురుషా! పరంజ్యోతి స్వరూపా! పరంధామా! పురుషోత్తమా! పుణ్యస్వరూపా! పుణ్యనిలయా! పుణ్యభావనా! దేవదేవోత్తమా! దేవతాసార్వభౌమా! స్వయంప్రకాశా! పరతత్త్వదీపా! పరిపూర్ణా! జ్ఞానప్రదా! యోగీశ్వరేశ్వరా! కుచేలవరదా! గుప్తప్రవర్తనా! విశ్వనేత్రా! విశ్వరూపా! విమలచరిత్రా! హరేకృష్ణ! హరేకృష్ణ! హరేకృష్ణ! పాహిమాం! పాహిమాం! పాహి! పాహి! - అని మిక్కిలి దీనతతోస్తోత్రము చేయుచుండిన శ్రీకృష్ణపరమాత్మ తప్పక దర్శనమీయగలడు.

## 21 శ్రీముచుకుందకృత శ్రీకృష్ణస్తుతి.

1. విమోహితో౽యం జన ఈశ మాయయా,
   త్వదీయయా త్వాం న భజత్యనర్థదృక్.

**సుఖాయ దుఃఖ ప్రభవేము సజ్జతే,**

**గృహేషు యోషిత్ పురుషైశ్చ వంచితః.**

ముచుకుందుడు శ్రీకృష్ణపరమాత్మతో యీ విధముగా పలికెను. దేవా! స్త్రీపురుషరూపముతో నున్న ఈ జనుడు నీమాయచే మోహితుడయ్యెను. అందు వలన అనర్థదృష్టి గలవాడై నిన్ను సేవించుటలేదు. కాని పరస్పరము వంచితుడై సుఖేచ్ఛచే దుఃఖజనకమగు గృహమునందే ఆసక్తుడైయున్నాడు.

**2. లబ్ధ్వా జనో దుర్లభమత్ర మానుషం,**

**కథంచిదవ్యంగమయత్నతో ఽనఘః.**

**పాదారవిందం న భజత్య సమ్మతి,**

**ర్గృహాంధకూపే పతితో యథా పశుః.**

అనఘా! మానవుడీ కర్మభూమియందు అదృష్టము వలన అప్రయత్నముగ దుర్లభము, వికలాంగము కానిదియునగు మానవదేహమును బొందియు నీపాదపద్మములను సేవించుటలేదు. కాని పశువువలె విషయ సుఖవాసనలచే గృహమను నంధకూపమున బడుచున్నాడు.

**3. మమైష కాలో ఽజిత నిష్ఫలో గతో**

**రాజ్యశ్రియోన్నద్ధమదస్య భూపతేః,**

**మర్త్యాత్మబుద్ధేః సుతదారకోశభూ**

**ష్వాసజ్జమానస్య దురంత చింతయా.**

అజితుడా! నేను కూడ దేహాత్మబుద్ధి విశిష్టుడను, భార్యాపుత్రుల యందు, ధనమునందు, రాజ్యమునందు ఆసక్తిగలవాడను. రాజసంపదచే మిగుల మత్తిల్లినవాడనై, దురంతచింతచే, నింతవరకు వ్యర్థముగ కాలము గడిపితిని.

**4. కళేబరే ఽస్మిన్ ఘటకుడ్యసన్నిభే**

**నిరూఢమానో నరదేవ ఇత్యహమ్,**

**వృతో రథేభాశ్వపదాత్యనీకపై**

**ర్గాం పర్యటంస్త్వాగణయన్ సుదుర్మదః.**

ఇంతవరకును ఘటకుడ్యములవలె అనాత్మపదార్థమైన శరీరమునందు "నేను మానవుల కధిపతి" నను అభిమానము గలవాడనై గజాశ్వరథపదాతుల

తోను, సైనికులతోను పరివృతుడవై భూమియందు పర్యటించుచు నిన్ను తలంపక మిగుల గర్వితుడనైతిని.

5. ప్రమత్తముచ్చైరితికృత్యచింతయా
ప్రవృద్ధలోభం విషయేషు లాలసమ్,
త్వమప్రమత్తః సహసాభిపద్యసే
క్షుల్లేలిహానోऽహిరివాఖుమంతకః.

దేవా! "ఈ పనియైన తరువాత యాపని చేయుదు"నను కోరికల పరంపర ననుసరించి మానవుడు మిగుల శ్రద్ధలేనివాడై విషయాసక్తుడై విషయములను బొందియు మరల లోభగ్రస్తుడగు మానవుని ఆకలిగొనిన సర్పము వెంటనే మూషికమును బట్టుకొనినట్లు నిత్యప్రబుద్ధుడవు, కాలరూపుడవునగు నీవు ఆక్రమింతువు.

6. పురా రథైః రే రేమపరిష్కృతైశ్చరన్
మతంగజైర్వా నరదేవసంజ్ఞితః,
స ఏవ కాలేన దురత్యయేన తే.
కలేవరో విట్కృమిభస్మ సంజ్ఞితః.

తా : పూర్వమున ఏ దేహము సువర్ణమండిత రథములు లేదా ఏనుగులతో దిరుగునపుడు రాజని చెప్పబడుచుండునో ఆదేహమే దురతిక్రమణీయమగు కాలగతి ననుసరించి విష్ఠ(మలము) కృమి(పురుగ) లేదా భస్మము అని చెప్ప బడును.

7. నిర్జిత్య దిక్చక్రమభూతవిగ్రహో
వరాసనస్థః సమరాజవందితః,
గృహేషు మైథున్యసుఖేషు యోషితాం
క్రీడామృగః పూరుష ఈశ నీయతే.

దేవా! సర్వదిగ్మండలమును జయించి సంగ్రామశూన్యావస్థయందున్న వాడు, ఉత్తమసింహాసనమును అధిష్ఠించి యున్నవాడు, తనవంటి రాజులచే సన్మానితుడైనవాడు నగు పురుషుడు గూడ కాముకస్త్రీల మైథునసుఖయుక్తుడై గృహమునందు క్రీడామృగమువలె ఇటునటు త్రిప్పబడుచుండును.

సకల దిశలు గెలిచి సములు వర్ణింపంగ
జారుపీఠ మెక్కి సార్వభౌము
డైన సతుల గృహములందు క్రీడాభోగ
వృత్తి నుండు నిన్ను వెదకలేడు (10-1659)

8. కరోతి కర్మాణి తపస్సునిష్ఠితో
నివృత్తిభోగ స్తదపేక్షయాదదత్,
పునశ్చ భూయాసమహం స్వరాడితి (భూయేయ)
ప్రవృద్ధతర్షో న సుఖాయ కల్పతే. భాగవతరత్నాకరము

అధిక విషయభోగలాలసుడగు వ్యక్తి "నేను జన్మాంతరమున ఇంద్రత్వ మును బొందెద" నను సంకల్పమునకు వశుడై ఐహిక భోగశూన్యావస్థలో తపస్సునందు ఆసక్తుడగుటచే సుఖానుభవసమయమును పొందజాలడు.

9. భవాపవర్గో భ్రమతో యదా భవే-
జ్జనస్య తర్హ్యచ్యుత సత్సమాగమః,
సత్సంగమో యర్హి తదైవ సద్గతౌ
పరావరేశే త్వయి జాయతే మతిః

అచ్యుతా ! ఇట్లు సంచరించు స్వభావముగల వ్యక్తికి యెప్పుడు బంధనదశ తొలగునో అప్పుడే సత్సాంగత్యము కలుగును. ఎప్పుడు సత్సాంగత్యము కలుగునో అప్పుడే సాధువులకు పరమగతి స్వరూపుడవు, నిఖిల కార్యకారణుడవు, నియంతవునగు నీయందు భక్తికలుగును. దానివలననే ముక్తి లభించును.

10. మన్యే మమానుగ్రహ ఈశ తే కృతో
రాజ్యానుబంధాపగమో యదృచ్ఛయా,
యః ప్రార్థ్యతే సాధుభి రేక చర్యయా
వనం వివిక్షద్భిరఖండభూమిపైః

దేవా! తపస్సుకై వనమునకు వెడలగోరువారు, వివేకులునగు రాజులు, ఏకాంతనిష్ఠతో నీ ధ్యానభక్తి సిద్ధికై రాజ్యబంధనములు తొలగవలయునని ప్రార్థింతురు. కాని నా యొక్క యా రాజ్యాదిబంధనము దాని యంతటదియే

విచ్ఛిన్నమైనది. అదినీయనుగ్రహము వలననే సంభవించినదని తలంచు చున్నాను.

11. న కామయేఽన్యం తవ పాదసేవనా
దకించనప్రార్థ్యతమాద్వరం విభో,
ఆరాధ్య కస్త్వాం హ్యపవర్గదం హరే
వృణీత ఆర్యో వరమాత్మబంధనమ్. ప(ప)రమాత్మ

దేవా! అకించనులకు గొప్పగా ప్రార్థనీయమైన నీపాదపద్మ సేవనుతప్ప ఇతరవరమును నేను గోరను. ముక్తి నొసంగునట్టి నిన్ను ఆరాధించి బంధనమునకు గారణమైన వరమును తెలివిగలవాడెవ్వడు కోరును?

12. తస్మాద్విసృజ్యాశిష ఈశ సర్వతో
రజస్తమ స్సత్త్వగుణానుబంధనాః,
నిరంజనం నిర్గుణమద్వయం పరం
త్వాం జ్ఞప్తిమాత్రం పురుషం వ్రజామ్యహమ్.

దేవా! అందువలన నేను సంపూర్ణముగ సత్త్వరజస్తమోగుణ సంబంధము గలిగిన కామ్య విషయములను పరిత్యజించి అద్వయుడవు, నిర్గుణుడవు, నిరుపాధికుడవు, సచ్చిదానందవిగ్రహుడవు, అక్షరుడవు, పరమపురుషుడవునగు నిన్ను శరణు బొందుచున్నాను.

13. చిరమిహ వృజినార్త స్తప్యమానోఽనుతాపై
రవితృషషడమిత్రోఽలబ్ధశాన్తిః కథంచిత్,
శరణద సముపేత స్త్వత్పదాబ్జం పరాత్మన్
అభయమృతమశోకం పాహి మాఽఽపన్నమీశ.

శరణప్రదాతా! పరమాత్మా! ఈశా! నేనీలోకమున చాలాకాలము కర్మఫలముచే పీడితుడను, అనుతాపములచే తప్తుడను, తృష్ణాపీడితములైన ఇంద్రియ శత్రువుల తాడనములచే శాంతిశూన్యుడను నై దైవవశమున సత్యము, అభయము, అశోకము నగు నీ పాదపద్మమును శరణుబొందితిని. ఆపదలో జిక్కుకొనిన వీనిని రక్షింపుము. భాగవతము 10-51-45,57.

శ్రీముచుకుందకృత శ్రీకృష్ణస్తుతి సంపూర్ణము

## 22 శ్రీకృష్ణదండకము

శ్రీశారదాంభోజపత్రేక్షణా చిత్తపద్మోవలగ్నాసితేందిందిరా! ఇందిరాసుందరీ రమ్య సౌదామినీ శోభితాంభోద నీకాశ వక్షస్థలీహార రత్నావళీ కాంతిరేఖా సముద్ద్యోతితాశేషలోకా! త్రిలోకాంతరస్థాఖిల ప్రాణిహృత్పంక జావాస జీవాత్మ తాంశస్థితి ప్రాభవా! భావనామాత్ర సంతుష్ట దివ్యాంతరంగా! తరంగాయితోత్తాల కారుణ్యవాఃపూర హైమీకృత స్వాశ్రితానూన సంసార తాపత్రయ క్లేశభారా! స్వభారాజితాకాశ విభ్రాజితాదిత్యతారావళీనాథ నక్షత్ర పాళీగ్రహాళీ ముఖానేక రుట్మండలా! మండలాకార సంవిష్ట గోపీ సమాజాంత రారబ్ధరాసైకలీలా సము త్సాహ కృద్వేణుగానామృతాసార సుస్నాపితాశేషలోక ప్రజాచిత్తకేదారవారా! త్రివా రాభి ధామంత్రణోద్ఘాత నిర్వ్యాజ కారుణ్యధారా సముత్పాటితానేక పాధీశదుః ఖద్రుమా! మాస సంవత్సరాది ప్రమాణానుమేయ ప్రభా ఇ_చింత్య కాలస్వరూపా! స్వరూపానుసంధానచాతుర్యధౌరేయ నీవార ముష్టింప చాగోచరోదార హృత్కోశ మూలాంతర స్థాయి తేజో మహత్త్వ ప్రపూర్ణా! ప్రపూర్ణామృతస్థానసంస్థాపిత స్వీయ సద్భక్తలోకా! త్రిలోకాధివాసుల్ మహాదుర్లభంబైన నీదివ్యరూపంబు గన్నార జూడంగ వాంఛించి యెన్నో తపంబుల్ వ్రతంబుల్ మహాయజ్ఞయాగాదులుం జేసియున్ గానలేకుండి రన్నన్, భవత్పాద పంకేరుహ ద్వంద్వ మొక్కింత డెందంబునం గూర్పలేనట్టి యత్యల్పుడన్ నేను నీ దర్శనంబున్ మదిం గోరుటం జూడ జాత్యంధరంభాదిదృక్షాసమం బౌనుగాదే ! యిదేలన్న, నోవాసుదేవా! సదా నామసంకీర్తనాసక్తులెల్లన్ భవత్ప్రీతి పాత్రంబులై యుంట వీక్షించి, నీ సత్కృపం గోరి, నీనామ వర్ణంబులై యొప్పు వేదాక్షరంబుల్ మహాభక్తితో జిహ్వకుం జేర్చు నన్నుం గటాక్షించి రక్షింపవే! వేదమూర్తీ! హరీ! దుగ్ధవారాశి గంభీరమౌ నీదు కారుణ్యపీయూష సంపాదనం గోరి యేకోన పంచద్వయీ రంధ్ర సంయుక్తమౌ నీ ఘటంబున్ వెసం దెచ్చుకొన్నాడ : నేడెట్టు లిద్దాని బూరించి కాపాడెదో దేవ! దేవాధినాథాదులే నీదు సంపూర్ణ శక్తి ప్రభావంబులన్ నోర గీర్తింపలేరే! జగద్వారి రాశిన్ మహాల్పాల్పయాదఃకణం బట్లు నేనెంతవాడన్! హృషీకేశ! యీశాను వాణీ(గీ)శ సంస్తుత్యనామా! ప్రణామంబులంజేసి నీ లీలలం బాడెదన్ నాకు జన్మాంతరప్రాప్తి బంధంబులం బాపి నీలో ననున్ జేర్చి ఆనందలీలాను సంధాయ కంబైన ముక్తిం బ్రసాదింపవే। కావరావే! ముకుందా! మురారీ నమస్తే నమస్తే నమస్తే నమః.

బ్రహ్మవైవర్తపురాణము 255

## 23 గర్గ కృత శ్రీకృష్ణ స్తుతిః

1. హే కృష్ణ జగతాం నాథ భక్తానాం భయ భంజన,
   ప్రసన్నోభవ మామీశ దేహి దాస్యం పదాంబుజే.
2. త్వత్పిత్రామే ధనం దత్తం తే నమే కిం ప్రయోజనమ్,
   దేహిమే నిశ్చలాం భక్తిం భక్తానా మభయప్రద.
3. అణిమాదికాది సిద్ధేషు యోగేషు ముక్తిషు ప్రభో,
   జ్ఞాన తత్వే ఽమరత్వేవా కించిన్నాస్తి స్పృహామమ.
4. ఇంద్రత్వేవా మమత్వేవా స్వర్గలోక ఫలే చిరం,
   నాస్తిమే మనసో వాంఛా త్వత్పాద సేవనం వినా.
5. సాలోక్యం సార్ష్టి సారూప్యే సామీప్యే కత్వ మీప్సితమ్,
   నాహం గృష్ణామితే బ్రహ్మన్ త్వత్పాద సేవనం వినా.
6. గోలోకేవాపి పాతాళే వాసే నాస్తి మనోరథః,
   కింతుతే చరణాంభోజే సంతతం స్మృతిరస్తు మే.
7. త్వన్మంత్రం శంకరాత్ప్రాప్య కతిజన్మ ఫలోదయాత్,
   సర్వజ్ఞో ఽహం సర్వదర్శీ సర్వత్ర గతిరస్తు మే.
8. కృపాం కురు కృపాసింధో దీనబంధో పదాంబుజే,
   రక్షమామభయం దత్వా మృత్యుర్మే కిం కరిష్యతి.
9. సర్వేషా మీశ్వర శ్చర్వ స్త్వ త్పాదాంభోజ సేవయా,
   మృత్యుంజయో ఽన్త కాలశ్చ బభూవ యోగినాం గురుః.
10. బ్రహ్మ విధాతా జగతాం త్వత్పాదాంభోజ సేవయా,
    యస్యైక దివసే బ్రహ్మన్ పతం తీంద్రాశ్చతుర్దశ.
11. త్వత్పాద సేవయా ధర్మసాక్షీ చ సర్వ కర్మణా,
    పాతా చ ఫలదాతా చ జిత్వాకాలం సుదుర్జయం.

12. సహస్రవదనశ్శేషో యత్పాదాంబుజ సేవయా,
ధత్తే సిద్ధార్థ విద్వీశ్వం శివః కంఠే విషం యథా.

13. సర్వ సంపద్వి ధాత్రీ యాదేవీనాం చ పరాత్పరా,
కరోతి సతతం లక్ష్మీః కేశై స్త్వత్పాద మార్జనమ్.

14. ప్రకృతిర్బీజ రూపాసా సర్వేషాం శక్తి రూపిణీ,
స్మారం స్మారం త్వత్పదాబ్జం బభూవ త్వత్పరావరా.

15. పార్వతీ సర్వరూపా సా సర్వేషాం బుద్ధి రూపిణీ,
త్వత్పాద సేవయా కాంతం లలాభ శివమీశ్వరమ్.

16. విద్యాదిష్ఠాతృదేవీ యాజ్ఞాన మాతా సరస్వతీ,
పూజ్యా బభూవ సర్వేషాం సంపూజ్య త్వత్పదాంబుజమ్.

17. సావిత్రీ వేదజననీ పూనాతి భువనత్రయమ్ ।
బ్రహ్మణో బ్రాహ్మణానాం చ గతిస్త్వ త్పాద సేవయా.

18. క్షమా జగద్వి భర్తుం చ రత్నగర్భా వసుంధరా,
ప్రసూతిస్సర్వ సస్యానాం త్వత్పాదాంబుజ సేవయా.

19. రాధామమాంశ సంభూతా తవతుల్యా చ తేజ సా,
స్థిత్వా వక్షసితే పాదం సేవతేఽన్యస్యకా కథా.

20. యథా శర్వాదయో దేవా దేవ్యః పద్మాదయో యథా,
తథా సనాథం కురుమాం, ఈశ్వర త్వత్కృపా స్పదమ్.

21. నయస్వామి గృహం నాథన గృష్ణామి ధనం తవ,
కృత్వా మాం రక్ష పాదాబ్జ సేవాయాం సేవకం రతమ్.

ఇతిగర్గకృత శ్రీకృష్ణస్తుతిః సంపూర్ణము.

శ్రీకృష్ణావతారతత్త్వం, 2వ భాగము, 366 పుట-141

## 24. అక్రూరకృత శ్రీకృష్ణస్తుతి

**నమః కారణ మత్స్యాయ ప్రలయాబ్ధి చరాయ చ,**
**హయశీర్ష్ణే నమస్తుభ్యం మధుకైటభమృత్యవే.**

నీవు ప్రళయ సముద్రమున సంచరించు సర్వకారణ మత్స్యరూపుడవు, మధుకైటభులను సంహరించిన హయగ్రీయు రూపుడవు నగు నీకు నమస్కరించుచున్నాను.

**2. అకుపారాయ బృహతే నమో మన్దరధారిణే,**
**క్షిత్యుద్ధార విహారాయ నమః సూకరమూర్తయే.**

దేవా! మందరపర్వతమును ధరించిన గొప్ప ఆకారము గలిగిన కూర్మ రూపుడవు, ప్రళయ సముద్రము నుండి పృథ్వి నుద్ధరించిన వరాహరూపమును ధరించినవాడవునగు నీకు నమస్కరించుచున్నాను.

**3. నమస్తే ఉద్భుత సింహాయ సాధులోక భయాపహ,**
**వామనాయ నమస్తుభ్యం క్రాంత త్రిభువనాయ చ.**

సజ్జనభయవినాశనా! అద్భుతమైన నృసింహరూపమును ధరించిన వాడవు, పాదవిన్యాసముతో ముల్లోకముల నాక్రమించు వామనరూపమును ధరించిన వాడవు నగు నీకు నమస్కరించుచున్నాను.

**4. నమోభృగూణాం పతయే దృప్తక్షత్రవనచ్ఛిదే,**
**నమస్తే రఘువర్యాయ రావణాన్త కరాయ చ.**

దేవా! గర్వితులగు క్షత్రియులనెడు వనమును ధ్వంసము చేసిన పరశు రాముని రూపమును ధరించిన వాడవు, రావణుని సంహరించిన రామచంద్ర రూపమును ధరించిన వాడవునగు నీకు నమస్కరించుచున్నాను.

**5. నమస్తే వాసుదేవాయ నమః సంకర్షణాయ చ,**
**ప్రద్యుమ్నాయానిరుద్ధాయ సాత్వతాం పతయేనమః**

దేవా! వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధరూపుడవు యాదవాధిపతివగు నీకు నమస్కారము.

**6. నమో బుద్ధాయ శుద్ధాయ దైత్యదానవమోహినే,**
**మ్లేచ్ఛప్రాయ క్షత్ర హన్త్రే నమస్తే కల్కి రూపిణే.**

భగవానుడా! వేదవిరుద్ధ శాస్త్రములను సృష్టించి, దైత్యులను దానవులను మోహిపరచినవాడవు, నిర్దోషస్వభావుడవు, బుద్ధరూపుడవు, మ్లేచ్ఛుల వంటి క్షత్రియులను నాశనము చేయు కల్కి రూపుడవునగు నీకు నమస్కరించు చున్నాను. భాగవతము 10-40-17,22

సర్వం శ్రీకృష్ణ పరబ్రహ్మార్పణమస్తు.

## 25 శాపవిమోచనము పొందిన నలకూబర మణిగ్రీవులు శ్రీకృష్ణుని స్తుతించుట

**కృష్ణ కృష్ణ మహాయోగిం స్త్వ మాద్యః పురుషః పరః,**
**వ్యక్తా వ్యక్త మిదం విశ్వం రూపం తే బ్రాహ్మణా విదుః.**

ఓ కృష్ణా! ఓ కృష్ణా! నీ ప్రభావ మచింత్యమైనది. నీవు పరమ పురుషుడవు. జగత్తునకు మూలకారణము ఉపాదాన కారణమునై యున్నావు. బ్రహ్మవేత్తలు ("సర్వ ఖల్విదం బ్రహ్మ తజ్జలాన్") మున్నగు వేదవాక్కుల ననుసరించి) స్థూల సూక్ష్మాత్మకమగు నీ జగత్తు నీ(ప్రాకృత) రూపమనియే చెప్పుచున్నారు.

భాగ-10-10-29

## 26 శ్రీ కృష్ణ భగవానుడు గోపికలతో నిట్లు పలికెను.

**శ్రవణాద్దర్శనాద్ధ్యానాన్మయి భావో ఽ నుకీర్తనాత్,**
**న తథా సన్నికర్షేణ ప్రతియాత తతో గృహాన్.**

ముఖ్యముగా నాకథను శ్రవణము చేయుట వలన, నామూర్తిని దర్శించుట వలన, ధ్యానించుట వలన, అనుక్షణము నా నామమును కీర్తించుట వలన నాయందెట్టి ప్రేమ కలుగునో నాకడనున్నందువలన అట్టి ప్రేమ కలుగదు. అందువలన మీరు మీయిండ్లకు దిరిగి వెడలుడు. భాగ-10-29-27.

**గోపికా గీతము**

**తవ కథామృతం తప్తజీవనం**
**కవి భిరీడితం కల్మషాపహమ్।**
**శ్రవణ మంగళం శ్రీమదాతతం**
**భువి గృణంతి తే భూరిదా జనాః ॥**

నీ కథామృతము నీవిరహకాతరులగు జనులకు జీవనము, ప్రహ్లాదుడు,

ధ్రువుడు, మున్నగు భక్తులు గూడ దానిని స్తుతించుచుండిరి. అది ప్రారబ్ధ పాపమును, అప్రారబ్ధ పాపమును నాశనము చేయును. శ్రవణ మాత్రమున శుభము నొసంగును. ప్రేమ సంపద నొసంగును. అది కీర్తించువారిచే విస్తృత మైనది. అందువలన దానిని గీర్తించునట్టివాడే గొప్పదాత.

## 41.1 రాధా షోడశ నామములు

రాధా, రాసేశ్వరి, రాసవాసినీ, రసికేశ్వరీ,
కృష్ణ ప్రాణాధికా, కృష్ణ ప్రియా, కృష్ణ స్వరూపిణీ,
కృష్ణ వామాంగ సంభూతా, పరమానందరూపిణీ,
కృష్ణా, బృందావనీ, బృందా, బృందావన వినోదినీ,
చంద్రావతీ, చంద్రకాంతా, శతచంద్రనిభాననా.

శ్రీ కృష్ణావతారతత్త్వము, 3వ భాగము 207

## 41. 2. శ్రీలక్ష్మీస్తుతులు



### శ్రీలక్ష్మి సుప్రభాతమ్

1. ఉత్తిష్ఠోత్తిష్ఠ శ్రీలక్ష్మి ఉత్తిష్ఠ కమలాలయే।
ఉత్తిష్ఠ జగదాధారే! త్రైలోక్యం మంగళం కురు॥

2. "శ్రీం"బీజయుక్త మహితే ! నిగమాంత వేద్యే! ।
"హ్రీం" శక్తిధారిణీ ! సనాతని ! పద్మహస్తే !॥
"క్లీం" కీలకాక్షరి ! దయారసహార్ద్ర చిత్తే !।
శ్రీలక్ష్మి! భక్తవరదే ! తవసుప్రభాతమ్॥

3. సౌభాగ్యలక్ష్మి ! ధనలక్ష్మి ! సువర్ణలక్ష్మీ !।
సంతానలక్ష్మి ! వరలక్ష్మి ! విశుద్ధలక్ష్మీ !॥
ఐశ్వర్యలక్ష్మి ! గజలక్ష్మి ! విభూతిలక్ష్మీ !।
శ్రీలక్ష్మి ! భక్తవరదే ! తవసుప్రభాతమ్ !॥

4. సౌందర్యలక్ష్మి ! జయలక్ష్మి ! స్వరాజ్యలక్ష్మి !!
కల్యాణలక్ష్మి! గృహలక్ష్మి! త్రిలోకలక్ష్మి!!!
సాయుజ్యలక్ష్మి ! స్థిరలక్ష్మి ! వికుంఠలక్ష్మి !!!
శ్రీలక్ష్మి ! భక్తవరదే ! తవసుప్రభాతమ్ !!!

5. సంగీతలక్ష్మి ! స్వరలక్ష్మి ! సరాగలక్ష్మి !!
సాహిత్యలక్ష్మి ! రసలక్ష్మి ! వసంతలక్ష్మి !!!
విజ్ఞానలక్ష్మి ! వనలక్ష్మి ! విరాగలక్ష్మి !!
శ్రీలక్ష్మి ! భక్తవరదే ! తవ సుప్రభాతమ్ !!!

6. భూలక్ష్మి ! భార్గవి ! మహోజ్జ్వల యుక్తలక్ష్మి !!
సంక్రాంతిలక్ష్మి ! సుమనోహర ధాన్యలక్ష్మి !!!
సద్ధర్మలక్ష్మి ! సరసీరుహ హస్తలక్ష్మి !!
శ్రీలక్ష్మి ! భక్తవరదే ! తవసుప్రభాతమ్ !!!

7. శ్రీ విష్ణు హృత్కమలవాసిని ! లోకరక్షే !!
నిత్యాత్మ తత్త్వపరిశోభిత సత్కటాక్షే !!!
భక్తేప్సితార్థ పరిపూరణ కల్పవృక్షే !!
శ్రీలక్ష్మి ! భక్త వరదే ! తవసుప్రభాతమ్ !!!

8. బ్రహ్మస్వరూపిణీ ! వికాసిత పద్మమాలే !!
సింధూరవర్ణ తిలకే ! సువిశాలఫాలే !!!
ఆద్యంతకాల రహితే ! శ్రితలోకపాలే !!
శ్రీలక్ష్మి ! భక్తవరదే ! తవసుప్రభాతమ్ !!!

9. శ్రీదేవి చారుచరితే ! సురలోకపాత్రే !!
వాగ్దేవి ! గానరసికే ! శశి సూర్యనేత్రే !!!
భూదేవి ! కష్ట శమనే ! వరమంజుగాత్రే !!
శ్రీలక్ష్మి ! భక్తవరదే ! తవసుప్రభాతమ్ !!!

10. సంపూర్ణ చంద్రవదనే ! రుచిరావతారే ॥
పున్నాగజాజి కుసుమాంచిత కంఠహారే ॥
క్షీరార్ణవోద్భవి ! వికుంఠపురీ విహారే ॥
శ్రీలక్ష్మి ! భక్తవరదే ! తవసుప్రభాతమ్ ॥

11. సర్వప్రకృష్ట గుణశీల వతాం ప్రసన్నే ॥
సేవ్యప్రియే ! కుసుమచందన యుక్తధన్యే ॥
ధర్మార్థకామ ఫలదాయిని ! కుందదన్తే ॥
శ్రీలక్ష్మి ! భక్తవరదే ! తవసుప్రభాతమ్ ॥

12. శృంగార దివ్యమణి రంజిత హేమపీఠే ॥
దౌర్జన్య దర్పగుణ నాశిని ! బీజహర్మ్యే ॥
సద్ధర్మవర్తని ! సురార్చిత పాదయుగ్మే ॥
శ్రీలక్ష్మి ! భక్తవరదే ! తవసుప్రభాతమ్ ॥

13. దారిద్ర్యమోచని ! దయామయి ! ధర్మకర్త్రః ॥
సౌభాగ్యవర్థిని ! జనార్దని లోకమాతః ॥
పద్మాలయే ! భవవినాశిని ! యోగమాయే ॥
శ్రీలక్ష్మి ! భక్తవరదే ! తవసుప్రభాతమ్ ॥

14. ఐశ్వర్యకారిణి ! నిరంజని ! సత్య బుద్ధే ॥
రంభాదినాట్యగణికాజన నృత్యముగ్ధే ॥
కస్తూరికాగరు సువాసిత గంధవక్షే ॥
శ్రీలక్ష్మి ! భక్తవరదే ! తవసుప్రభాతమ్ ॥

15. ధ్యాయంతి భక్త మనుజాః తవదివ్యనామ॥
కూజంతి కోకిల గణాః "కుహూకూ" నినాదైః॥
గాయంతి గాయకజనాః కమనీయరాగైః ।
శ్రీలక్ష్మి ! భక్తవరదే ! తవసుప్రభాతమ్ ॥

16. శ్రీవిష్ణు చిత్తతనయే ! సుగుణాంబురాశే !।
లోకైకమోహిని ! శివంకరి ! చిద్విలాసే !॥
ఉత్తిష్ఠమాధవి ! సుమంగళ మంజులాస్యే !।
శ్రీలక్ష్మి ! భక్తవరదే ! తవసుప్రభాతమ్ !॥

17. సంసార దుఃఖభయహారిణీ !ముక్తిమార్గే !।
వైకుంఠనాథదయితే ! ప్రకట ప్రభావే !॥
సర్వార్తిభంజని "విరంచి" నుత ప్రమోదే !।
శ్రీలక్ష్మి! భక్తవరదే! తవసుప్రభాతమ్!!॥

18. ఇదం శ్రీ సుప్రభాతాఖ్యం। శ్రీలక్ష్మి బీజ సంయుతం।
యేపఠంతి సదా భక్త్యా తే సర్వే సుఖమాప్నుయాత్॥

శ్రీలక్ష్మి సుప్రభాతమ్‌ను ముద్రించుటకు అనుమతించిన శ్రీ భాష్యకర్త దివ్యధర్మసూరి, గీతాచార్య విరించి లేఖినీ నామక శ్రీమాన్ శ్రీమన్నంపన్ముడుంబై రంగకృష్ణమాచార్యుల వారికి నా కృతజ్ఞతాభి వందనములు.

3. సర్వకామప్రదాం రమ్యాం, సంసారార్ణవ తారిణీమ్।
క్షిప్ర ప్రసాదినీం లక్ష్మీం, శరణ్యా మనుచింతయేత్॥

తా : సమస్తమైన కోరికల నిచ్చునదియు, రమ్యమైనదియు, సంసార సాగరము నుండి భక్తుల దరింప జేయునదియు, శీఘ్రముగ ననుగ్రహించునదియు, సర్వ లోకశరణ్యయునగు లక్ష్మీదేవిని సర్వపాప పరిహారార్థము తక్కిన ప్రాయశ్చిత్తముల వదలి శరణు చొరవలయును. వా.రా.బా.కాండ - 26

4. శరదిందు వికాస మందహాసామ్
స్ఫురదిందీవర లోచనాభిరామామ్,
అరవింద సమాన సుందరాస్యామ్
అరవిందాసన సుందరీ ముపాసే.

తా : శరత్కాలమందలి చంద్రుని కాంతి వంటి చిరునవ్వు గలిగినది, వికసించిన నల్ల కలువల వంటి కన్నులతో ప్రకాశించేది, పద్మం వంటి సుందరమైన ముఖం గలిగినది, పద్మాసనంతో శోభిల్లేది అయిన లక్ష్మీదేవిని సేవిస్తూ ఆమెకు నమస్కరిస్తున్నాను. లక్ష్మీదేవి ప్రార్థన వల్ల అష్టైశ్వర్యాలు చేకూరుతాయి.

## 5 శ్రీలక్ష్మి అష్టోత్తర శతనామస్తోత్రము

దేవ్యువాచ:-

దేవదేవ! మహాదేవ! త్రికాలజ్ఞ! మహేశ్వరః ।
కరుణాకర! దేవేశ! భక్తానుగ్రహకారక ।
**అష్టోత్తరశతం లక్ష్మ్యాః, శ్రోతు మిచ్ఛామి తత్త్వతః॥**

ఈశ్వర ఉవాచ:-

1. దేవి! సాధు మహాభాగే, మహాభాగ్య ప్రదాయకమ్ ।
సర్వైశ్వర్యకరం పుణ్యం, సర్వపాప ప్రణాశనమ్ ॥

2. సర్వదారిద్ర్య శమనం, శ్రవణాద్భుక్తి ముక్తిదమ్ ।
రాజవశ్యకరం దివ్యం, గుహ్యాద్గుహ్యతరం పరమ్ ॥

3. దుర్లభం సర్వదేవానాం, చతుష్షష్టి కళాస్పదమ్ ।
పద్మాదీనాం పరాంతానాం, నిధీనాం నిత్యదాయకమ్ ॥

4. సమస్తదేవ సంసేవ్య మణిమాద్యష్ట సిద్ధిదమ్ ।
కిమత్ర బహునోక్తేన, దేవీ ప్రత్యక్షదాయకమ్ ॥

5. తవప్రీత్యా ఽద్య వక్ష్యామి, సమాహిత మనాః శ్రుణు ।
అష్టోత్తర శతస్యాస్య, మహాలక్ష్మీస్తు దేవతా ।

6. క్లీం బీజపదమిత్యుక్తం, శక్తిస్తు భువనేశ్వరీ ।
అంగన్యాసః కరన్యాసః స ఇత్యాది ప్రకీర్తితః॥

ధ్యానమ్

వందే పద్మకరాం ప్రసన్నవదనాం, సౌభాగ్యదాం భాగ్యదాం ।
హస్తాభ్యామభయ ప్రదాం, మణిగణై ర్నానావిధై ర్భూషితామ్ ॥
భక్తాభీష్ట వరప్రదాం, హరిహర బ్రహ్మాదిభిస్సేవితామ్ ।
పార్శ్వే పంకజ శంఖ పద్మనిధి భిర్యుక్తాం సదా శక్తి భిః ॥

సరసిజనయనే సరోజహస్తే - ధవళ తరాంశుక గంధమాల్యశోభే।
భగవతి హరివల్లభే మనోజ్ఞే - త్రిభువన భూతికరి ప్రసీదమహ్యామ్॥

1. ఓం ప్రకృతిం వికృతిం విద్యాం, సర్వభూతహిత ప్రదాం ।
శ్రద్ధాం విభూతిం సురభిం, నమామి పరమాత్మికామ్ ॥
2. వాచం పద్మాలయాం, పద్మాం, శుచిం, స్వాహాం, స్వధాం సుధాం।
ధన్యాం, హిరణ్మయీం, లక్ష్మీం, నిత్యపుష్టాం, విభావరీమ్ ॥
3. అదితిం చ దితిం దీప్తాం, వసుధాం వసుధారిణీమ్ ।
నమామి కమలాం కాంతాం, క్షమాం క్షీరోద సంభవామ్ ॥
4. అనుగ్రహపరాం బుద్ధిం, అనఘాం హరివల్లభామ్ ।
అశోకా మమృతాం దీప్తాం, లోకశోకవినాశినీమ్ ॥
5. నమామి ధర్మనిలయాం, కరుణాం లోకమాతరం ।
పద్మప్రియాం, పద్మహస్తాం, పద్మాక్షీం పద్మసుందరీమ్ ॥
6. పద్మోద్భవాం పద్మముఖీం, పద్మనాభప్రియాం రమామ్ ।
పద్మమాలాధరాం దేవీం, పద్మినీం పద్మగన్ధినీమ్ ॥
7. పుణ్యగంధాం, సుప్రసన్నాం, ప్రసాదాభిముఖీం, ప్రభామ్
నమామి చంద్రవదనాం, చంద్రాం, చంద్ర సహోదరీమ్ ॥
8. చతుర్భుజాం చంద్రరూపాం, ఇందిరా మిందు శీతలామ్ ।
ఆహ్లాదజననీం, పుష్టిం, శివాం, శివకరీం, సతీమ్ ॥
9. విమాలాం, విశ్వజననీం, తుష్టిం, దారిద్ర్యనాశినీమ్ ।
ప్రీతిపుష్కరిణీం, శాంతాం, శుక్లమాల్యాంబరాం, శ్రియమ్ ॥
10. భాస్కరీం, బిల్వనిలయాం, వరారోహాం, యశస్వినీమ్ ।
వసుంధరా ముదారాంగాం, హరిణీం హేమమాలినీమ్ ॥
11. ధనధాన్యకరీం సిద్ధిం, స్త్రైణసౌమ్యాం, శుభప్రదామ్ ।
నృపవేశ్మగతానందాం, వరలక్ష్మీం, వసుప్రదామ్ ॥

12. శుభాం, హిరణ్యప్రాకారాం, సముద్రతనయాం జయామ్ ।
నమామి మంగళాం, దేవీం, విష్ణు వక్షస్థల స్థితామ్ ॥

13. విష్ణుపత్నీం, ప్రసన్నాక్షీం, నారాయణ సమాశ్రితామ్ ।
దారిద్ర్య ధ్వంసినీం, దేవీం, సర్వోపద్రవ వారిణీమ్ ॥

14. నవదుర్గాం, మహాలక్ష్మీం, బ్రహ్మరుద్రేంద్ర సేవితామ్ ।
త్రికాలజ్ఞాన సంపన్నాం, నమామి భువనేశ్వరీమ్ ॥

15. లక్ష్మీం క్షీర సముద్రరాజతనయాం, శ్రీరంగధామేశ్వరీం,
దాసీభూత సమస్తదేవ వనితాం, లోకైకదీపాంకురాం,
శ్రీమన్మంద కటాక్ష లబ్ధవిభవ, బ్రహ్మేంద్ర గంగాధరాం
త్వాంత్రైలోక్య కుటుంబినీం, సరసిజాం వందే ముకుందప్రియాం॥

16. మాతర్నమామి । కమలే । కమలాయతాక్షి ।
శ్రీవిష్ణుహృత్కమల వాసిని విశ్వమాతః
క్షీరోదజే। కమల కోమల గర్భగౌరి ।
లక్ష్మి ! ప్రసీద సతతం నమతాం శరణ్యే ।

17. త్రికాలంయో జపేత్ విద్వాన్, షణ్మాసం విజితేంద్రియః ।
దారిద్ర్య ధ్వంసనం కృత్వా, సర్వమాప్నోతి యత్నతః ॥

18. దేవీనామ సహస్రేషు, పుణ్యమష్టోత్తరం శతం ।
యేనశ్రియ మవాప్నోతి, కోటిజన్మ దరిద్రతః ॥

19. భృగువారే శతం ధీమాన్, పఠేద్వత్సర మాత్రకమ్ ।
అష్టైశ్వర్య మవాప్నోతి, కుబేర ఇవ భూతలే ॥

20. దారిద్ర్యమోచనం నామ స్తోత్రమంబా పరం శతం ।
యేన శ్రియమవాప్నోతి కోటిజన్మ దరిద్రతః ॥
(భుక్త్వాతు విపులాన్ భోగాన్ అస్యాస్సాయుజ్య మాప్నుయాత్)

21. ప్రాతఃకాలే పఠేన్నిత్యం సర్వ దుఃఖోపశాంతయే ।
పఠంస్తు చింతయేద్దేవీం, సర్వాభరణ భూషితామ్ ।
ఇతి శ్రీ లక్ష్మి అష్టోత్తర శతనామస్తోత్రం సంపూర్ణమ్.

స్తోత్రరత్నములు - 10

## 6. శ్రీలక్ష్మి అష్టోత్తర శతనామావళి - పదార్థావళి

పుష్పముతోగాని, తులసితోగాని, శ్రీచూర్ణముగాని, కుంకుమతోగాని, పసుపుతో గాని పూజింపవలయును. అచమనము చేయుట మంచిది.

| నామావళి | పదార్థావళి |
|---|---|
| 1. ఓం ప్రకృత్యై నమః | పరమాత్మునకు భిన్నమైన ప్రపంచ సంపద అంతయును తానే అయి నది. పంచభూతాత్మకమైన ప్రపంచ రూపం గలది. |
| 2. ఓం వికృత్యై నమః | పంచభూతాదులగు ప్రకృతిచే పొం దిన వికార రూపాలన్నియును తానే అయినది. అనగా సమస్తమైన వస్తు సంపద గలది. |
| 3. ఓం విద్యాయై నమః | విద్యా స్వరూపిణి. |
| 4. ఓం సర్వభూతహితప్రదాయై నమః | సమస్త ప్రాణులకు మేలు చేయు నది. |
| 5. ఓం శ్రద్ధాయై నమః | శ్రద్ధా స్వరూపిణి. "శ్రద్ధాకామస్య మాతరః" కోరికలకు తల్లివంటిది. సంపూర్ణమైన మెలకువలతో చేయ బడునది. |
| 6. ఓం విభూత్యై నమః | శ్రేష్ఠమైన సంపదలు కలది. |
| 7. ఓం సురభ్యై నమః | కామధేనువు వంటిది. |
| 8. ఓం పరమాత్మికాయై నమః | గొప్పని మనస్సు గలది. |

(నమామి = నమస్కరించుచున్నాను)

| | |
|---|---|
| 9. ఓం వాచే నమః | పలుకబడునది. |
| 10. ఓం పద్మాలయాయై నమః | పద్మమే యిల్లుగా గలది. |
| 11. ఓం పద్మాయై(య) నమః | పద్మమే రూపంగా గలది. |
| 12. ఓం శుచయే నమః | పరిశుభ్రంగా నుండునది. |
| 13. ఓం స్వాహాయై నమః | ఆహుతి స్వరూపిణి. అగ్నికి స్వాహా దేవి భార్యయై హవిస్సుల నర్పించు నట్లు విష్ణువుకు భక్తుల కోరికల నందించునది. |
| 14. ఓం స్వధాయై నమః | స్వంతధామము గలది. అర్పించు టకు స్థానమైంది. |
| 15. ఓం సుధాయై నమః | అమృతరూపిణి, మంచి ధామంలో నుండునది. |
| 16. ఓం ధన్యాయై నమః | కృతార్థురాలు. విష్ణువును చేరి యుం డుటచే పాలసంద్రంలో పుట్టినం దుకు ధన్యమైనది. |
| 17. ఓం హిరణ్మయ్యై నమః | బంగారురూపిణి, స్వర్ణమయ మైనది. |
| 18. ఓం లక్ష్మ్యై నమః | శ్రీ, లాభరూపిణి, మంచి లక్షణాలు గలది, లక్ష్మి = చిహ్నము. మంచి సాముద్రిక చిహ్నాలు గలది. |
| 19. ఓం నిత్యపుష్టాయై నమః | ఎల్లప్పుడు బలంగా నుండునది. |
| 20. ఓం విభావర్యై నమః | విశిష్టంగా ప్రకాశించునది. |
| 21. ఓం అదిత్యై నమః | (చ) అపరిమితమైన కాంతి గలది. భూమియైనది. (మరియు) |
| 22. ఓం దిత్యై నమః | కాంతి గలది. |
| 23. ఓం దీప్తాయై నమః | ప్రకాశించునది. ప్రకాశింప జేయునది. |
| 24. ఓం వసుధాయై నమః | స్వర్ణరూపిణి, వస్త్ర స్వరూపిణి,భూమి. |

25. ఓం వసుధారిణ్యై నమః బంగారాదులను ధరించునది.
(నమామి = నమస్కరించుచున్నాను.)

26. ఓం కమలాయై నమః పద్మంలో నుండునది.

27. ఓం కాంతాయై నమః కాంతివంతమైనది. స్త్రీ స్వరూపిణి.

28. ఓం క్షమాయై నమః ఓర్పు గలది.

29. ఓం క్షీరోదసంభవాయై నమః పాలసంద్రంలో పుట్టినది.

30. ఓం అనుగ్రహపరా(ప్రదా)యై నమః శ్రేష్ఠమైన దయ గలది.

31. ఓం బుద్ధ్యై (బుద్ధయే) నమః బుద్ధిరూపిణి.

32. ఓం అనఘాయై నమః పాపం లేనిది. (అఘం = పాపం)

33. ఓం హరివల్లభాయై నమః విష్ణువునకు భార్యయైనది.

34. ఓం అశోకాయై నమః శోకం లేనిది.

35. ఓం అమృతాయై నమః అమృతరూపిణి.
మృత్యువు లేకుండా చేయునది.

36. ఓం దీప్తాయై నమః ప్రకాశింప జేయునది.

37. ఓం లోకశోకవినాశిన్యై నమః ప్రజల దుఃఖాలను నాశనం చేయునది.

నమామి = నమస్కరించుచున్నాము.

38. ఓం ధర్మనిలయాయై నమః ధర్మానికి నివాసంగా గలది.

39. ఓం కరుణాయై నమః దయగలది.

40. ఓం లోకమాత్రే నమః ప్రపంచానికే తల్లి. విశ్వమాత.

41. ఓం పద్మప్రియాయై నమః పద్మాలయందు ప్రీతి గలది.

42. ఓం పద్మహస్తాయై నమః పద్మాలు చేతులలో గలది.

పద్మిని, పద్మహస్తా = ప్రపంచము నంతయు తనచేతిలో నుంచుకొని యుండునది. వా.రా.బాలకాండ - 236

43. ఓం పద్మాక్ష్యై నమః పద్మాలవంటి కన్నులు గలది.

44. ఓం పద్మసుందర్యై నమః పద్మము వంటి అందము గలది.

| | |
|---|---|
| 45. ఓం పద్మోద్భవాయై నమః | పద్మంలో పుట్టినది. |
| 46. ఓం పద్మముఖ్యై నమః | పద్మము వంటి ముఖము గలది. |
| 47. ఓం పద్మనాభప్రియాయై నమః | పద్మనాభునకు (విష్ణువుకు) ప్రీతిపాత్రమైంది. |
| 48. ఓం రమాయై నమః | రమింపజేయునది. |
| 49. ఓం పద్మమాలాధరాయై నమః | కమల పుష్పాలమాల ధరించినది. |
| 50. ఓం దైవ్యై నమః | దేవి, దీపింప చేయునది. |
| 51. ఓం పద్మిన్యై నమః | పద్మమేయైనది. |
| 52. ఓం పద్మగంధిన్యై నమః | పద్మమువంటి పరిమళము గలది. |
| 53. ఓం పుణ్య గంధాయై నమః | పవిత్రమైన వాసన గలది. |
| 54. ఓం సుప్రసన్నాయై నమః | మంచి ప్రశాంతమైనది. |
| 55. ఓం ప్రసాదాభిముఖ్యై నమః | శాంతమైన ప్రకాశించుముఖం గలది. |
| 56. ఓం ప్రభాయై నమః (నమామి = నమస్కరించుచున్నాను) | కాంతియైనది. |
| 57. ఓం చంద్రవదనాయై నమః | చంద్రుని వంటి ముఖము గలది. ప్రహ్లదమైన ముఖము గలది. కాంతులు వెదజల్లే ముఖము గలది. |
| 58. ఓం చంద్రాయై నమః | చంద్రునివంటి రూపము గలది. చల్లని హృదయము గలది. 'చది అహ్లాదనే' అనుధాతువు నుండి ఏర్పడినది. అహ్లాదము నిచ్చునది. అహ్లాద రూపిణి. |
| 59. ఓం చంద్రసహోదర్యై నమః | చంద్రుని సహోదరి అనగా తోబుట్టువు. పాలసముద్రమును మథించినప్పుడు చంద్రునితో సహా పుట్టినది. |
| 60. ఓం చతుర్భుజాయై నమః | నాలుగు భుజాలు గలది. |
| 61. ఓం చంద్రరూపాయై నమః | చంద్రుని వంటి రూపము గలది. |

| | |
|---|---|
| 62. ఓం ఇందిరాయై నమః | చల్లనైనది. |
| 63. ఓం ఇందుశీతలాయై నమః | చంద్రునివలె చల్లనైనది. |
| 64. ఓం ఆహ్లాదజనన్యై నమః | ఆనందమునకు తల్లి. |
| 65. ఓం పుష్ట్యై నమః | బలకరమైనది. |
| 66. ఓం శివాయై నమః | మేలు నిచ్చునది. |
| 67. ఓం శివకర్యై నమః | మేలు చేయునది. |
| 68. ఓం సత్యై నమః | మహాపతివ్రత. సతీత్వము గలది. |
| 69. ఓం విమలాయై నమః | నిర్మలమైనది. |
| 70. ఓం విశ్వ జనన్యై నమః | ప్రపంచమాత. |
| 71. ఓం తుష్ట్యై (తుష్టయే) నమః | తృప్తి గలది. |
| 72. ఓం దారిద్ర్య నాశిన్యై నమః | దరిద్రమును తొలగించునది. |
| 73. ఓం ప్రీతిపుష్కరిణ్యై నమః | ప్రేమసాగరం లాంటిది. కొలనులా ప్రియమైంది. |
| 74. ఓం శాంతాయై నమః | శాంతరూపిణి. |
| 75. ఓం శుక్లమాల్యాంబరాయై నమః | తెల్లని వస్త్రాలు గలది. |
| 76. ఓం శ్రియై నమః | శ్రేయస్సు నిచ్చునది. ఆశ్రయంగా నుండునది. |
| 77. ఓం భాస్కర్యై నమః | సూర్యుని వంటిది. |
| 78. ఓం బిల్వ నిలయాయై నమః | బిల్వ వృక్షాల మధ్యన నుండునది. |
| 79. ఓం వరారోహాయై నమః | శ్రేష్ఠంగా పురోగమించునది. బాగుగా నెక్కునది. |
| 80. ఓం యశస్విన్యై నమః | కీర్తి ప్రదమైనది. |
| 81. ఓం వసుంధరాయై నమః | భూస్వరూపిణి. వసువును ధరించి నది. |
| 82. ఓం ఉదారాంగాయై నమః | ఉదారమైన అవయవాలు గలది. |
| 83. ఓం హరిణ్యై నమః | లేడివంటి కన్నులు గలది. హరిగ్రా |

| | |
|---|---|
| | (పసుపు) చూర్ణంచే చేయబడినది. పసుపురూపిణి. హరిపత్ని. |
| 84. ఓం హేమ మాలిన్యై నమః | బంగారు మాల గలది. |
| 85. ఓం ధనధాన్యకర్త్యై నమః | సంపద, ధాన్యము కలిగించునట్టిది. |
| 86. ఓం సిద్ధయే నమః | భక్తుల కోరికలను ఈడేర్చునది. సిద్ధి పొందినది. |
| 87. ఓంస్త్రైణ సౌమ్యాయై నమః | శ్రీం, హ్రీం, క్లీం అను మూడు బీజాక్షరములతో సౌమ్యమైనది. |
| 88. ఓం శుభప్రదాయై నమః | శుభముల నిచ్చునట్టిది. |
| 89. ఓం నృపవేశ్మగతానందాయై నమః | దుర్మార్గులగు నరుల ఆనందాన్ని తొలగించునది. |
| 90. ఓం వరలక్ష్మ్యై నమః | వరములనిచ్చు లక్ష్మీదేవి, శ్రేష్ఠులను రక్షించి చేరునది. |
| 91. ఓం వసుప్రదాయై నమః | బంగారము నిచ్చునట్టిది. |
| 92. ఓం శుభాయై నమః | శుభముల నిచ్చునట్టిది. |
| 93. ఓం హిరణ్య ప్రాకారాయై నమః | బంగారంచే నిర్మించిన అగడ్తలు గలది. |
| 94. ఓం సముద్రతనయాయై నమః | పాలసముద్రపు కూతురు. |
| 95. ఓం జయాయై నమః (నమామి = నమస్కరించుచున్నాను) | గెలుపు గలది. |
| 96. ఓం మంగళాదేవ్యై నమః | శుభంకరమైనదేవి. మంగళంలు నిచ్చుదేవి. |
| 97. ఓం విష్ణువక్షస్థలస్థితాయై నమః | విష్ణువుయొక్క ఛాతిన నుండునది. |
| 98. ఓం విష్ణుపత్న్యైనమః | విష్ణుమూర్తి భార్య. |
| 99. ఓం ప్రసన్నాక్ష్యై నమః | దయతో కూడిన కన్నులు గలది. |
| 100.ఓం నారాయణసమాశ్రితాయై నమః | శ్రీమన్నారాయణుని బాగుగా ఆశ్రయించి వుండునది. |

| | |
|---|---|
| 101. ఓం దారిద్ర్య ధ్వంసిన్యై నమః | దరిద్రమును నాశనం చేయునది. |
| 102. ఓం దేవ్యై నమః | మాత. |
| 103. ఓం సర్వోపద్రవ వారిణ్యై నమః | అన్ని ఆపదలను తొలగించునది. |
| 104. ఓం నవదుర్గాయై నమః | తొమ్మిది విధముల క్లేశముల నెరుంగునది. 1. కుమారిక, 2. త్రిమూర్తి, 3. కళ్యాణి, 4. కాళి, 5. చండిక, 6. దుర్గ, 7. భద్ర, 8. రోహిణి, 9. శాంభవి అను తొమ్మండుగురు దుర్గలుగా రూపం దాల్చినది. |
| 105. ఓం మహాలక్ష్మ్యై నమః | గొప్ప లాభరూపిణి, మంచి లక్షణాలు గలది. |
| 106. ఓం బ్రహ్మరుద్రేంద్ర సేవితాయై నమః | బ్రహ్మచే, రుద్రునిచే, ఇంద్రునిచే సేవింపబడునది. |
| 107. ఓం త్రికాల జ్ఞాన సంపన్నాయై నమః | భూత, భవిష్యత్, వర్తమాన కాలముల గురించి పరిపూర్ణ జ్ఞాన సంపదగలది. |
| 108. ఓం భువనేశ్వర్యై నమః | లోకాలకు అధికారిణి. |

శ్రీలక్ష్మీ అష్టోత్తర శతనామావళికి పదార్థావళిని యిందుముద్రించుటకు అనుమతినిచ్చిన శ్రీభాష్యకర్త, దివ్యధర్మసూరి, గీతాచార్యవిరించి లేఖినినామక శ్రీమాన్ శ్రీమన్నంపన్ముడుంబై రంగకృష్ణమాచార్యులు (ఎం.ఓ.యల్) వార్కి నా కృతజ్ఞతాభివందనములు.

| | |
|---|---|
| 1. ఓం మహాలక్ష్మ్యై నమః | 2. ఓం శ్రీ భూదేవ్యై నమః |
| 3. ఓం శ్రీ నీళాదేవ్యై నమః | 4. ఓం శ్రీ గోదాదేవ్యై నమః |
| 5. ఓం శ్రీ అనంతాయ నమః | 6. ఓం శ్రీ గరుడాయ నమః |
| 7. ఓం శ్రీమతే విష్వక్సేనాయ నమః | 8. ఓం శ్రీ పరాంకుశాయ నమః |
| 9. ఓం శ్రీ పరకాలాయ నమః | 10. ఓం శ్రీమతే రామానుజాయ నమః |
| 11. ఓం శ్రీ వరవరమునయే నమః | 12. ఓం స్వాచార్యేభ్యో నమః |
| 13. ఓం పూర్వాచార్యేభ్యో నమః | 14. ఓం సమస్త పరివారాయ |

సర్వదివ్యమంగళ విగ్రహాయ శ్రీమతే నారాయణాయ నమః

## 7. శ్రీమహాలక్ష్మి స్తోత్రము

**1. నమస్తేఽస్తు మహామాయే । శ్రీపీఠే సురపూజితే ।**
**శంఖ చక్ర గదా హస్తే । మహాలక్ష్మి ర్నమోస్తుతే ॥**

దేవతలచేత పూజించబడే లక్ష్మి తనహస్తమందే శంఖంచక్రం గదలను ధరించి, శ్రీపీఠంపై ఆసీనయైన ఆమహాలక్ష్మికి మా నమస్సులు.

**2. నమస్తే గరుడా రూఢే డో(కో)లాసుర భయంకరి ।**
**సర్వపాపహరేదేవి । మహాలక్ష్మిర్నమోస్తుతే ॥**

గరుడిని అధిరోహించి డో(కో)లాసురునికి భయాన్ని కలిగించేదానవు, సర్వపాపాల్ని పోగొట్టుదానవు అయిన శ్రీమహాలక్ష్మి నీకు నా నమస్కారములు.

**3. సర్వజ్ఞే సర్వవరదే । సర్వదుష్ట భయంకరి ।**
**సర్వదుఃఖహరేదేవీ । మహాలక్ష్మి ర్నమోస్తుతే ॥**

సర్వజ్ఞురాలవు, అడిగిన వరాలను ఇచ్చేదానవు, దుష్టులకు భయం గొల్పేదానవు. అందరి దుఃఖాలను పారద్రోలేదానవు అయిన మహాలక్ష్మి నీకు నా నమోవాకాలు.

**4. సిద్ధిబుద్ధిప్రదే దేవి । భుక్తి ముక్తి ప్రదాయిని ।**
**మంత్రమూర్తే సదాదేవి । మహాలక్ష్మి ర్నమోస్తుతే ॥**

సిద్ధిని, బుద్ధిని, భుక్తిని, ముక్తిని ప్రసాదించేదానవు, ఎల్లప్పుడు మంత్ర మూర్తివి అయిన మహాలక్ష్మి దేవివి నీవు. నీకు మావందనాలు.

**5. ఆద్యంతరహితేదేవి ఆదిశక్తి మహేశ్వరి,**
**యోగజ్ఞే యోగసంభూతే మహాలక్ష్మి ర్నమోస్తుతే ॥**

ఆదిఅంతాలు లేని దానవు నీవు, ఆదిశక్తివి, మహేశ్వరివి యోగంనుంచి జన్మించిన యోగసంభూతురాలవు అయిన మహాలక్ష్మివినీవు. నీకు దండాలు.

**6. స్థూలసూక్ష్మ మహారౌద్రే మహాశక్తే మహోదరే,**
**మహాపాపహరేదేవి మహాలక్ష్మి ర్నమోస్తుతే ॥**

నువ్వు సామాన్య చర్మచక్షువులకు కనిపించనిదానివి. స్థూల విరాట్‌రూపవు త్రివిక్రమవు : మహారౌద్ర, మహాశక్తి స్వరూపిణివి. శరణాగత భక్తుల మహాపాపాల్ని నాశనం చేసి, ఆధ్యాత్మిక సిరిని(ధనాన్ని) ఇచ్చే మహాలక్ష్మివి. నీకు నమస్కారం.

7. పద్మాసనస్థితేదేవి పరబ్రహ్మ స్వరూపిణి ।
పరమేశి జగన్మాత ర్మహాలక్ష్మీ ర్నమోస్తుతే ॥

పద్మాసనంలో కూర్చున్న పరబ్రహ్మ స్వరూపిణివి, పరమేశ్వరివి, జగన్మాతవు అయిన మహాలక్ష్మివి నీకు కైమోడ్పులు.

8. శ్వేతాంబరధరే దేవి నానాలంకార భూషితే,
జగత్స్థితే జగన్మాత ర్మహాలక్ష్మీ ర్నమోస్తుతే ॥

తెల్లని వస్త్రాలు ధరించి, సర్వాలంకారభూషణాలను కలిగినదానవు, జగత్తును పాలించే జగన్మాతవు అయిన మహాలక్ష్మివి. నీకు నా నీరాజనాలు.

9. మహాలక్ష్మ్యష్టకం స్తోత్రం యః పఠేద్భక్తిమాన్నరః,
సర్వసిద్ధిమవాప్నోతి రాజ్యం ప్రాప్నోతి సర్వదా.

ఈమహాలక్ష్మి అష్టకాన్ని భక్తితో ఏ నరుడు పఠిస్తాడో, అతనికి ఎల్లప్పుడు సర్వసిద్ధులు, రాజ్యం కలుగుతాయి.

10. ఏకకాలే పఠేన్నిత్యం మహాపాపవినాశనమ్,
ద్వికాలం యః పఠేన్నిత్యం ధనధాన్యసమన్వితః ॥

ఎవరయితే ఒకసారి ఈ మహాలక్ష్మి అష్టకాన్ని పఠిస్తారో వారి మహాపాపాలు నాశనం అవుతాయి. రెండుసార్లు పఠిస్తే వారు ధనధాన్యసమృద్ధి పొందుతారు.

11. త్రికాలం యః పఠేన్నిత్యం మహాశత్రు వినాశనమ్,
మహాలక్ష్మీ ర్భవేన్నిత్యం ప్రసన్నా వరదా శుభా ॥

ఎవరైతే మూడుకాలాలు పఠిస్తారో వారికి మహాశత్రువినాశనం అవుతుంది. శ్రీమహాలక్ష్మిఎప్పుడూ వారికి ప్రసన్నురాలై శుభకరమైన వరాల్నీ, సర్వాన్ని అనుగ్రహిస్తుంది. పరబ్రహ్మానంద పరిపూర్ణ బోధామృతము - మరియు శ్రీరామకృష్ణప్రభ 11-2001-1.

## 42. శ్రీరామ ప్రార్థన

1. ఓమ్నమో భగవతే శ్రీరామాయ పరమాత్మనే।
సర్వ భూతాంతరస్థాయ స సీతాయ నమో నమః ॥

భగవంతుడును, పరమాత్మ స్వరూపులును, సమస్త ప్రాణులయందును నివసించువారును సీతాసమేతులును అగు శ్రీరామునకు నమస్కారము.

2. ఓమ్ నమో భగవతే శ్రీరఘునాథాయ శార్ఙ్గిణే, (శార్ఙ్గిణే)
చిన్మయానందరూపాయ స సీతాయ నమో నమః ॥

రఘునాథుడును, శార్ఙ్గమను ధనుస్సును ధరించినవారును, చిన్మయా నంద స్వరూపులును, సీతాసహితులును అగు శ్రీరామచంద్రునకు నమస్కారము.

రామాయణ రత్నాకరము - 4

3. ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్॥

ఆపత్తులను పోగొట్టువారును, సమస్త సంపదలను ఒసంగువారును, లోకమునకు ఆనందమును కలుగుజేయువారును అగు శ్రీరామునకు మరల మరల నమస్కరించుచున్నాను.

రామాయణ రత్నాకరము - 5

4. కౌసల్యా సుప్రజారామ పూర్వా సంధ్యా ప్రవర్తతే।
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యమ్ దైవమాహ్నికమ్॥

5. రామాయ రామభద్రాయ రామ చంద్రాయ వేధసే।
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః॥

తా:- చంద్రునిలా కాంతినీ, చల్లదనాన్ని ఇచ్చేవాడూ, ఆర్తత్రాణ పరాయణుడూ, సర్వజ్ఞుడూ, రఘుకుల ప్రధానుడు, సీతాపతి అయిన రామునికి నా ప్రణామాలు అని శ్లోకభావం. వేధసే అంటే హిరణ్యగర్భుడు, విష్ణువు, సూర్యుడు ఒకానొక సూర్యవంశపురాజు అనే అర్థాలున్నాయి. ఇక్కడ అర్థం శ్రీరామచంద్ర ప్రభువు సర్వజ్ఞుడు అని.

శ్రీరామకృష్ణప్రభ - 11/2003/21

6. నమోస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యై చ తస్యై జనకాత్మజాయై।
నమోస్తు రుద్రేంద్ర యమానిలేభ్యో
నమోస్తు చంద్రార్క మరుద్గణేభ్యః॥

7. కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలమ్ ॥

కవిత్వమను కొమ్మపైనెక్కి రామరామ యను మధురాక్షరములను సుమధురముగ గానముచేయు వాల్మీకియను కోయిలకు నమస్కారము. రా.ర. 23

8. శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపమ్ ।
ఆజానుబాహు మరవింద దలాయతాక్షం
రామం నిశాచర వినాశకరం నమామి ।

9. వైదేహీ సహితం సురద్రుమ తలే హైమే మహా మండపే
మధ్యే పుష్పకమాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్ ।
అగ్రే వా చ యతి ప్రభంజన సుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్॥

10. శ్రీరామాష్టోత్తర శతనామస్తోత్రము

1. ఓమ్ శ్రీరామో రామచంద్రశ్చ రామభద్రశ్చ శాశ్వతః ।.
రాజీవలోచనః శ్రీమాన్ రాజేంద్రో రఘు పుంగవః ॥
2. జానకీవల్లభో జైత్రో జితామిత్రో జనార్దనః ।
విశ్వామిత్రప్రియో దాంతః శరణత్రాణ తత్పరః
3. వాలిప్రమథనో వాగ్మీ సత్యవాక్సత్య విక్రమః ।
సత్యవ్రతో వ్రతధరః సదాహనుమదాశ్రితః ॥
4. కౌసలేయః ఖరధ్వంసీ విరాధవధ పండితః ।
విభీషణ పరిత్రాతా దశగ్రీవ శిరోహరః ॥
5. సప్తతాల ప్రభేత్తా చ హరకోదండ ఖండనః ।
జామదగ్న్య మహాదర్పదళనస్తాట కాంతకః ॥
6. వేదాంతసారో వేదాత్మా భవరోగస్య భేషజమ్ ।
దూషణ త్రిశిరో హంతా త్రిమూర్తి స్త్రి గుణాత్మకః ॥
7. త్రివిక్రమస్త్రి లోకాత్మా పుణ్యచారిత్ర కీర్తనః ।
త్రిలోకరక్షకో ధన్వీ దండకారణ్య వాసకృత్ ॥ (కర్తనః)

8. అహల్యా శాపశమనః పితృభక్తో వరప్రదః ।
జితేంద్రియో జితక్రోధో జితామిత్రో జగద్గురుః ॥

9. ఋక్షవానరసంఘాతీ చిత్రకూట సమాశ్రయః ।
జయంతత్రాణ వరదః సుమిత్రాపుత్ర సేవితః ॥

10. సర్వదేవాది దేవశ్చ మృతవానరజీవనః ।
మాయామారీచ హంతా చ మహాదేవో మహాభుజః ॥

11. సర్వదేవస్తుత స్సౌమ్యో బ్రహ్మణ్యో మునిసంస్తుతః ।
మహాయోగీ మహోదారః సుగ్రీవేప్సితరాజ్యదః ॥

12. సర్వ పుణ్యాధికఫలః స్మృతఃసర్వాఘ నాశనః ।
ఆదిపురుషః పరమ పురుషో మహాపురుష ఏవచ ॥

13. పుణ్యోదయో మహాసారః పురాణ పురుషోత్తమః ।
స్మితవక్త్రో మితభాషీ పూర్వభాషీ చ రాఘవః ॥

14. అనంతగుణ గంభీరో ధీరోదాత్త గుణోత్తమః ।
మాయామానుష చారిత్రో మహాదేవాది పూజితః ॥

15. సేతు కృజ్జిత వారాశిః సర్వతీర్థమయో హరిః ।
శ్యామాంగ స్సుందర శ్శూరః పీతవాసా ధనుర్ధరః ॥

16. సర్వ యజ్ఞాధిపో యజ్వా జరామరణ వర్జితః ।
విభీషణ ప్రతిష్ఠాతా సర్వావగుణ వర్జితః ॥

17. పరమాత్మా పరంబ్రహ్మ సచ్చిదానంద విగ్రహః ।
పరంజ్యోతిః పరంధామ పరాకాశః పరాత్పరః ॥

18. పరేశః పారగః పారః సర్వదేవాత్మక శ్శివః । (పరః)
ఇతి శ్రీరామచంద్రస్య నామ్నా మష్టోత్తరం శతమ్ ॥

రా.ర. 25

## 11. శ్రీమాన్ హనుమత్కృత శ్రీరామ దండకము

శ్రీరామ రామా! త్రిలోకాభిరామా! పరంధామ! నిష్కామ సంపూర్ణకామా! బుధేంద్రాంతరంగాబ్ధిసోమా! లసద్దివ్యనామా! విరాజద్గుణస్తోమ! యుష్మత్ప్రకాశ స్వరూపం! బవాచ్యం, బచింత్యం! బనంతం! బసంగం! బఖండం! బబాధ్యం! బభోధ్యం! బసాధ్యం! బభేద్యం! బవిచ్ఛేద్య, మాద్యంతశూన్యం! బజంబ ప్రమే యం! బవిజ్ఞేయ! మధ్యేయ! మద్వంద్వ! మవ్యక్త! మగ్రాహ్య! మధ్యాత్మమేకమ్! బరూపం! బనాఖ్యం! బరక్తం! బశుక్లం! బకృష్ణం! బపీతం! బపీనం! బసూక్ష్మం! బదీర్ఘం! బహ్రస్వం! బబాహ్యాంతరం! బక్షరం! బవ్యయమ్! బింద్రియాగోచరమ్! బప్రతర్క్యం! బనిర్దేశ్యమాద్యం! బదృశ్యం! బకంపం! బలక్ష్యం! బలిప్తం! బశబ్దం! బసంస్పర్శభూతం! బరూపం! బసుస్వాదుగంధం! బవాఙ్మానసప్రాప్యమై! పూర్ణమై! నిత్యమై! సత్యమై! శుద్ధమై! బుద్ధమై! ముక్తమై! శాంతమై! కేవలంబై! నిరాకారమై! సచ్చిదానందరూపాత్మ చైతన్యమై! సర్వభూతోరుదేహేంద్రియప్రాణ హృద్బుద్ధ్యహం కార చిత్తాది దృశ్య ప్రపంచంబు నాదిత్యుడీ విశ్వమెల్లన్, వెలిగింపగా జేయు రీతిన్ బ్రకాశింపగాజేయగా సాక్షివై! యాకసంబేకమై ! సర్వభాండంబులందం తటన్! లోపలన్! వెల్పలన్నిండియున్నట్టులాకాశ వాయ్వగ్ని వార్భూమి నానా విధాశేష భూతంబులందంతటన్ చూచుచున్ నిర్విలిప్తుండవైయుండి! కర్తృత్వ! భోక్తృత్వ! మంతృత్వ! భర్తృత్వ! హర్తృత్వ ముల్నామ రూపక్రియోపాధి! వర్ణాశ్రమం బుల్గుణంబుల్వివేకంబులున్! శోకమోహంబులున్ లేక యాస్థూల సూక్ష్మాదులన్! జాగరస్వప్నసుప్త్యాదులన్! బంచ భూతంబులన్! బంచకోశంబులన్! జూచుచున్! నిర్వికారుండవై నిర్వికల్పుండవై! నిర్విచేష్టుండవై! నిష్ప్రపంచుండవై! నిర్విశేషుం డవై నిర్గుణ బ్రహ్మమాత్రుండవై యొప్పు! నీదివ్య తత్త్వంబు! నీసత్కృపా సంభృతాంచత్క టాక్షంబు చేతం! గనుంగొంటి దేవా నమస్తే! నమస్తే నమస్తే నమః ॥

" శ్రీరామ చంద్రప్రభో పాహి! పాహిమాం పాహి "

రామాయణ రత్నాకరము - 24

## 12. శ్రీరామ రక్షా స్తోత్రము

1. రామరక్షాం పఠేత్ప్రాజ్ఞః, పాపఘ్నీం సర్వకామదామ్ ।
   శిరోమే రాఘవః పాతు, ఫాలం దశరథాత్మజః ॥

ప్రాజ్ఞుడగువాడు పాపముల నశింపజేయునదియు, సమస్త కోరికలను నేరవేర్చు నదియునగు రామరక్షా స్తోత్రము పఠించవలెను. నాశిరస్సును శ్రీరాముడు రక్షించుగాక! నా ఫాలమును దశరథనందనుడగు శ్రీరామచంద్రుడు కాపాడుగాక.

**2. కౌసలేయో దృశౌపాతు, విశ్వామిత్రప్రియః శ్రుతీ ।**
**ఘ్రాణం పాతు మఖత్రాతా, ముఖం సౌమిత్రి వత్సలః ॥**

నానేత్రములను కౌసల్యాతనయుడగు శ్రీరామమూర్తి రక్షించుగాక! నా చెవులను విశ్వామిత్ర ప్రియుడగు రఘుపతి కాపాడుగాక! నాముక్కును యజ్ఞ సంరక్షకుడగు శ్రీరాముడు రక్షించుగాక! నాముఖమును లక్ష్మణప్రియుడగు శ్రీరామచంద్రుడు కాపాడుగాక.

**3. జిహ్వాం విద్యానిధిః పాతు, కంఠం భరతవందితః ।**
**స్కంధౌ దివ్యాయుధః పాతు, భుజౌ భగ్నేశకార్ముకః ॥**

నా నాలుకను విద్యానిధియగు శ్రీరాముడు రక్షించుగాక! కంఠమును భరతునిచే నమస్కరింపబడు శ్రీరామమూర్తి కాపాడుగాక! మూపులను దివ్యాయుధములు గల శ్రీరామచంద్రుడు రక్షించుగాక! భుజములను శివ ధనుస్సును విరిచిన శ్రీరాముడు కాపాడుగాక!

**4. కరౌ సీతాపతిః పాతు, హృదయం జామదగ్న్యజిత్ ।**
**మధ్యం పాతు ఖరధ్వంసీ, నాభిం జాంబవదాశ్రయః ॥**

చేతులను సీతాపతియగు శ్రీరాఘవుడు రక్షించుగాక! హృదయమును పరశు రాముని జయించిన శ్రీరామచంద్రుడు కాపాడుగాక! మధ్యప్రదేశమును ఖరుని వధించిన శ్రీరాముడు రక్షించుగాక! నాభిని జాంబవంతునికి ఆశ్రయమగు శ్రీరామమూర్తి కాపాడుగాక.

**5. సుగ్రీవేశః కటిం పాతు, సక్థినీ హనుమత్ప్రభుః ।**
**ఊరూరఘూత్తమః, పాతు రాక్షః కులవినాశకృత్ ॥**

కటిప్రదేశమును సుగ్రీవేశుడైన శ్రీరాముడు రక్షించుగాక! తొడ ఎముకలను హనుమత్ప్రభువగు శ్రీరామచంద్రుడు కాపాడుగాక! తొడలను రాక్షసవంశమును నశింపజేసిన రఘుకులోత్తముడగు శ్రీరామచంద్రుడు రక్షించుగాక!

**6. జానునీ సేతు కృత్పాతు, జంఘే దశముఖాంతకః ।**
**పాదౌ విభీషణ శ్రీదః, పాతు రామోఽఖిలం వపుః ॥**

మోకాళ్ళను వారథిని నిర్మించిన శ్రీరాముడు కాపాడుగాక! పిక్కలను రావణ సంహారకుడగు శ్రీరామచంద్రుడు రక్షించుగాక! పాదములను విభీషణునకు ఐశ్వర్యమొసంగిన శ్రీరాఘవుడు కాపాడుగాక! శరీరమునంతను శ్రీరాముడు రక్షించుగాక!

**7. ఏతాం రామబలోపేతాం, రక్షాం యః సుకృతీ పఠేత్ ।**
**స చిరాయుః సుఖీ పుత్రీ విజయీ వినయీ భవేత్ ॥**

శ్రీరామ బలయుక్తమగు ఈరామరక్షాస్తోత్రమును ఏపుణ్యాత్ముడు పఠించునో అతడు దీర్ఘాయువు కలవాడై, సుఖవంతుడై, సంతానయుతుడై, విజయవంతుడై యలరారును. రా.ర - 55

ఫలశ్రుతి :- పద్మపురాణమున నుత్తరకాండమున 74వ అధ్యాయమున మహాదేవుడు ఎవ్వడీ రామబలోపేతమగు శ్రీరామరక్షామంత్రమును జదువునో యతడు చిరకాలము జీవించి దివ్యసంపదల నందగలడు. ఎవ్వడు శ్రీరామరక్షను జేయుచున్నాడో వానిని వైష్ణవి కాపాడుచున్నది. శ్రీరామయని, రామభద్రయని, రామచంద్రయని యెవ్వాడు చదువుచున్నాడో యతడు పాపములనుండి విము క్తుడై శాశ్వతమగు ముక్తిని బడయగలడు. నిదురించునపుడుగాని, ఇంటి యందు గాని, మార్గమధ్యమున బ్రయాణము చేయునపుడుగాని యెవ్వారలీ రామరక్షను పఠింతురో వారలభయము లందగలరు - అనియున్నది.

## 13 శ్రీరామ హృదయము

ఈ స్తోత్రమును జపమునకు ముందుగా పఠింపవలయును.

**1 తతోరామస్స్వయం ప్రాహ హనూమంత ముపస్థితమ్।**
**శ్రుణు తత్వం ప్రవక్ష్యామి హ్యాత్మానాత్మపరాత్మనామ్ ॥**

శివుడిట్లు చెప్పెను:- ఓపార్వతీ! పిమ్మట శ్రీరాముడు వినయముతోనున్న హనుమంతునిగూర్చి ఈ ప్రకారము పలికెను. ఓ ఆంజనేయా! ఆత్మ అనాత్మ పరమాత్మలయొక్క తత్త్వమును చెప్పుచున్నాను వినుము.

**2. ఆకాశస్య యథా భేదః త్రివిధో దృశ్యతే మహాన్ ।**
**జలాశయే మహాకాశః తదవచ్ఛిన్న ఏవహి ।**
**ప్రతిబింబాఖ్యమపరం దృశ్యతే త్రివిధం నభః॥**

3. బుద్ధ్య వచ్ఛిన్న చైతన్యమేకం పూర్ణమథాపరమ్ ।
ఆభాసస్త్వపరం బింబభూతమేవం త్రిధా చితిః ॥

జలాశయము, జలప్రతిబింబాకాశము, మహాకాశము అని ఆకాశమెట్లు మూడు విధములుగ గోచరించుచున్నదో, అట్లే బుద్ధియందు వ్యాపించియున్న చైతన్యము, బుద్ధియందు ప్రతిబింబించిన చైతన్యము, అంతటను వ్యాపించి యున్న పరిపూర్ణ చైతన్యము - అని చైతన్యము మూడు విధములుగ నున్నది.

4. సాభాస బుద్ధేః కర్తృత్వ మవిచ్ఛిన్నే ऽవికారిణి ।
సాక్షిణ్యారోప్యతే భ్రాంత్యా జీవత్వం చ తథా బుధైః ॥

అవిచ్ఛిన్నమై, నిర్వికారమై, సాక్షిరూపమై వెలయుచున్న శుద్ధ చిదాత్మ యందు, చైతన్య ప్రతిబింబముతో గూడిన అంతఃకరణము యొక్క కర్తృత్వమును జీవత్వమును భ్రాంతిచే జనులు ఆరోపించుచున్నారు.

5. ఆభాసస్తు మృషాబుద్ధిః అవిద్యా కార్యముచ్యతే ।
అవిచ్ఛిన్నంతు తద్బ్రహ్మ విచ్ఛేదస్తు వికల్పతః ॥

ఆత్మ ప్రతిబింబమైన జీవత్వము మిథ్యయని, అజ్ఞానముయొక్క కార్యమని చెప్పబడుచున్నది. బ్రహ్మము అవిచ్ఛిన్నమైనది. వికల్పముచే భేదము జనించుచున్నది.

6. అవిచ్ఛిన్నస్య పూర్ణేన ఏకత్వం ప్రతిపాద్యతే ।
తత్త్వమస్యాది వాక్యైశ్చ సాభాసస్యాగ(హ)మస్తథా॥

ప్రతిబింబ రూపుడైన జీవునకు అవిచ్ఛిన్న పరిపూర్ణ పరమాత్మతోటి ఏకత్వ మును 'తత్త్వమసి' మున్నగు మహావాక్యముల ద్వారా శాస్త్రములు ప్రతి పాదించుచున్నవి.

రామాయణ రత్నాకరము - 124, హమస్తథా.
ఆధ్యాత్మరామాయణము - 23 గమస్తథా.

7. ఐక్యజ్ఞానం యదోత్పన్నం మహావాక్యేన చాత్మనోః ।
తథా ऽవిద్యా స్వకార్యైశ్చ నశ్యత్యేవ న సంశయః ॥

ఈ ప్రకారముగ మహావాక్యముల ద్వారా జీవాత్మ పరమాత్మల ఏకత్వమును గూర్చిన జ్ఞానమెపుడు జనించుచున్నదో, అపుడు అవిద్య (అజ్ఞానము) కార్యసహితముగ నశించిపోవుచున్నది. ఇట సంశయములేదు.

8. ఏతద్విజ్ఞాయ మద్భక్తో మద్భావా యోప పద్యతే ।
మద్భక్తి విముఖానాం హి శాస్త్ర గర్తేషు ముహ్యతామ్ ।
న జ్ఞానం న చ మోక్షః స్యాత్తేషాం జన్మ శతై రపి ॥

నా యెడల భక్తిలేని వారికి, శాస్త్రములను గోతులందుపడి మోహము నొందు వారికి (అనుభవములేనివారికి) నూఱుజన్మములకైనను జ్ఞానముగాని మోక్షముగాని కలుగదు.

9. ఇదం రహస్యం హృదయం మమాత్మనో।
మయైవ సాక్షాత్కథితం తవానఘ
మద్భక్తిహీనాయ శఠాయ న త్వయా।
దాతవ్య మైంద్రాదపి రాజ్యతో ఽధికమ్ ॥

పాపరహితుడవగు హనుమంతుడా ! ఇప్పుడు చెప్పిన విషయము చాల రహస్యమైనది. ఆత్మస్వరూపుడనగు నాయొక్క హృదయము (అంతరంగికాభిప్రాయము) ప్రత్యక్షముగనాచేనీకు ఇపుడు చెప్పబడినది. ఇది ఇంద్రుని రాజ్యము కంటెను అధికమైనది. నాయందు భక్తిలేని వారికి, శఠునకు దీనిని ఒసంగరాదు. ఇతి శ్రీమదధ్యాత్మరామాయణే ఉమామహేశ్వరసంవాదే బాలకాండే "శ్రీరామ హృదయం" నామ ప్రథమసర్గః.

## 14 శ్రీరామచంద్రాష్టక స్తోత్రము

1. సుగ్రీవమిత్రం పరమం పవిత్రం, సీతా కళత్రం నవమేరుగాత్రమ్,
కారుణ్యపాత్రం శతపత్రనేత్రం, శ్రీరామచంద్రం సతతం నమామి.
2. సంసార సారం నిగమప్రచారం, ధర్మావతారం హృతభూమి భారమ్,
సదా ఽ వికారం సుఖసింధుసారం, శ్రీరామచంద్రం సతతం నమామి.
3. లక్ష్మీనివాసం జగతాం నివాసం, లంకానివాసం భువన ప్రకాశమ్,
భూదేవివాసం శరదిందుహాసం, శ్రీరామచంద్రం సతతం నమామి.
4. మందారమాలం వచనేరసాలం, గుణైర్విశాలం హత సప్తతాళమ్,
క్రవ్యాదకాలం సురలోకపాలం, శ్రీరామచంద్రం సతతం నమామి.
5. శ్యామాభిరామం నయనాభిరామం, వచనాభి రామం సుగుణాభిరామమ్,
విశ్వప్రణామం కృతభక్తకామం, శ్రీరామచంద్రం సతతం నమామి.

6. వేదాంతగానం సకలైస్సమానం, హృదాభిమానం త్రిదశప్రధానమ్,
గజేంద్రయానం వికతావసానం, శ్రీరామచంద్రం సతతం నమామి.

7. లీలాశరీరం రణరంగధీరం, విశ్వైకసారం రఘువంశ హారమ్,
గంభీరనాదం జితసర్వనాదం, శ్రీరామచంద్రం సతతం నమామి.

8. ఖలేకృతాంతం స్వజనే వినీతం, సామోపగీతం మనసా ప్రతీతమ్,
రాగేనుగీతం వచనాదతీతం, శ్రీరామచంద్రం సతతం నమామి.

9. రామచంద్రాష్టకం పుణ్యం, ప్రాతరుత్థాయ యః పఠేత్,
కోటిజన్మకృతం పాపం, స్మరణేన వినశ్యతి.

ఈ రామచంద్రాష్టకస్తోత్రమును ప్రాతఃకాలమున లేచి ఎవడు పఠించుచున్నాడో, వాడు స్మరించినంతమాత్రము చేతనే కోటిజన్మములయందు చేయబడిన పాపము నశించి యిష్టార్థసిద్ధిని బొందగలడు.

విశ్వామిత్రమహర్షి రామలక్ష్మణులకు ఉపదేశించిన బల, అతిబలా మంత్రాలు.

## 15. బలామంత్రము

1. బలం దేహి తనూమనే బలామింద్రా నతుత్సునః బలన్తే
కాయ తనయాయ జీవసే త్వహి బలదా అసి ॥

భావం :- బలాన్ని ఇవ్వు, బలాన్ని ఇవ్వు, నాశరీరాన్ని బలంగా చేయి. స్వష్ఠ చిత్తాన్ని కలుగచేయి. బాహ్యాంతరాలలో (బైటలోపల) గల శత్రువులను జయించగల శక్తిని ఇవ్వు.

2. అతిబలా మంత్రము

ఇంద్రోతి భిర్బహులా భిర్నో అద్య
యాచ్ఛ్రేష్ఠా భిర్మఘవన్ఛూర జిన్వ ।
యో నోద్వేష్ట్య ధరః సస్పదీష్ట ।
యము - ద్విష్మస్తము ప్రాణోజ-హాతు ॥

భావ:- ఓ ఇంద్రా! సమస్త విభూతులను లాభాలను నాకు కలుగజేయి హేమ ఘవన్! నన్ను ద్వేషించేవారు పతితులగుదురుగాక! నాచేద్వేషించబడేవారు ప్రాణాలను విడుతురుగాక! వేదమంత్రరామాయణము - శ్రీరామకృష్ణప్రభ 2/94-17,18.

గమనిక : ఈమంత్రాలను ఉపాసించేవారు, స్వార్థరహితులై, లోకకల్యాణాన్ని అపేక్షించి ఈ విద్యలను స్వీకరించాలని మనవి. శ్రీరా.ప్రభ. 2/94, 17,18.

## 43. సుందరకాండ ప్రార్థన శ్లోకములు.

**1. మనోజవం మారుతతుల్యవేగం ! జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్।**
**వాతాత్మజం వానరయూథముఖ్యం - శ్రీరామదూతం శిరసా నమామి॥**

తా :- మనస్సుతో సమానమైన వాయువుతో సమానమైన వేగము గలవాడు, ఇంద్రియ నిగ్రహము గలవాడు, బుద్ధిమంతులలో శ్రేష్ఠుడు, వాయుదేవుని కుమారుడు, వానరులలో శ్రేష్ఠుడు, అయిన శ్రీరామదూతయగు హనుమంతునికి నమస్కరించుచున్నాను.

**2. అంజనానందనం వీరం - జానకీ శోక నాశనమ్ ।**
**కపీశ మక్షహంతారం - వందే లంకా భయంకరం ॥**

**3. స్ఫటికాభం స్వర్ణకాంతిం - ద్విభుజం చ కృతాంజలిం ।**
**కుండలద్వయ సంశోభి - ముఖాంభోజం హరిం భజేత్ ॥**

**4. గోష్పదీకృత వారాశిం - మశకీకృత రాక్షసం ।**
**రామాయణ మహామాలా - రత్నం వందేఽనిలాత్మజం ॥**

**5. యత్రయత్ర రఘునాథ కీర్తనమ్ - తత్ర తత్ర కృతమస్త కాంజలిమ్।**
**భాష్పవారి పరిపూర్ణ లోచనమ్ - మారుతిం నమత రాక్షసాంతకమ్॥**

**6. వందే వానర, నారసింహ, ఖగరాట్, క్రోడాశ్వ వక్త్రాంచితం,**
**నానాలంకరణం, త్రిపంచనయనం, దేదీప్యమానం రుచా హస్తాబ్జైః॥**
**అసిఖేట పుస్తక, సుధా కుంభాన్ కుశాద్రీ, హలం, ఖట్వాంగం।**
**ఫణివృక్ష ధృద్దశ భుజం - సర్వారి గర్వాపహం ॥**

తా :- వానరము, నారసింహము, గారుత్మంతము, వారాహము, అశ్వముఅను ఐదు ముఖములు గలవాడు, నానాలంకారములు, పదిహేను నేత్రములు గలవాడు, అందమైనవాడు, కత్తి, డాలు, పుస్తకము, అమృత కుంభము, దర్భ, కొండ, నాగలి, మంచపుకోడు, పాము,చెట్టు పదిచేతులతో ధరించినవాడును, శత్రువులను సంహరించువాడునగు హనుమంతునికి నమస్కారము చేయుచున్నాను.

7. సర్వారిష్ట నివారకం, శుభకరం పింగాక్ష మక్షాపహం, ।
సీతాన్వేషణ తత్పరం - కపివరం - కోటీందు సూర్యప్రభం॥
లంకాద్వీప భయంకరం సకలదం సుగ్రీవసమ్మానితం ।
దేవేంద్రాది సమస్త దేవ వినుతం కాకుత్థ్సదూతం భజే ॥

8. బుద్ధిర్బలం యశోధైర్యం - నిర్భయత్వ మరోగతా ।
అజాడ్యం వాక్పటుత్వం చ హనుమత్స్మరణాద్భవేత్ ॥

9. నమో ऽస్తు రామాయ సలక్ష్మణాయ ।
దైవ్యై చ తస్యై జనకాత్మజాయై ।
నమో ऽస్తు రుద్రేంద్ర యమానిలేభ్యో
నమో ऽస్తు చంద్రార్క మరుద్గణేభ్యః ॥

10. జయత్యతిబలో రామో - లక్ష్మణశ్చ మహాబలః ।
రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః ॥

తా : మహాబలుండగు రాముడు జయంబు కలిగియున్నాడు. మహాబలుడగు లక్ష్మణుడును జయంబు కలిగియున్నవాడు. వానరరాజగు సుగ్రీవుండును రామునిచే పరిపాలితుండై జయంబు కలిగియున్నవాడు.

11. దాసో ऽహం కోసలేంద్రస్య రామస్యా క్లిష్ట కర్మణః।
హనుమాన్ శత్రుసైన్యానాం - నిహంతా మారుతాత్మజః॥

12. నరావణ సహస్రంమే యుద్ధే ప్రతిబలం భవేత్।
శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః॥

13. అర్దయిత్వాపురీంలంకాం - అభివాద్య చ మైథిలీం ।
సమృద్ధార్థో గమిష్యామి - మిషతాం సర్వరాక్షసాం ॥

14. ధర్మాత్మా సత్య సంధశ్చ - రామో దాశరథిర్యది।
పౌరుషే చ అప్రతి ద్వంద్వః - శరై నం జహి రావణిమ్ ॥

తా : దశరథకుమారుడు రాముడు, పౌరుషములో సాటిలేనివాడు అయితే, శరము ఇంద్రజిత్తును వధించుగాక !

15. సకృదేవ ప్రపన్నాయ - తవాస్మీతి చ, యాచతే
అభయం సర్వభూతేభ్యః - దదామ్యేతద్వ్రతం మమ ॥

తా : ఆర్తుడై ఒక్క పర్యాయము రామా అని యాచించిన సర్వభూతముల నుండి అభయమును ప్రసాదించుచున్నాను. ఇది నావ్రతము అని శ్రీరామ చంద్రమూర్తి సెలవిచ్చెను.

2 శ్రీ ఆంజనేయ స్తోత్రము.

(మంగళవారమున భక్తి శ్రద్ధలతో పఠించవలయును)

1. శ్రుణుదేవి ప్రవక్ష్యామి, స్తోత్రం సర్వ భయాపహమ్ ।
సర్వ కామప్రదం నృణాం, హనుమత్ స్తోత్ర ముత్తమమ్ ॥
2. తప్తకాంచన సంకాశం, నానారత్న విభూషితమ్ ।
ఉద్యద్బాలార్క వదనం, త్రిణేత్రం కుండలోజ్జ్వలమ్ ॥
3. మౌంజీకౌపీన సంయుక్తం, హేమయజ్ఞోపవీతినం ।
పిఙ్గళాక్షం మహాకాయం, టంకశైలేంద్ర ధారిణమ్ ॥
4. శిఖానిక్షిప్త వాలాగ్రం, మేరు శైలాగ్ర సంస్థితం ।
మూర్తిత్రయాత్మకం పీనం, మహావీరం మహాహనుమ్ ॥
5. హనుమంతం వాయుపుత్రం, నమామి బ్రహ్మచారిణం ।
త్రిమూర్త్యాత్మక మాత్మస్థం, జపాకుసుమ సన్నిభం ॥
6. నానాభూషణ సంయుక్తం, ఆంజనేయం నమామ్యహమ్ ।
పంచాక్షర స్థితందేవం, నీలనీరద సన్నిభం ॥
7. పూజితం సర్వదేవైశ్చ, రాక్షసాంతం నమామ్యహమ్ ।
అచలద్యుతి సంకాశం, సర్వాలంకార భూషితమ్ ॥
8. షడక్షరస్థితం దేవం, నమామి కపినాయకమ్ ।
తప్త స్వర్ణమయం దేవం, హరిద్రాభం సురార్చితమ్ ॥
9. సుందరం సాబ్జనయనం, త్రిణేత్రం తం నమామ్యహమ్
అష్టాక్షరాధిపం దేవం, హీరవర్ణ సముజ్జ్వలం ॥

10. నమామి జనతా వంద్యం, లంకాప్రాసాద భంజనం ।
అతసీపుష్ప సంకాశం, దశవర్ణాత్మకం విభుం ॥

11. జటాధరం చతుర్బాహం, నమామి కపినాయకం ।
ద్వాదశాక్షర మంత్రస్య నాయకం కుంతధారిణమ్ ॥

12. అంకుశం చ దధానం చ, కపివీరం నమామ్యహమ్ ।
త్రయోదశాక్షరయుతం, సీతాదుఃఖ నివారణమ్ ॥

13. పీతవర్ణం లసత్కాయం, భజే సుగ్రీవమంత్రిణమ్ ।
మాలామంత్రాత్మకం దేవం, చిత్రవర్ణం చతుర్భుజమ్ ॥

14. పాశాంకుశాఽభయ కరం, ధృతటంకం నమామ్యహమ్ ।
సురాసుర గణై స్సర్వై, స్సంస్తుతం ప్రణమామ్యహమ్ ॥

15. ఏవం ధ్యాయేన్నరోనిత్యం, సర్వపాపైః ప్రముచ్యతే ।
ప్రయాతి చింతితం కార్యం, శీఘ్రమేవ న సంశయః ॥

16. అష్టమ్యాం వా చతుర్దశ్యాం, మర్కవారే విశేషతః ।
సంధ్యా పూజాం ప్రకుర్వీత, ద్వాదశ్యాం చ విశేషతః ॥

17. అర్కమూలేన కుర్వీత, హనుమత్ప్రతిమాం సుధీః ।
పూజయేత్తత్ర విద్వాన్ యః, రక్త వస్త్రేణ వేష్టయేత్ ॥

18. బ్రాహ్మణా న్భోజయే తృశ్చాత్తత్ప్రీత్యై సర్వకామదాం ।
యః కరోతి నరో భక్త్యా, పూజాం హనుమతస్సుధీః ।

19. నశస్త్రభయ మాప్నోతి, భయం వ్యాప్యన్తరిక్షజం ।
అక్షాదిరాక్షసహరం, దశకంఠదర్ప నిర్మూలనం
రఘువరాంఘ్రి సరోజభక్తం ॥
సీతాఽవిషస్య ఘనదుఃఖ నివారకం తం ।
వాయోస్సుతం గిలిత భానుమహం నమామి ॥

20.మాం పశ్య పశ్య హనుమన్ నిజదృష్టి పాతైః ।
మాం రక్ష రక్ష పరితో రిపు దుఃఖ పుంజాత్ ।
వశ్యాం కురు త్రిజగతీం వసుదాధి పానాం ।
మే దేహిదేహి మహతీం వసుధాం శ్రియం చ॥
21.ఆపద్భ్యో రక్ష సర్వత్ర ఆంజనేయ నమోఽస్తుతే ।
బంధనం చ్ఛేదయాజస్రం కపివీర నమోఽస్తుతే ॥
22.దుష్టరోగాన్ హన హన రామదూత నమోఽస్తుతే ।
ఉచ్చాటయ రిపూన్సర్వా న్మోహనం కురు భూభుజాం ॥
23.విద్వేషిణో మారయత్వం త్రిమూర్త్యాత్మకం సర్వదా ।
సంజీవన పర్వతోద్ధార మనోదుఃఖం నివారయ ॥
24.ఘోరాను పద్రవాన్ సర్వాన్ నాశయా(క్ష)క్షా సురాన్తక ।
ఏవంస్తుత్వా హనూమన్తం నరః శ్రద్ధా సమన్వితః ॥
ఇత్యుమా సంహితాయాం ఆంజనేయస్తోత్రం సమ్పూర్ణమ్ ॥

నిత్యసాధనచంద్రిక - 20

3. నిద్రలేవగానే నిద్రపోయేముందు ప్రయాణమై ఇంటినుండి బయలుదేరుటకు ముందు పూజాసమయమున ఈ ఆంజనేయస్తోత్రము పఠించుట శుభకరము.

1. హనుమా నంజనాసూనుః - వాయుపుత్రో మహాబలః ।
రామేష్టః ఫల్గుణసఖః - పింగాక్షోఽమితవిక్రమః ॥
2. ఉదధిక్రమణశ్చైవ - సీతా శోక వినాశకః ।
లక్ష్మణ ప్రాణదాతా చ - దశగ్రీవస్య దర్పహా ॥
3. ద్వాదశైతాని నామాని - కపీంద్రస్య మహాత్మనః ।
స్వాపకాలే పఠేన్నిత్యం - యాత్రాకాలే విశేషతః ॥
తస్య మృత్యుభయం నాస్తి - సర్వత్ర విజయీ భవేత్ ।
4. యశ్శివో నామరూపాభ్యాం - యాదేవీ సర్వమంగళా ।
తయోస్సంస్మరణాత్పుంసాం - సర్వతో జయమంగళమ్ ।
లాభస్తేషాం జయస్తేషాం - కుతస్తేషాం పరాభవః ।
యేషా మిందీ వరశ్యామో - హృదయస్థో జనార్దనః ॥

5. ఆపదా మపహర్తారం - దాతారం సర్వ సంపదాం ।
లోకాభిరామం శ్రీరామం - భూయో భూయో నమామ్యహం ।

6. అగ్రతః పృష్ఠతశ్చైవ - పార్శ్వతశ్చ మహాబలౌ ।
ఆకర్ణ పూర్ణ ధన్వానౌ - రక్షేతాం రామలక్ష్మణౌ ॥

7. సన్నద్ధః కవచీ ఖడ్గీ - చాపబాణధరో యువా ।
గచ్ఛన్మమాగ్రతో నిత్యం రామః పాతు సలక్ష్మణః ॥

4. శ్రీరామదూత

అమల కమలవర్ణం ప్రజ్వలత్పావకాభం
సరసిజ నిభవక్త్రం సర్వదా సుప్రసన్నం ।
పటుతర ఘనగాత్రం భానుకోటి ప్రకాశం
రణజయ కరవాలం రామదూతం నమామి ॥

తా : నిర్మలమైన కమలమువలె శోభించువారును, ప్రజ్వలించు అగ్నివంటి కాంతి కలవారును, కమలమువలె అందమైన ముఖముతో విరాజిల్లువారును, సదా మహాప్రసన్నులైయుండువారును, దృఢమైన శరీరము కలవారును, కోటిసూర్య ప్రకాశముతో భాసిల్లువారును, యుద్ధమందు శత్రువులను భేదించు ఖడ్గము వంటివారును, శ్రీరామచంద్రుని దూతయునగు హనుమంతునకు నమస్కరించుచున్నాను.

రామాయణరత్నాకరము - 22.

## 44. శ్రీవేంకటేశ్వరా స్తోత్రము



1. కమలాకుచచూచుక కుంకుమతో ।
నియతారుణితాతుల నీలతనో ।
కమలాయతలోచన లోకపతే ।
విజయీ భవ వేంకటశైలపతే ॥

భావము:- ఓ వేంకటాచలపతీ ! శ్రీదేవి చనుమొనల కుంకుమపూత వలన నెఱ్ఱనైన నీల శరీరము గలవాడవు, తామరరేకులవలె నిడువైన కన్నులు గల వాడవు, ఓ జగన్నాయకస్వామీ నీకు జయము జయము.

**2. స చతుర్ముఖ షణ్ముఖ పంచముఖ ।**
**ప్రముఖాఖిల దైవత మౌళి మణే ।**
**శరణాగతవత్సల సారనిధే।**
**పరిపాలయ మాం వృషశైల పతే ॥**

భా : బ్రహ్మ, శివుడు, కుమారస్వామి మొదలగు సమస్త దేవతలకు తలమానికము వంటివాడవు. శరణు జొచ్చినవారిని ప్రీతితో బ్రోచువాడవు, సారథివి. ఓ వేంకటా చలపతీ నన్ను రక్షింపుము.

**3. అతివేలతయా తవ దుర్విషహై ।**
**రనువేల కృతై రపరాధ శతైః ।**
**భరితం త్వరితం వృషశైల పతే ।**
**పరయా కృపయా పరిపాహి హరే ॥**

భా : ఓ శ్రీహరీ ! హద్దుమీరి సైపరాని యపరాధముల పెక్కింటిని పలుమారు గావించితిని. ఓ వేంకటా చలపతీ మిక్కిలి దయతో నీదుష్టుని త్వరగాకాపాడుము.

**4. అధివేంకటశైల ముదారమతేః ।**
**జనతాభిమతాధిక దానరతాత్ ।**
**పరదేవతయా గదితాన్నిగమైః**
**కమలాదయితాన్న పరం కలయే ॥**

భా : ఓస్వామీ ! జనులు కోరినదానికన్నా ఎక్కువ వరములిచ్చు ఉదారమతివి. నిన్ను వేదములు పరమదైవముగా కొనియాడుచున్నవి. వేంకటాచలపతియగు ఓ లక్ష్మీపతీ నీకంటేనన్యునే నొల్లను.

**5. కలవేణురవావశగోపవధూ ।**
**శతకోటివృతాత్స్మర కోటిసమాత్ ।**
**ప్రతిపల్లవికాభిమతాత్సుఖదాత్ ।**
**వసుదేవ సుతాన్న పరం కలయే ॥**

భా: ఓ గోపాలస్వామీ ! మనోహరమగు నీవేణుగానముచే పరవశులై గోపికలు వేనవేలు నిన్ను చుట్టిముట్టి యుందురు. కోటి మన్మథలావణ్యము గల్గి గోపికల కొక్కక్కరికిని ప్రియముగ మెలగి సుఖమునొసంగు చుందువు. ఓ వాసుదేవా! నీకంటె నన్యము నేనెరుగను.

**6. అభిరామ గుణాకర దాశరథే ।**
**జగదేక ధనుర్ధర ధీరమతే ।**
**రఘునాయక రామ రమేశవిభో ।**
**వరదో భవ దేవ దయా జలధే ॥**

భా : ఓ వేంకటేశ్వరా ! కల్యాణ గుణములకు తావైన దాశరథీ ! నీవు జగదేక ధనుర్ధారివి. రఘునాయకారామా! లక్ష్మీపతీ! దయాసముద్రా! ఓ స్వామీ, దేవదేవా! వరముల నొసగి మమ్ము కాపాడుము.

**7. అవనీతనయా కమనీయకరం।**
**రజనీకరచారుముఖాంబురుహమ్।**
**రజనీ చరరాజ తమో మిహిరం।**
**మహనీయమహం రఘురామమయే ॥**

భా : భూదేవి కూతురగు సీతాదేవికి మిక్కిలి నచ్చినయందగాడవు. చందమామను గేరుమోము దమ్మిగలవాడవు. రావణాసురుడను దట్టమగు చీకటికి సూర్యుని వంటి వాడవు. ఓ రఘురామా! మహానుభావుడవు. నిన్నే శరణు వేడుచున్నాను.

**8. సుముఖం సుహృదం సులభం సుఖదం।**
**స్వనుజం చ సుకాయమమోఘ శరమ్ ।**
**అపహాయ రఘూద్వహ మన్య మహం।**
**న కథంచన కంచన జాతు భజే ॥**

భా : శ్రీరామా ! నీ ముఖము, శరీరము దివ్యసుందరములు. నీమనస్సు మిక్కిలి మృదువైనది. ఎల్ల జనులకు సులభముగా ఆశ్రయింపదగిన వాడవే. సుఖము నొసగుదువు. మంచితోబుట్టువులు కలవాడవు. మొక్కవోనియమ్ములు గలవాడవు. ఓ రఘుపతీ నిన్ను విడిచి వేఱొకని నెవ్వని నెప్పుడును సేవింపను.

**9. వినా వేంకటేశం న నాథో న నాథః।**
**సదా వేంకటేశం స్మరామి స్మరామి ।**
**హరే వేంకటేశ ప్రసీద ప్రసీద।**
**ప్రియం వేంకటేశ ప్రయచ్ఛ ప్రయచ్ఛ ॥**

భా : వేంకటేశ్వరుడుగాక నాకు వేరుదిక్కు ఎవ్వరునులేరు. ఎల్లవేళల వేంకటేశ్వరునే స్మరింతు. ఓ వేంకటేశ్వరా ప్రసన్నుడవగుము. ప్రీతినిమ్ము.

10. అహం దూరతస్తే పదాంభోజయుగ్మ।
ప్రణామే చ్ఛయాఽఽగత్య సేవాం కరోమి।
సకృత్సేవయా నిత్యసేవా ఫలం త్వం।
ప్రయచ్ఛ ప్రయచ్ఛ ప్రభో వేంకటేశ ॥

భా : ఓ వేంకటేశ్వరప్రభూ! నీపాదకమల సేవకై భక్తితో నెంతో దూరమునుండి వచ్చికొలుచుచున్నాను. ఓ స్వామీ! ఒకమారు చేయు నీసేవచేతనే నిన్ను నిత్యము గొలుచు సేవాఫలము నాకు దయచేసియిమ్ము.

11. అజ్ఞానినా మయా దోషాన్ అశేషాన్ విహితాన్ హరే।
క్షమస్వ త్వం క్షమస్వ త్వం శేషశైల శిఖామణే ॥

భా : ఓ శేషశైల శిఖామణీ, మూఢుండనై, యనేకములగు నేరముల గావించితిని. ఓ శ్రీహరీ వానినన్నిటిని క్షమింపుము. స్వామీ క్షమింపుము.

స్తోత్రరత్నములు - 80, భగవస్తుతి స్తుతిరత్నములు - 35

2 ఓం నమో వేంకటేశాయ పురుషాయ మహాత్మనే ।
ప్రణత క్లేశ నాశాయ గోవిందాయ నమోనమః ॥

భా : పరమ పురుషుడును, మహాత్ముడును నమస్కరించువారి కష్టములను నశింపజేయువాడును, భూమిని పొందినవాడును అగు శ్రీవేంకటేశ్వరస్వామికి నమస్కారము.



## 45 శ్రీరంగనాథాష్టక స్తోత్రము

1. పద్మాదిరాజే గరుడాదిరాజే విరంచిరాజే సురరాజరాజే,
త్రైలోక్యరాజేఽఖిల రాజరాజే శ్రీరంగరాజే నమతానమామి.

భా : బ్రహ్మాధిపతి, గరుడుని రాజు, వైకుంఠనాయకుడు, దేవరాజుకు చక్రవర్తి, ముల్లోకాలకు అధినాయకుడు, సర్వలోకాలకు అధిపతి అయిన శ్రీరంగరాజులో నామనస్సు లయించి సంతోషించుగాక.

2. శ్రీచిత్తశాయీ భుజగేంద్రశాయీ నాదార్కశాయీ ఫణిభోగశాయీ,
అంభోధిశాయీ వటపత్రశాయీ శ్రీరంగరాజే నమతా నమామి.

భా : శ్రీదేవి ఒడిలోనూ, ఆదిశేషునిపై పాలకడలిలో, వటపత్రంపై పవళించే శ్రీరంగనాథునికి నానమోవాకాలు.

**3. లక్ష్మినివాసే జగతాం నివాసే హృత్పద్మవాసే రవిబింబవాసే,**
**శేషాద్రివాసే ఒఖిలలోకవాసే శ్రీరంగవాసే నమతా నమామి.**

భా : శ్రీదేవికి తనవక్షస్థలాన్ని ప్రసాదించినవాడు, భక్తుల హృదయతామరల్లో వసించేవాడు, సూర్యమండలంలో సంచరించేవాడు, శ్రీరంగంలో అవతరించిన వాడూ అయిన శ్రీరంగనాథునికి ప్రణమిల్లుతున్నాను.

**4. బ్రహ్మాదివంద్యే జగదేకవంద్యే రంగే ముకుందే ముదితారవిందే,**
**గోవింద దేవాఖిల దేవదేవే శ్రీరంగరంగే నమతా నమామి.**

భా : బ్రహ్మాది సురగణాలచే కీర్తించబడ్డవాడు, లోకంలోని జీవులెల్లరకూ ఆరాధ్యుడు, ముకుందునిచే సేవించబడ్డవాడు, దేవతలందరికి నాయకుడైన ఇంద్రునికి దైవమయినవాడూ శ్రీరంగంలో వెలసి పూజలందుకొంటున్న శ్రీరంగనాథ వంద్యునికి నమస్కారాలు.

**5. నీలాంబువర్ణే భుజపూర్ణకర్ణే కర్ణాంతనేత్రే కమలాకళత్రే,**
**శ్రీవల్లిరంగే జితమల్లరంగే శ్రీరంగరంగే నమతా నమామి.**

భా : నీలకమల వర్ణుడూ, భుజాలవరకు శ్రవణాలు, చెవులవరకు నేత్రాలున్నవాడు, లక్ష్మీదేవి ధర్మపత్నిగా ఉన్నవాడూ, శ్రీవల్లి అండాళ్‌కు ఆ హృదయాన్నిచ్చిన శ్రీరంగరంగధామునికి కైమోడ్పులు.

**6. ఆనందరూపే నిజబోధరూపే భక్తి స్వరూపే శ్రుతిమూర్తిరూపే,**
**గోవిందదేవాఖిలదేవదేవే శ్రీరంగరంగే నమతానమామి.**

భా : ఆనందస్వరూపుడు, యథార్థ జ్ఞానబోధకుడు, సత్యరూపుడు, వేదమూర్తియై ఆవిర్భవించినవాడు, అందరి హృదయాలను ఆవహించినవాడూ, అయిన శ్రీరంగనాథునిలో నామనస్సు లగ్నమౌ గాక !

**7. కర్మప్రమాదే నరక ప్రమాదే భక్తి ప్రమాదే జగతాధిగాధే,**
**అనాథనాథే జగదేకనాథే శ్రీరంగనాథే నమతా నమామి.**

భా:- జనులు చేసే విధి నిషేధ కార్యాల ప్రమాదంలో భక్తుడు ఉన్నప్పుడూ, నరకంలోనూ, భక్తిలోనో లోపాలున్నప్పుడు, అనాథలకు నాథుడూ జగతులకు ఒకేఒక నాథుడూ అయిన శ్రీరంగనాథుని నామస్మరణలో నామది తుదివరకూ కొనసాగుగాక !

**8. అమోఘనిద్రే జగదేకనిద్రే విదేహ్యనిద్రే విషయా సముద్రే,**
**శ్రీయోగనిద్రే సుఖయోగనిద్రే శ్రీరంగనిద్రే నమతా నమామి.**

భా : విచిత్రరీతిలో సర్పరాజైన ఆదిశేషునిపై, నందుని ఒడిలో, శ్రీదేవి ఒడిలో, క్షీరసాగరంలో, వటపత్రంలో, యోగనిద్రలో పరుండినవాడు, శ్రీరంగంలో శయనించిన శ్రీరంగనాథుని చెంత నా మనస్సు లయమైయుండుగాక.

**రంగాష్టకమిదం పుణ్యం ప్రాతఃకాలే పఠేన్నరః,**
**కోటిజన్మకృతం పాపం తత్ క్షణేన వినశ్యతి.**

పుణ్యప్రదాత అయిన శ్రీరంగనాథుని ఈ ఎనిమిది స్తోత్రాలను ఉదయాన్నే పఠించువారు ఆకాంక్షలన్నీ సఫలవంతమగును. అట్టివారు స్వర్గధామాన్ని, శ్రీరంగనాథుని సాయుజ్యసిద్ధిని పొందగలరని భక్తుల అశేష విశ్వాసం.

శ్రీరంగం 'భూలోక వైకుంఠం' అని ప్రసిద్ధిచెందిన పుణ్యతీర్థం. ఈ పవిత్ర క్షేత్రంలో కావేరీనదిని పూమాలగా ధరించి, ఆలయగర్భమందిరంలో శయన మూర్తిగా దర్శనమిస్తున్నాడు శ్రీరంగనాథస్వామి. ఆదిశంకరులు, శ్రీరంగనాథుని స్తుతించినపై ఎనిమిది శ్లోకాలు, 'శ్రీరంగనాథ అష్టకం' గా పేర్కొనబడుతున్నాయి.

శ్రీరామకృష్ణప్రభ 12/2001-40,

ఇతి శ్రీరంగనాథాష్టకమ్ సంపూర్ణము భగవన్నుతిరత్నములు 141

## 46 గరుడదర్శనము చేయునపుడు పఠించు స్తోత్రము

**కుంకుమాంకిత వర్ణాయ కుందేందు ధవళాయ చ,**
**విష్ణువాహ నమస్తుభ్యం పక్షిరాజాయతే నమః.**

ఈ శ్లోకమును పఠించినయెడల సర్వకార్యసిద్ధి కలుగుటయేకాక పాముల విషములను హరించును. 256 సర్వదేవతల స్తుతి సంగ్రహము

## 47 సర్ప భయ నివారణకు

విష్ణు పురాణములో చెప్పబడిన యీ దిగువనగల నర్మదామంత్రమును చదివెడి వారికి, చీకటిలో వెళ్ళినవారికి, చీకటిలో నిద్రించుచున్నప్పటికి, పాముల వలన భయము వుండదు. ఈ మంత్రమును ఒకసారి చదివిన చాలు.

**నర్మదాయై నమః ప్రాతః నర్మదాయై నమోనిశి,**
**నమో౽స్తు నర్మదే! తుభ్యం, త్రాహిమాం విషసర్పతః ॥**

విశ్వదేవార్చన - 72 దైవప్రార్థన

2. ఇప్పుడు సంస్కృత భారతమున కొన్ని శ్లోకములున్నవి.
ఆశ్లోకములను నిత్యము పఠించుచో వారికి సర్ప భయముండదు.

**"అసితం చార్తిమంతం చ సునీథం చాపి యః స్మరేత్**
**దివా వా యది వా రాత్రౌ నాస్య సర్ప భయం భవేత్ ।"** ఆ-108
**యో జరత్కారుణా జాతో జరత్కారౌ మహాయశాః**
**ఆస్తీకః సర్పసత్రే వః పన్నగాన్యో௨భ్య రక్షత**
**తం స్మరంతం మహాభాగో న మాం హింసితు మర్హ థ**
**సర్పాపసర్ప భద్రం తే గచ్ఛ సర్ప మహావిష**
**'జనమే జయస్య యజ్ఞాంతే ఆస్తీకవచనం స్మర**
**ఆస్తీకస్య వచః శ్రుత్వా యః సర్పో న నివర్తతే**
**శతధా భిద్యతే మూర్ధ్ని, శింశవృక్షఫలం యథా'**

ఓ సర్పములారా! సర్ప సత్రము నందు పన్నగముల నెవ్వడు రక్షించెనో ఆ యాస్తీకుని వాక్యమును స్మరించుడు. అట్లు మీరామాటను స్మరించకనే యాస్తీకుని తలచినను తొలగిపోక పోతిరేని మీ శీర్షము నూరు వ్రక్కలగునని పై శ్లోకమున కర్థము. ఇట్టి స్తోత్రములు భారతమునందెన్నోయున్నవి.

మహాభారతోపన్యాసములు 1వ భాగము - 15

3.భుజగపతులందరూ సుధాపయోధి మధ్యంలో భుజగతల్పం పైన యోగ నిద్రలో ఉన్న శ్రీ మహావిష్ణువు చెంతకు వెళ్ళి శ్రుతిపక్వమైన కంఠాలతో వైదిక సూక్తాలను గానం చేసారు. "భగవన్! మాకీదురవస్థ తొలగిపోయే సదుపాయం ఏమిటి?" అని పరిదీనవదనాలతో పరిపరివిధాల ప్రార్థించారు. శ్రీహరి వారి భక్తి విధేయతలకు ప్రహృష్టుడై, "నేను మాంధాతృసుతుడైన పురుకుత్సుని రూపంలో గంధర్వగణాలను జయిస్తాను. మీరు చింతిల్లవద్దు" అని అభయాన్ని ప్రసాదించాడు.

వాసుదేవునికి దండవత్ప్రణామాలను ఆచరించి పాతాళానికి తిరిగి వచ్చాక చక్షుః శ్రవాధీశులు సమావేశమై, పురుకుత్సుని తమకు సహాయం చేయమని కోరదలచారు. ఆ మహత్కార్యంలో ఉరగ నాయకులకు తోడ్పడదలచి నర్మదానది పురుకుత్సుని వద్దకు వెళ్ళి పాతాళానికి కలిగిన ఆపదను గూర్చి తెలియజేసింది. ఆశ్రిత జనమందారుడైన పురుకుత్సుడు సోమపుత్రితో కలిసి పాతాళానికి వెళ్ళి గంధర్వగణాలను నాశనం చేసాడు.

తమకు కలిగిన దురవస్థను తొలగించిన పురుకుత్సునికి పాతాళలోకపతులు అవిచ్ఛిన్న వంశాభ్యుదయాన్ని అనుగ్రహించారు. నర్మదానదిని స్మరించిన పుణ్యాత్ములకు తమ జాతివలన భీతి కలుగకుండా వరాన్ని ప్రసాదించారు. ఉదయ సంధ్యలలోనూ నర్మదానదిని భక్తిశ్రద్ధలతో సంకీర్తించిన మానవులకు భోజన సమయంలో విషం తిన్నా అమృతాయమమానమౌతుందని మాట యిచ్చి భుజగేంద్రులు నర్మదా పురుకుత్సులను యథోచితంగా సన్మానించారు. వి.వృ.231

## 48. శ్రీ పాండురంగాష్టకము

**1.మహాయోగపీఠే తటే భీమరథ్యా - వరం పుండరీకాయ దాతుం మునీంద్రైః।**
**సమాగత్య నిష్ఠం తమానందకందం - పరబ్రహ్మమూర్తిం భజే పాండురంగమ్॥**

**2.తటిద్వాససం నీలమేఘావభాసం - రమామందిరం సుందరం చిత్ప్రకాశం।**
**వరం త్విష్టికాయాం సమన్యస్తపాదం - పరబ్రహ్మమూర్తిం భజే పాండురంగమ్॥**

**3.ప్రమాణం భవాబ్ధేరిదం మామకానాం - నితంబః కరాభ్యాం ధృతోయేన తస్మాత్।**
**విధాతుర్వ సత్యైధృతోనాభికోశః - పరబ్రహ్మమూర్తిం భజేపాండురంగమ్ ॥**

**4.స్ఫురత్కౌస్తుభాలంకృతం కంఠదేశే - శ్రియాజుష్ట కేయూరకం - శ్రీనివాసం।**
**హరిం శాంతమీడ్యం పరంలోకపాలం - పరబ్రహ్మమూర్తిం భజేపాండురంగమ్॥**

**5.శరచ్చంద్ర బింబాననం చారుహాసం - లసత్కుండలాక్రాంత గండస్థలాంతం।**
**జపారాగ బింబాధరం కంజనేత్రం - పరబ్రహ్మమూర్తిం భజే పాండురంగమ్ ॥**

**6.కిరీటోజ్జ్వల త్సర్వ దిక్ప్రాంతభాగం - సురైరర్చితం దివ్యరత్నై రనర్ఘైః।**
**త్రిభంగాకృతిం బర్హ మాల్యావతంసం - పరబ్రహ్మమూర్తిం భజే పాండురంగమ్॥**

**7.విభుం వేణువాదం చరంతం దురంతం - స్వయం లీలయాగోపవేషం దధానం।**
**గవాం బృందకానందదం చారుహాసం - పరబ్రహ్మమూర్తిం భజే పాండురంగమ్॥**

**8.అజం రుక్మిణీప్రాణ సంజీవనం తం - పరంధామ కైవల్యమేకం తురీయం।**
**ప్రసన్నం ప్రపన్నార్తి హం దేవదేవం - పరబ్రహ్మమూర్తిం భజే పాండురంగమ్॥**

**9.స్తవం పాండురంగస్యవై పుణ్యదం తత్యే - పఠంత్యేక చిత్తేన భక్త్యా చ నిత్యం।**
**భవాం భోనిధిం తే౽పి తీర్త్వాంతకాలే - హరేరాలయం శాశ్వతమ్ ప్రాప్నువంతి॥**

51057 - పురాతన విషయ సంగ్రహం 42 (భక్త విజయము)

2 శ్రీపాండురంగ స్తుతి.

1. నమశ్శ్రీ పాండురంగాయ - నమో బ్రహ్మోదరాయ చ ।
నమో నాథాయ కాంతాయ రమాయాః పుణ్యమూర్తయే ।

2. నమశ్శాంతాయ కృష్ణాయ నమస్తే ఽద్భుత కర్మణే ।
అప్రాకృత శరీరాయ పాండురంగాయతే నమః ॥

3. త్వమేవ మాతా చ పితా త్వమేవ ।
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ ।
త్వమేవ సర్వం మమదేవదేవ। పు.వి.సంగ్రహము 43 (భక్తవిజయము)

49 శ్రీదత్తాత్రేయ ధ్యానము.

1. జగదుత్పత్తి కర్త్రే చ స్థితి సంహార హేతవే ।
పాపనాశ విముక్తాయ దత్తాత్రేయ నమోఽస్తుతే ॥

2. కర్పూరకాంతి దేహాయ బ్రహ్మమూర్తి ధరాయ చ ।
వేదశాస్త్ర పరిజ్ఞాయ దత్తాత్రేయ నమోఽస్తుతే ॥

3. ఆదౌబ్రహ్మా మధ్యే విష్ణు రంతే దేవ స్సదా శివం ।
మూర్తి త్రయ స్వరూపాయ దత్తాత్రేయ నమోఽస్తుతే ॥

సర్వమతవిషయ సంగ్రహము - 257

50 సరస్వతీ ప్రార్థనలు.

1. సరస్వతీ నమస్తుభ్యం వరదే కామరూపిణీ,
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతుమే సదా,
పద్మపత్ర విశాలాక్షీ పద్మకేసర వర్ణినీ,
నిత్యం పద్మాలయాదేవీ సా మాం పాతు సరస్వతీ. పెద్దబాలశిక్ష
నిత్యానందే నిరాధారే - నిష్కలాయై నమోనమః।
విద్యాధారే విశాలాక్షి శుద్ధజ్ఞానే నమోనమః॥ కాశీమజిలీకథలు 2వ భాగము

2. యేర్థా నిత్యాయే చ నశ్యంతి చాన్యే,
యేర్థా స్థూలాయే చ సూక్ష్మాతి సూక్ష్మాః,
యేవా భూమౌ యే ఽ ంతరిక్షే ఽ న్య తోవా,
తేషాం దేవీ త్వత్త ఏ వోప లబ్ధిః. కాశీమజిలీకథలు, 8వభా, 362

3. సరస్వతీ మంత్రము.
ఓం ప్రాణో దేవీ సరస్వతీ వాజేభివాజినీవతీ ।
ధీనామవిత్ర్యవతు ॥ఓం॥

ప్రణమిల్లే యావన్మందినీ కాపాడే సరస్వతీదేవి మనలను కాపాడుగాక । వాక్ శక్తులను ప్రేరేపించి మనలను జాగృతం చేయుగాక । సస్వర వేదమంత్రాలు - 16

4. సరస్వతీ ద్వాదశ నామ స్తోత్రము.

1. సరస్వతీ త్వియం దృష్టా । వీణా పుస్తకధారిణీ ।
హంసవాహ సమాయుక్తా । విద్యా దానకరీ మమ ॥
2. ప్రథమం భారతీనామ । ద్వితీయం చ సరస్వతీ ।
తృతీయం శారదాదేవి । చతుర్థం హంసవాహనా ॥
3. పంచమం జగతీ ఖ్యాతం । షష్ఠం వాగీశ్వరీ తథా ।
కౌమారీ సప్తమం ప్రోక్త । మష్టమం బ్రహ్మచారిణీ ॥
4. నవమం బుద్ధి దాత్రీ చ । దశమం వరదాయినీ ।
ఏకాదశం క్షుద్రఘంటా । ద్వాదశం భువనేశ్వరీ ॥
5. బ్రాహ్మీ ద్వాదశ నామాని । త్రిసంధ్యం యః పఠేన్నరః ।
సర్వసిద్ధి కరీతస్య । ప్రసన్నా పరమేశ్వరీ ।
సామే వసతు జిహ్వాగ్రే । బ్రహ్మరూపా సరస్వతీ ॥

సరస్వతీ ద్వాదశనామస్తోత్రం సంపూర్ణము

పరబ్రహ్మానంద పరిపూర్ణ బోధామృతము

5 సరస్వత్యష్టకము.

1. మహామతే మహాప్రాజ్ఞ । సర్వ శాస్త్ర విశారద ।
అక్షీణ కర్మ బంధస్తు । పురుషోద్విజ సత్తమః ॥

2. మరణే యజ్ఞపే జ్ఞాప్యం । యం చ భావ మనుస్మరన్ ।
పరంపద మవాప్నోతి । తన్మే బ్రూహి మహామునే ॥

3. ఇదమేవ మహారాజ ।పృష్టవాంస్తే పితామహః।
భీష్మం ధర్మవిదాం శ్రేష్ఠం । ధర్మపుత్రో యుధిష్ఠరః ॥

4. పితామహ మహాప్రాజ్ఞ । సర్వ శాస్త్ర విశారద ।
బృహస్పతి స్తుతాదేవీ । వాగేశాయ మహాత్మనే ।
ఆత్మాయ దర్శయామాస । సూర్యకోటి సమప్రభమ్ ।

5. వరం వృణీష్వ భద్రంతే । యత్తే మనసి వర్తతే ।
యజ్ఞమే వరదాదేవి । దివ్యజ్ఞానం ప్రయచ్ఛనః ॥

6. హంతతే నిర్మల జ్ఞానం । కుమతి ధ్వంసకారకమ్ ।
స్తోత్రేణా నేన యే భక్త్యా । మాం స్తువంతి మనీషణః ॥

7. లభతే పరమం జ్ఞానం । యత్పురై రపి దుర్లభమ్ ।
ప్రాప్నోతి పురుషోనిత్యం । మహామాయా ప్రసాదతః ॥

8. త్రిసంధ్యం ప్రయతో నిత్యం । పఠేదష్టక ముత్తమమ్ ।
తస్య కంఠే సదావాసం । కరిష్యామి న సంశయః ॥

సరస్వత్యష్టకము సంపూర్ణము.

శ్రీ పద్మపురాణము (పరబ్రహ్మానంద పరిపూర్ణ బోధామృతము)

6. జయ జయ సత్యరూప । ధృవీ సర్వగ । అక్షరీ సర్వ సిద్ధిదా ।
జయ పరమేశ్వరి । పరమ । సర్వ జగజ్జననీ । సుపావనీ ।
జయ జయ సిద్ధి బుద్ధిద । విశాల జగద్రచనా చమత్క్రియా ।
జయశ్రుతి సంచయ ప్రభవ సాధని । యో ప్రణవ స్వరూపిణీ॥

వరాహపురాణము - 97

7. బ్రహ్మకృత సరస్వతీ స్తోత్రమ్

1. ఆరూఢా శ్వేతహంసే భ్రమతి చ గగనే దక్షిణే చాక్షసూత్రం
వామే హస్తే చ దివ్యామ్బర కనకమయం పుస్తకం జ్ఞాన గమ్యా।

**సా వీణాం వాదయన్తీ స్వకరకరజస్పైః శాస్త్ర విజ్ఞాన శబ్దైః
క్రీడన్తీ దివ్యరూపా కరకమలధరా భారతీ సుప్రసన్నా ॥**

భావము : తెల్లటిహంస నారోహించి, కుడిచేతిలో జపమాల, ఎడమచేతిలో దివ్య స్వర్ణవస్త్రం, పుస్తకం, స్వయంగా శాస్త్ర విజ్ఞాన శబ్దాలతో స్వహస్తాలతో వీణను వాయిస్తూ క్రీడిస్తున్నదీ, దివ్యరూపంతో జ్ఞానమే గమ్యముగా కలదీ అయిన భారతి, సరస్వతి నాకు సుప్రసన్నురాలు అవుగాక!

**2. యాకుందేందు తుషార హార ధవళా, యా శుభ్రవస్త్రా న్వితా ।
యా వీణా వరదండ మండిత కరా, యా శ్వేత పద్మాసనా ।
యా బ్రహ్మా చ్యుత శంకర ప్రభృతి భిర్దే వై స్సదా పూజితా ।
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యా పహా ॥**

భా : ఎవరు కుందపువ్వు జాబిల్లి మంచులాంటి తెల్లటి మేని ఛాయతో అల రారుతూ శుభ్రమైన వస్త్రాలను వేసుకొన్నారో, తెల్లటి కలువ పువ్వుపై ఎవరు కూర్చున్నారో, ఎవరిహస్తాల్లో వీణ, వరదండాలు ఉన్నాయో, ఎవరిని ఎల్లవేళలా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాదులు పూజిస్తున్నారో, ఆ సరస్వతీ భగవతీదేవి నాకు సంపూర్ణ ఆరోగ్యాన్ని ప్రసాదిస్తూ రక్షించుగాక। శ్రీరామకృష్ణప్రభ - సెప్టెంబరు/98-36

**3. శ్వేత పద్మాసనా దేవీ శ్వేతగన్ధానులేపనా,
అర్చితా మునిభిః సర్వైః ఋషిభిః స్తూయతే సదా.**

భావము : తెల్లని కలువపూవు ఆసనంగా గలదీ, తెల్లని గంధాన్ని పూసుకొన్నదీ, ఎల్లప్పుడూ మునులు పూజిస్తూ, ఋషులచే స్తుతింపబడుతున్న దేవి (సరస్వతి) నన్ను కరుణించుగాక.

**4. ఏవం ధ్యాత్వా సదా దేవీం వాంఛితం లభతే నరః.**

ఈ విధంగా ఎల్లప్పుడూ దేవిని ధ్యానించిన నరుడు కోరినవి పొందుతాడు.

**5. శుక్లాం బ్రహ్మవిచార సారపరమామాద్యాం జగద్వ్యాపినీం
వీణా పుస్తకధారిణీ మభయదాం జాడ్యాన్ధకారాపహామ్,
హస్తే స్ఫాటిక మాలికాం విదధతీం పద్మాసనే సంస్థితాం
వన్దేతాం పరమేశ్వరీం భగవతీం బుద్ధిప్రదాం శారదామ్.**

భా : తెల్లనిదీ, స్వచ్ఛమైనదీ బ్రహ్మవిచారసారమూ, ఉత్తమమైనదీ అద్యురాలూ, జగత్తును వ్యాపించి ఉన్నదీ, వీణ, పుస్తకం చేతిలో ధరించి, అభయమిస్తూ జాడ్యమనే చీకటిని ప్రారద్రోలేదీ, ఒకచేతిలో స్ఫటికమాలను ధరించి పద్మాసనంలో ఉంటూ మంచిబుద్ధిని ప్రసాదించే పరమేశ్వరి, భగవతి శారదకు నేను మ్రొక్కుకొంటున్నాను.

**6. నమస్తే శారదాదేవి - శృంగేరి పురవాసినీ,**
**త్వామహం ప్రార్థయే నిత్యం - విద్యా దానం చ (బుద్ధించ) దేహిమే.**

**7. భారతీ కరుణాపాత్రం - భారతీ పద భూషణం,**
**భారతీ పద మారూఢం - భారతీ తీర్థమాత్రయే.**

## 52. గాయత్రీమంత్రము.

ఋగ్వేదము 3-62-10

**ఓమ్ శ్రీ గాయత్రీ దేవ్యై నమః**
**ఓమ్ భూర్భువ స్సువః .**
**తత్స వితుర్వ రేణ్యమ్**
**భర్గో దేవస్య ధీమహి**
**ధియో యోనః** ప్రచోదయాత్

ఓం = ప్రణవ మంత్రంగాను, భూర్భువస్సువః = భూః, భువః, సువః అనే వ్యాహృతులుగాను ఉంటున్న, యః = ఎవరు, నః మన, ధియః = బుద్ధిని, ప్రచోదయాత్ = ప్రేరేపిస్తారో, సవితుః = సకలాన్ని సృష్టించేవాడైన, తత్ = ఆ, దైవస్య = దైవం యొక్క, వరేణ్యం = ప్రశస్తమైన, భర్గః = జ్యోతిర్మయ రూపాన్ని, ధీమహి = ధ్యానిద్దాం.

ప్రణవ మంత్రంగాను, భూః భువః సువః అనే వ్యాహృతులుగాను ఉంటూ ఎవరు మన బుద్ధిని ప్రేరేపిస్తారో, సమస్తాన్ని సృష్టించే ఆ దైవ జ్యోతిర్మయరూపాన్ని ధ్యానిద్దాం.

ఈ మంత్రం మూడు భాగాలుగా సంతరించుకొన్నది.

మొదటిది ప్రణవ మంత్రమైన ఓం.

పిదప వచ్చే భాగం ప్రణవ మంత్రపు విపులమైన వ్యాహృతులు. ఇది దివ్యశక్తి కలిగిన పదాలు. స్థూల స్థితిలో ఇవి భూమి (భూః), పితృలోకం (భువః), దేవ లోకం (సువః) అనే మూడు లోకాలను సూచిస్తాయి. సూక్ష్మస్థితిలో మన చేతన

యొక్క మూడు స్థితులను, అంటే శరీరము, మనస్సు, ప్రాణము అనే మూడు స్థితులలోనూ పనిచేసి జీవితాన్ని పరిపోషణ గావిస్తాయి. తత్..... ప్రచోదయాత్ అనే భాగం సావిత్రీమంత్రంగా పేర్కొబడుతుంది. ప్రణవం, వ్యాహృతి, సావిత్రి - ఈ మూడూ కలిసిందే గాయత్రీ "గాయంతం త్రాయత ఇతి గాయత్రీ" జపించే వారిని తరింపజేస్తుంది కనుక యీ మంత్రం గాయత్రీ అని పేరు గాంచినది.

జపించే పద్ధతి : గాయత్రీ మంత్రాన్ని ఐదు భాగాలుగా, అంటే నడుమ నాలుగుసార్లు నిలిపి జపించాలి. (ఓం, - భూర్భువస్సువః, - తత్ సవితుర్వరేణ్యం, - భర్గోదేవస్య ధీమహి, - ధియో యోనః ప్రచోదయాత్) సూర్యుడు కానరాని ప్రాతఃకాలంలోను, సూర్యుడు నడినెత్తిన ఉండే మిట్ట మధ్యాహ్న సమయంలోను, సూర్యుడు అస్తమించే సాయం సమయంలోను గాయత్రీ జపించడం మంచిది. నిత్యం 108 సార్లయినా జపించాలి. సస్వర వేదమంత్రాలు - 4

2. గాయత్రీమాత - మూడుకాలాలలో చేయుపద్ధతి

| ప్రాతఃకాలమున ధ్యానము చేయు గాయత్రీ | **బాలరూపిణి** |
|---|---|
| ఓం భూర్భువ స్సువః | 5 |
| తత్స వితుర్వరేణ్యమ్ | 7 |
| భర్గో దేవస్య ధీమహి | 8 |
| ధియో యోనః ప్రచోదయాత్ | 4 |
| ఓం - ప్రచోదయాత్ లెక్కకురాదు. | 24 |

| మిట్ట మధ్యాహ్న సమయమున ధ్యానము చేయు సావిత్రి | **తరుణరూపిణి** |
|---|---|
| ఓమ్ తత్స వితుర్వ రేణ్యమ్ | 8 |
| భర్గో దేవస్య ధీమహి | 8 |
| ధియో యోనః ప్రచోదయాత్ | 8 |
| | 24 |

| సాయం సమయమున ధ్యానము చేయు సరస్వతి | **వృద్ధ రూపిణి** |
|---|---|
| ఓం భూర్భువ స్సువః | 5 |
| తత్స వితుర్వ రేణ్యమ్ | 7 |
| భర్గో దేవస్య ధీమహి | 8 |
| ధియో యోనః ప్రచోదయాత్ | 4 |
| ఓం, ప్రచోదయాత్ = లెక్కకురాదు. | 24 |

## 3. శ్రీ గాయత్రీ దండకము

(సావిత్రి, సరస్వతీ సహితము)

తల్లీ ! జగత్కల్పవల్లీ ! చిదానందవల్లీ ! సుధారాగవల్లీమ తల్లీ ! త్రివర్ణ స్వరూపా ! త్రయీ పాదరూపా ! త్రిసంధ్యా స్వరూపా ! త్రిమూర్త్యాత్మ రూపా ! త్రినేత్రా ! ప్రసాదింపవే తల్లి !

తద్రూపిణీ ! దివ్య సద్రూపిణీ ! వేద విద్రూపిణీ ! తుర్య భాగ్రూపిణీ ! వర్య వాగ్రూపిణీ ! పూరకుంభస్వనద్రే. చ కోద్భాసినీ ! నీలవేణీ ! యతీంద్రాది హృత్పద్మ సంచారిణీ ! భాస్కరీ ! భవ్యగోలోక సంచారిణీ ! దేశకాలానురూపా ! వషట్కార రూపా! మహా ధీర గంభీర రూపా ! మహామంత్రరూపా ! హితారాధ్య రూపా ! సుధీశాలినీ ! యోగమాయా విలాసోల్ల సద్రూపిణీ ! యోగియోగేశ్వరా రాధితా ! నామ పారాయణ ప్రీత హృత్పద్మినీ ! ప్రాణ సంజీవనీ ! సత్య ధీచోదినీ ! ధర్మ దాక్షిణ్యరూపా ! యథాశక్తి నర్చింతు నోయమ్మ ;

త్వత్పాద కంజాత ధూళిన్ శిరంబందు మేనన్ గుబాళింపగా చల్లు కొందున్ శుభశ్రీలతో నిండుకొన్నట్టి ప్రత్యూష సౌందర్య సంపత్తి చిత్తంబులో హత్తుకొందున్ తమో హారిణీ ! స్వాగతం బమ్మ తేజస్వినీ ! అగ్నియే మోముగా, బ్రహ్మ శీర్షంబుగా విష్ణు దేవుండు డెందంబుగా, రుద్రుడే కేశపాశంబుగా, భూమియే యోనిగా, పంచప్రాణంబులొప్పన్ శరత్పూర్ణిమా జ్యోత్స్నవై చారు భూషాంగివై, వేద శాఖోప శాఖాదులందాడుచున్ నృత్యముంజేయవే - సామవేదోక్త మా ధ్వీక విద్యా ప్రభావంబులో వర్ణితంబైన, నీ రోహిత, శ్వేత, కృష్ణాతి కృష్ణ స్వరూపంబులున్, చంచలత్తేజమున్నోవి, వస్వగ్ని, రుద్రేంద్ర, పాశాయుదాదిత్య, రాజన్మరుత్సోమక, బ్రహ్మ సాధ్యుల్ సదా పానమున్ జేయగా వారి నానంద పాథోదిలో, దేల్చి, పూర్ణాత్ములన్ జేయవే అట్టివారిన్ దొసంగుల్ తొలంగన్ స్మరింపంగ శక్తిన్ ప్రసాదింపవే వేదమాతా ! ;

పృథివ్యగ్ని వాయ్వంతరిక్ష స్వరాదిత్య శుభ్రాంశు నక్షత్ర వాక్ప్రాణ ఛాయాత్మ చక్షుస్సులున్, శ్రోత్ర చిత్తంబులున్ నేత్ర కృష్ణాచ్ఛ వర్ణంబులున్ సామ రూపంబులై కొల్వ ప్రాణ స్వరూపాధి దైవంబవై సామ గాయత్రివై సాధు భావంబుతో లోక విఖ్యాతి జేకొన్న మాతల్లి పూతాత్మునిం జేయవే నన్ను - వాగ్రూపమై నామరూప క్రియా భేదమై భూత సంబంధియైనట్టి ఈ జంగమ స్థావరాలంకృతంబీ ప్రపం చంబు వాక్సారమై శాబ్దికంబైన బ్రహ్మంబుగా నొప్ప తద్బ్రహ్మవేదోక్త గాయత్రిగా

కీర్తి నందన్ భవద్వ్యాపితానంత శక్తిన్ ప్రపంచంబు పూరించుచున్ సర్వ భూతాత్మకత్వంబుగా, పృథ్వి రూపంబుగా నొప్పి త్వన్మంత్రమున్ గానముం జేయు భక్తాళి రక్షించు చున్ సార్థకంబైన గాయత్రి నామంబునుం దాల్చి పేర్వడ్డ నీరూపు భావింతు నీనామ సామర్థ్య మూహింతు.;

సూర్యోదయంబందు ప్రత్యగ్రరూపంబుతో రక్త పద్మాసనారూఢివై రక్త వస్త్రంబులందాల్చి, రక్తాంగివై, రక్తమాలా సుగంధాను లేపంబులం గూడి ఋగ్వేదమున్ పూని, దండాక్ష మాలాదులున్ సుక్స్రువంబుల్ చెలంగన్ ప్రసన్నాత్మతన్ **బాలగాయత్రి**గా బ్రాహ్మి రూపంబుతో నాల్గు మోముల్ సదా నవ్వులన్ రువ్వగా రాజహంసంబుపై వచ్చు నీ తేజమున్ గొల్తు;

అర్ధోదయంబందునన్ నీదు దివ్యారుణ జ్యోతికిన్ చిత్త ముప్పొంగ మేనన్ గగుర్పాటు పొందంగ రాగామృతాస్వాద నాయత్త భృంగమ్ము నై చొక్కుదున్ మ్రొక్కుదున్ మక్కువన్ తల్లిరోమమ్ము సద్బుద్ధి నోయమ్మ;

మధ్యాహ్నకాలంబులో నీవు శ్వేతాంగివై, శ్వేతవస్త్రంబులం దాల్చుచున్, శ్వేతపద్మాసనంబందు శోభిల్లుచున్ **ప్రౌఢ**వై యాజుషంబైన గ్రంథంబు చేబూని నేత్రత్రయంబొప్ప, పంచాస్యవై గంధ మాలాదు లొప్పన్ త్రిశూలంబు తోడన్, వృషారూఢవై దివ్య దీప్తిన్ ప్రచండ ప్రభాదుర్నిరీక్ష్యంబుగా నొప్పవే తల్లి రుద్రాధి దైవంబవై నట్టి నీరూపు భావింతు సాద్గుణ్య సామ్రాజ్య సావిత్రి సత్కీర్తికై నిన్ను సేవింతునోయమ్మ;

అస్త్రాద్రి తాకంగ సూర్యుండు నీవంతటన్ కృష్ణ వర్ణంబుతో కృష్ణ పద్మాస నారూఢవై, కృష్ణ వస్త్రంబులందాల్చి నేత్రద్వయంబొప్ప దండాక్ష మాలాదులన్ శంఖ చక్రాదులన్ తాల్చుచున్ సామవేదంబుతో **వృద్ధ** రూపంబుతో విష్ణు భావం బు తళ్కొత్త తార్క్ష్యుండు వెన్నంటి రా దివ్య నక్షత్రకోటీ ప్రభా భాస మానాంగివై చారు భూషాంగివై వాణివై వీణ చేబూని వీణాఖ్య లోకంబు నందుండి ఆలాప ముల్ చేయ తన్నాదముల్, మౌని లోకంబులందాకి వేదంబులైత్రాల గంధర్వ లోకంబు గాంధారమున్ పాడమెచ్చన్, దిశా శ్రేణులన్ తట్టుచున్ లోకముల్ ముట్టి శబ్దంబులన్ పుట్టగా జేయుచున్ నాద విఖ్యాతవై సాంధ్య వౌచున్ సరస్వత్యభిఖ్యాతవై తోచు కళ్యాణిరో యిమ్ము సంగీత సాహిత్య సద్భావ సంపత్తి నో తల్లి. ;

పాతాళ లోకంబు నందుండి జీమూత భూతంబు వోలెన్ తమం బల్లనన్

స్వర్గలోకంబు పైకొన్న నక్షత్ర గోళంబులున్ చంద్రుడున్ స్వీయతేజంబులన్ సూర్య బింబాకృతిన్ దాల్చిరేమో యనన్ వచ్చి భానుండు సప్తాంశు బాణాగ్నులన్ రుస్వ తానంతటన్ కొండలన్ బండలన్ దూతీ కాలంబుకై నిల్చి బాణ ప్రతాపంబు నిర్వీర్యమున్ జేయుచున్ సూర్యబింబంబుపై బద్ధ భానుండు తేజంబు నక్షత్ర చంద్రాదులందుంచి కాలంబుకై నిల్ప దైవాసురంబైన యుద్ధంబు నిత్యంబుగా సంధిలన్ సంధ్యలో మౌని లోకంబు ధీశాలినీ నీవిలాసంబు నీవిభ్రమౌవిర్భవం బెంచుచున్ మాన సంబందు నీశక్తికిన్ యుక్తికిన్ మెచ్చుచున్ స్తోత్రపాఠంబులం జేయుచున్ మ్రొక్కదే, ఆత్మచైతన్య విస్ఫారితా లోక నాసంతశక్తిన్ మహాదేవి కైమోడ్పులో తల్లి భాస్వత్కిరీటాం మహాకుండవైర్మండితాం శంఖ చక్రాంక హస్తాం స్ఫురత్కాంతి రూపాం ఉదూఢ ద్యుతిం శ్యామలాం కోమలాం సుందరీం చంద్రతారాత్మికాం నిత్య సత్యాత్మికాం మోహినీం సర్వ మంత్రాశ్రితాం శుద్ధ విద్యాం జయాం జ్ఞాన రూపాం తమో హారిణీం వేద ధాత్రీం ఉషఃకాల గమ్యాం ఉదాత్త స్వరూపాం సదాహంస యానాం, అజేశాది వంద్యాం సుమేధాం దదానాం సుశాంతాం సుకాంతాం శుభాం నిత్యమైశ్వర్య సౌఖ్యప్రదాం, శాకినీ ఢాకినీ ఘోర భూతాళి విద్రావిణీం త్వాం భజేయంచు నిన్‌కొల్తు రెవ్వార లవ్వారి పాపంబులం ద్రుంచి కష్టంబులన్ బాపవే తల్లి ! ;

ఈ జీవిపై నీదయా వర్షమున్ చిమ్మవే ముక్తి మార్గంబు చూపింపవే దోష పుంజంబులన్ ద్రుంపవే నింపవే దివ్య భావంబుతో నామనంబున్ సదా మ్రొక్కె దన్ తల్లిరో వేదమాతా ! నమస్తే నమస్తే నమస్తే నమః

శ్రీ గాయత్రీ దండకము సంపూర్ణము

శ్రీ గాయత్రీ పరబ్రహ్మార్పణమస్తు.

4. శ్రీ గాయత్రీమాతను కొందఱు యిలా ప్రార్థిస్తారు.

ఓ త్రికాలములందు ఉన్నటువంటి పరమాత్మా,
త్రిలోకములందున్నటువంటి పరమాత్మా,
త్రిగుణములందున్నటువంటి పరమాత్మా

నా యొక్క అజ్ఞానమనే చీకటిని పారద్రోలు, నా బుద్ధి యొక్క బలమును వికసింపజేసి, అజ్ఞానమనే చీకటిని దూరముచేసి, ప్రజ్ఞానమనే టటువంటి వెలుతురులో, నా యొక్క తత్త్వమును నిరూపించమని కోరుతూ వచ్చుట.

5. సూక్తి సుధానిధి

ఏ మహాతేజము లోకమంతయు వ్యాపించి సర్వాధిపత్యము వహించి

యుండెనో, ఏతేజఃపుంజము సర్వ చరాచర జంతుజాలమును త్రిప్పి కర్మఫల మనుభవింప జేయుచుండునో, ఏదివ్యతేజ స్ఫురణచే బ్రహ్మాదిదేవతలు స్వయం ప్రభాభాసమానులగుచున్నారో, యట్టి తేజోమూర్తినే గాయత్రిగా నాశ్రయించెదను.

సర్వ సంహార కార్యకలాపంబులే తేజంబు కన్నుమూతతో జరుగుచుం డునో, సృష్ట్యాది నేతేజంబు వెలింగి జీవితంబుల ప్రవేశించునో, స్థితి సమయంబు ననే తేజంబు ప్రరోహ స్థితికి దోహదము సేయునో, యట్టి తేజోమూర్తి గాయత్రిగా నాశ్రయించెదను.

బ్రహ్మేంద్రాది దిక్పాలకుల కందరాని మహావైభవ స్వరూపమై, వేదాది విద్యాలంకార భూషితయై, యుపనిషత్కన్యకల నిరంతర గానామోదా మందహాస వదనయై ప్రతిజీవాత్మ ప్రతిబింబిత తేజోమయాకార చిహ్నయై సదా భక్త హృదయానంద స్వరూపమైనట్టి తేజోమూర్తినే గాయత్రిగా నాశ్రయించెదను.

పరమానంద స్వరూపమై, ప్రజ్ఞాదుల కలభ్యమై, కేవల ధ్యానానంద విలసిత హృత్పుండరీకాలంకృత పరిపూర్ణ ప్రభాధారమగునట్టి తేజోమూర్తినే గాయత్రిగా నాశ్రయించెదను.

ఏలీలాతేజంబు నిఖిలవ్యాప్తమై సమస్త చరాచర జీవజాల పాపపుణ్య ప్రదర్శ నానుభవక కర్తీభూతయై పిపీలికాది బ్రహ్మపర్యంతంబు కర్మానుభవ సిద్ధాంతఫల సారూప్యమై, వివిధ జీవజాలంబుల వివిధ కర్మక్రమోప సంహార కార్య సమర్థమై, ప్రబల సత్త్వరూప నిగూఢ సూక్ష్మ విధాన దక్షత్వమున నారితేరి చరించునో, యట్టితేజోమూర్తినే గాయత్రిగా నాశ్రయించెదను.

ఏ వెలుంగులో సమస్త ప్రపంచంబును జ్యోతిర్మయ గణ సంఘంబులు, పంచభూతాదులు లీనమైన కాలంబున గాఢాంధకార బంధురమై విశ్వంబు జగత్ప్రళయంబున మునింగి యుండువేళ తానే స్వయంప్రకాశ మార్గంబున ఖద్యోతంబువలె నాత్మ వెలుంగున ప్రకాశించి మించునో యట్టి తేజోమూర్తినే గాయత్రిగా నాశ్రయించెదను.

ఎవరియందు సమస్త దివ్యలోకంబులు లీనమై ఎవరి ప్రభావంబున పుష్ప దళంబులు విడినట్లు విరిపి ప్రకాశించునో, యందు చతుర్వింశతి తత్త్వాత్మ కంబుగా నెవరు ప్రకాశించి మహామంత్రమూర్తిగా వెలుంగుచు నవకోటి మహా మంత్రాధిష్ఠాన దేవతయై యెవరు ప్రకాశించుచుండిరో యట్టి తేజోమూర్తినే గాయత్రిగా నాశ్రయించెదను.

స్థూల సూక్ష్మ యాతనా శరీరాదులు జీవులచే ధరింపజేసి పరమార్థ పరంబును జేరుటకు పరిమితుల నేర్పరచి ప్రభాభాసమానంబుగా వారి వారి కర్మానురూప కార్యకలాపంబులందు నిష్కామకర్మ ప్రధానముంచి యట్లు నెరవేర్చువారిని సకలాదర సత్కారములతో సాక్ష్యభూతముగా సహాయాదులు గావించి తోడుపడి తనయందాత్మ విశ్వాసము దృఢపరచి అగమ్యమగు మార్గము సుగమము గావించి బ్రహ్మాదుల కందరాని మహావైభవములు సమకూర్చి జ్యోతిర్మూర్తులను జేయునట్టి తేజోమూర్తినే గాయత్రిగా నాశ్రయించెదను.

గ్రహతారా జ్యోతిర్మండలముల కూర్ధ్వమగు శింశుమార, చక్రముచే కాల స్వరూప నిర్ణయాదులు గావించి కళా కాష్ఠని మేషాది విభాగములతో కాలస్వరూప మేర్పరచి జీవుల కనంత బ్రహ్మాండాదులలో నివాసము లుచితగతి నేర్పరించి వారిలో తాను ప్రవేశించి వారికందరాని విధమున వారితో సంచరించి సమస్తంబు తానేయని యెరుంగువారలకు సన్నని పాపిలు మార్గము తేజస్సుతోనేర్పరచి మహా మండలముల దాటించి నశ్వరంబగు విశ్వంబున కవల జరామృత్యు జన్మాదులకు లొంగని మహాజ్యోతి స్వరూపంబుతో ప్రకాశింపజేయు తేజోమూర్తినే గాయత్రిగా నాశ్రయించెదను.

ఏనామ ప్రతిపాద శబ్దమందు "తారమ్త్రాయతే" గాయత్రి యనబడుచున్నదో యట్టి పవిత్ర మాతృ స్వరూప మంత్రాధిష్ఠానమూర్తి మూర్తి మంతమై సర్వుల హృదయములలో ప్రకాశించి సమస్త జీవుల బాధాదికముల నుండి తన్నామ స్మరణచే తప్పించు శక్తిమంతమై తనరారుచున్నదో యట్టి తేజో మంత్ర మూర్తి శుభసంధాత్రి గాయత్రి సావిత్రియై సమస్తమ్ము్న కంగరక్షయగు తేజోమూర్తినే గాయత్రిగా నాశ్రయించెదను. శ్రీగాయత్రి నిత్యపూజావిధానము - 44

## 52. అన్నపూర్ణ స్తోత్రము

**నిత్యానందకరీ వరాభయకరీ సౌందర్యరత్నాకరీ,**
**నిర్ధూతాఖిల ఘోరపావనకరీ ప్రత్యక్షమాహేశ్వరీ,**
**ప్రాలేయాచలవంశపావనకరీ కాశీపురాధీశ్వరీ,**
**భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ.**

**అన్నపూర్ణే సదా పూర్ణే, శంకర ప్రాణవల్లభే,**
**జ్ఞానవైరాగ్య సిధ్యర్థం, భిక్షాందేహి చ పార్వతి,**
**మాతా చ పార్వతీదేవీ, పితాదేవో మహేశ్వరః,**
**భాంధవాశ్శివ భక్తాశ్చ స్వదేశో భువనత్రయమ్.**

## 5.పంచాయుధ స్తోత్రము

| | | |
|---|---|---|
| ధర్మరాజు | శంఖముయొక్క అంశచే అవతరించినవాడు | ధర్మము |
| భీముడు | గదయొక్క అంశచే జన్మించినవాడు | బలము |
| అర్జునుడు | చక్రముయొక్క అంశచే ఆవిర్భవించినవాడు | పరాక్రమము |
| నకులుడు | ఖడ్గము యొక్క అంశచే పుట్టినవాడు | శౌర్యము |
| సహదేవుడు | శార్జాంశచే దేహము ధరించినవాడు | శౌర్యము |

ఈ విధముగా శ్రీహరియొక్క పంచాయుధములు పంచపాండవులుగా అవతరించినవి.

**1. విష్ణోర్ముఖో త్థానిల పూరితస్య।**
**యస్పధ్వాని ర్దానవ దర్పహంతా।**
**తం పాంచజన్యం శశికోటి శుభ్రం।**
**శంఖం సదాஉహం శరణం ప్రపద్యే ॥**

తా:- విష్ణువు యొక్క ముఖము నుండి వెలువడిన వాయువుచే పూరింపబడి నట్టియు, దేనియొక్క ధ్వని రాక్షసుల దర్పమును హరించునో, అట్టి కోటి చంద్రులవలె పరిశుద్ధమైన 'పాంచజన్య' మను శంఖమును నేనెల్లప్పుడునూ శరణు పొందుచున్నాను.

**2. హిరణ్మయీం, మేరు సమాన, సారాం।**
**కౌమోదకీం, దైత్యకులైక హంత్రీం।**
**వైకుంఠ వామాగ్ర, కరాభి మృష్టాం।**
**గదాం సదాஉహం శరణం ప్రపద్యే॥**

తా : బంగారు వికారమైనదియు, మేరుపర్వతముతో సమానమైన జిగిని కల దియు, రాక్షసుల కులమును సంహరించుటలో ప్రధానమైనదియు, శ్రీహరి యొక్క కరాగ్రముచే స్పృశించబడిన 'కౌమోదకి' యను గదను నేనెల్లప్పుడూ శరణుపొందుచున్నాను.

3. స్ఫురత్సహస్రార శిఖాతి తీవ్రమ్।
సుదర్శనం భాస్కరకోటి తుల్యమ్।
సురద్విషాం ప్రాణవినాసి విష్ణోః।
చక్రం సదా೭హం శరణం ప్రపద్యే॥

తా : ప్రకాశించుచున్న వేయి అంచులతో మిక్కిలి - వాడియైనదియు, కోటి సూర్యులతో సమానమైనదియు, రాక్షసుల ప్రాణములను తీయునట్టి శ్రీహరి యొక్క 'సుదర్శన' మనుపేరుగల చక్రమును నేనెల్లప్పుడూ శరణు పొందు చున్నాను.

4. రక్షో೭సురాణాం కఠినోగ్ర కంఠ।
ఛేద క్షర చ్ఛోణిత దిగ్ధధారం।
తం నందకం నామ హరేః ప్రదీప్తం।
ఖడ్గం సదా೭హం శరణం ప్రపద్యే॥

తా : రాక్షసుల యొక్కయు, అసురుల యొక్కయు, కఠినమైన శరీరమును ఛేదించుటచే వారిరక్తముచే పూయబడిన అంచులు గల, కాంతివంతమైన శ్రీహరి యొక్క 'నందక' మను ఖడ్గమును నేనెప్పుడునూ శరణు పొందుచున్నాను.

5. యజ్జ్యా నినాద, శ్రవణాత్సురాణాం।
చేతాంసి, నిర్ముక్త, భయాని, సద్యః।
భవంతి, దైత్యాశని, బాణవర్షైః।
శార్ఙ్గం సదా೭హం, శరణం ప్రపద్యే॥

తా : దేనియొక్క నారిధ్వనిని విని దేవతల మనస్సులు వెంటనే భయము లేనివగుచున్నవో, ఏది తన బాణవర్షములచే రాక్షసులను కూల్చుచున్నదో, అట్టి శ్రీహరియొక్క శార్ఙ్గ మను ధనుస్సును నేను శరణు పొందుచున్నాను.

ఇమః హరేః పంచమహాయుధానాం
స్తవం పఠేత్యో೭నుదినం ప్రభాతే
సమస్త దుఃఖాని భయాని సద్యః
పాపాని నశ్యంతి సుఖాని సంతి॥ఇతి॥

తా : ఈ శ్రీహరియొక్క పంచాయుధ స్తవమును ప్రతిదినము ప్రాతఃకాలమున ఎవరు పఠింతురో వారి యొక్క సమస్త దుఃఖములు భయములు వెంటనే నశించుచున్నవి. వారికి సుఖములు కలుగును.

పంచాయుధస్తోత్రము సంపూర్ణము.

మహాభారతసారోద్ధారము, ప్రథమ భాగము - 181.

## 54.శ్రీనారాయణ హృదయము

హరిః ఓమ్ అస్య శ్రీ నారాయణ హృదయస్తోత్ర మహామంత్రస్య బ్రహ్మ ఋషిః అనుష్టుప్ ఛందః శ్రీమన్నారాయణోదేవతా శ్రీమన్నారాయణ ప్రీత్యర్థే జపే వినియోగః.

1. ఓం నారాయణః పరంజ్యోతి - రాత్మా నారాయణః పరః ।
నారాయణః పరంబ్రహ్మ । నారాయణ నమోஉస్తుతే ॥
2. నారాయణః పరోదేవో దాతా నారాయణః పరః ।
నారాయణః పరోధ్యాతా । నారాయణ నమోஉస్తుతే ॥
3. నారాయణః పరంధామ । ధ్యాతా నారాయణః పరః ।
నారాయణః పరోధర్మో । నారాయణ నమోஉస్తుతే ॥
4. నారాయణః పరోదేవో । విద్యా నారాయణః పరః ।
విశ్వం నారాయణస్సాక్షా । న్నారాయణ నమోஉస్తుతే ॥
5. నారాయణా ద్విధిర్జాతో । జాతో నారాయణోద్భవః ।
జాతో నారాయణా దింద్రో నారాయణ నమోஉస్తుతే ॥
6. రవిర్నారాయణస్తే జః । చంద్రో నారాయణో మహః ।
వహ్నిర్నారాయణ స్సాక్షా । న్నారాయణ నమోஉస్తుతే ॥
7. నారాయణ ఉపాస్యస్స్యా ద్గురు ర్నారాయణః పరః ।
నారాయణః పరో బోధో । నారాయణ నమోஉస్తుతే ॥
8. నారాయణః ఫలం ముఖ్యం । సిద్ధిర్నారాయణ స్సుఖం ।
సర్వం నారాయణః శుద్ధో । నారాయణ నమోஉస్తుతే ॥

ఇది నారాయణ హృదయం సంపూర్ణము.

**ఓ మిత్యే కాక్షరం, నమ ఇతిద్వే అక్షరే, నారాయణాయేతి।**
**పంచాక్షరాణి, ఏతద్వై నారాయణ స్యాఽష్టాక్షరం పదం॥**

ఓమ్ అనునది ఒక అక్షరము. "నమః" అనునది రెండక్షరములు. "నారాయణాయ" అనునది ఐదక్షరములు. ఇదియే నారాయణాష్టాక్షరీ మహామంత్రము.

ఓమ్ భగవన్నారాయణాభి మతానురూప స్వరూప రూప గుణ విభవ - ఐశ్వర్య శీలాద్యనవధికాతి శయాఽసంఖ్యేయ కల్యాణ గుణగణాం, పద్మవ నాలయాం భగవతీం, శ్రియందేవీం నిత్యానపాయనీం నిరవద్యాం దేవదేవ దివ్య మహిషీం - అఖిల జగన్మాతరం అస్మన్మాతరం అశరణ్య శరణ్యాం - అనన్య శరణః - శరణమహం ప్రపద్యే.

మైత్రేయుడు పరాశరమహర్షిని కొన్ని ప్రశ్నలడిగెను. ఆయన అనుగ్రహ బుద్ధితో మైత్రేయునికి సమాధానములిచ్చెను. అదియే విష్ణుపురాణము. విష్ణువనగా వాసుదేవుడు. ఆయన పరమతత్త్వమును, మహిమావిశేషములను వర్ణించునది కనుక ఈ పురాణమునకు ఈపేరు సార్థకమైనది.

అన్నింటియందును (అనగా సమస్త చరాచరవస్తువుల యందును) నివసించువాడును, అంతటను ఉండువాడును అగుటచే ఆ పరమ పురుషుని "వాసుదేవు"డని విజ్ఞులు చెప్పుదురు. "అణో రణీయా న్మహతో మహీయాన్" అని వేదము చెప్పినట్లు అతడు అణువుకన్నను పరమాణు స్వరూపుడు. పెద్దవాని కంటెను చాల పెద్దవాడు. అతడే వ్యక్తావ్యక్తస్వరూపుడై సర్వమును తానేయై యున్నాడు. అతడే కాలపురుషుడు కూడ. వ్యక్త స్వరూపము విష్ణువు నందును, అవ్యక్త స్వరూపము కాలము నందును మహాత్ములు దర్శింతురు.

నారము అనగా నీళ్ళు. అయనమనగా సంచారము. నీటియందే సంచారము గలవాడు గావున ఆపరమపురుషుడు నారాయణుడని కూడ చెప్పబడును. ఇదే విషయము లీలాశుకుడు కృష్ణకర్ణామృతములో వర్ణించినాడు.

**'కరారవిందేన పదారవిందం ముఖారవిందే వినివేశయంతం,**
**వటస్యపత్రస్య పుటేశ యానం బాలం ముకుందం మనసా స్మరామి.**

అని లోక ములన్నియు నశించి ఏకార్ణవమైన సమయములో (మహాప్రళయములో) ఆ పరమ పురుషుడు బాలకృష్ణరూపముతో మఱ్ఱియాకుమీద పండుకొని పద్మము వంటి పాదమును, పద్మమువంటి చేతితో గ్రహించి, పద్మము

వంటి ముఖము దాకతెచ్చి, ఆ కాలి బొటనవ్రేలిని (వినోదముగా) ఆనందముగా చీకుచున్నాడట. అటువంటి పరమపురుషుని కవి ధ్యానించుచున్నాడు. ఎంతమహత్తరమైన భావనయిది. శ్రీవిష్ణుపురాణము

## 55.నవగ్రహ స్తోత్రము

**ఆదిత్యాయ చ, సోమాయ, మంగళాయ, బుధాయ చ,**
**గురు, శుక్ర, శనిభ్యశ్చ, రాహవే, కేతవే నమః.**

తా : ఆదివారము (భాను) అధిపతి భానునకు, సోమవారము అధిపతి (సోము) చంద్రునకు, మంగళవారం అధిపతి కుజునకు, బుధవారము అధిపతి బుధునకు, గురువారము అధిపతి గురునకు, శుక్రవారము అధిపతి శుక్రునకు, శనివారము అధిపతి శనికి రాహుకేతువులకు నమస్కారము. భగవన్నుతిరత్నములు - 195

## 56. దశరథ ప్రోక్త శనిస్తోత్రము

**1. కోణస్థో, పింగళో, బభ్రుః, కృష్ణో, రౌద్రాంతకోయమః,**
**సౌరీ, శనైశ్చరో, మందః పిప్పలాదేవ సంస్తుతః.**

తా : మూలయందుండువాడా, పింగళవర్ణమువాడా బభ్రూ, కృష్ణ కాంతి గలవాడా, రౌద్రమూర్తీ, యముని వంటివాడా సౌరీ శనీ మందమైనవాడా, పిప్పలాదులచే చక్కగా కీర్తించ బడ్డవాడా నమస్కారము.

**2. నమస్తే కోణ సంస్థాయ పింగళాయ నమోస్తుతే,**
**నమస్తే రౌద్రదేవాయ నమస్తే చాంతకాయ చ.**

తా : కోణములయందు విలసిల్లువాడా, నల్లనైనవాడా, రుద్రమూర్తీ నమస్కారము.

తా : (ఈ పై రెండు రహస్య) శ్లోకములను నిత్యము స్తుతించి, స్తోత్రము జేసినచో 7సం॥రముల 6 మాసములయందును ఏలినాటి శని పీడ కలుగదు.

**3. ధ్యానము**

**నీలాంజనాభం, మిహిరేష్ట పుత్రం,**
**గ్రహేశ్వరంపాశ, భుజంగ పాణిమ్,**
**సురా సురాణాం, భయదం ద్విబాహుం,**
**స్మరే శనిం మాన స, పంకజేఌహమ్.**

తా : నల్లనైన కాటుకవంటి శరీరము గలిగినవాడు, మిహిరునకు (సూర్యునకు) ప్రియపుత్రుడు, గ్రహములందు పెద్దవాడు, సర్పములను తాళ్ళుగా చేత బట్టిన వాడు, దేవతలకు దానవులకు భయమును గొల్పువాడు, రెండుచేతుల వాడు అగు శనిని నాహృదయ కమలమందు స్మరించుచున్నాను.

భగవన్నుతిరత్నములు - 196

**4. కలినాశన స్మరణము**

**కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలుస్యచ,**
**ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనం ॥**

తా : కర్కోటకుడను సర్పము యొక్కయు, దమయంతి యొక్కయు, నలచక్రవర్తి ఋతుపర్ణ రాజర్షి యొక్కయు నామములను కీర్తించుట కలిపాపహరణము గనుక వీరిని ప్రతినిత్యం ప్రాతఃకాలమున స్మరించుచుండవలయును.

విశ్వదేవార్చన, దైవప్రార్థన - 59

**5. యోధీతే ఽహన్య హన్యేయం, త్రీణి వర్షాణ్య తంద్రితః ।**
**సబ్రహ్మ పదమభ్యేతి, వాయు భూతఃఖ మూర్తిమాన్ ॥**

తా : ఎవడు మూడు సంవత్సరములు ప్రతిదినము దీని జపించునోవాడు పర బ్రహ్మమున కెదురుగ బోవును. అతడు వాయువు వలె గామ చారియై పరబ్రహ్మ స్వరూపుడగుచున్నాడు.

**6. ఆ బ్రహ్మ స్తంభ పర్యంతం పరమాత్మ స్వరూపకమ్,**
**స్థావరం జంగమం చైవ ప్రణమామి జగన్మయమ్.**

తా : బ్రహ్మ మొదలు గడ్డి గంటవరకు చరా చరములందు సర్వము పరమాత్మ స్వరూపమే. కావున జగన్మయుడైన భగవంతునకు నమస్కారము.

**7. విష్ణుం నారాయణం కృష్ణం । మాధవం మధుసూదనం ॥**
**హరిం నరహరిం రామం । గోవిందం దధివామనం ॥**

తా : విష్ణు నారాయణ, కృష్ణ, మాధవ, మధుసూదన, హరి, నరహరి, రామ, గోవింద, దధివామన అను పదినామములను భక్తియుక్తుడై నూరుమార్లు స్మరించినమానవుడు రోగవిముక్తుడగును. లక్షసార్లు జపించిన బంధవిముక్తుడగును. పదిలక్షలు జపించిన నెట్టి గొడ్రాలైనను పుత్రవతియగును. ఇంద్రియ నిగ్రహము

కలిగి పరిశుద్ధుడై పై పది నామములను జపించిన దరిద్రుడు ధనవంతుడగును. నూఱులక్షలు జపించిన జీవన్ముక్తుడగును. నారాయణ క్షేత్రము (బదిరి) నందీ నామములను స్మరించిన సర్వసిద్ధులు కలుగును.

**8. కలేర్దోషనిధే రాజన్నస్తి హ్యేకో మహాన్ గుణః ।**
**కీర్తనాదేవ కృష్ణస్య ముక్త సఙ్గః పరం వ్రజేత్ ॥**

తా : రాజా! మానవులు కృష్ణనామ సంకీర్తనము వలననే ముక్తసంగులై పరమ పురుషుని పొందుదురు. ఇది యొక్కటియే సర్వదోషముల కాశ్రయమగు ఈ కలియుగములో గల యొక్క గొప్పగుణము. భాగ 12-3-51

**9. కృతే యద్ధ్యాయతో విష్ణుం త్రేతాయాం యజతో మఖైః ।**
**ద్వాపరే పరిచర్యాయాం కలౌ తద్ధరి కీర్తనాత్ ॥**

తా : కృతయుగమున విష్ణువును ధ్యానించుటవలన, త్రేతాయుగమున ఆయనను గూర్చి యజ్ఞము చేయుటవలన, ద్వాపరయుగమున ఆయనను అర్చించుటవలన ఏ ఫలము కలుగునో అది కలియుగమున నొక్క శ్రీహరి నామమును కీర్తించుట వలననే గలుగును. భాగ-12-3-52

**10 హరేర్నామైవ నామైవ నామైవ మమ జీవనమ్ ।**
**కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా ॥**

బృహన్నారదం, 1-41-15

హరి నామమే మనకు ముమ్మాటికీ జీవనం. ఓ మానవులారా కలియుగంలో తరించడానికి మరో మార్గం ముమ్మాటికిలేదు.

దీనికి విపరీతంగా పద్మపురాణంలో నామస్మరణ చేయని వారి గురించి ఇలా చెప్పారు. గోవిందనామం స్మరించని నాలుక బిలంలో వున్న సర్పిణి వంటిది. ఏ జిహ్వ హరినామం రాత్రింబవళ్ళు కీర్తించదో అది మనిషి నోటిన ఉన్న పాప రూపమైనంత మాత్రమే.

**11. హరేరామ హరేరామ రామ రామ హరే హరే,**
**హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే,**
**ఇతిషోడశకం నామ్నాం కలి కల్మష నాశనమ్,**
**నాతః పరతరోపాయ సర్వవేదేషు దృశ్యతే ॥** కలిసంతరణోపనిషత్తు

పైన ఉదహరించిన పదహారు పదాల మంత్రం కలిదోషాలను నశింప జేస్తుంది. వేదాలలో ఇంతకు మించిన ఉపాయం మరొకటి ముక్తికి కానరాదు.

12. కలియుగములో సత్యమును పలుకుటవల్ల నీలో ఒకదివ్యశక్తి ఏర్పడు తుంది. అదే కలియుగానికి తపస్సు. కలియుగములో దైవారాధన చేయుటయే సకల శుభములకు కారణమగును. "కలౌ సంస్మరణాన్ముక్తిః" (కలియుగములో భగవంతుని నామము కీర్తించినచో ముక్తి కలుగును) "యజ్ఞోవై విష్ణుః" అని వేదవచనము. యజ్ఞమే విష్ణుస్వరూపము.

## 57. సప్తదిఙ్నమస్కారములు

**1 ఓం నమః ప్రాచ్యై దిశేయాశ్చ దేవతా ఏ తస్యాం ప్రతివసన్త్యేతాభ్యశ్చ నమః.**

తా : తూర్పు దిక్కునకు నమస్కారము. ఈ తూర్పు దిక్కునందు నివసించు దేవత ఇంద్రుడు మొదలగువారికి నమస్కారము.

**2. నమో దక్షిణాయై దిశేయాశ్చ దేవతా ఏ తస్యాం ప్రతివసన్త్యేతాభ్యశ్చ నమః.**

తా : దక్షిణ దిక్కునకు నమస్కారము. ఈ దక్షిణ దిక్కునందు నివసించు దేవత యమధర్మరాజు మొదలగువారికి నమస్కారము.

**3. నమః ప్రతీచ్యై దిశేయాశ్చ దేవతా ఏ తస్యాం ప్రతివసన్త్యేతాభ్యశ్చ నమః.**

తా : పడమర దిక్కునకు నమస్కారము. ఈపడమర దిక్కునందు నివసించు దేవత వరుణదేవుడు మొ॥వారికి నమస్కారము.

**4. నమ ఉదీచ్యై దిశేయాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసన్త్యేతాభ్యశ్చ నమః.**

తా : ఉత్తరదిక్కునకు నమస్కారము. ఈఉత్తరదిక్కునందు నివసించు దేవత కుబేరుడు మొ॥ వారికి నమస్కారము.

**5. నమ ఊర్ధ్వాయై దిశేయాశ్చ దేవతా ఏ తస్యాం ప్రతివసన్త్యేతాభ్యశ్చ నమః.**

తా : ఊర్ధ్వ దిక్కునకు ఊర్ధ్వముగా నున్న స్వర్లోక భాగమునకు నమస్కారము. ఊర్ధ్వదిక్కునందు నివసించు దేవతలకును నమస్కారము.

**6. నమో ధరాయై దిశేయాశ్చ దేవతా ఏ తస్యాం**
**ప్రతివసన్త్యేతాభ్యశ్చ నమః.**

తా : క్రింది దిక్కునకు నమస్కారము. క్రింది దిక్కునందు నివసించు దేవతలకును నమస్కారము.

**7. నమో౭వాన్తరాయై దిశేయాశ్చ దేవతా ఏ తస్యాం**
**ప్రతివసన్త్యేతాభ్యశ్చ నమః.**

తా : భూమ్యాకాశముల నడుమనున్న దిక్కగు నంతరిక్షమునకును, ప్రాగాది దిక్కుల నడుమనున్న ఆగ్నేయ, నిరృతి, వాయవ్య, ఈశాన్యములను అవాంతర దిశల కొఱకు వారి అనుచరులకు నమస్కారము. అంతరిక్షమున వసించు పితృదేవతలకును నమస్కారము.

సప్త దిఙ్న నమస్కారములు ప్రాతస్సాయం సంధ్యల యందు మాత్రమే చెప్పవలయును. మధ్యాహ్న సంధ్యయందు దిఙ్నమస్కారము లేదు.

తైత్తరీయ సంధ్యోపాసనము.

## 2. ముని నమస్కారము

**నమో గంగాయమునయో, ర్మధ్యే యే వసన్తి, తేమే**
**ప్రసన్నాత్మాన శ్చిరంజీవితం వర్ధయన్తి,**
**నమో గంగా యమునయో ర్మునిభ్యశ్చ,**
**నమో నమో గంగా యమున యోర్ముని భ్యశ్చ నమః.**

తా : పుణ్యప్రదేశములగు గంగా యమునా నదుల యొక్క మధ్యభాగమునందు నివసించు మహానుభావులందఱు నన్ను అనుగ్రహ బుద్ధి గలవారలై నాయా యుస్సును జిరకాలముండునట్లు వృద్ధిచేయుదురు గాక ! గంగా యమునా నదుల మధ్య ప్రదేశమందు నివసించుచున్న మునీశ్వరుల కొఱకు నమస్కారము. గంగా యమునా నదుల మధ్యప్రదేశమందు నివసించుచున్న మునీశ్వరులకు బునః పునః నమస్కారములు. త్రికాల సంధ్యావందవము 18.

### 3. దేవతా నమస్కారము

1. సంధ్యాయై నమః :- చిత్స్వరూపిణియగు సంధ్యాదేవికి నమస్కారము.

2. సావిత్ర్యై నమః :- సకల ప్రపంచోత్పత్తికిని కారణంబగు సావిత్రీ దేవికి నమస్కారము.

3. గాయత్ర్యై నమః :- ధ్యానించువారికి సకల పురుషార్థముల నొసంగుచు రక్షించు గాయత్రీ శక్తికి నమస్కారము.

4. సరస్వత్యై నమః :- సకల జీవులను పరస్పరభావములను గుర్తెరుంగుటకు వాగ్రూప శక్తి నొసంగు సరస్వతీదేవికి నమస్కారము.

5. సర్వాభ్యోదేవతాభ్యో నమః :- వివిధ దేవతలకును నమస్కారము.

6. దేవేభ్యో నమః :- ప్రకాశమానులగు నెల్ల దేవతలకు నమస్కారము.

7. ఋషిభ్యో నమః :- ప్రజాపత్యాది నవకాండర్షులకు నమస్కారము.

8. మునిభ్యో నమః :- మౌనమును బ్రహ్మపదార్థమును విచారణచేయు మహాయోగులకు నమస్కారము.

9. గురుభ్యో నమః :- అజ్ఞానమును పొనడంచి జ్ఞానమును ప్రసాదించిన గురువులకు, పంచ గురువులకును నమస్కారము.

10. మాతృభ్యో నమః :- నవమాసములు గర్భమున ధరించి కని పెంచిన తల్లికి నమస్కారము. పంచమాతలకును నమస్కారము.

పదవసంఖ్యగల మాతృవందనము పాఠాంతరము. పితృభ్యః అనుపదములో నిమిడియే యున్నదిగాన విరమించినను లోపములేదు.

11. పితృభ్యో నమః :- స్థూల శరీరమును కనిపెంచిన తల్లిదండ్రులకు నమస్కారము.

**12. కామో ౽ కార్షీన్నమోనమః, మన్యురకార్షీ న్నమోనమః,**
**కామః కర్తా నాహం కర్తా కామః కారయితా నాహం.**

కారయితా అను శ్రుతి : ప్రమాణము వలన కామము చేయుచున్నది. అదియే కర్త. కాని నేనేమియు చేయలేదు. కాన నేను కర్తను కాను. కామము చేయించుచున్నది. నేను చేయించుటలేదు. అని చెప్పబడినది. కాన కామము చేయుచున్నది. క్రోధము చేయుచున్నది. కామక్రోధములే యీపాపములను చేసెనుగాన నన్ను బాధించవద్దు. అట్టి కర్మలకు కారణమగు కామమునకు, క్రోధమునకును వాని అధి దేవతలకు నమస్కారము. 37

తైత్తరీయ సంధ్యోపాసనము. త్రి.సం. వందనము - 18

**4. ఈశ్వరచింతనము**

**పృథివ్యాపస్తేజో వాయురాకాశాత్ । ఓ న్నమో భగవతే వాసుదేవాయ । యాగ్ం సదా సర్వభూతాని చరాణి స్థావరాణి చ । సాయం ప్రాతర్నమ స్యన్తి సామా సంధ్యా ౽ భిరక్షత్వేన్నమః ॥**

తా : భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము - అను పంచభూతముల కొరకు నమస్కారము. ప్రణవ స్వరూపుడును, ఐశ్వర్య వీర్య సంపద్యశో జ్ఞాన, వైరాగ్య షడ్గుణైశ్వర్యవంతుడును, సర్వ భూతములకు నివాసస్థానమైన వాడునగు వాసుదేవునకు నమస్కారము. చరించునట్టి భూతములు, స్థావరములగు పర్వత వృక్షాదులు, ఇంకను సమస్త భూతములు నెల్లప్పుడును సాయం ప్రాతఃకాలముల యందే సంధ్యాదేవతకు నమస్కరించుచున్నవో యా సంధ్యాదేవత నన్ను సం రక్షించుగాక. అట్టి ఓంకారస్వరూపిణియగు నా సంధ్యాదేవతకు నమస్కారము.

**నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణ హితాయ చ।**
**జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమోనమః ॥**

ఇచట గో శబ్దముచే సమస్త పశుజాతికి నుప లక్షణ మనియు, బ్రాహ్మణ శబ్దముచే సర్వమానవజాతికి నుప లక్షణమనియు నెరుంగవలయును.

తైత్తరీయ సంధ్యోపాసనము - 38

తా : వేదవేత్తలచే కొనియాడబడుచున్న వాడును, గో బ్రాహ్మణులకు హితుడును, జగద్ధితుడును అగు శ్రీగోవిందునకు నమస్కారము.

**ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్ ।**
**సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి ॥**

తా : ఆకాశము నుండి క్రింద పడిన జలమంతయు నదులలో చేరి సముద్రమును పొందునటుల ఏదేవతకు నమస్కరించినను అది ఒక్కకేశవునకే దక్కుచున్నది.

**5. గాయత్రీ ధ్యానమ్**

**ఉత్తమే శిఖరే జాతే భూమ్యాం పర్వత మూర్ధని ।**
**బ్రాహ్మణే భ్యో ఽభ్యనుజ్ఞాతా గచ్ఛ దేవి ! యథా సుఖమ్ ॥**
**స్తుతోమయా వరదా వేదమాతః ప్రచోదయన్తీ పవనే ద్విజాతా ।**
**ఆయుః పృథివ్యాన్ద్రవిణం బ్రహ్మవర్చసం మహ్యం దత్వా ప్రయాతమ్బ్రహ్మ లోకమ్॥**

త్రి.సం.వందనము 19

తా : మేరుపర్వత శిఖరము నివాసముగా గలిగి, తన్నుపాసించు భక్తుల ననుగ్రహించుట కొఱకు ఇచ్చటికి విచ్చేసిన గాయత్రీదేవి మాకభిమతార్థము లొసంగి, మఱల తన నివాస ప్రదేశమునకు బోవుగాక !

గాయత్రీదేవి ఆదిత్యమండలమునందును, బ్రహ్మలోకమునందున్ను నివసించుచుండునని వేదవేత్తల యభిప్రాయము. ఇదివరకు ఆదిత్య మండలమునందు నివసించు చున్నటుల కొన్ని తావుల అధ్యాహారముచేసి చెప్పితిమి. ఇచట బ్రహ్మలోకమునందు నివసించుచున్నటుల వేదమాతయే పలుకుచున్నది. వరదయు, వేదమాతయునగు గాయత్రీదేవి వేదోక్తమగు సంపూర్ణాయుస్సును, జప తప స్వాధ్యాయాది రూపమగు బ్రహ్మవర్చస్సును, మాకొసంగి బ్రహ్మలోకమును గూర్చిపోవుగాక! గాయత్రికిగల ద్విజాతయను విశేషణమునకు సూర్యమండల బ్రహ్మలోకములను రెంటియందును ప్రాదుర్భవించినదనియు అర్థము చెప్పవచ్చును. త్రికాలసంధ్యావందనము. 19-42.

**6. నారాయణాభివందనము**

**నమో ఽ స్త్వనంతాయ సహస్రమూర్తయే**
**సహస్ర పాదాక్షి శిరోరు బాహవే ।**
**సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే**
**సహస్రకోటీ యుగధారిణే నమః ॥**

తా : అద్యంతరహితుడును, లెక్కింపనలవికాని శరీరములు గలవాడును, లెక్కింపనలవికాని పాదములు, నేత్రములు, తొడలు, బాహువులు గలవాడును, లెక్కింపనలవికాని నామములు గలవాడును, లెక్కింపనలవిగాని కోట్లకొలది యుగములనుండి యున్నవాడును, శాశ్వతుడును అగు పురుషునకు అనగా పరమాత్మకు నమస్కారము. లేక వేయి (దళములు) రేకులు కలిగి, వేయి నామములు కలిగి వేయి అంచులు కలిగి, శ్రీశైల క్షేత్రమనియు, త్రివేణీ పుణ్య తీర్థమనియు, పేరువడసిన సహస్రకమలమను బ్రహ్మ బిలమున శయనించి యోగ నిద్రను గాంచు **పరమాత్మ**కు నమస్కారము.

**7. భూమ్యాకాశాభివందనము**

**ఇదం ద్యావా పృథివీ సత్యమస్తు ।**
**పితర్మాత ర్యదిహోప బ్రువేవాం ।**
**భూతం దేవానామవమే అవోభిః**
**విద్యామేషం వృజనమ్ జీరదానుమ్ ॥**

తా : తండ్రివంటి దానవగునోద్యులోకమా ! తల్లివంటిదానవగు భూదేవీ ! యగు ఓ భూమ్యంతరిక్షదేవతలారా ! నేనీ సమయమునందు మీరు నన్నొక్కనినేగాక స్థావర జంగమాత్మకమగు ప్రపంచమునంతయు చక్కగా సంరక్షింపవలయునని మిమ్ములను వేడుకొనుచున్నాడను. ఈ వేడికోలు సత్యమగుగాక. ఇతరుల కెట్టి సంతాపము కలుగజేయకుండునటుల జీవనాధారమగు అన్నము మాకందరకు కలుగుగాక. త్రి.సం.వం. - 20-43

**సర్వవేదేషు యత్పుణ్యం సర్వతీర్థేషు యత్ఫలం ।**
**తత్ఫలం నర ఆప్నోతి స్తుత్వాదేవం జనార్దనమ్ ।**

తా : సర్వవేదములను బఠించుట చే నేపుణ్యము లభించునో సమస్త తీర్థయాత్రలను జేసిన నేయుత్తమ ఫలము లభించునో యట్టిది జనార్దనుడగు విష్ణుమూర్తిని స్తుతించుట వలన గలుగును.

**వాసనా ద్వాసుదేవస్య వాసితన్తే జగత్రయమ్ ।**
**సర్వ భూత నివాసోఽసి వాసుదేవ నమోఽస్తుతే ॥**
**శ్రీవాసుదేవ నమోస్తుత ఓం నమ ఇతి.**

తా : వాసుదేవుని యునికి చేతనే మూడులోకములును నిలిచియున్నవి. సర్వ భూతములందంతర్యామి రూపుడవగు వాసుదేవా నీకు నమస్కారము. సకల భూతములకు స్థానభూతుండవగు ఓవాసుదేవా నీకు నమస్కారము.

## 58.పరమాద్భుత కవచము

1. శ్రీహరిః పాతుతే వక్త్రం మస్తకం మధుసూదనః,
   శ్రీకృష్ణ శ్చక్షుషీ పాతు నాసికాం రాధికా పతిః.
2. కర్ణయుగ్మం చ కంఠం చ కపోలం పాతు మాధవః,
   కపోలం పాతు గోవిందః కేశాం శ్చ కేశవ స్స్వయమ్.
3. అధరోష్ఠం హృషీకేశో దంతపంక్తిం గదాగ్రజః,
   రాసేశ్వర శ్చ రసనాం తాలుకం వామనో విభుః.
4. వక్షః పాతు ముకుందశ్చ జఠరం పాతు దైత్యహా,
   జనార్దనః పాతు నాభిం పాతు విష్ణుశ్చ మేహనమ్.
5. నితంబయుగ్మం గుహ్యం చ పాతుతే పురుషోత్తమః,
   జానుయుగ్మం జానకీశః పాతుతే సర్వదావిభుః.
6. హస్తయుగ్మం నృసింహ శ్చ పాతు సర్వత్ర సంకటే,
   పాదయుగ్మం వరాహ శ్చ పాతుతే కమలోద్భవః.
7. ఊర్ధ్వం నారాయణః పాతు హ్యధస్తా త్కమలాపతిః,
   పూర్వస్యాం పాతు గోపాలః పాతు వహ్నౌ దశాస్యహా.
8. వనమాలీ పాతు యామ్యాం వైకంఠః పాతు నైఋతౌ,
   వారుణ్యాం వాసుదేవ శ్చ సతో రక్షాకర స్స్వయమ్.
9. పాతుతే సంతతమజో వాయువ్యాం విష్టరశ్రవాః,
   ఉత్తరే చ సదాపాతు తేజసా జలజాసనః.
10. ఐశాన్యా మీశ్వరః పాతు పాతు సర్వత్ర శత్రుజిత్,
    జలస్థలే చాంతరిక్షే నిద్రాయాం పాతు రాఘవః.

**11. ఇత్యేవం కథితం బ్రహ్మాన్ కవచం పరమాద్భుతం,**
**కృష్ణేన కృపయాదత్తం స్మృతం చోక్తం పునర్మయా.**

శ్రీకృష్ణ జన్మఖండే 12వ అధ్యాయే ప్రతిపాదితం.

కవచం సంపూర్ణము

శ్రీకృష్ణావతారతత్వము, 2వ భాగము 336.

## 59. నారాయణ కవచము

విశ్వరూపుడు చెప్పెను :- ఓ దేవేంద్రా ! భయము కలిగినపుడు నారాయణ కవచమును ధరించి తన శరీరమును రక్షించుకొనవలయును. దాని పద్ధతియీ ప్రకారముగ నున్నది.

మొదట చేతులు కాళ్ళు కడుగుకొని ఆచమనము చేయవలయును. పిమ్మట చేతికి దర్భయొక్క పవిత్రిని ధరించి ఉత్తరపువైపుగ కూర్చొని, కవచధారణ పూర్తియగువరకు మౌనముద్రవహించి, అంతరంగమున సర్వాంతర్యామిని తలంచి **"ఓం నమో నారాయణాయ" " ఓం నమో భగవతే వాసుదేవాయ"** అను మంత్రముల ద్వారా హృదయాది అంగన్యాసమును, అంగుష్ఠాది కరన్యాసమును గావింపవలయును. మొదట " ఓం నమో నారాయణాయ " అను అష్టాక్షరీ మంత్రము యొక్క ఓమ్ మున్నగు ఎనిమిది అక్షరములను క్రమముగ....1. పాదములు **ఓమ్** - య, 2. మోకాళ్ళు **న** ణా, 3. తొడలు **మో** య, 4. పొట్ట **నా** రా, 5. హృదయము **రా** నా, 6 వక్షస్థలము **య** మో, 7. ముఖము **ణా** న, 8. శిరస్సు **య ఓమ్** లందు న్యాసమొనర్చ వలయును. - లేక ఆ మంత్రము యొక్క య కారము మొదలుకొని ఓమ్ కారము వఱకుగల ఎనిమిది అక్షరములను క్రమముగ శిరస్సు మొదలుకొని పాదముల వఱకు ఆ ఎనిమిది - అంగములందు విపరీత క్రమముగ న్యాసమొనర్చవలెను.

అటుపిమ్మట ' ఓం విష్ణవేనమః ' అను మంత్రము యొక్క మొదటిదగు ఓం అను అక్షరమును హృదయమందును, వి అనుదానిని బ్రహ్మరంధ్రమందును, ష్ అనుదానిని కనుబొమల (భ్రుకుటి) నడుమను, ణ అనుదానిని శిఖయందును, వే అనుదానిని రెండునేత్రములందును, న అనుదానిని శరీరము యొక్క సంధులన్నిటియందును న్యాసము చేయవలయును. తదుపరి **" ఓం మః అస్త్రాయ ఫట్ "** అని చెప్పి దిగ్బంధనము గావింపవలెను. ఈ ప్రకారముగ

న్యాసమొనర్చుటచే అవ్యక్తి మంత్రస్వరూపుడగును. అనంతరము పూర్ణ ఐశ్వర్యము, ధర్మము, కీర్తి, సంపద, జ్ఞానము, వైరాగ్యము - అను ఆఱుశక్తులతో కూడిన ఇష్టదైవమగు భగవంతుని ధ్యానించవలెను. మఱియు తన్నుకూడ అరూపముగనే చింతన చేయవలెను. పిదప విద్య, తేజస్సు, తపస్సుల స్వరూపమగు నారాయణ కవచమును పఠించవలెను.

368, భాగవతరత్నాకరము - షష్ఠస్కంధము

1. ఓం హరిర్విధధ్యాన్మమ సర్వరక్షాం - న్యస్తాఙ్ఘ్రి పద్మః పతగేంద్ర పృష్ఠే।
దరారిచర్మాసి గదేషు చాప - పాశాన్ దధానో ఽష్టగుణో ఽష్ట బాహుః॥

తా : గరుడుని పృష్ఠదేశమున పాదపద్మములను నిలిపి అష్టబాహువులయందు శంఖ చక్ర చర్మ ఖడ్గ గదా బాణ ధనుస్సులను పాశములను ధరించి విరాజిల్లుచున్నవాడును, అణిమాదులైన అష్టైశ్వర్యములతో గూడినవాడును, ఎనిమిది బాహువులు గలవాడునునగు శ్రీహరి యెల్లప్పుడు నన్ను రక్షించుగాక!

2. జలేషు మాం రక్షతు మత్స్యమూర్తి - ర్యాదోగణేభ్యో వరుణస్యపాశాత్।
స్థలేషు మాయావటు వామనో ఽవ్యాత్ - త్రివిక్రమః ఖే ఽవతు విశ్వరూపః॥

తా : మత్స్యరూపధారియగు భగవానుడు క్రూరములైన జలజంతువు లనెడి వరుణపాశమునుండి రక్షించుగాక! మాయాబలముచే వామన రూపధారియగు భగవానుడు స్థలములయందు నన్ను రక్షించుగాక ! విశ్వరూపుడగు త్రివిక్రముడు గగనమండలమున నన్ను రక్షించుగాక !

3. దుర్గేష్వటవ్యాజిముఖాదిషు ప్రభుః- పాయాన్నృసింహో ఽసురయూథపారిః।
విముంచతో యస్య మహాట్టహాసం - దిశో వినేదుర్న్య పతంశ్చ గర్భాః ॥

తా : ఎవని అట్టహాసధ్వనిచే దిఙ్మండలము ప్రతిధ్వనితమగునో అసురస్త్రీల గర్భములు పతనములగునో అట్టి యసురయూథపుడైన హిరణ్యకశిపునకు శత్రువగు శ్రీనృసింహాదేవుడు అరణ్యమునందును యుద్ధక్షేత్రమునందును ఇంకను దుర్గమములగు నితర ప్రదేశములలోను నిలచి మమ్ము రక్షించుగాక!

4. రక్షత్వసౌమాధ్వని యజ్ఞకల్పః - స్వదంష్ట్రయోన్నీతధరో వరాహః।
రామో ఽద్రికూటేష్వథ విప్రవాసే - సలక్ష్మణో ఽవ్యాద్భరతాగ్రజో ఽస్మాన్॥

తా : తనయవయవరూపములగు యజ్ఞముల ద్వారా యజ్ఞేశ్వరరూపముతో నిరూపితుడైనవాడు, రసాతలము నుండి తీక్షణములైన దంతముల యొక్క

అగ్రభాగముల ద్వారా పృథివిని, పైకిదెచ్చినవాడు, వరాహరూపుడునగు నా భగవానుడు నన్ను మార్గమధ్యమున రక్షించుగాక ! పరశురామరూపుడగు భగవానుడు గిరిశిఖరమునందు, లక్ష్మణునితో గూడిన భరతాగ్రజుడగు రామచంద్రుడు ప్రవాసమునందు నన్ను రక్షించుగాక !

**5. మాముగ్ర ధర్మాఖిలాత్ప్రమాదాత్ - నారాయణః పాతు నరశ్చహాసాత్।**
**దత్తస్త్వ యోగాదథ యోగనాథః - పాయాద్గుణేశః కపిలః కర్మబన్ధాత్ ॥**

తా : నారాయణుడు నన్ను అభిచారాదులైన ఉగ్రధర్మముల నుండి విహిత కర్మల నుల్లంచుట మున్నగు ప్రమాదముల నుండి రక్షించుగాక! నరరూపుడగు భగవానుడు నన్ను గర్వము నుండి రక్షించుగాక ! యోగేశ్వరుడు దత్తాత్రేయ రూపుడు నగు భగవానుడు నన్ను యోగభ్రంశము అనగా యోగమునుండి పతనమగుట మున్నగు ప్రమాదములనుండి రక్షించుగాక ! గుణేశ్వరుడైన కపిలునిరూప ములోనున్న భగవానుడు నన్ను కర్మబంధనముల నుండి అనగా సంసారము నుండి రక్షించుగాక !

**6. సనత్కుమారో ఽవతు కామదేవా - ద్ధయాననో మాం పథిదేవ హేలనాత్।**
**దేవర్షివర్యః పురుషార్చ నాన్తరాత్ - కూర్మో హరిర్మాం నిరయాద శేషాత్॥**

తా : సనత్కుమారభగవానుడు నన్ను కామభయము నుండి, హయగ్రీవుడు మార్గములో నడుచునప్పుడు దేవతాతిరస్కారాదులవలన గలిగిన యపరాధముల నుండి, దేవర్షియగు నారదుడు భగవదర్చన విషయమున ముప్పదిరెండప రాధములనుండి, కూర్మరూపుడగు భగవానుడు అశేష నరకముల నుండి నన్ను రక్షించుగాక.

**7. ధన్వన్తరిర్భగవాన్ పాత్వ పథ్యా - ద్వన్ద్వాద్భయాదృషభో నిర్జితాత్మా।**
**యజ్ఞశ్చ లోకాదవతాజ్జనాన్తా - ద్బలోగణాత్క్రోధవశాదహీన్ద్రః ॥**

తా : భగవానుడగు ధన్వంతరి యపథ్యమునుండి (శరీరమునకు వ్యాధులను గలుగజేయు ద్రవ్యాదులను భక్షించుటనుండి), అంతరింద్రియములను, బహి రింద్రియములను జయించిన ఋషభదేవుడు శీతోష్ణాదుల వలన గలుగు భయము నుండి, యజ్ఞావతారుడగు భగవానుడు లోకాపవాదమునుండి, బలభద్రుడు జనులుపెట్టు బాధలనుండి, శేషరూపుడగు భగవానుడు క్రోధవశములైన సర్పములనుండి నన్ను రక్షించుగాక !

**8. ద్వైపాయనో భగవాన ప్రబోధా - ద్బుద్ధస్తు పాషణ్డగణప్రమాదాత్ ।**
**కల్కిః కలేః కాలమలాత్ ప్రపాతు - ధర్మావనాయోరు కృతావతారః ॥**

తా : వ్యాసదేవుడజ్ఞానమునుండి, బుద్ధదేవుడు వేదవిరుద్ధములగు నాచారముల నుండి, అలసత్వము వలన వేదవిహిత కర్మానుష్ఠాన విషయమున విముఖత్వ మనెడు ప్రమాదమునుండి రక్షించుగాక ! ధర్మరక్షణకై శ్రేష్ఠమైన అవతార రూపముగ పరిగణింపబడినవాడైన కల్కిభగవానుడు నికృష్ఠమగు కలికాలము నుండి నన్ను రక్షించుగాక !

**9. మాం కేశవో గదయా ప్రాతరవ్యాత్ - గోవిన్ద ఆసంగవ ఆత్తవేణుః ।**
**నారాయణః ప్రాహ్ణ ఉదాత్తశక్తి - ర్మధ్యన్దినే విష్ణురరీన్ద్ర పాణిః ॥**

తా : కేశవుడు గదద్వారా ప్రాతఃకాలమునందు (దివాభాగమున మొదట ఐదు ఘడియలు వరకు) నన్ను రక్షించుగాక ! సంగవ సమయమున (ఆఱుఘడియల నుండి పదిగడియల వరకు) వేణుధారియు బృందావనాధిపతియునగు గోవిందుడు నన్ను రక్షించుగాక! ప్రాహ్ణమున (పదునొకండు ఘడియల నుండి పదునైదు ఘడియల వరకు) నారాయణుడు శక్తిని ధరించి నన్ను రక్షించుగాక! మధ్యందినమున(పదునాఱు ఘడియలనుండి ఇరువది ఘడియల వరకు) చక్రహస్తుడగు విష్ణువు నన్ను రక్షించుగాక !

**10. దేవోఽపరాహ్ణే మధుహోగ్రధన్వా - సాయం త్రిధామావతు మాధవోమామ్।**
**దోషే హృషీకేశ ఉతార్థరాత్రే - నిశీథ ఏకోఽవతు పద్మనాభః ॥**

తా : అపరాహ్ణమున (పగటియందలి యైదవభాగమున అనగా నిరువదియొక్క ఘడియలనుండి ఇరువదియైదు ఘడియల వరకు) ఉగ్రధనుస్సును ధరించిన వాడగు మధుసూదనుడు, సాయంకాలమున (ఇరువదియాఱు ఘడియలనుండి ముప్పది ఘడియల వరకు) త్రిధాముడు అనగా బ్రహ్మ విష్ణు మహేశ్వర రూపుడగు మాధవుడు, ప్రదోషకాలమున (రాత్రియొక్క మొదటి నాలుగు ఘడియల వరకు) హృషీకేశుడు, అర్థరాత్రమున (ఐదవ ఘడియ నుండి పదునాలుగు ఘడియల వరకు) నిశీథకాలమున (పదునైదవ ఘడియనుండి పదునాఱవ ఘడియవరకు) పద్మనాభుడు నన్ను రక్షించుగాక !

**11. శ్రీవత్సధామా పరరాత్ర ఈశః - ప్రత్యూష ఈశోఽసిధరోజనార్దనః।**
**దామోదరోఽవ్యాదను సన్ధ్యం ప్రభాతే - విశ్వేశ్వరో భగవాన్ కాలమూర్తిః॥**

తా : అపరరాత్రమందు (నిశీథకాలమునకు చిమ్మట అరుణోదయకాలమునకు ముందువరకు) శ్రీవత్సలాంఛనుడగు భగవానుడు, ప్రత్యూషకాలమున రాత్రి యందు చివరి నాలుగు ఘడియల కాలమును) జనార్దనుడు ఖడ్గమును ధరించి నన్ను రక్షించుగాక ! ప్రభాతకాలమున దామోదరుడు, ప్రతిసంధి సమయమున కాలమూర్తియగు విశ్వేశ్వరుడు నన్ను రక్షించుగాక !

12. చక్రం యుగాన్తానల తిగ్మనేమి - భ్రమత్ సమన్తాద్భగవత్ప్రయుక్తమ్।
దన్దగ్ధి దన్దగ్ధ్యరి సైన్యమాశు - కక్షం యథావాతసఖో హుతాశః ॥

తా : ప్రళయకాలమందలి యగ్నివలె తీక్షములైన అంచులుగల సుదర్శనచక్రము భగవానునిచే నియమింపబడినదై నలువైపుల దిరుగుచు వాయువుతో గూడిన అగ్ని తృణరాశిని దగ్ధముచేయునట్లు శత్రుసమూహమును దగ్ధము చేయుగాక.

13. గదేऽశని స్పర్శనవిస్ఫులింగే - నిష్పణ్ఢి నిష్పిణ్ఢ్యజితప్రియాసి ।
కూష్మాణ్డవైనాయక యక్షరక్షో - భూతగ్రహాం శ్చూర్ణయ చూర్ణయారీన్॥

తా : పిడుగులవంటి తీక్షస్పర్శగల విస్ఫులింగములను వెడలుగ్రక్కుచున్న ఓగదా! నీవు భగవానున కతిప్రియమైనదానవు (నేనుకూడ ఆయనకుదాసుడనె) అందు వలన నీవు నాశత్రువులగు కూష్మాండ వినాయక యక్షరాక్షసభూత గ్రహములను పొడిపొడిగా జేయవలసినది.

14. త్వం యాతుధానప్రమథ ప్రేతమాతృ - పిశాచవిప్రగ్రహఘోరదృష్టీన్।
దరేన్ద్ర విద్రావయ కృష్ణపూరితో - భీమస్వనోహరేర్హృదయాని కంపయన్॥

తా : ఓ శంఖరాజమా! పాంచజన్యమా ! నీవు శ్రీకృష్ణుని ముఖవాయుచే పూరింపబడి భయంకరశబ్దముతో శత్రువుల హృదయములను కంపింప జేయుచు రాక్షసులను, ప్రమథులను, ప్రేతములను, మాతృకలను, పిశాచులను, భయంకరదర్శనులగు బ్రహ్మరాక్షసులను పారద్రోలుము.

15. త్వం తిగ్మధారాసివనారిసైన్య - మీశప్రయుక్తో మమ ఛిన్ధి ఛిన్ధి।
చక్షూంషి చర్మన్ శతచన్ద్ర ఛాదయ - ద్విషామఘోనాం హరపాపచక్షుషామ్ ॥

తా : తీక్షధారగల ఓ ఖడ్గరాజమా ! నీవు భగవానునిచే ప్రయోగింపబడిన దానివై నాశత్రుసైన్యమును నాశము చేయుము. శతచంద్రాకారమండల విశిష్టమైన ఓడాలా ! నీవు పాపాత్ములగు శత్రువుల చక్షువులను కప్పివేయుము. ఉగ్రదృష్టి గల శత్రువుల నేత్రములను బెతికివేయుము.

16. యన్నోభయం గ్రహేభ్యో ఒభూత్కేతుభ్యో నృభ్య ఏవచ ।
సరీసృపేభ్యో దంష్ట్రిభ్యో భూతేభ్యో ఒంహోభ్య ఏవచ ॥

17. సర్వాణ్యేతాని భగవన్నామరూపానుకీర్తనాత్ ।
ప్రయాన్తు సంక్షయం సద్యోయేనః శ్రేయః ప్రతీపకాః ॥

తా : ఆదిత్యాదులైన నవగ్రహములు, ఉల్కాపాతములు, దుష్టమనుష్యులు, సర్పములు, వృశ్చికాదులైన సరీసృపములు, సింహవ్యాఘ్రాదులైన క్రూర మృగ ములు, ప్రేతాదులు, జలము, అగ్ని, విద్యుత్తు మున్నగు నుపద్రవములు, పాపములు మున్నగువాని నన్నింటివలన గలుగు భయములు, మాశుభ విషయ ములకు విరోధములైన సర్వభావములు భగవన్నామరూపాను కీర్తనముచే వెంటనే నశించుగాక !

18. గరుడో భగవాన్ స్తోత్రస్తోభశ్ఛన్దోమయః ప్రభుః ।
రక్షత్వశేషకృచ్ఛ్రేభ్యో విష్వక్సేనః స్వనామభిః ॥

తా : బృహద్రథంతరాది సామతంత్రములచే స్తుతింపబడువాడు, వేదమూర్తియు, పరమపూజ్యుడు, ప్రభువునగు గరుడుడు, తననామములచే విష్వక్సేనుడు సమస్త దుఃఖములనుండి నన్ను రక్షింతురు గాక !

19. సర్వాపద్భ్యో హరేర్నామరూప యానాయుధాని నః ।
బుద్ధీంద్రియమనః ప్రాణాన్ పాన్తు పార్షద భూషణాః ॥

తా : శ్రీహరి నామము, రూపము, వాహనము, అస్త్రములు, పార్షదముఖ్యులు మాబుద్ధులను, ఇంద్రియములను, మనస్సును, ప్రాణములను సమస్త విపత్తుల నుండి రక్షింతురుగాక!

20. యథా హి భగవానేన వస్తుతః సదసచ్చయత్ ।
సత్యేనానేన నః సర్వేయాన్తు నాశముపద్రవాః ॥

తా : స్థూల సూక్ష్మాత్మకమగు జగత్తు వాస్తవములో భగవానునికంటె భిన్నము కాదు. వస్తు తత్త్వమును విచారించినచో వాస్తవ వస్తువు భగవానుని కార్య స్వరూపము, జగత్కారణ రూపుడగు భగవానుని కంటె భిన్నమైన వస్తువొక్కటియు లేదు. సత్యస్వరూపుడు వాస్తవ వస్తువునకు భగవానునిచే మా సర్వ విపత్తులు నశించుగాక ।

**21. యథైకాత్మ్యానుభావానాం వికల్ప రహితః స్వయమ్ ।**
**భూషణాయుధలిఙ్గాఖ్యా ధత్తే శక్తీః స్వమాయయా ॥**

**22. తేనైవ సత్యమానేన సర్వజ్ఞో భగవాన్ హరిః।**
**పాతు సర్వైః స్వరూపైర్నః సదా సర్వత్ర సర్వగః ॥**

తా : ఈశ్వరుడు, జీవుడు, మాయ, జగత్తు ఇవియన్నియు వస్తువులే. వస్తుతత్త్వ మును విచారించినచో వీనిలొనెట్టి భేదము లేదు. ఇట్టి భావనాపరులగు వ్యక్తుల కడ వాస్తవవస్తువగు భగవానుడు వస్తుతత్త్వ విచారమున భిన్నుడైకూడ కృపాశక్తి వలన కౌస్తుభాది భూషణములను, సుదర్శనాద్యాయుధములను, చతుర్భుజ ద్విభుజాది రూపములను ధరించుచున్నాడు. అట్లే విద్వత్ప్రతీతి లక్షణమగు సత్యప్రమాణము ననుసరించి భూషణాది లక్షణము లతో గూడి విచిత్ర స్వరూప ములలో మమ్ము రక్షించుగాక !

**23. విదక్షు దిక్షూర్ధ్వ మధః సమన్తాదన్తర్బహిర్భగవాన్ నారసింహః ।**
**ప్రహాపయల్లోకభయం స్వనేన స్వతేజసాగ్రస్త సమస్త తేజాః ॥**

తా : మహాభయంకరముగ గర్జించి లోకభయమును సంపూర్ణముగ దొలగించుచు తనతేజస్సుచే తేజస్సుల యొక్క అనగా దిగ్గజములు, విషము, శస్త్రములు, జలము, అగ్ని, వాయువు మున్నగు తేజస్సుల నాచ్ఛాదనము చేసిన ఆ నృసింహ దేవుడు లేదా ఆయన భక్తుడగు ప్రహ్లాదుడు దిక్కులు, విదిశలు, పైన, క్రింద, లోపల, బయట అంతట మమ్ము రక్షింతురుగాక.

**24. మఘవన్నిదమాఖ్యాతం వర్మ నారాయణాత్మకమ్ ।**
**విజేష్యసేఽఞ్జసా యేన దంశితోఽసురయూథపాన్ ॥**

తా : ఇంద్రుడా ! ఈ నారాయణ కవచమును నీకుపదేశించితిని. నీవు దీనిని ధరించినవాడవై తప్పక అసురసేనను జయింపగలవు.

**25. ఏతద్ధారయమాణస్తు యం యం పశ్యతి చక్షుషా ।**
**పదా వా సంస్పృశేత్సద్యః సాధ్వసాత్స విముచ్యతే ॥**

తా : ఈ కవచమును ధరించినవ్యక్తి యెవనిని జూచునో, లేదా పాదమును స్పృశించునో అతడు వెంటనే భయము నుండి విముక్తుడగును.

సర్వం శ్రీకృష్ణ చరణారవిందార్పణమస్తు — శ్రీమద్భాగవతము 6-8-12, 36

16. యన్నో భయం గ్రహేభ్యో ఽభూత్కేతుభ్యో నృభ్య ఏవచ ।
సరీసృపేభ్యో దంష్ట్రిభ్యో భూతేభ్యో ఽంహోభ్య ఏవచ ॥

17. సర్వాణ్యేతాని భగవన్నామరూపానుకీర్తనాత్ ।
ప్రయాన్తు సంక్షయం సద్యోయేనః శ్రేయః ప్రతీపకాః ॥

తా : ఆదిత్యాదులైన నవగ్రహములు, ఉల్కాపాతములు, దుష్టమనుష్యులు, సర్పములు, వృశ్చికాదులైన సరీసృపములు, సింహవ్యాఘ్రాదులైన క్రూర మృగ ములు, ప్రేతాదులు, జలము, అగ్ని, విద్యుత్తు మున్నగు నుపద్రవములు, పాపములు మున్నగువాని నన్నింటివలన గలుగు భయములు, మాశుభ విషయ ములకు విరోధములైన సర్వభావములు భగవన్నామరూపాను కీర్తనముచే వెంటనే నశించుగాక !

18. గరుడో భగవాన్ స్తోత్రస్తోభశ్ఛన్దోమయః ప్రభుః ।
రక్షత్యశేషకృచ్ఛ్రేభ్యో విష్వక్సేనః స్వనామభిః ॥

తా : బృహద్రథంతరాది సామతంత్రములచే స్తుతింపబడువాడు, వేదమూర్తియు, పరమపూజ్యుడు, ప్రభువునగు గరుడుడు, తననామములచే విష్వక్సేనుడు సమస్త దుఃఖములనుండి నన్ను రక్షింతురు గాక !

19. సర్వాపద్భ్యో హరేర్నామరూప యానాయుధాని నః ।
బుద్ధీంద్రియమనః ప్రాణాన్ పాన్తు పార్షద భూషణాః ॥

తా : శ్రీహరి నామము, రూపము, వాహనము, అస్త్రములు, పార్షదముఖ్యులు మాబుద్ధులను, ఇంద్రియములను, మనస్సును, ప్రాణములను సమస్త విపత్తుల నుండి రక్షింతురుగాక!

20. యథా హి భగవానేవ వస్తుతః సదసచ్చయత్ ।
సత్యేనానేన నః సర్వేయాన్తు నాశముపద్రవాః ॥

తా : స్థూల సూక్ష్మాత్మకమగు జగత్తు వాస్తవములో భగవానునికంటె భిన్నము కాదు. వస్తు తత్త్వమును విచారించినచో వాస్తవ వస్తువు భగవానుని కార్య స్వరూపము, జగత్కారణ రూపుడగు భగవానుని కంటె భిన్నమైన వస్తువొక్కటియు లేదు. సత్యస్వరూపుడు వాస్తవ వస్తువునకు భగవానునిచే మా సర్వ విపత్తులు నశించుగాక ।

21. యత్రైకాత్మ్యానుభావానాం వికల్ప రహితః స్వయమ్ ।
భూషణాయుధలిఙ్గాఖ్యా ధత్తే శక్తీః స్వమాయయా ॥

22. తేనైవ సత్యమానేన సర్వజ్ఞో భగవాన్ హరిః।
పాతు సర్వైః స్వరూపైర్నః సదా సర్వత్ర సర్వగః ॥

తా : ఈశ్వరుడు, జీవుడు, మాయ, జగత్తు ఇవియన్నియు వస్తువులే. వస్తుతత్త్వ మును విచారించినచో వీనిలోనెట్టి భేదము లేదు. ఇట్టి భావనాపరులగు వ్యక్తుల కడ వాస్తవవస్తువగు భగవానుడు వస్తుతత్త్వ విచారమున భిన్నుడైకూడ కృపాశక్తి వలన కౌస్తుభాది భూషణములను, సుదర్శనాద్యాయుధములను, చతుర్భుజ ద్విభుజాది రూపములను ధరించుచున్నాడు. అట్లే విద్వత్ప్రతీతి లక్షణమగు సత్యప్రమాణము ననుసరించి భూషణాది లక్షణము లతో గూడి విచిత్ర స్వరూప ములలో మమ్ము రక్షించుగాక !

23. విదిక్షు దిక్షూర్ధ్వ మధః సమన్తాదన్తర్బహిర్భగవాన్ నారసింహః ।
ప్రహాపయల్లోకభయం స్వనేన స్వతేజసాగ్రస్త సమస్త తేజాః ॥

తా : మహాభయంకరముగ గర్జించి లోకభయమును సంపూర్ణముగ దొలగించుచు తనతేజస్సుచే తేజస్సుల యొక్క అనగా దిగ్గజములు, విషము, శస్త్రములు, జలము, అగ్ని, వాయువు మున్నగు తేజస్సుల నాచ్ఛాదనము చేసిన ఆ నృసింహ దేవుడు లేదా ఆయన భక్తుడగు ప్రహ్లాదుడు దిక్కులు, విదిశలు, పైన, క్రింద, లోపల, బయట అంతట మమ్ము రక్షింతురుగాక.

24. మఘవన్నిదమాఖ్యాతం వర్మ నారాయణాత్మకమ్ ।
విజేష్యసేఽఞ్జసా యేన దంశితోఽసురయూథపాన్ ॥

తా : ఇంద్రుడా ! ఈ నారాయణ కవచమును నీకుపదేశించితిని. నీవు దీనిని ధరించినవాడవై తప్పక అసురసేనను జయింపగలవు.

25. ఏతద్ధారయమాణస్తు యం యం పశ్యతి చక్షుషా ।
పదా వా సంస్పృశేత్సద్యః సాధ్వసాత్స విముచ్యతే ॥

తా : ఈ కవచమును ధరించినవ్యక్తి యెవనిని జూచునో, లేదా పాదమును స్పృశించునో అతడు వెంటనే భయము నుండి విముక్తుడగును.

సర్వం శ్రీకృష్ణ చరణారవిందార్పణమస్తు — శ్రీమద్భాగవతము 6-8-12, 36

## 60.శ్రీకృష్ణ పరమాత్మకు నైవేద్యము నివేదించు విధము

పరిషేచన విధి, ఆత్మనివేదనము

స్త్రీలు స్నానము చేసి శుచిర్భూతులై మడుపు చీరలను గట్టి మిక్కిలి శ్రద్ధతో భయభక్తులతో అన్నము, కూరలు వండి, భర్త పూజ చేయు సమయమును మించకుండా దేవుని సమక్షమున నుంచవలయును. వెన్నకూడ నుంచవలయును. ఆపాత్రలకు పసుపు, కుంకుమ బొట్టులుంచవలయును. తదుపరి ఉద్ధరిణతో నీటిని చేతతీసుకొని

**"శాల్యన్నం షడ్రసోపేతం, పంచభక్ష్యాది సంయుతం**
**నైవేద్యం దేవదద్యాజ్య సమ్మిశ్రం ప్రతి గృహ్యతామ్"**
**"ఓం భూర్భువస్సువః, తత్స వితుర్వరేణ్యమ్,**
**భర్గో దేవస్య ధీమహి, ధియో యోనః ప్రచోదయాత్".**

ఈ మంత్రములతో నివేదన చేయబోవు వంటకములపై నుద్ధరిణితో నీళ్ళను ప్రోక్షించి (పగటి భాగమందైన) " సత్యం త్వర్తేన పరిషించామి" అనియు (రాత్రి భాగమందైన) "ఋతం త్వా సత్యేన పరిషించామి" అనియు చెప్పుచు చేతితో మరల నీటిని తీసుకొని నైవేద్యము చుట్టుత్రిప్పి వదల వలయును. వెనుక శ్రీకృష్ణపరమాత్మ ప్రసాదము గ్రహించునట్లు దీనిక్రింద చెప్పబోవు మంత్రములను చెప్పవలయును. ఇట్లు మంత్రములను చెప్పు నప్పుడు భగవంతుని ముందు ప్రసాదమును ఆరగింపు చేయవలయును. ప్రసాదమును తనచేతితో చూప వలయును.

**" అమృతమస్తు, అమృతోపస్తరణమసి, చంద్రమా మనసోజాతః,**
**చక్షో స్సూర్యో అజాయత ముఖాదింద్ర శ్చాగ్నిశ్చ । ప్రాణా**
**ద్వాయు రజాయత। ఓం మహాదేవ్యై చ విద్మహే విష్ణుపత్నీ చ**
**ధీమహి తన్నో లక్ష్మీః ప్రచోదయాత్ - ఓం నారాయణాయ**
**విద్మహే వాసుదేవాయ ధీమహి తన్నో విష్ణుః ప్రచోదయాత్**
**ఓం ప్రాణాయ స్వాహా ! ఓం అపానాయ స్వాహా ! ఓం వ్యానాయ**
**స్వాహా ! ఓం ఉదానాయ స్వాహా ! ఓం సమానాయ స్వాహా !**
**ఓం బ్రహ్మణే పరమాత్మా అమృతత్వాయ ".**

అనెడి యీ మంత్రములను చెప్పి వెనుక అర్ఘ్య పాత్రములోని జలమును ఉద్ధరిణితో నెత్తి "మహాతీర్థం సమర్పయామి" అని మూడు మారులు చెప్పి ఆ తీర్థమును ప్రత్యేకముగా నుండు వేరు అర్ఘ్య పాత్రములో విడువ వలయును.

మధ్యే మధ్యే పానీయం సమర్పయామి, అమృతాపి ధానమసి, ఉత్తరా పోశనం సమర్పయామి (ముఖప్రక్షాళనం సమర్పయామి, హస్త ప్రక్షాళనం సమర్పయామి, పాదప్రక్షాళనం సమర్పయామి) ముఖప్రక్షాళనం కరోమి, హస్త ప్రక్షాళనం కరోమి, పాద ప్రక్షాళనం కరోమి శుద్ధ ఆచమనీయం సమర్పయామి, ఉద్ధరిణితో నీరు పళ్ళెములో వుంచి, తదుపరి పురాణాచమనము చేయ వలయును.

**నాభ్యా ఆసీదంతరిక్షం । శీర్ష్ణో ద్యౌ స్స మవర్తత ।**
**పద్భ్యాం భూమి ర్దిశ శ్శ్రోత్రాత్ । తథా లోకాగ్ం అకల్పయన్ ॥**
**పూగీ ఫలైస్స కర్పూరై ర్నాగవల్లీ దళైర్యుతం ముక్తా**
**చూర్ణేన సంయుక్తం తాంబూలం ప్రతి గృహ్యతామ్ ॥**
**ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః తాంబూలం సమర్పయామి.**

తాంబూల చర్వణానంతరం ఆచమనీయం సమర్పయామి.

నీరాజనము :- (హారతి) **వేదాహమేతం పురుషం మహాన్తమ్ ।**
**ఆదిత్యవర్ణం తమసస్తు పారే । సర్వాణి రూపాణి విచిత్యధీరః ।**
**నామాని కృత్వా౽భివదన్ యదాస్తే ॥**

కర్పూరము వెలిగించవలెను.

**సర్వ ప్రజాంమే గోపాయ ; అమృతత్వాయ జీవసే ;**
**జాతాం జనిష్య మాణాం చ ; అమృతే సత్యే ప్రతిష్ఠి తాం ;**
**అథర్వ పితుం మే గోపాయ ; రసమన్నమిహా యుషే ;**
**అదబ్ధాయో శీతతనో ; అవిషన్నః పితుం కృణు ;**
**శగ్గ్ స్వప శూన్మే గోపాయ ; ద్విపాదో యే చతుష్పదః ;**
**అష్టా శఫా శ్చయ ఇహాగ్నే ; యే చైక శఫా ఆశుగాః ;**
**సప్రథ సభాం మే గోపాయ ; యే చ సభాసదః ;**
**తానింద్రియా వతః కురు, సర్వమాయురు పాసతాం ;**

అహే బుధ్నియ మంత్రం మే గోపాయ ; యమృష యస్త్రై
విదావిదుః; ఋచస్సామాని యజూగ్ంషి ; సాహి
శ్రీరమృతా సతాం ; మానోహిగ్ం సీర్ణాత వేదోగామ శ్వం
పురుషం జగత్ ; అబిభ్ర దఘ్ను అగహి ; శ్రియామా
పరిపాతయ ; సమ్రాజం చ విరాజం చాభి శ్రీర్యాచనో
గృహే ; లక్ష్మి రాష్ట్రస్య యా ముఖేతయా మాసగ్ం
సృజామసి ; సంతత శ్రీరస్తు సమస్త మంగళాని భవంతు ;
నిత్య శ్రీరస్తు నిత్య మంగళాని భవంతు.

ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

1. శ్రీ రుక్మిణీ ప్రాణనాథాయ సామగాన ప్రియాయ చ ।
 శ్రీ శుభాద్రి నివాసాయ శ్రీ నృసింహాయ మంగళమ్ ॥
2. శ్రీమతే నారాయణాయ గోవిందాయ నమోనమః ।
 కృష్ణాయ రుక్మిణీశాయ వాసుదేవాయ మంగళమ్ ॥
3. మంగళం శ్రీకురుక్షేత్ర రణక్షోణి విహారిణీ
 పార్థసారథి రూపాయ గీతాచార్యాయ మంగళమ్ ॥
4. ఓం మంగళం వేదవేద్యాయ మేఘశ్యామల మూర్తయే ।
 పుంసాం మోహన రూపాయ పుణ్య శ్లోకాయ మంగళమ్ ॥
5. ఏకశిలా నివాసాయ వాసుదాసార్పితాయ చ ।
 జానకీ ప్రాణనాథాయ రామచంద్రాయ మంగళమ్ ॥
6. మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే ।
 చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్ ॥

కర్పూరానంద నీరాజనం దర్శయామి. నీరాజనా నంతరం శుద్ధాచమనీయం సమర్పయామి.

స్వామినః ఆచార్య శ్రీహస్తేన స్నానం పరికల్పయామి.

## శాంతి మంత్రము

**ఓం తచ్ఛం యోరా వృణీమహే । గాతుం యజ్ఞాయ గాతుం యజ్ఞ పతయే । దైవీ స్వస్తిరస్తు నః । స్వస్తిర్మానుషేభ్యః । ఊర్ధ్వం జిగాతు భేషజమ్ । శం నో అస్తు ద్విపదే । శం చతుష్పదే ॥**

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

ఎవరు మంగళకరాన్ని అనుగ్రహిస్తారో ఆ భగవంతుని ప్రార్థిస్తాం. యజ్ఞం సవ్యంగా పరిసమాప్తికై ప్రార్థిస్తాం. యజ్ఞం నిర్వర్తించేవారికై ప్రార్థిస్తాం. మనకు దేవతలు శుభం చేయుగాక ! మానవులందరకూ మేలు జరుగుగాక ! చెట్టు చేమలు ఊర్ధ్వముఖంగా పెరుగుగాక ! మన వద్ద నివసిస్తున్న ద్విపద జీవులకు మంగళకరమగుగాక ! చతుష్పాద జీవులకు మేలు జరుగుగాక !

ఈ శాంతి మంత్రము మంత్రపుష్పమునకు ముందు - వెనుక చదువదగును..

## 61. పురుష సూక్తము

ఋగ్వేదము 10-8-90

**ఓం తచ్ఛం యోరావృణీమహే। గాతుం యజ్ఞాయ। గాతుం యజ్ఞపతయే। దైవీ స్వస్తిరస్తు నః। స్వస్తిర్మానుషే భ్యః। ఊర్ధ్వం జిగాతుభేషజం। శన్నో అస్తు ద్విపదే। శం చతుష్పదే ॥**

**ఓం శాంతిః శాంతిః శాంతిః ॥**

శ్రీ గురుభ్యోనమః ॥ హరిః ఓమ్ ॥

**1. సహస్రశీర్షా పురుషః। సహస్రాక్ష స్సహస్రపాత్। సభూమిం విశ్వతో వృత్వా। అత్యతిష్ఠద్దశాంగులమ్। పురుషయేవేదగ్ం సర్వమ్। యద్భూతం యచ్చ భవ్యమ్। ఉతామృతత్త్వస్యేశానః। యదన్నేనా తిరోహతి। ఏతా వానస్య మహిమా। అతో జ్యాయాగ్శ్చ పూరుషః.॥**

తా :- వెయ్యి శిరస్సులు గలవాడు, వేయి నేత్రములు గలవాడు, వేయి పాద ములు గలవాడగు విరాట్స్వరూపుడు, ప్రపంచమంతాతానై దశాంగుళములు శరీరము గల్గి యున్నాడు. త్రికాలములు సమస్త ప్రకృతి గూడా తానై యున్నాడు. అమృతత్వమునకు అన్నంనకు, జగద్రూపమ్మునకు యీ మహానుభావుడే సర్వశక్తి నిచ్చుచున్నాడు.

2. పాదో ఽ స్య విశ్వాభూతాని। త్రిపాదస్యామృతం దివి। త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః। పాదో ఽ స్యేహా ఽ ఽ భవాత్పునః। తతో విష్వఙ్వ్య క్రామత్। సాశనా నశనే అభి। తస్మాద్విరాడ జాయత। విరాజో అధి పూరుషః। స జాతో అత్యరిచ్యత। పశ్చాద్భూమిమథో పురః ॥

తా : సమస్త భూతములు యీ బ్రహ్మమునకు పాతిక భాగముగానే యున్నవి. తక్కిన మూడు భాగములు ఆకాశముగా యున్నది. మూడు వంతులు గలుగు పరమాత్మ పైన వున్నాడు. తరువాత అనేక నామరూపాలు గలిగి ప్రకృతియందీ పరమాత్మ అంతర్బహిరములందు నిల్చి జీవులను రక్షించుచున్నాడు.

3. యత్పురుషేణ హవిషా। దేవా యజ్ఞమతన్వత। వసంతో అస్యా సీదాజ్యమ్। గ్రీష్మ ఇధ్మశ్శరద్ధవిః। సప్తాస్యా సన్పరిధయః। త్రి స్సప్త స్సమిధః కృతాః। దేవా యద్యజ్ఞం తన్వానాః। అబధ్నన్ పురుషం పశుమ్। తం యజ్ఞం బర్హిషి ప్రౌ(ప్రో)క్షన్ పురుషం జాతమగ్రతః ॥

తా : ఈ బృహాశ్శరీరములు గల్గిన తరువాత దివిజులు సృష్టికి పురుషుడనే నామం గల ఒక యజ్ఞమును జరిపిరి. ఆ యజ్ఞమునకు వసంత ఋతువు నెయ్యిగా, గ్రీష్మ ఋతువు సమిధలుగా, శరదృతువు హవిస్సువుగాచేసారు.

దీనికి గాయత్రి మొదలుగా గలుగు సప్త ఛ్ఛందస్సులు పరిధులు. యివి యిరువది ఒక్కటిగా విభజింపబడినవి. దేవతలు తాము చేయుచున్న యీ యజ్ఞమునకు విరాట్పురుషునే పశువుగా చేసి యూపస్తంభమునకు గట్టిరి. సృష్టికి బూర్వమే యీ పురుషుడుదయించెను.

4. తేనదేవా అయజంత। సాధ్యా ఋషయశ్చయే।
తస్మాద్యజ్ఞాత్సర్వహుతః సంభృతం పృ(వృ)షదాజ్యమ్।
పశూగ్ంస్తాగ్ంశ్చక్రే వాయవ్యాన్। ఆరణ్యాన్గ్రామ్యాశ్చయే।
తస్మాద్యజ్ఞాత్సర్వహుతః। ఋచస్సామాని జజ్ఞిరే।
ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాత్। యజు స్తస్మా దజాయత।

తా : దివిజులు, సిద్ధులు, సాధ్యులు, యీ పశువునే ఉపయోగించి యజ్ఞములు

చేసిరి. ఆ యజ్ఞము నుండి పుట్టిన "వృషస్సు" అనే అజ్యమును వీరు ఉపయోగించుచున్నారు. ఆ యజ్ఞము నుండియే అనేక పశువులును, గోవులు, గాయత్రి ఛందస్సు, వేదములు మొదలగున వన్నియు పుట్టెను.

**5. తస్మాదశ్వా అజాయన్త। యేకే చో భయా దతః।**
**గావో హ జజ్ఞిరే తస్మాత్। తస్మాజ్జాతా అజావయః।**
**యత్పురుషం వ్యదధుః కతిథా వ్యకల్పయన్ । ముఖం కిమస్య**
**కౌ బాహూ। కావూరూ పాదావుచ్యేతే । బ్రాహ్మణో౽స్య**
**ముఖమాసీత్। బాహూ రాజన్యః కృతః।**
**ఊరూ తదస్య యద్వైశ్యః। పద్భ్యాగ్ం శూద్రో అజాయత।**
**చంద్రమా మనసో జాతః। చక్షో స్సూర్యో అజాయత।**
**ముఖాదింద్రశ్చాగ్నిశ్చ। ప్రాణాద్వాయు రజాయత। నాభ్యా**
**ఆసీదంతరిక్షమ్। శీర్ష్ణో ద్యౌః సమవర్తత। పద్భ్యాం**
**భూమిర్దిశః శ్రోత్రాత్। తథా లోకాగ్ం అకల్పయన్।**

తా : ఆ బృహత్తర యాగము నుండి గుఱ్ఱములు, గార్దభములు పుట్టెను. గోవులు మేకలు పుట్టెను. సర్వదేవతలు యీ విధముగా శ్రీవిరాడ్బ్రహ్మ చేత సర్వజీవులను సృజించిరి. విరాట్పునకు రెండు చేతులేవి? తొడలెవ్వి? చరణము లేవి? అని ప్రశ్నించినచో దానికి తగినట్టుగా యీ దిగువ సమాధానమున్నది.

విరాడ్బ్రహ్మకు ముఖము ద్విజులు, భుజములు రాజులు, ఊరువులు వైశ్యులు, పాదముల నుండి శూద్రులు యుద్భవించిరి. సూర్యుడు నేత్రముల వలన, ముఖమున సర్వదేవతా శ్రేష్ఠుడగు ఇంద్రుడు, మనస్సు వలన చంద్రుడు, ముఖము వలన అగ్ని, ప్రాణము వలన వాయువు, నాభి నుండి యాకాశము, శిరంబునుండి దేవలోకము, పాదముల వలన భూమి, శ్రోత్రము (చెవులు)ల వలన దిక్కులు కలిగెను. ఈ విధంగా సమస్త లోకములు యా విరాట్పురుషుని వలన పుట్టెను.

**6. వేదాహమేతం పురుషం మహాంతమ్। ఆదిత్యవర్ణం తమసస్తు**
**పారే। సర్వాణి రూపాణి విచిత్యధీరః। నామాని కృత్వా౽**
**భివదన్ యదాస్తే। ధాతా పురస్తాద్యముదాజహార। శక్రః**

**ప్రవిద్వాన్ ప్రది శశ్చతస్రః। తమేవం విద్వానమృత ఇహ భవతి। నాన్యః పంథా అయనాయ విద్యతే। యజ్ఞేన యజ్ఞమయజంతదేవాః। తాని ధర్మాణి ప్రథమాన్యాసన్। తేహ నాకం మహిమానః సచంతే। యత్ర పూర్వే సాధ్యాస్సంతి దేవాః॥**

తా : మహామహిమోపేతుడగు విరాట్టును సృజించి యాతని అనేకమగు పేరులు పెట్టి చరాచర ప్రపంచాత్మకుడుగా నున్నాడో అతని నేను తెలిసికొనుచున్నాను. అతడే అజ్ఞానాంధకారమును బాపి విజ్ఞాన దీపికను నా హృదయములో వెలిగించును. ప్రజాపతి, ఇంద్రుని చేత ఎవ్వడు స్తోత్రము చేయబడుచున్నాడో, ఎవ్వని యాదేశానుసారము ప్రపంచము వర్తిస్తున్నదో అట్టివారిని ఆరాధించి దేవతలు కూడ ముక్తిని పొందిరి. అటులే నేను కూడా యా విరాట్టు నారాధించి మోక్షమును బడసెదను.

7. **అద్భ్య స్సంభూతః పృథివ్యై రసాచ్చ। విశ్వకర్మణ స్సమవర్తతాధి। తస్య త్వష్టా విదధద్రూపమేతి। తత్పురుషస్య విశ్వమా జానమగ్రే। వేదాహమేతం పురుషం మహాంతమ్। అదిత్యవర్ణం తమసః పరస్తాత్। తమేవం విద్వా నమృత ఇహ భవతి। నాన్యః పంథా విద్యతేఽ యనాయ। ప్రజాపతిశ్చరతి గర్భే అంతః। అజాయ మానో బహుధా విజాయతే॥**

తా : శ్రీ విష్ణుమూర్తి నీటి నుండి యుద్భవించెను. భూమి తాలూకు సంబంధము గల్గిన ఉదకము నుండి బ్రహ్మాండ భాండమంతయునూ గలిగెను. దీనికి మూలము పరబ్రహ్మ విరాటు పురుషుని యంశము చేత గలిగిన యీ విశ్వమంతయు సృష్టికి ప్రారంభమున నుద్భవించెను. ఈతనిని మహత్త్వముగా సూర్యుని వంటి గొప్ప తేజశ్శాలిగా నేను తెలిసికొని యారాధించు చున్నాను. ఈ విరాట్టుని పై విధముగా యెవ్వరు తెలిసికొందురో అంధకారమును బాసి సుజ్ఞాన సూర్యోదయములో నిరంతరమూ సంచరింతురు. ప్రజాపతి యీ బ్రహ్మాండ భాండమందు పుట్టువు లేనివాడయ్యు పుట్టి ప్రపంచ రక్షణ కొఱకు సంచరించుచున్నాడు.

**8. తస్య ధీరాః పరిజానంతి యోనిమ్। మరీచీనాం పదమిచ్ఛంతి వేధసః॥ యోదేవేభ్య ఆతపతి। యోదేవానాం పురోహితః॥ పూర్వోయో దేవేభ్యో జాతః॥ నమో రుచాయ బ్రాహ్మయే। రుచం బ్రాహ్మం జనయంతః॥ దేవా అగ్రే తదబ్రువన్। యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్। తస్యదేవా అసన్ వశే॥ హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ। అహోరాత్రే పార్శ్వే। నక్షత్రాణి రూపమ్। అశ్వినౌ వ్యాత్తమ్। ఇష్టం మనిషాణ। అముం మనిషాణ। సర్వం మనిషాణ॥**

తా : ప్రజాపతి యొక్క స్వరూపాది గుణములు పండితులు తెలిసికొనుచున్నారు. ఏ మహానుభావుడు దేవతలకొరకు పుట్టెనో, మొదట దేవతల కెవ్వడుమేలు చేయుచున్నాడో, ఎవ్వడు దివిజులకంటే పురాతనుడో, అట్టి స్వయం ప్రకాశమైన దివ్యతేజోరూపమును ముందుగా ప్రార్థింతును. "ఓ పరమాత్మా ! నీకు సర్వ దివిజగణములు పశువులగుచున్నారు. లజ్జ గల యైశ్వర్యముగల దేవతయు నీకు భార్యలుగా యున్నారు. నక్షత్రములు సూర్యుడు చంద్రుడు మొదలగు బ్రహ్మాండమంతయూ నీ రూపము దేవవైద్యులగు అశ్వినీదేవతలు నీముఖము. మా కోర్కెలు తీర్పుము." అని ప్రార్థిస్తున్నాను. నన్ను దయతో కాపాడుము. ఇహపరాలలో సమస్తాన్ని ప్రసాదించి కరుణించు. సస్వరవేదమంత్రాలు - 76

**ఓం తచ్ఛం యోరా వృణీ మహే....** స్తోత్ర రత్నములు - 1

మంత్రపుష్పము - 1967 సం॥

## 62. మంత్రపుష్పము

**ధాతా పురస్తాద్య ముదాజహార - శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చ తస్రః, తమేవం విద్వా నమృత ఇహ భవతి - నాన్యః పంథా అయనాయ విద్యతే.**

తా : ప్రతీవాడూ ప్రార్థన చేసితరించుటకు సుమంగళకారియై యుండుటకు యీ మంత్రపుష్పమును యెవ్వాడు చదువునో వాడికి సమస్త దేవతానాథుడగు ఇంద్రుడు శాశ్వత సుఖానుభూతు లిచ్చును.

**1 హరిఃఓమ్ సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వ శంభువం, విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదం.**

తా : వేయి శిరంబులు గలవాడును, లెక్కకు మిక్కుటమగు నేత్రములు గల వాడును, ప్రపంచమునకు సుఖము యొనగూర్చెడివాడును, సర్వమునూ వ్యాపించినవాడునూ, సర్వప్రాణుల కాధారమగువాడును, శాశ్వతుండును, మంగళకరుడును, మోక్షస్థానభూతుడైనట్టి నారాయణునకు షడ్విధైక్యానుసంధాన ముతో మ్రొక్కెదను.

**2 విశ్వత: పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్,**
**విశ్వమే వేదం పురుషం స్త ద్విశ్వ ముపజీవతి.**

**3 పతిం విశ్వస్యాత్మే శ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్,**

తా : ప్రపంచానికి యాధారభూతుడును, విశ్వమును రక్షించువాడును, నారా యణుడును, వేదములకు యాది భూతుడును, పురుషోత్తముడును, విశ్వానికి జీవితము కల్పించినవాడును, ప్రపంచమునకు భర్త అనగా పోషించువాడును, క్షేమమును గూర్చెడివాడును, నాశరహితుడగు నారాయణునకు నమస్కరింతును.

**నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణం,**
**4 నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణః పరః,**
**నారాయణ పరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరః.**
**నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణః పరః.**

తా : గాలే యాహారంగా ఇంద్రియాలను అరికట్టి తపస్సు చేయు ఋషులచేతనే తెలిసికొనబడినవాడును, సర్వాంతర్యామిగా నున్నవాడును, జ్యోతిస్వరూపంగా యున్నవాడును యగు శ్రీమన్నారాయణుడే సర్వమును రక్షించువాడు. అతనే సర్వమూ బ్రోచెడువాడు. నారాయణుడే ధ్యానము చేయదగినవాడు. అట్టి ధ్యాన గోచరుడైన పరమాత్మను సేవించుచున్నాను.

**5 యచ్చ కించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతే ఽపివా,**
**అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః.**

**6 అనంత మవ్యయం కవిగ్ం సముద్రే ఽంతం విశ్వ శంభువమ్,**

తా : బ్రహ్మాండమందు యీ సర్వమును ఘటాకాశ, మహదాకాశములందుగూడ చూడబడి వినబడి యుండునో అంతర్బహిర్వ్యాపకత్వములలో సర్వత్రాయున్న శ్రీమన్నారాయణుని మనంబులో ధ్యానించి వారిని గొల్చుచున్నాను.

**పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్.**

**7 అధో నిష్ట్యా వితస్త్యాంతే నాభ్యా ముపరితిష్ఠతి,**

తా : గళమునకు అధో (క్రింద) భాగమును నాభికి ఊర్ధ్వ (పైన) భాగమునకు, మధ్యను ద్వాదశాంగుళప్రమాణ భాగమందు అధోముఖమై మూయబడిన (ముకుళితమై) హృదయకమలమున్నది. ఆ హృదయ కమలమున పరమాత్మ గలదు.

**8 జ్వాలమాలాకులంభాతి విశ్వస్యా ౨ యతనం మహత్.**
**సంతతగ్ం శిలాభిస్తు లంబత్యాకోశ సన్నిభమ్,**
**తస్యాంతే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్సర్వం ప్రతిష్ఠితమ్.**

**9 తస్యమధ్యే మహానగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః,**

తా : అహృదయ పుండరీకము నాశ్రయించి జ్వాలావళులచే ప్రకాశించుచు అనేక నాడీ సమూహములు వ్రేలాడుచు జీవునకు ముఖ్యస్థానమై కొంచెము వికసిత మైన తామరపుష్పముతో తుల్యమై అహృదయాగ్రమందు సూక్ష్మమైన యొక కమలమున్నది. దానియందు సర్వము ప్రతిష్ఠింపబడి యున్నది. దాని నడుమ సర్వత్ర జ్వలించుచు జఠరాగ్నియైన వైశ్వానరరూప పరమాత్మ (గీత 15/14)గలడు.

**సో ౨ గ్రభుగ్విభజ న్తిష్ఠ న్నాహార మజరః కవిః,**
**తిర్యగూర్ధ్వమధశ్శాయీ రశ్మ యస్తస్య సన్తతా.**

**10 సంతాపయతి స్వం దేహ మాపాద తల మస్తకః,**

తా : ఆ జఠరాగ్నియందు తాను తిన్న యన్నము తిని అభాగములు విభజింపబడి నూర్ధ్వముగను, అడ్డముగ క్రిందుగనున్నవి. వాని తాలూకు కిరణజాలములు యాపాదమస్తకము వ్యాపకముచేత యోగధ్యానాది బృహత్కార్యములు చేయు వారు అజరామరణములు విడిచి దేహముయొక్క కాంతిగల్గి సుఖాయురారోగ్య సంపన్నులగుదురు.

**తస్య మధ్యే వహ్ని శిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః.**

**11 నీలతో యదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా,.**

తా : ఈపైని వివరిస్తున్న జఠరాగ్నికి మధ్యభాగములో అగ్ని యొక్క జ్వాలములు మీదుభాగంగానే యెగురుచున్నవి. యానల్లని మేఘాలవలె మెరుపువలె నెగురుచున్నవి. గొప్పగా ప్రకాశించుచున్నవి.

నీవారశూకవత్తన్వీ పీతాభాస్వ త్యణూపమా.

12 తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః,

సబ్రహ్మ స్సశివ స్సహరి స్సేన్ద్ర స్సో ఽ క్షరః పరమస్స్వరాట్.

తా : నీవారధాన్యముల ముల్లువలె బహుసూక్ష్మమై పీతవర్ణమై అణువుతో సమానమైయున్నది. దాని శిఖా మధ్యమందు పరమాత్ముడున్నాడు. ఆ పరమాత్మయే బ్రహ్మయు, రుద్రుడు, విష్ణువు, ఇంద్రుడుననియు, నాశరహితుడు, కూటస్థుడు, అన్నిటికి మూలకారణుడు స్వప్రకాశకుడును.

## యోపాం పుష్పమ్

13 యో ఽ పాం పుష్పం వేద।

పుష్పవాన్ ప్రజావాన్ పశు

మాన్ భవతి। చన్ద్రమా వా

అపాం పుష్పం, పుష్పవాన్ ప్రజావాన్ పశుమాన్

భవతి య ఏవం వేద॥

తా : నీటియందు దేవుడు, యాతనియందు నీరు వీటికి పరస్పర సంబంధములున్నవని యెవ్వరు తెలిసికొన్నారో, వారికి పుష్పములు, జనులు, పశువులు గలుగుచున్నవి. ఈ జలములన్నియు యా స్థానములు తెలిసికొనినవారే ముఖ్య ముగా ముక్తులు.

14 యో ఽ పామాయతనం వేద ।

ఆయతనవాన్ భవతి ।

అగ్నిర్వా అపామాయతనమ్ ।

ఆయతనవాన్ భవతి ।

యో ఽ గ్నే రాయతనం వేద ॥

ఆ యతనవాన్ భవతి ।

ఆపో వా అగ్నే రాయతనం ।

ఆయతనవాన్ భవతి । య ఏవం వేద ॥

తా : అగ్నిలో నీరు నీరుయందు యగ్నియు పరప్పర యాశ్రయ భూతములుగా నున్నవి. ఈ సత్యమును పూర్తిగా తెలిసికొని సమస్త భూతజాలములను యా

నారాయణుడే పుట్టించి పెంచి త్రుంచుటకు గూడా సమర్థుడగుచున్నాడని యెవ్వరు తెలిసికొందురో వారే ముక్తులగుచున్నారు.

15 యో ऽపామాయతనం వేద ।
ఆయతనవాన్ భవతి ।
వాయుర్వా అపామాయతనం ।
ఆయతనవాన్ భవతి ।
యో వాయో రాయతనం వేద ।
ఆయతనవాన్ భవతి ॥
ఆపో వై వాయో రాయతనమ్ ।
ఆయతనవాన్ భవతి ॥ య ఏవం వేద ॥

తా : ప్రపంచమునకు మూలపురుషుడై మహాజ్యోతి రానందదాయకుడుగా సర్వమూ తనలోనే లీనం చేసి సమస్త జీవులకు కర్మానుగుణంగా నిత్య నైమిత్తికముగా వాంఛల నేర్పరచిన నారాయణునకు జలమే స్థానమనియు, పంచభూతములూ యాతని యాజ్ఞ చేతనే వర్తిస్తున్నాయని తెలిసినవారే నిజముగా ముక్తిని పొందినవారని యెరుగునది.

16 యో ऽపామాయతనం వేద।
ఆయతనవాన్ భవతి ।
అసౌ వై తపన్న పామాయతనమ్ ।
ఆయతనవాన్ భవతి।
యో ऽముష్య తపత ఆయతనం వేద
ఆయతనవాన్ భవతి ।
ఆపో వా అముష్య తపత ఆయతనమ్ ॥
ఆయతనవాన్ భవతి। య ఏవం వేద ॥

తా : తన సహస్ర కిరణములచేత సర్వప్రాణులను గూడా తపింపచేయుచున్న లోకబాంధవుడగు సూర్యుడే నీటికి ఆ స్థానాధిపతి. సూర్యుని స్థానమే నీటికి స్థానము. అందుచే యీ రహస్యమును శాస్త్రజ్ఞానవిశోభితమగు విషయాన్ని యెవ్వరు తెలిసికొందురో వారే నిజమగు మోక్షమార్గమునకు వెళ్ళుటకు అర్హులుగా నుందురు.

17 యో உపామాయతనం వేద ।
ఆయతనవాన్ భవతి ।
చన్ద్రమావా అపామాయతనమ్।
ఆయతనవాన్ భవతి ।
యశ్చన్ద్రమస ఆయతనం వేద।
ఆయతనవాన్ భవతి ।
అపో వై చన్ద్రమస ఆయతనమ్ ।
ఆయతనవాన్ భవతి । య ఏవం వేద ॥

తా : తన చల్లని కిరణముల ద్వారా ప్రపంచమునగల జనులకు తాపమును బోగొట్టి అమృతముతో సమానమైన కాంతి పుంజమునిచ్చి సంతోషమును గలుగజేయు కుముద బాంధవుడే నీటికి అధిష్ఠానాధిపతి. చంద్రస్థానమును ఆ జలస్థానమును సర్వము తెలిసి యోగామలానందానుకూలురగు జనులే ముక్తులగుదురు.

18 యో உపామాయతనం వేద ।
ఆయతనవాన్ భవతి ।
నక్షత్రాణివా అపామాయతనం।
ఆయతనవాన్ భవతి ।
యో నక్షత్రాణా మాయతనం వేద ।
ఆయతనవాన్ భవతి ।
ఆపో వై నక్షత్రాణా మాయతనమ్ ।
ఆయతనవాన్ భవతి । య ఏవం వేద ॥

తా : అజ్ఞానాంధకారములో క్రుంగి దరిగానలేక చింతించుచున్న వారిని తమ చక్కని చుక్కలగు నక్షత్రములే ఉదకములకు యునికిపట్టు, అందుచేత యానక్షత్రముల స్థితిని సంపూర్ణముగా యెవ్వరు తెలిసికొంటారో వారే ముక్తులు గదా !

19 యో౽పామాయతనం వేద ।
ఆయతనవాన్ భవతి ।
పర్జన్యోవా అపామాయతనమ్।
ఆయతనవాన్ భవతి ।
యః పర్జన్యస్యాయతనమ్ వేద।
ఆయతనావాన్ భవతి ।
ఆపో వై పర్జన్యస్యా౽౽యతనమ్
ఆయతనవాన్ భవతి । య ఏవం వేద ॥

తా : సమస్త జీవులకు యాధారభూతుడై నిరంతరమూ జీవులెల్లరు సుఖించ గలందులకై అన్ని ప్రాణములను రక్షించుటకు అనువగు పర్జన్యుడే బలమునకు అధిపతి. ఆయన తత్త్వమిట్టిదని యెవ్వరు తెలిసికొందురో వారే ముక్తిని పొందుదురు.

20 యో౽పామాయతనం వేద ।
ఆయతనవాన్ భవతి ।
సంవత్సరోవా అపామాయతనమ్ ।
ఆయతనవాన్ భవతి ।
యస్సంవత్సరస్యాయతనం వేద ।
ఆయతనవాన్ భవతి ।
ఆపో వై సంవత్సరస్యా౽యతనమ్
ఆయతనవాన్ భవతి । య ఏవం వేద ॥

తా : మూడువందల అరువదినాల్గు దినములు గల్గిన యా వత్సరమే నీటికి నివాసము. ఈ వత్సరమే యీ విధంగా యున్నదని దీనికి జలమే యాస్థానమని ఎవ్వరు తెలుసుకొన్నారో వారు నిజమగు ముక్తి మార్గమును తెలిసినవారు. జలమునకు అన్యో౽న్యాశ్రయము చక్కగా యెరుగునది.

21 యో౽ప్సు నావం ప్రతిష్ఠతాం ।
వేద। ప్రత్యేవ తిష్ఠతి ।

తా : ఆత్మ మూలకమగు భ్రాంతిని విసర్జించి జలాధిపతిని ఎవ్వరు సత్యముగా తెలియుదురో వారే ముక్తులు. వస్వరవేదమంత్రాలు - 272

**22 కిం తద్విష్ణోర్బల మాహుః కాదీప్తిః కిం పరాయణమ్**
**ఏకో యద్ధారయ ద్దేవః రేజతీ రోదసీ ఉభే.**

తా : ఇహి కాముష్మికములను మహాత్ముడైన యే పురుషుడు స్వయంప్రకాశుడై ఎట్లు ధరించి యున్నాడో ఆ పరంజ్యోతి వికుంఠనాథుడు ఎంతగొప్పవాడు? అతనికి బలముందా? ప్రకాశమెంత? అని ప్రశ్న?

**23 వాతాద్విష్ణోర్బల మాహుః అక్షరా ద్దీప్తి రుచ్యతే ।**
**త్రిపదా ద్ధారయ ద్దేవః యద్విష్ణోరేక ముత్తమమ్॥**

" ఉత్తరము " విష్ణుమూర్తికి ప్రాణాయామము మొదలగు వాయువు కుంభించు ధారణవలన బలమును నాశనము లేక పోవుటవలన గొప్ప ప్రకాశమును కలిగెను. ఏ జగన్నియంత మూడు పాదముల విభూతి ధరించి ఒక్కడే సర్వలోకములనూ ధరించి యుండెనో అతని లోకమొక్కటియే యుత్తమము.

విష్ణు సహస్రనామము

62 త్రికకుద్ధామ = త్రిపాద్విభూతిని స్థానముగా గలవాడు.

(ధామ212 = ఆధారమైనవాడు.

(1) త్రికకుద్ధామ, (2) తికకుబ్ధామ

(3) త్రికకుత్ - ధామ

ఈనామంబునకు నిట్లు మూడు విధములుగా వ్యాఖ్యానము గలదు. త్రికకుద్ధామ అనియు, తికకుబ్ధామ అనియు, పాఠాంతరములు. త్రికకుత్ అనియు, ధామ అనియు భిన్న నామములు అని.

(1) త్రికకుత్ = త్రిపాద్విభూతిని, ధామ = స్థానముగా గలవాడు. అతడిట్లు సృజించునట్లును, సంహరించునట్లును చెప్పినదంతయును వాని విభూతులలో అణుమాత్రంబునే గదా ! ఇక యీ విషయము నుపాదించుచున్నారు. త్రికకుద్ధామ. త్రిపాద్విభూతిని (మూడు భాగములు గల పరమపదంబును) స్థానముగా గలవాడు.

1. వాని విభూతిలో ఈ ప్రపంచమంతయు పాతికభాగమే. మిగిలిన ముప్పాతిక భాగము నిత్యమైనది. పైనుండునది. 2. ఎవనియొక్క పదివేలలోని యంశం

బున ఈజగచ్ఛక్తి యుండునో అను నీ ప్రమాణంబుచే అది పరమ మహత్పరి మాణంబనియు, ఇది అణుమాత్రంబనియు స్పష్టమగుచున్నది.

(2) "త్రికకుబ్ధామ, జ్ఞానము, బలము, ఐశ్వర్యము, వీర్యము, శక్తి, తేజస్సు అను నాఱుగుణంబులం గలవాడు, (1) త్రికకుత్, అటులే మూడు మూపుర ములు గల్గినవిగాన, "త్రికకుత్" అని వరాహావతారంబునకు పేరు గల్గె. అను నీ ప్రమాణ రీతిగా వరాహావతారంబున మూడు మూపురములు గలవాడు. (2) ధామ - ఇదివేఱు నామము. తేజస్సు అని అర్థము.

విష్ణుసహస్రనామస్తోత్రం, రామానుజభాష్యం.

24 ఓం రాజధిరాజాయ ప్రసహ్యాసాహినే ।
నమో వయం వై శ్రవణాయ కుర్మహే ।
సమేకామాన్ కామకామాయ మహ్యామ్
కామేశ్వరో వై శ్రవణో దదాతు
కుబేరాయ వై శ్రవణాయ మహారాజాయ నమః ॥

తా : సమస్తమైన రాజాధిరాజులకు యాధారమగు భగవానునకు సాష్టాంగ దండప్రణామములర్పింతును. సమస్తమైన కామ్యకర్మల కాధారుడును, తన నామ సహస్రావళి శ్రవణ పఠనయందు కోరిక కలవాడును, సమస్త పృథ్వీతల మునకు, పరిపాలకుడును అగు ఆదినారాయణునకు నమస్కారము చేయుదును.

25 ఓం తద్బ్రహ్మ । ఓం తద్వాయుః । ఓం తదా త్మా ।
ఓం తత్సత్యమ్ । ఓం తత్సర్వం ఓంతత్పురోర్నమః ।

తా : మూడు వర్ణములచే కూడి యొప్పిన " ఓం " అను ప్రణవమే బ్రహ్మము యొక్క స్వరూపము. ఆ ప్రణవమే వాయువు, ప్రణవమే మనయాత్మ ప్రణవమే ప్రపంచాని కాధారమగు సత్యము, ప్రణవమే సర్వమునకు కారణము. అందుకు దానికే నేను నమస్కారము చేయుచున్నాను. ప్రణవశబ్ద వాచ్యుడు భగవానుడే. సమస్త భూతహృదంతరవర్తి, సర్వతీర్థములు గూడా యాతడే. అంతటా త్రిమూ ర్త్యాత్మకుడై, యజ్ఞయాగాదిరూపుడై సర్వమూ తానుగా ప్రజలను పరిపాలింపు చున్నాడు.

మంత్రపుష్పము - 1967 సం.

**26 అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు ।**
**త్వం యజ్ఞస్త్వం వషట్కార స్త్వ మింద్రస్త్వగ్ం రుద్రస్త్వం**
**విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః ॥**

తా : ఆపరమాత్మ ప్రపంచమందలి సమస్త భూతముల హృదయగుహయందు చరించుచుండును. అట్టి ఓ ఆత్మరూపుడవగు దేవా ! నీవే యజ్ఞము, నీవే వషట్కారము, నీవే ఇంద్రుడవు, నీవే రుద్రుడవు, నీవే బ్రహ్మవు, నీవే ప్రజాపతివి.

**27. త్వంతదాప ఆపోజ్యోతీ**
**రసోఽమృతం బ్రహ్మభూర్భువ స్సువరోమ్.**

తా : తాను స్వయం ప్రకాశుడయ్యు, సర్వమునకు యాధారుడు, అమృత రూపుడు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరరూపధారీ ! ప్రణవమే కారణముగా గల ఓ నారాయణా ! నీకు నమస్కారము చేయుదును.

**28 ఈశానస్సర్వవిద్యానామీ శ్వరస్సర్వభూతానాం ।**
**బ్రహ్మధిపతిర్బ్రహ్మణోఽధిపతిర్బ్రహ్మ శివోమేఽస్తు సదా శివోమ్॥**

తా : సర్వ విద్యాధినాధుడవు, భూతనాథుడవు, బ్రహ్మలోకాధిపతివి, నీస్వరూపమే బ్రహ్మము, త్రిమూర్తి స్వరూపుడవు, ప్రణవమే నీరూపు. అట్టి ఓ మహాదాతా ! సర్వదేవారాధ్యా, త్రికాలముల యందు మాకు శుభములను యిచ్చెదవని భక్తి వినమ్ర చిత్తులమై నిన్ను ప్రార్థింతుము.

**29 తద్విష్ణోః పరమం పదగ్ం సదా పశ్యన్తి సూరయః,**
**దివీవ చక్షు రాతతమ్.**

తా : గొప్పవారగు పండితులు తమతమ విజ్ఞాన దృష్టి చేత శ్రీమన్మహా విష్ణు రూపమును అతని లోకమును యాతని యావాసమగు శ్రీవైకుంఠమును సాక్షిగా చూస్తున్నారు.

**30 తద్విప్రాసో విపన్యవో**
**జాగృవాం స స్సమి న్ధతే విష్ణోర్యత్పరమం పదమ్.**

తా : శ్రీ భగవానునిచే పొందబడిన మోక్షముచేత పారద్రోలిన పాపములు గలవారును మహాత్ములగువారి నేనెప్పుడూ ప్రార్థింతును.

**31 అద్వైతం విష్ణవే చ రుం నిర్వపతి యజ్ఞో వై విష్ణుః,**
**యజ్ఞ ఏవాం తతః ప్రతి తిష్ఠతి సోఽ త్రజుహోతి.**

**32 ఋతగ్ం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణ పింగళం,**
**ఊర్ధ్వరేతం విరూపాక్షం విష్ణు రూపాయ వై నమోనమః.**

తా : స్వతస్సిద్ధుడైన స్వరూపము గలవాడు, నిరంజనుడు, నిత్యుడు, నిర్మోహుడు, నిత్యసంకల్పుడు, స్వయం ప్రకాశుడు, ప్రపంచాధారుడు, పింగళవర్ణము గలవాడు, ఊర్ధ్వరేతస్సుడగు శ్రీకృష్ణునకు నమస్కారము.

**33 నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి,**
**తన్నో విష్ణుః ప్రచోదయాత్.**

తా : 1. శ్రీమన్నారాయణుడే మాకు సర్వకాలముల యందు సేవింపదగినవాడు, అతడే మమ్మందరిని రక్షించువాడు, యాతడే మాకు పూజ్యుడగుచున్నాడు.

1967 సం. ముద్రణ మంత్రపుష్పము

2. శ్రీమన్నారాయణుని తెలిసికొని, వాసుదేవ స్వరూపుడగు నాతనిని ధ్యానించుచున్నాము. అందువలన మమ్ములను శ్రీమహావిష్ణువు సత్కర్మల నాచరించునటుల ప్రేరేపించుగాక.

3. శ్రీమన్నారాయణుడు మాకు నామస్మరణముల యందు దృఢాపరోక్షబుద్ధిని గలుగజేయవలెను. స్వస్వరూపసంధానము - 77

4. శ్రీమన్నారాయణుని మేము తెలిసికొందుము. శ్రీవాసుదేవుని మేము ధ్యానించెదము. ఆ విష్ణువు (వ్యాపకస్వరూపుడగు పరమాత్మ) మమ్ములను (దృఢా పరోక్ష జ్ఞానమునకై) ప్రేరణ చేయుగాక. నిత్యప్రార్థనావళి - 141

**34 ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరం,**
**సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి.**

తా : ఆకాశము నుండి పడిననీరు సముద్రములో కలియునట్లు ఎన్ని రూపములలో యెందరర్పించినా శ్రీమన్నారాయణునిలోనే చేరును... ఏ దేవతకు నమస్కరించినను అది ఒక్కకేశవునకే దక్కునుగదా!

**35 సంతాపయతి సందేహ మాపాదతల మస్తకమ్,**
**తస్యమధ్యే వహ్ని శిఖా అణీయోర్ధ్వావ్యవ స్థితః.**

తా : అయగ్ని ఆపాదమస్తకమును దహించును, ఆ యంగారకుని మధ్యలో పైముఖంగా అణువువలె సూక్ష్మంగా ఒక శిఖవుంది.

**36 నీలతో యద మధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వర ।**
**నీవార శూకవత్తన్వీ పీతాభాస్వత్య్యణూపమా.**

తా : అయగ్నిజ్వాల నీలమైన మేఘములోని మెరుపువలె దివ్యముగా ప్రకాశించును. అది అణు రూపము గలిగి పీతవర్ణముగానుండును.

**37 తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః,**
**సబ్రహ్మ స్సశివ స్సహరి స్సే న్ద్ర స్సో ఒక్షరః పరమస్స్వరాట్.**

తా : ఆ యగ్ని జ్వాల మధ్యమున పరబ్రహ్మకలడు. అతడే త్రిమూర్త్యాత్మకుడు, అతడే సర్వదేవతానాథుడు.

**38-1. ఓం రాజాధి రాజాయ ప్రసహ్యసాహినే ।**
**నమో వయం వై శ్రవణాయ కుర్మహే ।**
**సమేకామాన్ కామకామాయ మహ్యమ్ ।**
**కామేశ్వరో వై శ్రవణో దదాతు ।**
**కుబేరాయ వై శ్రవణాయ మహారాజాయ నమః ॥**

తా : ఎల్లరాజులకు రాజగు భగవంతునకు మేము వందనము జేయుచున్నాము. కామేశ్వరుడు కోరికల నిచ్చుచున్నాడు. సహస్రనామాది స్తోత్రపాఠ శ్రవణమందా సక్తిగలవాడును, బ్రహ్మాండమునకు రాజుగానుండు శ్రీమన్నారాయణునకు భక్తితో సాష్టాంగముగా నవవిధభక్త్యుపచారములతో మ్రొక్కెదము.

స్వస్వరూపనంధానము 74

**2 ఓం తద్బ్రహ్మ, ఓం తద్వాయుః, ఓం తదాత్మా,।**
**ఓం తత్సత్యం ఓం తత్సర్వం ఓం తత్పురోర్నమః।**

**3 అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు,।**
**త్వం యజ్ఞస్త్వం వషట్కార స్త్వ మిన్ద్రస్త్వగ్ం।**
**రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః ॥**

తా : వర్ణత్రయాత్మకమైన ప్రణవమే బ్రహ్మస్వరూపము, ప్రణవమే వాయు స్వరూ

పము. ప్రణవమే ఆత్మస్వరూపము. ప్రణవమే సత్యస్వరూపము. ప్రణవమే సర్వ కారణ స్వరూపమని వందనము చేయుచున్నాము. ఆ ప్రణవాత్మకమైన తచ్ఛబ్ద వాచ్యుడైన భగవంతుడు సమస్త భూతముల యొక్క హృదయమందుండు వాడును, శ్రీశైల కుహరములం దుండువాడును, అంతర్బాహ్యములయందు సర్వత్ర మూర్తిత్రయాత్మకుడై, యజ్ఞ స్వరూపుడై, వషట్కార స్వరూపుడై, ఇంద్రుడై, రుద్రుడై, విష్ణువై, బ్రహ్మ స్వరూపుడై ప్రజలను పాలించుచున్నాడు.

**4 త్వం త్వదాప ఆపో జ్యోతీ రసో౽మృతం,**
**బ్రహ్మ భూర్భువస్సువ రోమ్.**

తా : స్వప్రకాశుడవైన నీవు ఆపోజ్యోతిస్వరూపుడవు, అమృతరూపుడవు, రస రూపుడవు, బ్రహ్మ స్వరూపుడవు, భూలోక భువర్లో సువర్లోక స్వరూపుడవు, ప్రణవై కాక్షర స్వరూపుడవగుచున్నావు. స్వస్వరూపవంధానము - 75

ఓం శ్రీం శ్రియై నమః ఓం హిరణ్యవర్ణాయై నమః

## 63. శ్రీ సూక్తము

వేదాలలోను, పురాణాలలోను కానవచ్చే మహాలక్ష్మీ స్తుతుల సంకలనమే శ్రీ సూక్తమ్. దక్షిణదేశంలో ఇది బహుళప్రాచుర్యం సంతరించుకొన్నదనడం ముదా వహం. శ్రీమహాలక్ష్మీ కృపాకటాక్షం పరిపూర్ణంగా కలుగుతుందనే విశ్వాసంతో దీనిని పారాయణ చేయడం పరిపాటి.

**1 ఓం హిరణ్యవర్ణాం హరిణీం - సువర్ణరజతస్రజామ్ ।**
**చంద్రామ్ హిరణ్మయీం - లక్ష్మీం జాతవేదో మమావహ ॥**

తా : ఓ అగ్నిదేవా ! సువర్ణకాంతివంటి ఛాయగలదీ, పాపాలను హరించివేసేదీ, బంగారము వెండి హారాలను అలంకరించుకొన్నదీ, చంద్రునివంటి ఆహ్లాదం కలదీ సువర్ణమయమైనదీ అయిన మహాలక్ష్మిని నాకొరకు ఆవాహనం చెయ్యి.

**2 తాం మ ఆవహ జాతవేదో - లక్ష్మీమనపగామినీమ్ ।**
**యస్యాం హిరణ్యం విందేయం - గామశ్వం పురుషానహమ్ ॥**

తా : ఓ అగ్నిదేవా ! ఎవరి కృపాకటాక్షంతో నాకు బంగారము, గోవులు, గుర్రాలు, బంధువులు సంప్రాప్తమైనవో ఆ మహాలక్ష్మిని నాకడకు ఆవాహన చెయ్యి : ఆమె నా వద్దనుండి వీడిపోనట్లు చూడు.

3 అశ్వపూర్వాం రథమధ్యాం - హస్తినాద ప్రబోధినీమ్ ।
శ్రియం దేవీ ముపహ్వయే - శ్రీర్మా దేవీ ర్జుషతామ్ ॥

తా : గుర్రాలను పూన్చిన రథం మధ్యన ఆసీనురాలైనదీ, తనరాకను ఏనుగు ఘీంకారనాదంతో సూచిస్తూవున్నదీ అయిన శ్రీదేవిని అహ్వానిస్తున్నాను. శ్రీదేవీ। నువ్వు నావద్ద సంతోషంగా నెలకొనియుండుగాక.

4 కాం సోస్మితాం హిరణ్యప్రాకారా - మార్ద్రాం జ్వలన్తీం తృప్తాం।
తర్పయన్తీమ్। పద్మే స్థితాం పద్మవర్ణాం-తామిహోపహ్వయేశ్రియమ్॥

తా : చిరుదరహాసంతో కూడినదీ, బంగారుకోటలో వసించునదీ, కరుణా స్వరూపిణీ, తేజస్స్వరూపిణీ, ఆనందస్వరూపిణీ, ఆనందాన్ని ప్రసాదించునదీ, పద్మంలో ఆసీనురాలైనదీ, పద్మంవంటి ఛాయ గలదీ అయిన ఆ శ్రీదేవిని ఇక్కడ సాక్షాత్కరింపమని ప్రార్థిస్తున్నాను.

5 చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం - శ్రియం లోకే దేవజుష్టా ముదారామ్।
తాం పద్మినీమీం శరణమహం । ప్రపద్యే ఽలక్ష్మీర్మే నశ్యతాం త్వాం వృణే ॥

తా : చంద్రుని పోలినదీ, తేజోవంతమైనదీ, తనకీర్తి చంద్రికలవలన దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నదీ, దేవతలచే పూజలందుకొనునదీ, కరుణా స్వరూపిణీ, పద్మాన్ని ధరించినదీ, 'ఈం'అనే బీజమంత్రానికి భావంగా విరాజిల్లుతూన్నదీ, అయిన మహాలక్ష్మిని నేను శరణు జొచ్చుతాను. ఓదేవీ నిన్ను ప్రార్థిస్తున్నాను. నాదారిద్ర్యం తీరిపోయేలా కరుణించు.

6 ఆదిత్యవర్ణే తపసో ఽధి జాతో
వనస్పతిస్తవ వృక్షో ఽథ బిల్వః ।
తస్య ఫలాని తపసా నుదన్తు
మాయాంతరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః ॥

తా : సూర్యునివన్నె కలదానా ! వనానికి అధిపతి యైన బిల్వవృక్షం నీ తపోమహిమచే ఉద్భవించింది. నీ తపస్సం భూతాలైనదాని ఫలాలు అజ్ఞానమైన లోపలి ఆటంకాన్నీ, అమంగళకరమైన బాహ్య ఆటంకాన్నీ తొలగిస్తాయి గాక !

7 ఉపైతు మాం దేవసఖః కీర్తిశ్చ మణినా సహ ।
ప్రాదుర్భూతో ऽ స్మి రాష్ట్రేऽస్మిన్ కీర్తి మృద్ధిం దదాతు మే ॥

తా : కుబేరుడూ, కీర్తిదేవుడూ ఐశ్వర్యాలతో నన్ను వెన్నంటి రావాలి. నీఅనుగ్రహాన్ని పూర్తిగా సంతరించుకొన్న యీదేశంలో నేను జన్మించాను. కీర్తిని ఐశ్వర్యాన్ని నాకు ప్రసాదించు.

8 క్షుత్పిపాసామలాం జ్యేష్ఠామలక్ష్మీం నాశయామ్యహమ్ ।
అభూతిమ సమృద్ధిం చ సర్వాం నిర్ణుదమే గృహాత్ ॥

తా : ఆకలి దప్పికలతో కృశించినదీ, శ్రీదేవి కంటే ముందుగా జన్మించినదీ, అయిన జ్యేష్ఠాదేవిని (అలక్ష్మిని) నేను నాశనం చేస్తాను. నాగృహం నుండి అభాగ్య అసమృద్ధులను పూర్ణంగా నిర్మూలించి అనుగ్రహించు.

9 గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్ ।
ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహో పహ్వయే శ్రియమ్ ॥

తా : సుగంధానికి ఆలవాలమైనదీ, జయింపనలవికానిదీ, సతతము పౌష్టికత నిచ్చునదీ, సకల సంపన్నురాలూ, సమస్త జీవులకు నాయకురాలైనదీ అయిన మహాలక్ష్మిని ఇక్కడ ఆవాహన చేస్తున్నాను.

10 మనసః కామమాకూతిం వాచః సత్యమశీమహి ।
పశూనాం రూపమన్నస్య మయి శ్రీః శ్రయతాం యశః ॥

తా : శ్రీదేవీ! మనస్సులో జనించే ఉదాత్త ఆకాంక్షలను సంతోషాన్ని, వాక్కులో సత్యాన్ని, గోసమృద్ధిచేత, ఆహార సమృద్ధిచేత కలిగే ఆనందాన్ని నేను చవిచూడాలి. నాకు కీర్తి కలుగుగాక !

11 కర్దమేన ప్రజాభూతా మయి సంభవ కర్దమ ।
శ్రియం వాసయ మే కులే మాతరం పద్మమాలినీమ్ ॥

తా : కర్దమ మహర్షీ ! నీకు పుత్రికగా జన్మించిన మహాలక్ష్మి నాకు సాక్షాత్కరించాలి. తామరపువ్వుల మాల దాల్చినదీ, సిరిసంపదలకు అధిదేవతా, తల్లీ అయిన ఆమెను నాకులంలో సతతం వసింప చేయాలి.

12 ఆపః సృజంతు స్నిగ్ధాని చిక్లీత వసమే గృహే ।
ని చ దేవీం మాతరం శ్రియం వాసయ మే కులే ॥

తా : శ్రీదేవి పుత్రుడవైన ఓ చిక్లీతా। నీరు చక్కని ఆహారపదార్థాలను ఉత్పాదన చేయనీ (చేయుగాక!) నా యింట నువ్వు వసించాలి. దేవీ, నీ మాత అయిన శ్రీదేవి నా కులంలో నిరంతరం వసింప అనుగ్రహించు.!

**13 ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం పింగలాం పద్మమాలినీమ్ ।**
**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥**

తా : అగ్నిదేవా ! కరుణా పూరిత మనస్సు గలదీ, పద్మవాసినీ, ఆహారం ఒసగి లోకాన్ని పోషించేదీ, కుంకుమవన్నె గలదీ, తామరపువ్వుల మాలధారీ, చంద్రునిలా ఆహ్లాదకారిణీ, బంగారు మయమైనదీ అయిన మహాలక్ష్మిని నా నిమిత్తం ఆవాహన చేయి.

**14 ఆర్ద్రాం యః కరిణీం యష్టిం సువర్ణాం హేమ మాలినీమ్ ।**
**సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥**

తా : అగ్నిదేవా ! దయార్ద్ర హృదయురాలూ, గంభీరమూర్తీ, దండం చేత బట్టినదీ, అందమైన మేనిఛాయ గలదీ, సూర్యునిలా ప్రకాశమానమైనదీ, బంగారు మయమైనదీ అయిన మహాలక్ష్మిని నాకోసం ఆవాహన గావించు.

**15 తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీమ్ ।**
**యస్యాం హిరణ్యం ప్రభూతం గావో దాస్యోऽశ్వాన్,**
**విందేయం పురుషానహమ్ ॥**

తా : అగ్నిదేవా ! ఎవరి వలన నేను అపరిమిత బంగారం, గోవులు, సేవకురాండ్రు, గుర్రాలు, సేవకులను పొందితినో అట్టి మహాలక్ష్మి నన్ను వదలి వెళ్ళి పోకుండా కృప చూపు.

**పద్మప్రియే పద్మిని పద్మహస్తే పద్మాలయే పద్మదలాయతాక్షి ।**
**16. విశ్వప్రియే విష్ణు మనోऽనుకూలే త్వత్పాదపద్మం మయి సన్నిధత్స్వ ॥**

తా : పద్మమంటే ఇష్టపడేదానా, పద్మకుమారీ, పద్మాన్ని చేత ధరించినదానా, పద్మనివాసినీ, తామరరేకుల వంటి విశాలమైన కన్నులు గలదానా, లోకానికి ప్రియమైనదానా, విష్ణువు మనస్సుకు అనుకూలురాలైనదానా, నీపాదపద్మాలను నాపై మోపి నన్ను అనుగ్రహించు. మంత్రపుష్పము 1967 సం॥ సస్వరవేదమంత్రాలు - 152

శ్రీరామకృష్ణప్రభ - 3/2001=36, 4/2001=13

ఓం శ్రీం శ్రియై నమః

## 17. శ్రీసూక్తాంతర్గత నామావళి

1 ఓం హిరణ్యవర్ణాయ నమః
2 ఓం హరిణ్యై నమః
3 ఓం సువర్ణ రజత స్రజాయై నమః
4 ఓం చంద్రాయ నమః
5 ఓం హిరణ్మయ్యై నమః
6 ఓం అనపగామిన్యై నమః
7 ఓం హిరణ్యై నమః
8 ఓం గవే నమః
9 ఓం అశ్వాయై నమః
10 ఓం పురుషిణ్యై నమః
11 ఓం అశ్వపూర్వాయై నమః
12 ఓం రథమధ్యాయై నమః
13 ఓం హస్తినాద ప్రబోధితాయ నమః
14 ఓం శ్రియై నమః
15 ఓం దైవ్యై నమః
16 ఓం కస్యై నమః
17 ఓం సోస్మితాయై నమః
18 ఓం హిరణ్యప్రాకారాయై నమః
19 ఓం ఆర్ద్రాయై నమః
20 ఓం జ్వలన్త్యై నమః
21 ఓం తృప్తాయై నమః
22 ఓం తర్పయంత్యై నమః
23 ఓం పద్మేస్థితాయై నమః
24 ఓం పద్మవర్ణాయై నమః
25 ఓం చంద్రప్రభాసాయై నమః
26 ఓం యశసాజ్వలన్త్యై నమః
27 ఓం లోకే దేవజుష్టాయై నమః
28 ఓం ఉదారాయై నమః
29 ఓం తస్యై నమః
30 ఓం పద్మిన్యై నమః
31 ఓం "ఈం" కారాయై నమః
32 ఓం శరణ్యాయై నమః
33 ఓం అలక్ష్మీర్నాశయిత్ర్యై నమః
34 ఓం వృణినే నమః
35 ఓం ఆదిత్య వర్ణాయై నమః
36 ఓం తపసో ఽధిజాతాయై నమః
37 ఓం వనస్పత్యై నమః
38 ఓం బిల్వఫలాధిజాతాయై నమః
39 ఓం తపసే నమః
40 ఓం మాయాయై నమః
41 ఓం అంతరాయై నమః
42 ఓం బాహ్యాయై నమః
43 ఓం అలక్ష్మీం నుదన్త్యై నమః
44 ఓం దేవసఖ్యై నమః
45 ఓం కీర్త్యై నమః
46 ఓం మణిన్యై నమః
47 ఓం ప్రాదుర్భూతాయై నమః
48 ఓం రాష్ట్రాయై నమః
49 ఓం కీర్తిదాయై నమః
50 ఓం బుద్ధిదాయై నమః

51 ఓం క్షుత్పిపాసాయై నమః
52 ఓం అమలాయై నమః
53 ఓం జ్యేష్ఠాయై నమః
54 ఓం అలక్ష్మీ నాశిన్యై నమః
55 ఓం అభూతి నిర్ణుదాయై నమః
56 ఓం అసమృద్ధి నిర్ణుదాయై నమః
57 ఓం సర్వాన్నిర్ణుదాయై నమః
58 ఓం గంధద్వారాయై నమః
59 ఓం దురాధర్షాయై నమః
60 ఓం నిత్యాయ నమః
61 ఓం పుష్టాయై నమః
62 ఓం కరీషిణ్యై నమః
63 ఓం సర్వభూతానా మీశ్వర్యై నమః
64 ఓం మనసాయై నమః
65 ఓం కామాయై నమః
66 ఓం ఆ కూత్యై నమః
67 ఓం వాచే నమః
68 ఓం సత్యాయై నమః
69 ఓం పశూనాం రూపాయై నమః
70 ఓం అన్నాయై నమః
71 ఓం యశసే నమః
72 ఓం కర్ధమేన ప్రజా భూతాయై నమః
73 ఓం సంభవాయై నమః
74 ఓం కర్ధమాయై నమః
75 ఓం శ్రియం వాసాయై నమః
76 ఓం కులాయై నమః
77 ఓం మాత్రే నమః
78 ఓం పద్మ మాలిన్యై నమః
79 ఓం అపస్సృజంత్రిణ్యై నమః
80 ఓం స్నిగ్ధాయై నమః
81 ఓం చిక్లీత మాత్రే నమః
82 ఓం కులే నివాసిన్యై నమః
83 ఓం పుష్కరిణ్యై నమః
84 ఓం పింగళాయై నమః
85 ఓం కరిణ్యై నమః
86 ఓం యస్ష్యై నమః
87 ఓం యష్ట్యై నమః
88 ఓం సువర్ణాయై నమః
89 ఓం హేమ మాలిన్యై నమః
90 ఓం సూర్యాయై నమః
91 ఓం ప్రభూతాయై నమః
92 ఓం హిరణ్యదాయై నమః
93 ఓం ప్రభూత గోదాయై నమః
94 ఓం దాసిదాయై నమః
95 ఓం అశ్వదాయై నమః
96 ఓం పురుషదాయై నమః
97 ఓం శుచయే నమః
98 ఓం పంచదశ ఋుచయే నమః
99 ఓం పద్మ ప్రియాయై నమః
100 ఓం పద్మహస్తాయై నమః
101 ఓం పద్మాలయాయై నమః
102 ఓం పద్మదళాయ తాక్ష్యై నమః
103 ఓం విశ్వప్రియాయై నమః
104 ఓం విష్ణుమనోనుకూలాయై నమః
105 ఓం పాదపద్మాయై నమః
106 ఓం మహా దైవ్యే నమః
107 ఓం విష్ణుపత్న్యై నమః
108 ఓం లక్ష్మ్యై నమః

ఓం, శ్రీం, శ్రియై నమః
ఓం, శ్రీం, హ్రీం, క్లీం, ఐం, మహాధనలక్ష్మ్యై నమః
ఓం, శ్రీం, హ్రీం, క్లీం, ఐం, మహా వరలక్ష్మ్యై నమః
శ్రీ సూక్తాంతర్గత నామావళి సంపూర్ణము.

శ్రీ సూక్తాంతర్గత నామావళిని ముద్రించుటకు అనుమతించిన శ్రీభాష్యకర్త దివ్యధర్మసూరి, గీతాచార్య విరించి లేఖినీనామక శ్రీమాన్ మన్నంపన్నృదుంబై రంగకృష్ణమాచార్యుల వారికి నాహృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు.

## 64. ఫలశ్రుతి

1. యశ్శుచిః ప్రయతో భూత్వా జుహు యాదాజ్య మన్వహమ్ ।
శ్రియః పంచదశర్చం చ శ్రీకామః సతతం జపేత్ ॥

తా : ఎవరు లక్ష్మీదేవి కృపాకటాక్షార్థం ప్రార్థిస్తున్నారో వారు శుచిగా ఇంద్రియాలు నిగ్రహించినవారుగా ఉంటూ ప్రతిరోజు నేతిలో హోమం చేయాలి. పైన తెలిపిన లక్ష్మీదేవియొక్క పదిహేను మంత్రాలను సదా జపిస్తూ వుండాలి.

2. ఆనందః కర్దమ శ్చైవ చిక్లీత ఇతి విశ్రుతా : ।
ఋషయస్తే త్రయః పుత్రా స్స్వయం శ్రీదేవిదేవతా ॥

తా : సుప్రసిద్ధులూ, ఋషులూ అయిన ఆనందుడు, కర్దముడు, చిక్లీతుడు ముగ్గురూ పుత్రులు. మహాలక్ష్మియే దేవత.

3. పద్మాననే పద్మఊరూ పద్మాక్షీ పద్మసంభవే ।
త్వం మాం భజస్వ పద్మాక్షీ యేన సౌఖ్యం లభామ్యహమ్ ॥

తా : పద్మము నందు నివసింపునది, పద్మమువంటి ఊరువులూ, పద్మమువంటి కన్నులు కలదానా, పద్మమునుండి ఉద్భవించినదానా, నేను దేనివలన సుఖిస్తానో దాన్ని నువ్వు నాకు అనుగ్రహించు.

4. అశ్వదాయి చ గోదాయి ధనదాయి మహాధనే ।
ధనం మే జుషతాం దేవిం సర్వ కామార్థ సిద్ధయే॥

తా : గుర్రాలను సమర్పించేదీ, గోవులను సమర్పించేదీ, సంపదలను సమర్పించేదీ, ధనానికి అధిదేవతాయైన మహాలక్ష్మి ! అభీష్టాలన్నీ నెరవేరేటప్పుడు కలిగే సుఖాన్ని ఇచ్చే సంపదను నాకు ప్రసాదించు.

5. పుత్రపౌత్ర ధనం ధాన్యం హస్త్యశ్వాజావిగో రథమ్ ।
ప్రజానాం భవసి మాతా ఆయుష్మంతం కరోతుమామ్ ॥

తా : పుత్రులు, పౌత్రులు, గోవులు, ధనధాన్యాలు, ఏనుగులు, గుర్రాలు, మేకలు, గోవులు, గొఱ్ఱెలు ఇత్యాదులు రథాలు సకలము ప్రసాదించు. జనులకు నువ్వు తల్లివి. నన్ను అయుష్మంతునిగా చేయుము.

6. చంద్రాభాం లక్ష్మీమీశానాం సూర్యాభాం శ్రియమీశ్వరీమ్ ।
చంద్ర సూర్యాగ్ని సర్వభాం శ్రీమహాలక్ష్మీ ముపాస్మహే ॥

తా : చంద్రునిలా ఆహ్లాదంగా ప్రకాశిస్తూన్నదీ, దేవతల శక్తిగా విరాజిల్లుతూన్నదీ, సూర్యునిలా తేజస్సుతో ప్రకాశిస్తూన్నదీ, శ్రీదేవీ ఈశ్వరీ చంద్ర సూర్య అగ్నుల ముప్పురినీ తన సమస్తమూ కలదీయైన శ్రీమహాలక్ష్మిని అరాధిస్తాము.

7. ధనమగ్నిర్ధనం వాయుర్ధనం సూర్యోధనం వసుః ।
ధనమింద్రో బృహస్పతిర్వరుణం ధనమశ్నుతే ॥

తా : అగ్నిదేవుడూ, వాయుదేవుడూ, సూర్య భగవానుడూ, అష్టవసువులూ, దేవేంద్రుడూ, దేవగురువైన బృహస్పతీ, వరుణదేవుడూ తమతమ సంపదలను నీకృపతో అనుభవిస్తున్నారు.

8. వైనతేయ సోమం పిబ సోమం పిబతు వృత్రహా ।
సోమం ధనస్య సోమినో మహ్యం దధాతు సోమిని ॥

తా : ఓ గరుత్మంతుడా ! సోమరసంగ్రోలు. వృత్రాసురుని సంహరించిన ఇంద్రుడు సోమరసం గ్రోలనీ, సోమయాగం నిర్వర్తింప ఆశిస్తూన్న నాకు పుష్కలంగా ధనాన్ని సోమరసమును ప్రసాదించనీ. (ప్రసాదించు)

9. న క్రోధో న చ మాత్సర్యం న లోభో నాశుభామతిః ।
భవంతి కృతపుణ్యానాం భక్తానాం శ్రీసూక్తం జపేత్సదా ॥

తా : పుణ్యాత్ములగు భక్తులకు కోపం నశించును. కోపం రాదు. మాత్సర్యం ఉండదు, లోభం నశిస్తుంది, దుర్బుద్ధి పుట్టదు. భక్తిని పొందగోరే వారు శ్రీ సూక్తాన్ని సదా జపం చేయాలి.

**10. వర్షంతు తే విభావరి దివో అభ్రస్య విద్యుతః ।**
**రోహంతు సర్వ బీజాన్యవ బ్రహ్మ ద్విషో జహి ॥**

తా : నీ కృపతో విద్యుల్లతాయుక్తాలైన మేఘాలు రేయింబవళ్లు వర్షించనీ ! విత్తనాలు సమస్తం చక్కగా మొలకెత్తి ఏపుగా పెరగనీ ! భగవంతుని నిందించేవారు నిష్క్రమించుదురు గాక !

**11. పద్మప్రియే పద్మిని పద్మహస్తే పద్మాలయే పద్మదలాయతాక్షి ।**
**విశ్వప్రియే విష్ణు మనో ఽ నుకూలే త్వత్పాదపద్మం మయి సన్నిధత్స్వ॥**

తా : పద్మమంటే ఇష్టపడేదానా, పద్మకుమారీ, పద్మాన్ని చేత ధరించినదానా, పద్మనివాసినీ,తామరరేకుల వంటి విశాలమైన కన్నులు కలదానా, లోకానికి ప్రియమైనదానా మహావిష్ణువు మనస్సుకు అనుకూలురాలైనదానా, నీ పాదపద్మాలను నాపై మోపి నన్ను అనుగ్రహించు.

**12. యాసా పద్మాసనస్థా విపులకటితటీ పద్మపత్రాయతాక్షీ ।**
**గంభీరావర్తనాభిః స్తనభర నమితా శుభ్ర వస్త్రోత్తరీయా ।**
**లక్ష్మీర్దివ్యైర్గజేంద్రై ర్మణీగణ ఖచితైస్స్నాపితా హేమకుంభై ః ।**
**నిత్యం సా పద్మహస్తా మమవసతు గృహే సర్వమాంగల్యయుక్తా॥**

తా : పద్మము మీద ఆసీనురాలై ఉన్నదెవరో, విస్తారమైన పిరుదులు గలవారెవరో, తామరరేకులవంటి నేత్రాలు గలవారెవరో, లోతైన నాభి గలవారెవరో, స్తనాల భారంతో వంగివున్న వారెవరో, స్వచ్ఛమైన వలువలు ఉత్తరీయం ధరించినదెవరో, రత్నాలు పొదిగిన బంగారు కలశాల జలంతో దేవలోకంలోని శ్రేష్ఠతమ గజరాజులచే అభిషేకించబడుచున్న దెవరో, పద్మాన్ని చేత ధరించినదెవరో, సర్వమంగళ స్వరూపిణియైన దెవరో అట్టి మహాలక్ష్మి నా గృహంలో సర్వవేళలా నివసించుగాక!

**13. లక్ష్మీం క్షీరసముద్ర రాజతనయాం శ్రీరంగధామేశ్వరీమ్ ।**
**దాసీభూత సమస్త దేవ వనితాం లోకైక దీపాంకురామ్ ।**
**శ్రీమన్మందకటాక్షలబ్ధ విభవ బ్రహ్మేంద్రగంగాధరామ్ ।**
**త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందే ముకుందప్రియామ్॥**

తా : భాగ్యానికి ఆలవాలమైనదీ, క్షీరసముద్రరాజ తనయా, శ్రీరంగంలో వెలసిన

దేవీ, దేవలోకస్త్రీల నందరినీ దాసీజనంగా చేసుకొన్నదీ, లోకానికి ఏకైక దీపంగా భాసిస్తున్నదీ, ఎవరి మృదుల కటాక్షంతో బ్రహ్మ ఇంద్రుడు గంగాధరుడు వైభవం సంతరించుకొన్నారో, మూడు లోకాలను తన కుటుంబంగా చేసుకొన్నదీ, తామర కొలనులో ఉద్భవించినదీ, మహావిష్ణువుకు ప్రియాతిప్రియమైనదానవైన నీకు నమస్కారం చేస్తున్నాను.

**14. సిద్ధలక్ష్మీ ర్మోక్షలక్ష్మీ ర్జయలక్ష్మీ స్సరస్వతీ ।**
**శ్రీర్లక్ష్మీ ర్వరలక్ష్మీ శ్చ ప్రసన్నా మమ సర్వదా ॥**

తా : తలచిన మాత్రాన నెరవేర్చే సిద్ధ లక్ష్మిగాను, ముక్తిని అనుగ్రహించగల మోక్షలక్ష్మిగాను, విజయాన్ని సిద్ధింపచేసే జయలక్ష్మిగాను, పద్మాకాసారంలో ఉద్భవించినదీ, సంపదలనిచ్చే శ్రీదేవిగాను, వరాలు ప్రసాదించగల వరలక్ష్మిగాను, విరాజిల్లుతూన్న నువ్వు సదా సర్వవేళలా నాకు ప్రసన్నురాలవుగా ఉండుగాక !

**15. వరాంకుశౌ పాశమభీతి ముద్రాం కరైర్వహం తీం కమలాసనస్థామ్।**
**బాలార్క కోటి ప్రతిభాం త్రినేత్రాం భజేఽహమంబాం జగదీశ్వరీం త్వామ్॥**

తా : వర అభయ ముద్రలు చేత దాల్చినదీ, పాశ అంకుశాలను చేత ధరించినదీ, పద్మ నివాసినీ, కోటి బాలసూర్యుల ప్రకాశం గలదీ, మూడు కన్నులు గలదీ, ఆదిశక్తీ, జగదీశ్వరీ అయిన అమ్మెను నేను స్తుతిస్తాను.

**16. సర్వమంగలమాంగల్యే శుభే సర్వార్థ సాధకే ।**
**శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోఽస్తుతే ॥**
**నారాయణి నమోఽస్తుతే ।**
**నారాయణి నమోఽస్తు తే ॥**

తా : మంగళాల కల్లా మంగళకరమైన దానవు, మంగళం ప్రసాదించేదానవు, సకల శుభాలను సాధించి ఇచ్చేదానవు, శరణు పొందడానికి యుక్తమైన దానవు, మూడు కన్నులున్న దానవు అయిన దేవీ! నారాయణీ నీకు నా నమస్కారము.

**17. సరసిజనిలయే సరోజహస్తే**
**ధవళ తరాం శుక గంధమాల్యశోభే ।**
**భగవతి హరివల్లభే మనోజ్ఞే**
**త్రిభువన భూతికరి ప్రసీదమహ్యామ్ ॥**

తా : పద్మవాసినీ, చేత పద్మాన్ని ధరించినదీ, పవిత్రమైన తెల్లని వస్త్రాలను సుగంధపూరిత మాలను ధరించి శోభించేదానా, భగవతీ, హరి అర్ధాంగీ, కోర్కెల నెరిగి యీడేర్చుదానా, ముల్లోకాలను పోషించి కాపాడేదానవైన నువ్వు నన్ను అనుగ్రహించు.

**18. ఓం విష్ణుపత్నీం క్షమాం దేవీం మాధవీం మాధవప్రియామ్ ।**
**విష్ణోః ప్రియసఖీం దేవీం నమామ్యచ్యుతవల్లభామ్ ॥**

తా : విష్ణుపత్నీ, భూదేవీ, తులసి మొక్కగా అలరారుతున్నదీ మాధవుని ప్రియురాలూ, విష్ణువు ప్రియసఖీ, విష్ణువుతో కూడిన దేవీ, నేను నమస్కరిస్తున్నాను.

**19. ఓం మహాలక్ష్మీ చ విద్మహే విష్ణుపత్నీ చ ధీమహి ।**
**తన్నో లక్ష్మీః ప్రచోదయాత్ ॥**

తా : మహాలక్ష్మిని తెలుసుకొందాం. విష్ణుపత్నియైన ఆమెను అందుకై ధ్యానిద్దాం. ఆలక్ష్మీదేవి మనలకు ప్రేరణ నిచ్చుగాక.

**20. శ్రీవర్చస్యమాయుష్యమారోగ్య మావిధాత్ పవమానం మహీయతే।**
**ధనం ధాన్యం పశుం బహుపుత్రలాభం శతసంవత్సరం దీర్ఘమాయుః।**
**ఋణ రోగాది దారిద్ర్యపాపక్షుదప మృత్యవః ।**
**భయశోకమనస్తాపా నశ్యంతు మమ సర్వదా ॥**

తా : మహాలక్ష్మీ! వర్చస్సు, లోటులేని జీవితం, మంచి ఆరోగ్యం నాకు ప్రసాదించే పవనాలు సదా సర్వవేళలా వీచనీ, ధనధాన్యాలు, పశుసంపద, పుత్రులు, నూరేళ్ళ దీర్ఘాయుస్సు నాకు చేకూరనీ. ఋణం, రోగం, పాపం, దారిద్ర్యం, ఆకలి, అకాల మరణం, భయశోకాలు, మానసిక వ్యధలు ఇత్యాదులు నశించుగాక.

**21. శ్రియే జాత శ్రియ ఆనిర్యాయ శ్రియం వయో జరితృభ్యో దధాతు । శ్రియం వసానా అమృతత్త్వమాయన్ భజంతి సద్యః సవితా విదధ్యాన్ ॥**

తా : శ్రీదేవి చేరే వారిని ఐశ్వర్యం వరిస్తుంది. సంపద దీర్ఘ ఆయుస్సు చేకూరుతుంది. వారు ఐశ్వర్యంలో తులతూగుతూ మరణం లేని స్థితికి చేరుకొంటారు. సత్వరమే వారు కీర్తిని, విజయాన్ని పొందుతారు.

22. శ్రియ ఏవైనం తచ్ఛ్రియామాదధాతి ।
సంతతమృ చా వషట్ కృత్యం సంధత్తం
సంధీయతే ప్రజయా పశుభిః । య ఏవం వేద ॥

తా : మంచివి అన్నీ లక్ష్మీదేవియే - ఇలా తెలుసుకొన్నవాడు లక్ష్మీదేవిని చేరుకొంటాడు. మంత్రయుక్తంగా ఎల్లప్పుడూ యాగం చేయాలి. అలా చేసేవాడికి పుత్ర సంపద, పశుసంపద లభిస్తుందని గ్రహించాలి.

23. ఓం మహాదేవ్యై చ విద్మహే విష్ణుపత్నీ చ ధీమహి ।
తన్నో లక్ష్మీః ప్రచోదయాత్ ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః॥

తా : మహాదేవియైన లక్ష్మీదేవిని తెలుసుకుందాం. విష్ణుపత్నియైన ఆమెను అందునిమిత్తం ధ్యానిద్దాం. ఆ లక్ష్మీదేవి మనలకు ప్రేరణనిచ్చుగాక.

శ్రీరామకృష్ణప్రభ - 5/2001-12

24. ఓం తచ్ఛం యోరా వృణీమహే । గాతుం యజ్ఞాయ
గాతుం యజ్ఞపతయే । దైవీ స్వస్తిరస్తు నః । స్వస్తిర్మానుషేభ్యః।
ఊర్ధ్వం జిగాతు భేషజమ్ । శన్నో అస్తు ద్విపదే । శం చతుష్పదే॥

ఓం శాంతిః శాంతిః శాంతిః

25. బ్రహ్మ భూర్భువస్సువరోమ్
నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి।
తన్నో విష్ణుః ప్రచోదయాత్॥

26. ఆకాశా త్పతితం తోయం యథా గచ్ఛతి సాగరం,
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి.

27. ఆవాహతేభ్య స్సర్వేభ్యో దేవేభ్యో నమః,
సువర్ణ దివ్య మంత్రపుష్పం సమర్పయామి.

పై శ్లోకమును చదువచూ పుష్పములను, అక్షతలను అర్చితమూర్తి పాదముల చెంతనుంచవలయును.

**28. యానికాని చ పాపాని జన్మాంతర కృతాని చ తాని తాని ప్రణ శ్యంతి ప్రదక్షిణ పదేపదే పాపోఽహమ్ పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః త్రాహిమాం కృపయాదేవ శరణాతవత్సల అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ తస్మాత్కారుణ్య భావేన రక్ష రక్ష జనార్దన - అష్టాంగనమస్కారము చేయదగును.**

ఈ శ్లోకము చదువుచూ ప్రదక్షిణ చేయాలని కొందరు, కూడదని కొందరు. ఓం శ్రీకృష్ణాయనమః అత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి, ఛత్రం అచ్ఛాద యామి, చామరం వీజయామి, నృత్యందర్శయామి, గీతం శ్రావయామి, అందోళి కామారోహయామి, అశ్వానారోహయామి, గజానారోహయామి, సమస్త రాజోప చార, శక్త్యుపచార, భక్త్యుపచార, మంత్రోపచార, దైవోపచార, సర్వోపచా రాన్ సమర్పయామి.

**యస్యస్మృత్యాచ నామోక్త్యా తపః పూజాక్రియాదిషు, న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే తమచ్యుతం, మంత్రహీనం క్రియా హీనం భక్తిహీనం (శక్తిహీనం) జనార్దన, య త్పూజితం (యత్కృతంతు) మయాదేవ పరిపూర్ణం తదస్తుతే ॥**

**అనయా ధ్యానా వాహనాది షోడశోపచార పూజయా చ భగవాన్ సర్వాత్మకః ... సుప్రీతః సుప్రసన్నో వరదో భవతు.**

**(అక్షతలు నీరు కలిపి పళ్ళెములో విడువవలెను)**

**ఓం యదక్షర పదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్ ।**
**తత్సర్వం క్షమ్యతాం దేవ ! నారాయణ నమోఽస్తుతే ॥**

తా : (అధ్యయనము చేయునపుడు) ఏ అక్షరముగాని పదములు గాని తప్పి దములైనను, మాత్రలు భంగమైనను, వాటినన్నిటిని ఓదేవా ! నారాయణా! క్షమింపుము. నీకు నమస్కారము.

**మధ్యే మంత్ర తంత్ర స్వర వర్ణ లోప దోష ప్రాయ శ్చిత్తార్థం, విష్ణోర్నామత్రయ మంత్ర జపం కరిష్యే.**

**(అంగుష్ఠ అనామికలతో జలమును తాకదగును)**

**కేశవాయ నమః నారాయణాయ నమః మాధవాయ నమః**
**కేశవనారాయణ, మాధవకేశవనారాయణ, మాధవేభ్యోనమః**
**ఓం తత్స ద్బ్రహ్మార్పణమస్తు.**

**అపరాధ సహస్రాణి, క్రియంతే ఽహర్నిశం మయా ।**
**దాసో ఽయమితి మాం మత్వా, క్షమస్వ పరమేశ్వర ॥**

శ్రీమత్ మహానైవేద్యం సమర్పయామి. కర్పూరానంద నీరాజనానంతరం సాక్షాత్ దీపం దర్శయామి. దీపదర్శనానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి. అచ మనము చేయదగును.

**ఓంసర్వే ఽత్ర సుఖినస్సన్తు। సర్వే సన్తు నిరామయాః ।**
**సర్వే భద్రాణి పశ్యన్తు । మా కశ్చి ద్దుఃఖ మాప్నుయాత్ ॥**

తా : ఈ ప్రపంచమున నందఱును సుఖమునే పొందుదురుగాక । సర్వులును దుఃఖరహితు లగుదురు గాక ! శుభములనేగాంచుదురుగాక ! ఒకడే ని క్లేశముల నొందకుండునుగాక !.... స్వస్వరూపనంధానము - 54.

**కాయేన వాచా మనసేంద్రియై ర్వా,**
**బుద్ధ్యా ఽ ఽత్మ నావా ప్రకృతేః స్వభావాత్**
**కరోమి యద్యత్ సకలం పరస్మై**
**నారాయణాయేతి సమర్పయామి.**

తా : మనోవాక్కాయముల చేతను, ఇంద్రియముల చేతను, బుద్ధి చేతను, ప్రకృతి స్వభావము చేతను, నేను చేయుచున్న పనియంతయు శ్రీమన్నారాయణమూర్తికి సమర్పించుచున్నాడను.

**శ్రీమతే నారాయణాయ గోవిందాయ నమోనమః ।**
**కృష్ణాయ రుక్మిణీశాయ వాసుదేవాయ మంగళమ్ ॥**
**శ్రియః కాంతాయ కల్యాణ నిధయే నిధయే ఽర్థినామ్ ।**
**శ్రీవేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥**

దేవతా ప్రసాదం శిరసా గృహ్ణామి - (అనుచు అర్చితమూర్తిని అర్చించిన పూజా క్షతలు తన శిరస్సుపై నుంచుకోవలెను)

**ఏతత్ పూజాఫలం శ్రీకృష్ణపరబ్రహ్మార్పణమస్తు (అంటూ జపాంతమున అర్ఘ్య**

పుష్పాదులచే అర్చించిన, అర్చితమూర్తి ఉపాసనాదైవము యొక్క దక్షిణహస్త మందు ఉద్ధరిణితో జలమును విడుస్తూ జపఫలమును సమర్పించ వలెను. అనంతరము ఒక ప్రాణాయామము చేయవలెను.)

భగవద్విగ్రహమును పూజించిన తులసీదళములలో ఒకటి తీసుకొని వాసన చూచి కుడి చెవియందు ధరించవలెను.

ఈ 'నిత్యానుష్ఠాన చంద్రిక' పారాయణ అనుష్ఠానఫలము అందరూ నిష్కామ కర్మయోగులై తరింతురుగాక! ఇదియే మన భారతీయ అర్ష సంప్రదాయము.

కావుననేమన భారతీయ అర్ష సాంప్రదాయమున గ్రంథపఠనానంతరము లేక పూజ దైవారాధనానంతరము ఒక శ్లోకమును పఠింతురు. ఆ శ్లోకముతోనే నేనీ "నిత్యానుష్ఠాన చంద్రిక" పూర్వభాగమును సంపూర్ణము చేయుచున్నాను.

**స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం,**
**న్యాయేన మార్గేణ మహీం మహీశాః,**
**గో బ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యమ్,**
**లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు.**
**కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్య శాలినీ,**
**దేశోయం క్షోభరహితః బ్రాహ్మణా స్సంతు నిర్భయాః.**
**అపుత్రాః పుత్రిణ స్సంతు**
**పుత్రిణస్సంతు పౌత్రిణః**
**అధనాస్సధనా స్సంతు।**
**జీవంతు శరదాం శతం ॥**

మనము ఆచరించిన "నిత్యానుష్ఠాన చంద్రిక" పారాయణ అనుష్ఠాన ఫలముచేత సమస్త ప్రజలకు క్షేమము కలుగుగాక ।

ఈ భూమిని పాలించు పాలకులు న్యాయమార్గముగ పాలింతురుగాక!
గోవులకును బ్రాహ్మణులకును నిత్యము శుభము కలుగుగాక!
సమస్త లోకములును సుఖమయములై యుండుగాక ।
సకాలమున వర్షములు కురియుగాక !
పృథివి సస్యశ్యామలమై యుండుగాక !
దేశమునందుపద్రవములు లేక శాంతి వర్ధిల్లుగాక !

బ్రాహ్మణులు భయరహితులై యుందురుగాక !
పుత్రులు లేనివారు పుత్రవంతులై పుత్రులకు పుత్రులుదయింపగా సర్వులును సంతసించి వంశవృద్ధి కలవారగుదురు గాక !
ధనములేనివారు భాగ్యవంతులగుదురుగాక !
అందరునూ దీర్ఘాయుష్మంతులగుదురు గాక !
ఇది భారతీయుల నిత్య ప్రార్థనము.

**ఓం సర్వేషాం స్వస్తిర్భవతు ఓం సర్వేషాం**
**శాన్తిర్భవతు ఓం సర్వేషాం పూర్ణం భవతు.**

ఓం శాన్తిః శాన్తిః శాంతిః

**నారాయణ! నారాయణ! నారాయణ! ఓమ్**

హరిః ఓమ్ తత్ సత్ ఓమ్

తీర్థమును తాను (పూజచేసినవారు) సేవించి యితరులకు యివ్వవలెను.

**అకాల మృత్యు హరణం సర్వ వ్యాధి నివారణమ్।**
**సర్వ పాపక్షయ కరం కృష్ణ పాదోదకం శుభమ్.॥**

తీర్థమును ఉద్ధరిణతో ఎక్కువగా కాకుండ కొంచెముగా మూడు పర్యాయములు తీసికొనవలయును.

## ఉద్వాసన మంత్రము

భగవ ద్విగ్రహములకు ప్రతిదినము అవాహన, ఉద్వాసనము చెప్పవలయును. మంత్రమునకు ముందుగా ఆచమనము, తదుపరి చేయదగును.

**ఓం భవన్మంత్రమూర్తే స్వపద,**
**మాసాదయ క్షమస్వ క్షమస్వ నమోనమో.**

నివేదన చేసిన నైవేద్యమునుండి కొంచెము అన్నము, కూర, పాలు, వెన్న చిన్న పళ్ళెములోనికి తీసి, దానిని కాకులకు సమర్పించవలయును. కాకి కాహారమిడిన సత్కార్యమగును. పుణ్యము లభించును.

నీవు కూర్చున్న చాప, జింక చర్మము, వస్త్రము నీవే తీసి భద్రపరచు కొనవలయును. ఎందువలన? వేరొకరు ఆపని చేసిన నీవు సంపాదించుకున్న పుణ్యములో కొంత వారికి చెందును గనుక. మడిబట్టలు మార్చుకుని చాకలి ఉతికిన బట్టలు ధరించవలయును.

శ్రీమతే రామానుజాయ నమః

# నిత్యానుష్ఠానచంద్రిక
## (ఉత్తరభాగము)

అల్పాహారము, పాలు, భోజనము చేయుటకు ముందుగా శ్రీ భగవద్గీతలోని ఈ క్రింది రెండు శ్లోకములు చదువుట చాలా మంచిది.

**1. బ్రహ్మార్పణం బ్రహ్మ హవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్,**
**బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మ కర్మ సమాధినా.**
**బ్రహ్మమయ మగ్ని : ద్రవ్యమ్ము బ్రహ్మమయము**
**బ్రహ్మయును, హోమమున గూడ బ్రహ్మమయము,**
**బ్రహ్మ కర్మ సమాధిచే బడయదగిన**
**వాడునుం గూడ బ్రహ్మమే పాండు పుత్ర.**

తా : అర్పణము సేయుట యను క్రియ బ్రహ్మము, హవిస్సు (అనగా అర్పింప బడు ద్రవ్యము) బ్రహ్మము : బ్రహ్మాగ్నియందు బ్రహ్మచే హోమము చేయబడునది బ్రహ్మము. ఈరీతిగ కర్మము అంతయు బ్రహ్మమయమని దృఢ బుద్ధి గలవారు బ్రహ్మమునే పొందుదురు. గీత 4/24

**2 అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః,**
**ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్.**
**ప్రాణము, నపానమును గూడి పాండుపుత్ర !**
**నన్ని ప్రాణుల దేహమ్ము నాశ్రయించి**
**వారుదిను ; నాల్గు తెగల నాహారములను**
**జీర్ణమొనరించు చుందును జిత్రముగను.**

తా : నేను అన్ని ప్రాణులయొక్క శరీరమును ఆశ్రయించి వైశ్వానరుడనను భావమును పొంది ప్రాణము అపానమునను వాయువులతో గలిసి వారు భుజిం చిన నాలుగు విధములయిన యాహారమును అనగా భక్ష్యభోజ్య చోష్య లేహ్య ములను జీర్ణము చేయు చున్నాను.

శంకరాచార్యులు - చతుర్విధాహారములేవనగా - భక్ష్యము = పిండివంట, భోజ్య ము = అన్నము, కూరలు, చోష్యము = జుర్రదగినది, లేహ్యము = నాకదగినది.
రామానుజాచార్యులు : చతుర్విధాహారము లేవనగా - ఖాద్యము = నమల

దగినది, చోష్యము = పాయసాదులు, లేహ్యము = పచ్చడి : పేయము = త్రాగదగినది. గీత 15/14

## 66. అన్నమును మంత్రపూర్వకముగా శుద్ధినిచేసి భోజనము చేయుట.

కాళ్ళు చేతులు పరిశుభ్రంగా కడుగుకొని భోజనము చేయుటకు కూర్చుండ వలయును. కాళ్ళతడి ఆరకుండా భోజనము చేయవలయునని, కాళ్ళ తడి ఆరిన తరువాతనే పరుండవలయునని పెద్దలు అంటారు. ఒకే వస్త్రమును ధరించి భుజించరాదు. తలపాగను తీసి భుజించవలెను. భోజనము చేయు ప్రదేశమందు గోమయము చేత గుండ్రముగ నలికి ముగ్గునువేసిదానిపైన ఆకునువేసి అన్నమును వడ్డించవలయును. పిమ్మట భోజనమయిన తరువాత మరల యీవిధముగా గోమయముతోనలికి ముగ్గును వేయవలెను. అట్లు చేయుటవలన భువి యందున్న సకలదోషములు హరించును. అందువలన అగృహమునందు లక్ష్మీదేవి ఎల్లప్పుడును నివాసము చేయుచుండును.

**భోజనవిధి :** అయురభివృద్ధిని కోరువాడు సర్వదా తూర్పుముఖుడై భుజింప వలయును. సంపత్కాముడు పశ్చిమాభిముఖుడై, కీర్తిని కోరువాడు దక్షిణాభి ముఖుడై భుజింపవలయును. ఉత్తరాభిముఖుడై ఎన్నడును భుజింపకూడదు. పుత్రవంతుడగువాడు స్వగృహమున నెల్లప్పుడును దక్షిణాభిముఖుడైయ్యే భుజించవలయును. ఇదియునుగాకపండితుడైనవాడు సోమవారదినమునందు అభ్యంగనము చేసికొనగూడదు.

**పంక్తి భోజన నిర్ణయము :-** ఉత్తముడు స్వబంధువులతోనైనను ఏకపంక్తియందు కూర్చుండి భుజింపకూడదు. కారణమేమనగా రహస్యముగా నెవడే పాతకమును చేయునో ఎవరికీ తెలియదు. కాబట్టి అపంక్తియందు అట్టి దుర్మార్గుడు కూర్చుండి యుండిన వానియొక్క పాపమంతయును అపంక్తి నున్నవారందరికిని చెందును. అందువలన ఒకరొకరి మధ్యను ఉదకమో, తృణమో, భస్మమో, దారమో లేక మార్గమో కలిగియున్నయెడల పంక్తిదోషము లేకపోవును. అందు వలననే పంక్తిలో కూర్చున్న వెంటనే విస్తరాకువేసి గ్లానుతో నీరు పెట్టుట. భోజనమునకు ముందు, వెనుక గోవిందనామస్మరణ చేయవలయును. పంక్తిలో భోజనము చేస్తూండగా, ఎవరిమట్టుకువారు తనభోజనము పూర్తయినది కదాఅని మధ్యలోలేచి పోరాదు. వేచియుండవలయును.

**దేవతార్చనచేయు కారణము :-** దివారాత్రములు దేవునికి ఆరాధన మొనర్చినవెనుక

పిల్లలు పెద్దలు మొదలగువారు భోజనము చేయవలయును గాని అంతకు ముందు చేయకూడదు. ఎందుకనగా ఒక్కొక్కపదార్థమునందును జీవుడున్నాడు. ఆపదార్థములను కోసి వంటచేయుటచే దోషము వచ్చుచున్నది. కాన ఆ పదార్థ ములను శ్రీకృష్ణపరమాత్మకు అర్పణము చేసిన యెడల ఆదోషము నివారణ మగును.

**మౌనము :- "స్నానేచ భోజనే హోమే జపే మౌనముపాశ్రయేత్ "** స్నానము, భోజనము, హోమము, జపము చేయునప్పుడు మౌనము పాటించవలయును అని అర్థము.

స్నానము చేయుట మొదలు షోడశోపచారములతో దైవారాధన ముగించు వరకు మౌనముద్ర వహించుట చాలామంచిది - మాయకు, పరవిద్యకు, స్వామి, మౌనధ్యానయోగంబులు గలవాడు మాధవుడు. నామసంఖ్య 169 అని చెప్తోంది విష్ణు సహస్రనామస్తోత్రము.

మాయ శ్రీకృష్ణపరమాత్మకు వెనుక తట్టున వుంటుంది.

గీత 7/14 దైవీహ్యేషా.........మాయామేతాం తరంతి తే.

తా : ఇది మోహిక యను మాయ. ఇది సృష్ట్యాది క్రీడ మొదలగునవి కల దేవు నిది. కాన శక్తి వలన దాట శక్యము కానిది. మిగిలినవాని నంతయు విడిచి నన్నే ఎవరు సేవించుచున్నారో, గురువు మొదలగు వారికి చేయు వందనముల గూడ నా యందె సమర్పించుచున్నారో, భగవంతుడె వారి యందున్నవాడై గురువు మొదలగువారు అగుచున్నాడని తెలిసికొనుచున్నారో, వారిచే దాట దగినది.

భాగవతము 2-5-19

**కార్యకారణ కర్తృత్వే ద్రవ్య జ్ఞాన క్రియాశ్రయాః ।**
**బధ్నన్తి నిత్యదాముక్తం మాయినం పురుషం గుణాః ॥**

తా : పూర్తిగ ముక్తుడైనను మాయా ముగ్ధడగు పురుషుని కార్యకారణ కర్తృత్వాభి మానమున ద్రవ్యజ్ఞానక్రియలు నాశ్రయించిన త్రిగుణములు బంధించుచున్నవి.

వివరణము :- అందువలన గుణములు భగవానుని తటస్థ శక్తి వృత్తిరూపుడగు జీవుని బంధించును. తటస్థ శక్తి భూతుడగుటవలన నిత్యముక్తుడగు జీవున కనాది బహిర్ముఖత్మము ఉన్ముఖత్వము రెండునూ ఉండును. **మాయ భగవానునకు వెనుక నుండును.** అందువలన భగవానునకు వెనుక భాగమున నున్న జీవునితో మాయకు సాంగత్య ముండుట సంభవమే.

అందువలన అధి భూతము, అధ్యాత్మము, అధిదైవము నను వాని కర్తృత్వము నందు మహాభూత ద్రవ్యము దేవతారూపజ్ఞానము, ఇంద్రియరూపక్రియ కాశ్రయ స్వరూపము లగు గుణములు తత్తభిమానములద్వారా అధి భూతములై మాయా ముగ్ధతారహిత తటస్థ (స్వరూపావస్థయందు మాయాముగ్ధతారహిత) జీవుని బంధించును. మనము శ్రీకృష్ణనామామృతమును గ్రోలుచున్నంతసేపూ మాయ మనలనేమీ చేయలేదు. సంకీర్తన, లేదా ధ్యానము ఆగగానే ఏవేవో ఆలోచనలు, అలజడులు మనల్ని చుట్టిముట్టి చంచలమైన మనసు (మాయ) మనలనెక్కడికో దూరతీరాలకు యీడ్చుకొనిపోయి మాయలో ముంచుతుంది. మునుగుతూ వుండగా తెలియదు. పూర్తిగా మునిగిన తరువాతగాని తెలియదు. అందుకే భగవంతుని సర్వకాల సర్వావస్థలలోను స్మరణ చేయాలని భాగవతములోని ప్రహ్లాద చరిత్ర చెప్తోంది.

"విపద్విస్మరణం విష్ణుః - సంపన్నారాయణ స్మృతిః ".

అనగా నారాయణుని మరచిపోవడమే ఆపద, నారాయణుని స్మృతిపథంలో స్మరించడమే సంపద అంటోంది శాస్త్రం. అందుకనే పూజ సంపూర్ణమయ్యేవరకు భగవంతుని మౌనంగా స్మరించమంటోంది శాస్త్రం. అందుకోమార్గముంది. అది స్నానము చేస్తూ, మందారపువ్వులు కోస్తూ, తులసీదళములను గ్రహిస్తూ, మడిబట్టలు ధరిస్తూ, ఊర్ధ్వపుండ్రధారణ, శ్రీచూర్ణమును ధరిస్తూ చాపపైన జింక చర్మము, దానిపై శ్వేతవస్త్రము పరుస్తూ, దీపములను వెలిగిస్తూ, పూజ ప్రారంభించే వరకు (సుమారు ఓగంటకాలము) శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రము, నామావళి, గీతలోని శ్లోకాలు మననము చేస్తూ వుండాలి. అయితే ఇవి కంఠస్థం చేసియుండాలి. అప్పుడు మనమనసు మన చెప్పు చేతల్లో వుంటుంది. పరమాత్మయందు మనసు లగ్నమవుతుంది. చేసిన పూజఫలిస్తుంది. ఈవిధంగా నియమ, నిష్ఠలతో నిత్యానుష్ఠానము చేయవలయునన్న మన ఆరోగ్యము బాగుండాలి. మనదేహారోగ్యము బాగుపడవలయునన్న భారతీయ శాస్త్రము బ్రాహ్మముహూర్తము (సుమారు గం. 4-32 నిముషములు)న నిద్రలేవవలసినదని విధించినది. ఈవిధిని నిర్వర్తించని వారికి కలుగునది పాపమే. పాపఫలము రోగరూపమున వ్యక్తమగును. ఉదయాస్తమయ కాలముల నిద్ర చెందుట చేత పిప్పిగోళ్ళులేక చర్మవ్యాధులు కూడ వచ్చునని కర్మపరి పాక శాస్త్రము చెప్తోంది.

పాపమును గురించి భక్తి నివేదన 10/2001-18 ఏమంటుందో చూద్దాం.

"పూర్వజన్మ కృతం పాపం వ్యాధి రూపేణ బాధతే" (పీడితః) అన్నట్లు పూర్వ జన్మలో మనం చేసిన పాపమే వ్యాధిగామారి మనల్ని బాధిస్తుంది, పీడిస్తుంది.

మనం అనుభవించే వ్యాధులు - పాపఫలములు. వ్యాధులు నశించవలె నంటే పాపములు నశించాలి. దానికి భగవదనుగ్రహం కావాలి. అందుకే తైత్తరీయ బ్రాహ్మణంలోనే పాపములు పోవటానికి భగవంతుణ్ణి ప్రార్థించే మంత్రాన్ని ఇలా వివరిస్తోంది వేదమాత.

" సంపృచః స్థ సంమా భద్రేణ పృంక్త । విపృచఃస్థవిమా పాప్మనాపృంక్త"

ఓదేవతలారా । తైత్తరీయోపనిషత్తు చెప్పినట్లు భగవదంగ భూతులై పరమాత్మ శరీరములై సంయుక్త రూపులైయున్నారు. కావున మాకు శ్రేయస్సును ప్రసాదిం చండి. ఓదేవతలారా మీరు దైవాజ్ఞను అనుసరించి వేరువేరు నామరూపము లను, శక్తులను కలిగి వేరువేరు ఫలాలనిస్తూ వియుక్తరూపులైయున్నారు. కావున నన్ను పాపము నుండి వేరు చేయండి. (నా పాపమును తొలగించండి) అని. ఇలాంటి ప్రార్థననే కులశేఖరాళ్వారుతమ ముకుందమాలలో

"శ్రేయః ప్రాప్తి కరౌషధం పిబ మనః శ్రీకృష్ణ దివ్యౌష ధమ్ "

ఓమనసా ! (సంపత్ప్రదంబు) శ్రేయస్సు కలుగజేయు శ్రీకృష్ణనామమునే దివ్యౌ షధాన్ని సేవించు అని దాని అర్థం. కులశేఖరులే మరొకచోట ' నిరామయం కృష్ణరసాయనం పిబ ' అని భగవన్నామం సర్వరోగహరమంటారు. పాపమే దుః ఖానికి మూలము. అందుకే మనము ఔషధసేవ చేసేటప్పుడు,

"శరీరే జర్జరీ భూతే వ్యాధిగ్రస్తే కలేబరే ।
ఔషధం జాహ్నవీ తోయం వైద్యో నారాయణోహరిః "

అనే శ్లోకాన్ని అనుసంధిస్తూ లోపలికి ఔషధాన్ని పుచ్చుకోమని చెబుతారు. నిజమైన వైద్యుడు నారాయణుడే. ఆయనే రోగాల బారినుండి రక్షిస్తాడు.

భక్తినివేదన 10/2001=18

ఇప్పుడు భోజనము చేయుటకు కూర్చుని ఆచరించు విధులు తెలుసు కుందాము.

"అన్నమ్ న నింద్యాత్ - తద్వ్రతమ్, అన్నమ్ న పరిచక్షీత - తద్వ్రతమ్
అన్నమ్ బహుకుర్వీత - తద్ వ్రతమ్.

దీని అర్థం ఏమిటంటే - ఆహారాన్ని నిందించి అసహ్యించుకోరాదు. ఆహారాన్ని

పారెయ్యరాదు. వృధాచేయరాదు. అహారాన్ని మరింతగా పండించాలి. (తయారు చేయాలి) శ్రీరామకృష్ణ ప్రభ - 1/2003 తైత్తిరీయోపనిషత్తు - 174

ఎప్పుడును అన్నమును దూషింపరాదు. అన్నము పరబ్రహ్మస్వరూపము. కలి యుగ మానవులు అన్నగతప్రాణులు. కూర్చుండి అన్నమును చూచిన తోడనే భక్తితో నమస్కరించి దోసిలియొగ్గి " ఈ అన్నము మాకెప్పుడూ లభించుగాక " అని మనసులో తలంచవలయును. అన్నము, కూరలు పిండి పదార్థములు, నెయ్యి విస్తరిలో వడ్డించిన తరువాత, ఎడమప్రక్క నీటితో నింపిన గ్లాసు (చెంబు) తీసికొని, కుడిచేతిలో కొంచెము నీటిని విడుచుకొని " ఓం భూర్భువ స్సువః, తత్స వితుర్వరేణ్యమ్, భర్గో దేవస్య ధీమహి, ధియో యోనః ప్రచోదయాత్ " అనెడి యీ నాలుగు మంత్ర వాక్యములు పఠించి, ఆ ఉదకమును విస్తరిలో వడ్డించిన అన్నము శుద్ధియగుటకై చల్లి, మరల కొంచెము జలమును కుడి చేతియందు తీసికొని "సత్యంత్వర్తేన పరిషించామి" (పగటి భాగమందైన) అనుచు నా ఉదకమును విస్తరి చుట్టును సవ్యముగ విడిచి, మరల కొద్దిగానీరు చేతిలో వుంచుకుని "అమృతమస్తు" అనుచు నా ఉదకమును లోనికి పుచ్చు కొనవల యును. వెనుక అన్నముపై మరల కొంచెము నెయ్యిని వేసికొని ఆనేతితో తడసిన అన్నమును పెద్దవ్రేలును (బొటనవ్రేలు) నడిమివ్రేలును, పవిత్రపువ్రేళ్ళతో కలిపి నాలుగయిదు మెతుకులను మాత్రమెత్తుకుని "ఓం ప్రాణాయస్వాహా, ఓం అపా వాయస్వాహా, ఓం వ్యానాయ స్వాహా, ఓం ఉదానాయ స్వాహా, ఓం సమానాయ స్వాహా, ఓం బ్రహ్మ ఓం బ్రహ్మణే స్వాహా " అనెడి యీ ఆరు మంత్రవ్యాకములను యొక్కొక్క పర్యాయమొక్కొక్క వాక్యమును చెప్పుచు నోరుతెరచి ఒక్కొక్క పర్యాయము అయిదారు మెతుకులను పండ్లు తగులకుండ నోటియందు వేసుకొని మింగివేయవలయును. తరువాత పప్పును పదార్థములను కలిపి భోజనము చేయవలయును. పిమ్మట కొంచెము ఉదకమును కుడిచేతిలో విడుచుకొని "అమృతాపిధానమసి" అనుచు మంత్రవాక్యమును చెప్పి సగము జలమును పుచ్చుకొని " రౌరవే పుణ్యనిలయే, పద్మార్బుద నివాసినామ్ః అర్థినాముదకం దత్తం, అక్షయ్య ముపతిష్ఠతు" అను యీ శ్లోకమును పఠించుచు శేషించిన జలమును అపసవ్యముగా విస్తరి చుట్టును విడువవలయును. మరియు రాత్రులందు భోజనము చేయునపుడు కొంచె ముదకమును చేతిలో విడచుకొని "సత్యంత్వర్తేనపరిషించామి" అని చెప్పి అపసవ్యముగా విస్తరి

చుట్టను విడువవలెను. ఇట్లు పై చెప్పిన మంత్రవాక్యములను ఉచ్చరించి భుజించుటచేత (భుజించిన పదార్థములు అమృతములైనవి అనిశ్రుతి ప్రమాణము) శరీరారోగ్యము, బుద్ధి కుశలత, భూతదయ, భగవద్భక్తియందుప్రేమ, సత్సహవాసము మొదలగు సద్గుణములు కలిగి ఇహపరములందును సుఖించువాడగును.

విష్ణువే అన్న భోక్త : విష్ణువే అన్నం : విష్ణువే అన్న పరిణామం - అని నేను భుజించిన ఈ అన్నము సుఖంగా జీర్ణమౌతుందిగాక - అని తలంచవలయును.

విష్ణు పురాణం - 180

ఇదియేగాక చేసిన పాపములన్నియును నశించును. కనుక ప్రతిమానవుడు యిట్లు చేయక తప్పదు.

భోజనానంతరము ప్రక్షాళిత పాణి పాద వదనుండయి యాచమించుట యుక్తమను ధర్మమును కాంతాసమ్మితముగా నుపదేశించినాడు నన్నయ భారతమున - భోజనమైన తరువాత తూర్పు లేదా ఉత్తరాభిముఖంగా తిరిగి శుద్ధజలాలతో ముఖప్రక్షాళనం కావించాలి. ఉచ్ఛిష్ట నివారణార్థం నోరు పుక్కిలించి శుభ్రం చేసుకోవాలి. పాదాలను, మణికట్టుదాకా చేతులను కడుగు కొనాలి. అంతియేగాక ఆచమించవలెనని కూడా చెప్పినాడు. విష్ణుపురాణం - 180

భోజనము చేసిన కంచమును తొలిచిన నీళ్ళను చల్లు దిశలకు ఫలము యీవిధంగా వుంది. కంచమును కడిగి ఆ నీళ్ళను యింటికి తూర్పు భాగమున జల్లిన శుభము. ఆగ్నేయమున మానభంగము, దక్షిణమున మృత్యు భయము, నైఋతియందు రోగములు, పశ్చిమమందు సంపద, వాయవ్య మందు శత్రుత్వము, ఉత్తరమున ధనము, ఈశాన్యమున ఐశ్వర్యమును కలుగును.

**యదుహవా ఆత్మ సమ్మితమన్నం తదవతి తన్న హినస్తి ।**
**యద్భూయో హినస్తి తద్యత్కనీయో న తదవతి ॥**

తా : ఎంతఅన్నము దేహమునకు చాలునో, అంత అన్నము తన్ను రక్షించును. దానికన్న అధికముగా తిను అన్నము తనను భక్షించును. దానికన్న తక్కువయగు అన్నము దేహమును సంరక్షించదు. స్తోత్రమంజరి - 148

తగిన తిండి, తగిన నిద్ర, తగిన మెలకువ, తగిన వ్యాపారము గలవానికే యోగము సిద్ధించునని శ్రీమద్భగవద్గీత 6 అధ్యా-17వ శ్లోకం చెప్తుంది. "యుక్తాహార...

**అగస్త్యం కుంభకర్ణం చ శమ్యం చ బడబానలమ్ ।**
**ఆహారపరిణామార్థం : స్మరామి చ వృకోదరమ్ ॥**

అను శ్లోకమును భోజనము చేయగానే ధ్యానించినవారికి ఆహార పదార్థములు చక్కగా జీర్ణమై శరీరారోగ్యమును కలిగించును.

**అగస్త్యం వైనతేయం చ శమీం చ బడబానలమ్ ।**
**ఆహార పరిణామార్థం స్మరామి చ వృకోదరమ్ ।**

అను శ్లోకమును కూడా భోజనానంతరము ధ్యానించదగును. నిత్యపాదవచంద్రిక-11

"రౌరవే ఇ_పుణ్యనిలయే....దత్తం అక్షయ్య ముపతిష్ఠతు" అని పఠించుచు శేషించిన జలమును అపసవ్యముగా విస్తరి చుట్టు విడచిన ఈ ఎంగిలి నీరు పితృ లోకము చేరి వారి ఆకలి దప్పులను తీర్చును.

ఎవడు ఉత్తముడో, బ్రహ్మజ్ఞానము కలవాడో అట్టి బ్రాహ్మణునితో తద్దిన ములు పెట్టిన పితృదేవతలు తృప్తి పడుదురు. భూలోకములో జరిగిన ఒక్క సంవత్సరము పితృలోకములో ఒక్కరోజుతో సమానం. మనం సంవత్సరమునకు ఒక్కసారి పెట్టే ఆబ్దికము పైనున్న పితృదేవునకు రోజూ అందుతుంది. వారు తృప్తులైతే మనకు మంచి జరుగుతుంది. అన్యాయముగా సంపాదించిన ధన ముతో శ్రాద్ధము చేసినచో అది పితరులకు ముట్టదు. రాక్షసులకు చెందును. పితృదేవతల ఆశీస్సులు పొందినవాడు భూమియందు ఆయురారోగ్యైశ్వర్య ములతో సుఖపడును.

## 67. కలియుగ ప్రాశస్త్యము

శ్రీవిష్ణుపురాణమున కలియుగ ప్రాశస్త్యమును గూర్చి వివరించబడింది. శ్రీవేదవ్యాసమహర్షిచే - దాని సారాంశమును తిలకించండి.

ఒకప్పుడు కొందరు మహామునులకు కొన్ని సందేహములు కలిగెను. కలియు గంలో మహాఫలములు చిన్నచిన్న సత్కార్యముల చేతనే కలుగునందురు కదా! అది యెట్లు సంభవించునని సందేహించి ఆమునులు, బహుపురాణములు వ్రాసిన వ్యాసభగవానుని జూడబోయిరి. వ్యాసుడప్పుడు గంగలో స్నానము చేయుచుండెను. మునులు ఆయన స్నానము పూర్తియైన తరువాత అడగవచ్చునని గట్టుమీద కూర్చుండిరి. వారు చూచుచుండగా వ్యాసుడు "కలిస్సాధు, స్త్రియ స్సాధు, శూద్రస్సాధు" అనుచు మూడుసారులు గంగలో మునిగి బయటకు వచ్చెను.

1. బ్రాహ్మణులందరికి ప్రదక్షిణ నమస్కారములు చేసి కూర్చుండగా మునుల తనితో నిట్లనిరి". మీరు కలియుగము, కాంతలు, శూద్రులును ధన్యులని స్నానము చేయుచు అన్నారుగదా ! వాని తాత్పర్యమును వివరింపుడు". అంతట వ్యాసుడు, కృతయుగములో పదేండ్లు ఏకాగ్రతతో ధ్యానము (తపము) చేసినచో నారాయణుడు ప్రసన్నుడగును. త్రేతాయుగములో ఒక్కయేడు యజ్ఞములు చేసినచో ప్రసన్నుడగును. ద్వాపరయుగములో నెలరోజులు అహోరాత్రములు పూజించినచో ప్రసన్నుడగును. కలియుగ ములో భక్తితో ఒక్కనాడు కీర్తనము చేసినచో (కలౌ సంకీర్తనా న్ముక్తిః) మాధవుడు ప్రసన్నుడగును. మొదట చెప్పిన మూడు యుగములలో ఎంతో ప్రయాసపడినగాని స్వల్ప ఫలముగూడ కలుగదు. కాని అంతశ్రమ లేకుండ గనే ఎక్కువ ఫలము పొందవచ్చును గాన కలియుగము మంచిదన్నాను.

2 మనసుచేత, వాక్కుచేత, కర్మముచేత పవిత్రత గలిగి, తనభర్తను దైవముగా భావించి సేవించిన యిల్లాలు సులభముగా మోక్షము నొందును. క్రతు వులు గాని, జపములుగాని, తపములుగాని, వ్రతములు గాని యేమి చేయలేకపోయినను పతియందలి పరమభక్తితో శుశ్రూషలు చేయునామెకు ఉత్తమగతి కలుగును. అందుచే స్త్రీ జన్మము మంచిది అంటిని.

3 మరి, వేదాలు చదివి, యజ్ఞములు చేసి, దేవపూజలు చేసి, బ్రహ్మచర్యాదు లైన అశ్రమ ధర్మములను బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు పాటించవలెను. అందులో ఏమైన లోపములు గలిగినచో పుణ్యమునకు మారుగా పాపము కల్గును. అంత నియమముతో పై మూడు వర్ణములవారును ఆచరించి నచో ముక్తి కలుగును. శూద్రులకు అట్లుకాదు. వారు పాక యజ్ఞము (తాము వండుకొన్న దానిలో కొంత అతిథులకును, పెంపుడు జంతువుల వంటి వాటికిని, కాకులకును పెట్టుట) బ్రాహ్మణసేవ భక్తి శ్రద్ధలతో చేసినచో మంచిఫలమును బొంది సద్గతికి బోవుదురు. వారికి యజ్ఞములు, వ్రత ములు, ఉపవాసములు ఏమి చేయక పోయినను దోషము లేదు. చిత్త శుద్ధితో, దానధర్మములు, బ్రాహ్మణసేవ చేసినచో శూద్రాది వర్ణముల వారు ఉత్తమ గతిని పొందుదురు. అందుచేతనే శూద్రుడై పుట్టుట మంచిది అన్నాను. అని వారికి వివరించి చెప్పగా మునులు సంతోషించి వ్యాస భగవానునకు నమస్కరించి తమ ఆశ్రమములకు వెళ్ళిరి.

## 68. "న శూద్రా విష్ణు భక్తాశ్చ విప్రా భాగవతా స్మృతాః"

విష్ణు భక్తులు శూద్రులు గారు. విప్రులు భాగవతులు అని చెప్పుటచేనట్టి భక్తులను బ్రాహ్మణలయందు భాగవతులను జూచు దృష్టిచే జూడవలయునని అర్థము. ఇట్టి విష్ణుభక్తుల లక్షణమెట్టిదై యుండవలయుననిన

**మద్భక్త జనవాత్సల్యం, పూజాయాం చానుమోదనమ్।**
**మత్కథాశ్రవణే భక్తిః, స్వరనేత్రాంగ విక్రియా।**
**స్వయమారాధనే యత్నో, మదర్థే దంభవర్జనమ్।**
**మమాను స్మరణం నిత్యం, యచ్చమాం నోపజీవతి॥**
**భక్తిరష్టవిధా హ్యేషా, యస్మిన్మ్లేచ్ఛాపి వర్తతే।**
**స విప్రేంద్రో, ముని శ్రీమాన్, సయతి స్సచ పండితః।**
**తస్మై దేయం తతోగ్రాహ్యం సచ పూజ్యో యథాహ్యహమ్॥**

తా : 1 నా భక్తజనులయందు ప్రేమ, 2. పూజ చేయుట యందు సంతోషము, 3 నా కథలు వినుటయందత్యాంతానురాగము, 4 నా కీర్తనలు పాడుటయందు నన్ను గురించి చెప్పుటయందు డగ్గుత్తిక, దేహమునందు గగ్గురుపాటు, కన్నుల యందు ఆనందాశ్రువులు, 5. తానై నన్నారాధించుటయందు బ్రయత్నము, (పూజాద్రవ్యములు స్వయంకృషిచే సంపాదించి స్వహస్తముల బూజించుట), 6. నా నిమిత్తముగ దంభములేక (మెఱమెచ్చులకుగాదు) కార్యములు చేయుట, 7. ఎల్లప్పుడు నన్నే స్మరించు చుండుట, 8. నన్ను విడిచి జీవింపలేక యుండుట అనునీ యెనిమిది విధముల భక్తి మ్లేచ్ఛుని యందుండినను వాడే విప్రశ్రేష్ఠుడు, వాడేముని, వాడే శ్రీమంతుడు, వాడేయతి, వాడే జ్ఞాని, వాని నిమిత్తమై దాన మీయవచ్చును. వానిచే గ్రహింపవచ్చును. నావలె వాడును బూజ్యుడు. అని భగవద్వాక్యము. "నన్ను విడిచి జీవింపలేక యుండుట" యననేమి? ఈగుణము పరమ భక్తిని దెలుపుచున్నది.

**మయ్యేవ మన ఆధత్స్వ, మయి బుద్ధిం నివేశయ।**
**నివసిష్యసి మయ్యేవ, అత ఊర్ధ్వం న సంశయః॥** గీత 12/8

తా : నాయందే మనస్సుంచుము. బుద్ధి నాయందే నిలుపుము. మీదట నాయందె నివసించెదవు. ఇందుకు సందేహములేదు. అని అర్థము.

విషయములందు నేమాత్రమైన మనస్సును బోనీయక, సర్వకాల సర్వా వస్థలయందు నేయవయవముతో నేకార్యము చేయుచున్నను, మనస్సు బుద్ధి భగవంతునియందే యుంచవలయును. - అనగా ననన్యుడై, యనన్య శరణ్యుడై, యనన్యోపాయుడై, యనన్య ప్రయోజనుడై సర్వదాయుండవలయును. అనన్యుడు :- సూర్యునకు నెండ, చంద్రునకు వెన్నెల, సముద్రమునకు అల, అగ్నిహోత్రమునకు మిణుగురు నెట్లో యట్లె తాను భగవంతునంశమై విశేషణమై ధారణ పోషణములకు భగవంతునందే యాధారపడి తాను భగవంతుని వాడేగాని వేరుగాదను నభిప్రాయము గలవాడు.

**అనన్యశరణ్యుడు** :- భగవంతునికంటె దన్ను రక్షింపగలవాడు, తన్ను రక్షింపుమని కోరదగినయోగ్యుడు వేరొకడులేడని తలచువాడు.

**అనన్యోపాయుడు** :- తరించుటకు భగవంతుని కృపదప్ప వేరుపాయము లేదనువాడు.

**అనన్యప్రయోజనుడు** :- భగవత్ప్రాప్తి దప్ప వేరుఫలము కోరనివాడు. ఇట్టివాడు భక్తుడు. ఇట్టివాని భక్తి యనన్యభక్తి.

భగవదనుగ్రహము దప్ప వేరేదియు భక్తుడు కోరడు. కావుననది యెంత శీఘ్రముగా లభించునాయని తహతహ పడుచుండును. వీని తహ తహ పాటెట్టిదై యుండుననిన రామకృష్ణపరమహంస లిట్లు తమ శిష్యునకు దెలిపిరి.

శ్రీరామకృష్ణ పరమహంస శిష్యులలో నొకడు భగవద్విషయమై భక్తుని మనస్సెట్టిదై యుండునని ప్రశ్నించెను. ఆ శిష్యుని గంగకు స్నానార్థమై పిలుచు కొనిపోయి, గంగయందువాడు మునిగినప్పుడు శ్రీరామకృష్ణులవారు వాని నీళ్ళలో నట్లే నదిమెను. కొంతసేపు వాడు నీటిలో గిజగిజ తన్నుకొన్న తరువాత చేయి విడిచివాడు లేచిన తరువాత నీటిలో మునిగినప్పుడు నీ మనస్థితి ఎట్లుండెనని యడిగెను. ఎప్పుడీ ముప్పునుండి తప్పించుకొని బయట పడుదునా ఎప్పుడు గాలి పీల్చుదునా యనియుండెనని శిష్యుడు చెప్పెను. అట్టి పరితాపమే నీకు సంసార విషయమై యెప్పుడు కలుగునో, భగవత్కటాక్షమునకై తహతహ లాడుదువో అప్పుడు నీకు భక్తి కలదని యనుకొనుము అని చెప్పెను. - ఇది నిజమైన భక్తి లక్షణము దీనికే పరమభక్తి యని పేరు. ఇదియే యార్త ప్రపత్తి! ఇట్టిదశవచ్చువఱకు నెవ్వడు భక్తుడనపేర పిలువబడుటకు యోగ్యుడు కాడు.

" నిన్ను విడిచి సీతగాని వేనుగాని రామా ! నీటినుండి బయటవేసిన చేప

వలె కొంచెము కాలమైనను జీవింపజాలము " అని లక్ష్మణుడనెను. అట్టులే ఇది పరమభక్తి. ఇది పరమప్రేమ స్వరూపము.

**యన్ముహూర్తం క్షణం వాపి, వాసుదేవో న చింతితః ।**
**సాహాని స్తన్మహచ్ఛిద్రం, సాభ్రాంతి స్సా చ విక్రియా ।**
**ఏకస్మిన్న ప్యతిక్రాంతే, ముహూర్తే ధ్యాన వర్జితే ।**
**దస్యు భిర్ముషి తానేవ, యుక్త మాక్రంది తుం భృశమ్ ॥**

తా : వాసుదేవుని చింతింపని యొక ముహూర్తమైనను, క్షణమైనను గలిగెనేని యదియే ప్రాణహాని. అదియే మహా ఛిద్రము. అదియే భ్రాంతి. అదియే వికారము. అల్పకాలమైనను భగవధ్యానము లేక కాలమతిక్రమించెనేని దొంగ లచే సర్వస్వము దోచుకొని పోయినట్లు వెక్కివెక్కి యేడ్వవలయును. ఇది - పరమభక్తి లక్షణము - శబరి యెంతగొప్ప తల్లియో యెంత సాధించినదో తెలుపుటకుగాను నింతదూరము వ్రాయవలసి వచ్చినది - అని శ్రీమాన్ వావిలికొలను సుబ్బారావు గారు శ్రీవాల్మీకిరామాయణములో (అరణ్యకాండము) వివరించారు.

మాతా పితరుల బిడ్డలయందు గలుగు అనురాగము వంటి అనురాగము భగవంతునియందు కలుగగా అదివాత్సల్యము. స్నేహితునియందు గలుగు అనురాగమువంటి యనురాగము కలుగగా అది సఖ్యము. ప్రియునియందు ప్రియురాలికి కలుగు భావము వంటి రాగము భగవానునియందు కలుగగా అది మధురము. -- శ్రీకృష్ణునియందు యశోదకు కలిగినది వాత్సల్యభక్తి. గోపకుమారులకు శ్రీకృష్ణునితోటిగల సంబంధము సఖ్య భక్తి. గోపాంగనలకు భగవానునితోటిగల సంబంధము మధురభక్తి.

ఈ మధురభక్తికే ప్రేమభక్తియని పేరు. ఈమధుర భక్తియందు జీవుడు నాయకి కాగా భగవానుడు నాయకుడై ప్రేమింపబడును. వీరిద్దరి మధ్యను ఉదయించునది శృంగారరసములోని భావపరంపరలే. సామాన్యముగ శృంగా రమన నీచ భావము నొందుట భక్తిరసమున వర్ణింపబడు భావతరంగము లకు గాదు. ఇక్కడ శృంగారమన భగవంతుడే.

శృంగారము రెండు విధములు :- ప్రాకృతము? అప్రాకృతము. ప్రాకృత శృంగారమన - జీవభావము నొందిన స్త్రీ పురుషులయందు ఇంద్రియ ప్రీతి

కొరకై స్త్రీకి పురుషుడును, పురుషునకు స్త్రీయును ఆధారములు కాగా ఉదయించు శృంగారము. ఇది ఇచ్చు ఆనందము తాత్కాలికము. దాని పరిణామము దుఃఖము.

భగవంతునకును భక్తునకును మధ్యగల అనురాగములోని భావశృంగారము అప్రాకృతము. గోపికా శ్రీకృష్ణుల శృంగారము దిగంబరుడైన శుకయోగీంద్రులకు పాన్యమైన శృంగారము. నేను చెప్పిన జీవేశ్వరుల వాత్సల్య, సఖ్య, మధుర భావముల సంబంధమును గీతాశాస్త్రమెట్లు చెప్పినదో చూడుడు. అర్జునుడు విశ్వరూప సందర్శన సమయమున భగవంతుని శరణువేడి క్షమాపణను చెప్పుకొనిన శ్లోకము. గీత 11/44

" పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్ "

తండ్రి పుత్రుని, మిత్రుడు మిత్రుని, ప్రియురాలిని ప్రియుడు క్షమించినట్లు నన్ను క్షమింపమని కోరినాడు. మహాభారతోపన్యాసములు, 3వ భాగము, 295

## 69. అర్చితమూర్తిని అర్చించుటలోని అంతరర్థము

**ఆవాహనాసనం పాద్య మర్ఘ్య మాచమనీయకమ్**
**స్నానం, వస్త్రం యజ్ఞసూత్రం గంధమాభరణాని చ ।**
**పుష్పం ధూపం చ దీపం చ నైవేద్యం చర్వణార్తికమ్**
**మంత్రపుష్పం నమస్కార ముపచారాణి షోడశ ॥**

1. ఆవాహనము : సమస్తమైన కర్మలను విడిచి మనసును పరమాత్మ మీద లగ్నంచేయడము.
2. ఆసనము : అన్నిటికీ పరంధాముడే ఆధారమనే నిశ్చయ జ్ఞానమే ఆసనము.
3. పాద్యము : గంగ ఉద్భవించిన పాదములివియే యని స్మరించుట.
4. అర్ఘ్యము : ప్రవృత్తి ఆలోచన కాకుండా నియంత్రించడము.
5. ఆచమనీయము : కేశవనామాలలోని భగవత్తత్త్వమును దర్శించుట.
6. స్నానము : అంతర్యామిని అభిషేకించుటలోని ఆంతర్యమే అంతరింద్రియములను వశము గావించుకొనుట.

| | | |
|---|---|---|
| 7. వస్త్రము | : | నియమ నిష్ఠలు, ఆచారములు పాటించుట. |
| 8. యజ్ఞోపవీతము | : | బ్రహ్మనిష్ఠులై నిష్ఠాతులై ప్రవర్తించుట. |
| 9. గంధము | : | కరుణ, ఆనందము అనే మంచివాసనలనే సంస్కారాలచే, రాగద్వేషాలనే చెడ్డ వాసనలను నశింపజేసి, జగత్తు అంతటా పరమాత్మ నిండి ఉన్నాడనడమే. |
| 10. పుష్పము | : | సర్వకాల సర్వావస్థలలోను, సంతతాహ్లాదముతో నుండుట. |
| 11. ధూపము | : | చెడును మంచితో తొలగించడము. |
| 12. దీపము | : | చిత్తమనే ప్రమిదలో, వైరాగ్యమనే నూనె పోసి, భక్తి అనే వత్తివేసి, జ్ఞానమనే అగ్నితో దీపాన్ని వెలిగిస్తున్నాననే భావన. |
| 13. నైవేద్యము | : | మనకు అన్నీ ఇస్తోంది ఆ పరమాత్మే. ఆయనది తిరిగి ఆయనకు అర్పించడము. |
| 14. తాంబూలము | : | బ్రహ్మ విష్ణు శివ స్వరూపం - ఆకు వక్క సున్నం. ఆ త్రిమూర్తుల పవిత్రమైన నామాల్ని నోటినిండా స్మరించాలి అని. |
| 15. మంత్రపుష్పము | : | మంత్రాలచే పవిత్రమైన మనస్సు అనే పుష్పాన్ని శ్రీకృష్ణపరమాత్మకు అర్పించడము. |
| 16. నమస్కారము | : | వరమాత్మే నా సర్వస్వం అని భావించడము. |

మానసిక షోడశోపచారములు సంపూర్ణము.

| | | |
|---|---|---|
| ధ్యానము | : | తనను గురించి తానెవరో? అసలు యీ లోకానికెందు కొచ్చాడో? ఆలోచించడమన్నమాట. |
| అక్షతలు | : | వడ్లు మొలకెత్తుతాయి. కాని బియ్యము మొలకెత్తవు. అలానే కర్మవాసనలనుండి దూరంగా వుండి తిరిగి జన్మవద్దు అనే భావంతో పూజించడము అక్షతల పూజ. |
| హారతి | : | కర్పూరము ఎట్లా హరించుకుపోతుందో, కోరికలను కూడా అలానే హరింపజేసుకోమని. |
| ప్రదక్షిణము | : | భగవంతుని సంపూర్ణంగా భారము మోపి ప్రశాంత |

చిత్తంతో ఉండటము.
అభ్యాసమున కర్థము చిత్తవృత్తుల నిరోధించు సాధనము.
జ్ఞానమున కర్థము శ్రవణ మననాదులు.
ధ్యానమున కర్థము ఉపాసన.

వీనియన్నిటి ఫలితముగా కర్మ ఫలాపేక్షను పరిత్యజించుట కలుగనిచో దానినొక యభ్యాసమని, జ్ఞానమనిగాని, ధ్యానమనిగాని నుడువ వలసిన పనియే యుండదు. గీత 12/10.

## 70 సంధ్యోపాసన - సాయం సమయము కొవస్తోంది.

సదాచార సంపన్నుడైన విప్రుడు మూడు సంధ్యల్లోనూ విధిగా సంధ్యోపాసన చెయ్యాలి. నక్షత్రాలుండగా ప్రాతస్సంధ్యనూ, సూర్యుడు నడినెత్తిమీద వున్నప్పుడు మధ్యాహ్నసంధ్యనూ, సూర్యాస్తమయం కాకముందు సాయం సంధ్యనూ చెయ్యాలి.

నక్షత్రాలుండగా చేసే ప్రాతస్సంధ్య ఉత్తమము. నక్షత్రాల్లేనప్పుడు చేసేది మధ్యమము. సూర్యోదయానంతరం చేసేది అధమము.

సూర్యుడున్నప్పుడు చేసే సాయంసంధ్య ఉత్తమము. సూర్యుడు అస్తమించిన తరువాత చేసేది మధ్యమము. నక్షత్రోదయం అయిన తర్వాత చేసేది అధమము.

సూర్యోదయ సూర్యాస్తమయాల తర్వాత మూడు ఘడియల (ఒక ఘడియకు ఇరువదినాలుగు నిముషములు) వరకూ సంధ్యోపాసన చేయవచ్చు. (ఉ.గం.7-12ని.లు, సా.గం. 7-12 ని.లు) అంతకు మించి కాలాతిక్రమణం జరిగితే ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. అంటే నాలుగో అర్ఘ్యం యివ్వాలి. లేకపోతే నూట ఎనిమిదిసార్లు గాయత్రిని జపించాలి. ఇంట్లో చేసిన సంధ్యావందనం సాధారణం. గోశాలలో చేస్తే మధ్యమము. నదీతీరంలో చేస్తే ఉత్తమము. దేవీమందిరంలో చేస్తే ఉత్తమోత్తమము.

బ్రాహ్మణులకు గాయత్రిని మించిన దైవము లేదు. ఈమె వేదమాత. బ్రహ్మాదిదేవతలు కూడా ఈమెను ఉపాసిస్తారు. వేదాలు ఘనంగా కీర్తిస్తాయి. గాయత్రీ మంత్రపాదాలను విడి విడిగా జపించాలి. గాయత్రీ మంత్రాన్ని ఐదు భాగాలుగా, అంటే నడుమ నాలుగుసార్లు నిలిపి జపించాలి.

**ఓం, భూర్భువస్సువః, తత్సవితుర్వరేణ్యమ్,**

**భర్గోదేవస్యధీమహి, ధియోయోనఃప్రచోదయాత్.**సస్వర వేదమంత్రాలు - 5 .పాదాలను కలిపి పఠిస్తే బ్రహ్మహత్యా పాతకము చుట్టుకుంటుంది. గాయత్రిని నూట ఎనిమిది సార్లుగానీ, ఇరవై ఎనిమిదిసార్లుగానీ జపించాలి. అంతశక్తి లేకపోతే పదిసార్లు అయినా చేయాలి. అంతకన్నా తక్కువ పనికిరాదు. సంధ్యో పాసన అయిన తర్వాత, అగ్నికార్యం ఆచరించి, దాని తర్వాత పంచాయతనపూజ చేసి, చివరికి వేదాధ్యయనం చెయ్యాలి.

## 71 అత్రిమహర్షి అత్రి శబ్దమునకు అర్థము.

సప్తమహర్షులలో ఒకరైన అత్రి మహర్షి చేసిన వేదాధ్యయనము గురించి చూద్దాం. అత్రి శబ్దమున కర్థము నత్రియే యిట్లు చెప్పెను.

**అ రాత్రి ర త్రిః సారాత్రి, ర్యాం నాధీతే త్రిరద్యవై।**
**అ రాత్రి రత్రి రిత్యేవ, నామమే విద్ధి శోభనే॥**

తా : నేను లోకములను బాపములనుండి రక్షింతును. గావున నాపేరత్రి మఱి యును వేదములు దినమునకు ముమ్మాఱు పఠించుటచే రాత్రులను గూడ బగళ్ళను జేసితిని. కావున నాపేరత్రి. మఱియును నేను వేదాధ్యయనము చేయని రాత్రిలేదు కావున నాపేరత్రి. శ్రీ.వా.రా.అయోధ్యకాండ-1238 భారతము-అను-142 అ

## 72 రాత్రి భోజన నియమములు

1. రాత్రి భోజన సమయమందు దీపమారిపోయిన యెడల ఆసమయ మందు సూర్యుని మనస్సున స్మరించి చేతులతో పాత్రమును దాకి యుండి తిరిగి దీప ముంచువరకు భుజింపరాదు. దీపముంచిన తరు వాత పాత్రమందున్న పదార్థము మాత్రమే భుజింపవలయును. దీపము లేకుండ, వెన్నెల అగ్ని మొదలగు వెలు తురులందు భుజింపరాదు. పిండి వంటకము, కూరలు, దుంపలు, ఫలములు మొదలగువానిని చేతితో విఱిచి తినవలయును. పండ్లతో కొఱికి తినరాదు. పాయసము, పెరుగు, క్షీరములు, ఉదకము, నెయ్యి వీనిని శబ్దము కాకుండ త్రాగవలెను. పాత్రలో నున్న ఉదకము త్రాగగా మిగిలిన నీరు భూమి యందు కొంచెము పోసి పుచ్చుకొనవలయును.
2. నోట నెంతమాత్రము ముద్దపట్టునో యంతమాత్రము ప్రమాణము గల ముద్దనే యొక్కొక్కసారిగ నోరనుంచుకొని తినవలయును.

నోరబెట్టుకొనగా ముద్దలో మిగిలిన యన్నము ఆత్మోచ్ఛిష్టమనబడును. నోరబెట్టుకొనగా ముద్దలో మిగిలిన యన్నము గాని, నోటినుండి వెలువడినది గాని మరల భుజించరాదు. అట్లు భుజించెనేని చాంద్రాయణ వ్రతము జరుపవలయును. (చాంద్రాయణ వ్రతమనగా శుద్ధ పక్షమున పాడ్యమినాడొక ముద్ద యన్నము, విదియనాడు రెండు, తదియనాడు మూడు, యిట్టులే హెచ్చించి పున్నమనాడు 15 ముద్దలు తినవలయును. అవల మరల బహుళమున పాడ్యమి నాడు 14, విదియనాడు 13, ఇట్లు వరుసగ అమావాస్యనాటి వరకు తగ్గింపవలయును. ఇట్లు చేయుట చాంద్రాయణ వ్రతమనబడును)

3. భోజనకాలమందును, గుడిచేతితో నీళ్ళుత్రాగుటకు సాధ్యపడని సమయంబులందు దప్ప, నెడమ చేతితో నీళ్ళు త్రాగరాదు.
4. విస్తరియందు ఉప్పు నొకటి ప్రత్యేకముగా వేయరాదు. పెరుగులోగాని మజ్జిగయందుగాని చేర్చి యుంచవలయును. ఇట్లుకాక ప్రత్యేకముగా ముందుగా ఉప్పు వుంచిన, అన్నములో కలిపి మజ్జిగ పోసుకొనరాదు. మజ్జిగతో అన్నమును కలిపి తరువాత ఉప్పు కలపవలయును.

శ్రీ వా. రామాయణము

5. రాత్రిపాలు - అన్నము తినవలెను. లేదా మజ్జిగ అన్నము తినవచ్చును. కాని పెరుగువేసుకొనరాదు. అయున్సు క్షీణించును. రోజూ మజ్జిగ వాడేవారు ఎలాంటి రోగాలను పొందరు. పాలకంటె మజ్జిగకు జీర్ణశక్తి ఎక్కువ. నేయి వేసుకొని వేడి అన్నము తినవలెను. ("అయుర్వై ఘృతమ్" అని శ్రుతి). ఆకలి వేసినప్పుడు అన్నము తినుట, దాహము వేసినపుడు నీరుత్రాగుట, భోజనానంతరము తాంబూలము వేసికొనుట ఆరోగ్య సాధనములు. అపుడే కాచిననెయ్యి, వెన్న వీనిని మితముగా భుజించువారికి ముసలితనమురాదు. నిలువ యున్న అన్నము తినరాదు. భోజనానంతరము ఒకదొంగను వెంబడించి, అతని వేగముకన్నా నీ పరుగు పెంచి దొంగను బంధించాలి. అప్పుడు మనము మితముగా భుజించినట్లవుతుంది కదా !
6. మాంసాహారమును గురించి మద్గురువరేణ్యులు పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయర్‌స్వామివారు ఏమి చెప్పారో చూద్దాం.

మాంసమనగ చనిపోయిన జంతు శరీరము. దానిని "శవము" అందురు. శవములను చేర్చు స్థానమును శ్మశానమని యందురు. మనస్సున భగవానుని ధరించుటచే "తిరుగాడు ఆలయము"గ ఉండ వలసిన ఈశరీరములో శవములను (మాంసమును) చేర్చుటచే ఈ శరీరమే యిపుడు ఆలయముగ కాక "తిరుగాడు శ్మశానమే" అగును గదా! శ్మశానమను చూచిన, లేక వెళ్ళినంతమాత్రమున వెంటనే స్నాన మాచరింతురే ! ఇక తమ శరీరమునే "తిరుగు శ్మశానము" చేసుకొన్న వారేమి చేయవలెనో? అట్టివారిని, చూచిన స్పృశించినంత మాత్రమున మనమును వెంటనే స్నానము చేయవలెనుగద! అదియు కాక శ్మశానము యితరుల వద్దకు వెళ్ళదు. తన వద్దకు వచ్చిన వారినే అపవిత్రులను చేయును. కాని ఈ "తిరుగాడు శ్మశానమగు మానవుడు" తను పాడైనది చాలక అందరనూ చేరి పాడుచేయును.

తిరుగు ప్రాణులు, తిరుగని ప్రాణులను ఆహారముగ గ్రహించుట ప్రకృతి సిద్ధము. తిరుగని ప్రాణులు ప్రాణములేని అచేతనములను ఆహారముగ గ్రహించుట నియమము. తిరుగు ప్రాణులు, మానవులు, పశువులు మొదలగు జంతువులు, పక్షులు మొదలగునవి. తిరుగని ప్రాణులు చెట్లు, లతలు మొదలగునవి. అచేతనము లనగ మట్టి, నీరు, వేడినిచ్చు తేజస్సు, గాలి మొదలగునవి. చెట్లు మొదలగునవి తమ నియమము తప్పక అచేతనములనే ఆహారముగ గ్రహించును. హాని కల్గించు వాటిని చూచి భయపడుదుము. శాకాహారమును తిను జంతువులను చూచి భయము నందము. మన మితరులకు భయంకరులము కారాదు. కాక నియమము నెరిగి శాఖాహారీయులమై సమస్త భూతలములకు శ్రేయస్సును కోరుట కనీసము జ్ఞానము కల మానవ ధర్మము, శ్రీ వైష్ణవునకు అత్యంత ప్రధానమైన ధర్మము. మాంసాదులు, రజస్తమస్సులను ఉద్రేకమును, ఒకసారి వాసన, రుచి చూచిన మరల ఆకర్షించి మనోబలమును క్షీణింపచేయును గాన ఉల్లి మొదలగునవి స్వీకరింపరాదని నియమము. గురుపరంపరాది - 46

7 మాంసము - పద వివరణ

**మాంస భక్షయతే యస్మా-ద్భక్ష యిష్యేత మప్యహమ్ ।**
**ఏ తన్మాంస స్య మాంస త్వ-మను బుధ్య స్వ భారత ॥**

మాం = నన్ను : సః = వాడు భక్షించుచున్నాడు. గావున వానిని నేను తిరిగి భక్షించెదను. కావుననే మాంసమునకు మాంసమను పేరు గలిగినది. సమను అనగా విచారణకై న్యాయాధికారుల వలన బిలువ బడుట. శ్రీమహాభారత సారోద్ధారము, తృతీయ భాగము 581.

8 ప్రతి సంవత్సరము అశ్వమేథయాగమున దేవతల దృప్తి పరచుచు 100 వర్షములట్లు కాలము గడపిన వాని కెట్టి ఫలము లభించునో మాంసాహారమును మానిన నట్టి ఫలము గల్గును.

**తే. వంద యజ్ఞముల్ చేసిన వాని కవని**
**నెట్టి ఫలితము కల్గునో! అట్టి ఫలము**
**మాంస భక్షణ వీడిన మానవులకు**
**తప్పక లభించు నిది యథార్థంబు మిత్ర.**

శ్రీకృష్ణావతారతత్వము, 8వ భా. 42

**9 'పుణ్యేన వర్ధతే లక్ష్మీః పాపేన క్షీయతే ధ్రువమ్ '**

పుణ్యముచే లక్ష్మి వృద్ధి నొందును. పాపమున లక్ష్మి నశించును. ఇది ధ్రువము.

10. సృష్టి చేయు కాలమునందు బ్రహ్మ మనస్సున గల్గిన విసుగు కారణముగా దుస్సహుడను రాక్షసుడు పుట్టెను. అతనికి ఆకలి యెక్కువ. కనబడిన జంతువుల నన్నింటిని మ్రింగుచుండెను. అదిచూచి బ్రహ్మ " ఓరీ నీవిట్లు అన్నింటిని మ్రింగరాదు. నీవు తినుటకు పదార్థములు, ఉండదగిన చోట్లు చెప్పెదను వినుమని యిట్లు చెప్పెను. నీవు సత్కర్మానుష్ఠానములకు అటంకము కలిగింపకుము. దుర్జనుల యిండ్లలో నుండుము. సాలెపురుగులు, కుక్క, పిల్లి, ముట్టిన పదార్థములను, కుండలలో నిలువ యున్న అన్నములను, దేవునికి నివేదన చేయక వున్న పదార్థములను నీవు తిను చుండుము. సంధ్యా సమయములో ఎవరు భోజనము చేయుదురో వారి పుణ్యము నీకుదక్కును. కళ్ళాపి చల్లి ముగ్గులు పెట్టని యిండ్లలోను, పుట్టలు పెట్టిన యిండ్లలోను, రాత్రి దీపముపెట్టని యిండ్లలోను నీవునివసించు చుండుము. నియమ నిష్ఠాపరులై, ఆచారవ్యవహారములు నడుపుచు సత్కర్మలు ఆచరించు సజ్జనుల ఇండ్లజోలికి పోకుము". ఆదుస్సహుండట్లే నడుచు కొనుచుండెను. మార్కండేయపురాణము 89

## 73 తెలుగు కాలమానము

| | | | |
|---|---|---|---|
| 6 రెప్పపాట్లు | =1 విఘడియ | 7 రోజులు | =1 వారము |
| 60 విఘడియలు | =1 ఘడియ | 15 రోజులు | =1 పక్షము |
| 1 విఘడియ | =24 సెకండ్లు | 40రోజులు | =1 మండలము |
| 1 ఘడియ | =24 నిమిషములు | 2 వారములు | =1 పక్షము |
| 21/2 విఘడియలు | =1 నిమిషము | 2 పక్షములు | =1 నెల |
| 2 ఘడియలు | =1 ముహూర్తము | 2 నెలలు | =1 ఋతువు |
| 12 క్షణములు | =1 ముహూర్తము | 4 నెలలు | =1 కాలము |
| 21/2 ఘడియలు | =1 గంట | 12 నెలలు | =1సంవత్సరము =52 వారములు |
| 3 గంటలు | =1 జాము | | |
| 71/2 ఘడియలు | =1 జాము | 3 కాలములు | =1 సంవత్సరము |
| 8 జాములు | =1 రోజు | 3 ఋతువులు | =1 అయనము |
| 24 గంటలు | =1 రోజు | 2 అయనములు | =1సంవత్సరము |
| 30 ముహూర్తములు | =1 రోజు | 12 సంవత్సరములు | =1 పుష్కరము |

365 దినముల 8 గంటల 2 నిమిషాల 30 సె. 1 సంవత్సరము.

1. ఉత్తరాయణము, 2. దక్షిణాయనము = సంవత్సరములో మకర సంక్రాంతి నుండి అరుమాసములు ఉత్తరాయణము మిగిలిన అరు మాసములు దక్షిణాయనము.

1. వేసవి కాలము = చైత్ర వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢ మాసములు.

2. వర్షాకాలము = శ్రావణ, భాద్రపద, అశ్వయుజ, కార్తీక మాసములు.

3. చలికాలము = మార్గశిర, పుష్య, మాఘ, ఫాల్గున మాసములు.

21-7-2000 స్వాతి సపరి వారపత్రిక.

## 74 బ్రహ్మదేవుని ఆయుర్దాయము

| | | | |
|---|---|---|---|
| కలియుగము | = | 4,32,000 | సంవత్సరములు, |
| ద్వాపరయుగము | = | 8,64,000 | సం॥లు, |
| త్రేతాయుగము | = | 12,96,000 | సం॥లు, |

| | | | |
|---|---|---|---|
| కృతయుగము | = | 17,28,000 | సం॥లు, |
| | | 43,20,000 | చతుర్యుగము లేదా మహాయుగము మరియు దేవయుగమందురు. |
| | | 71 | |
| | | 30,67,20,000 | మన్వంతరము. |
| | | 14 | |
| | | 429,40,80,000 | బ్రహ్మకు పగలు లేక మనుష్యకల్పము. |
| | | 2 | |
| | | 858,81,60,000 | బ్రహ్మకొకదినము. |

ఈ లెక్క ప్రకారము బ్రహ్మకు నూరు సంవత్సరములు జీవించి మృతి చెందగా నాతని మాయుఃకాలము శ్రీహరికొక నిమేషమగును, - కాలమానము లెక్కల కందనిది. యుగములకె రుంగదగు.

మానవ పంవత్సరముల గణనతో 43,20,000 సం॥ ఒక చత్యుగమగును. డెబ్బది యొక్క చతుర్యుగములు ఒక మన్వంతరమగును. పదునాలుగు మన్వంతరములు ఒక కల్పమగును. ఒక కల్పము బ్రహ్మకు ఒక పగలగును. బ్రహ్మకు ఇంతేకాలము రాత్రియగును. బ్రహ్మకు పగలు కాగానే సృష్టి, రాత్రి కాగానే మరల నన్నియు ప్రకృతియందే లీనమగుచున్నవి. ఈ విధముగా భూతసమూహ మంతయు వాని కర్మ బలమున బ్రహ్మమేలు కొన్నప్పుడు పుట్టియాయన నిద్ర పోవునప్పుడు లీనమగుచున్నవి. ఒక్క బ్రహ్మ దినములో 14 మనువులు వెళ్ళి పోవుదురు. ఇప్పటికీ 6 గురు మనువులు వెళ్ళిపోయిరి. ఏడవవాడగు వైవస్వత మనువు ప్రస్తుతమున్నాడు.

బ్రహ్మ ఆయుర్దాయమును గురించి భాగవతము (12-4-2) భగవద్గీత 8/17 విష్ణుపురాణము (139,441 పుటలు)లలో ఏమి చెప్పారో చూద్దాము.

1 చతుర్యుగ సహస్రన్తు బ్రహ్మణో దినముచ్యతే ।
స కల్పో యత్ర మనవశ్చతుర్దశ విశాంపతే ॥

(మహారాజా!) మానవ పరిమాణముతో నాలుగువేల యుగముల పరిమితి కాలము, బ్రహ్మకు పగలనియు, అదియే కల్పమనియు చెప్పబడినది. దానిలో క్రమముగ పదునలుగురు మనువులు ఉద్భవింతురు. భాగవతము 12-4-2.

**2 సహస్రయుగ పర్యంత మహర్యద్బ్రహ్మణో విదుః,**
**రాత్రిం యుగసహస్రాంతాం తే ఽ హో రాత్ర విదో జనాః**

శంకరభాష్యము : సహస్ర మహాయుగకాల పర్యంత మయిన బ్రహ్మయొక్క పగటిని, అంతయే పరిమాణముగల బ్రహ్మయొక్క రాత్రిని, ఏ గొప్పవారు తెలియుదురో, అట్టివారే రేయింబవళ్ళు తెలిసినవారలుగానున్నారు. బ్రహ్మ యనగా ప్రజాపతి. అతడే విరాట్టు.

రామానుజ భాష్యము :- బ్రహ్మయనగా : చతుర్ముఖుడే. యుగములనగా చతుర్యుగములు.

మధ్వ.భా: నన్ను పొందిన తరువాత పునరావృత్తి లేదని తెలియజేయుటకు, అవ్యక్తుడను పేరుగల తన సామర్థ్యమును చూపుటకు ప్రళయాదులు చూపబడుచున్నవి. సహస్రమనగా : అనేకములనుట. బ్రహ్మము యొక్క యనగా : పరబ్రహ్మముయొక్క ద్వి పరార్థ ప్రళయమె ఇచ్చట వివక్షింపబడినది.

గీతలోని 8వ అధ్యాయమును ప్రతిదినమును పఠించువారికి పునరావృత్తిలేని పరమపదము నిచ్చును. శ్రీభగవద్గీత - 8/17.

3 పరాశరమహర్షి విష్ణుపురాణమును మైత్రేయునికి యీవిధంగా వినిపించాడు. మైత్రేయా! నీవడినట్లుగానే పూర్వం గతించిన మన్వంతరాలూ, ఇకముందు రానున్న మన్వంతరాల స్వరూపాన్ని గురించి చెబుతున్నాను విను.

శ్రీమన్నారాయణుని కరుణా కటాక్షం వలన చరాచర భూతసృష్టికి ఉపక్రమించిన పద్మగర్భుని దివసకాలంలో మానవమానాన్ని అనుసరించి నాలుగు వందల ముప్పైరెండు కోట్ల సంవత్సరాలు గతిస్తాయి. ఆ సమయంలో పధ్నాలుగు మంది మనువులు ఒక్కొక్కరూడెబ్బై ఒక్క మహాయుగాల కాలంపాటు సృష్టిని పరిపాలిస్తారు. ఒక్కొక్క మహాయుగమూ నలభై మూడు లక్షల ఇరవైవేల హాయనాలు కాగా చతుర్దశ మనువుల పాలనకాలం నాలుగువందల ఇరవైతొమ్మిది కోట్ల నలభై లక్షల ఎనభైవేల మానవ సంవత్సరాల ప్రమాణం కలిగి యున్నది.

విష్ణుపురాణము - 139, 441.

## 75. గృహావరణలో ఏయే వృక్షాలు పెంచాలి

**ప్ర :గృహావరణలో సాధారణంగా ఏయే వృక్షాలను పెంచుకోవచ్చు? ఏయే వృక్షాలను పెంచకూడదు?**

జవాబు : ఇదిచూడటానికి చిన్న ప్రశ్నే అయినా చాలా వివరాలను చెప్పవలసి

వచ్చే ప్రశ్న. 27 నక్షత్రాలను బట్టి వృక్షాలు...మిత్రవృక్షాలు, శత్రు వృక్షాలుగా విభజితమయ్యాయి. ఒకవ్యక్తి జన్మ నక్షత్రరీత్యా అతనికి మిత్రవృక్షాలేవో, వాటినే ఇంటి అవరణలో పెంచుకోవలసి వుంటుంది. అతని జన్మ నక్షత్ర రీత్యా శత్రు వృక్షాలు పెంచకూడదు.

## 27 నక్షత్రాలకు మిత్ర, శత్రు వృక్షాల పట్టిక

| నెం. | నక్షత్రం | మిత్ర వృక్షాలు | శత్రు వృక్షాలు |
|---|---|---|---|
| 1. | అశ్విని | ముష్టి | నీరుద్ది |
| 2. | భరణి | ఉసిరిక | మామిడి, జమ్మి, పొగడ |
| 3. | కృత్తిక | అత్తి (మేడి) | జిల్లేడు, ముల్లువేము, నెమ్మి |
| 4. | రోహిణి | నేరేడు | పనస, మద్ది |
| 5. | మృగశిర | చంద్ర | పనస |
| 6. | ఆరుద్ర | వనచంద్ర | - - - |
| 7. | పునర్వసు | వెదురు | - - - |
| 8. | పుష్యమి | రావి | నెమ్మి, జిల్లేడు |
| 9. | ఆశ్లేష | నాగకేసరం | - - - |
| 10. | మఖ | మర్రి | వెదురు, ఇప్ప, నాగకేసరం |
| 11. | పుబ్బ | మోదుగ | వెదురు, నాగకేసరం, వేప |
| 12. | ఉత్తర | జువ్వి | మామిడి, వేము |
| 13. | హస్త | అంబాళము | ముష్ఠి, కానుగు |
| 14. | చిత్త | మారేడు | జమ్మి |
| 15. | స్వాతి | మద్ది | కానుగ, ముష్ఠి |
| 16. | విశాఖ | ములువేము | - - - |
| 17. | అనూరాధ | పొగడ | వనచంద్ర, వేగి |
| 18. | జ్యేష్ఠ | నీరుద్ది | వనచంద్ర, వేగి |
| 19. | మూల | వేగి | నాగకేసరం |
| 20. | పూర్వాషాఢ | పనస | రావి |
| 21. | ఉత్తరాషాఢ | పనస | జమ్మి |
| 22. | శ్రవణం | జిల్లేడు | - - - |
| 23. | ధనిష్ఠ | నెమ్మి | చంద్ర |

| | | | |
|---|---|---|---|
| 24. | శతభిషం | కానుగు | - - - |
| 25. | పూర్వాభాద్ర | వేప | - - - |
| 26. | ఉత్తరాభాద్ర | వేప | వేము, మారేడు |
| 27. | రేవతి | ఇప్ప | జమ్మి, మామిడి |

అయితే ఇక్కడ గమనించవలసిన ముఖ్య విషయం ఒకటుంది. అదే గృహంలో నివసించే కొంతమంది కుటుంబ సభ్యులలో ఒకరి మిత్ర వృక్షం మరొకరికి శత్రు వృక్షమయ్యే అవకాశముంది. అటువంటప్పుడు వాటిని పెంచకపోవడమే మంచిది. ఎందుకంటే మిత్ర వృక్షాలు సత్ఫలితాలనిస్తాయి. సర్వతోముఖాభివృద్ధిని ప్రసాదిస్తాయి. శత్రు వృక్షాల వల్ల సత్ఫలితాల మాట అటుంచి, అనేక దుష్ఫలితాలను పొందవలసి వస్తుంది. మంచి జరక్కపోయినా ఫరవాలేదుకానీచెడు మాత్రం జరగకూడదు కదా! మిత్ర వృక్షం కుటుంబ సభ్యుల్లో ఎవరికీ శత్రు వృక్షం కానప్పుడు నిరభ్యంతరంగా పెంచుకొనిఅనేక సత్ఫలితాలను పొందవచ్చును. ఎ.కె.ఎస్.ఆర్. విజయవాడ

13 జూన్, 2004, ఆదివారం వార్త

## 76. కలి ప్రభావము

**కృత్వా మూత్ర పరిత్యాగం సంధ్యామాస్తే స నైషధః ।**
**అకృత్వా పాదయో శ్శౌచం తత్రైనం కలిరావిశత్ ॥**

తా : పూర్వము కృతయుగమున నలమహారాజు మూత్ర విసర్జనముచేసి పాద ప్రక్షాళనము చేయక సంధ్యావందనమాచరించెను. అంతట కలి వానిని ప్రవేశించెను. శ్రీమహాభారత సారోద్ధారము 2వ భాగము - అప - 41

**కర్కోటకకస్య నాగస్య దమయంత్యా నలస్య చ ।**
**ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలి నాశనం ॥**

తా : వరుస నంబరు 55/4 చూడుడు. 55/4లో వ్రాస్తే మరల ఎందుకు వ్రాసినట్లు? అని పాఠకమహాశయులు అడుగవచ్చు ! దానికి సమాధానము చెప్పబడుతుంది. వేదాంత విషయాలు పునశ్చరణము (పునః పునః పఠనము) చేసిననందువల్ల పునరుక్తి దోషము లేదని పెద్దలు చెప్పగా విన్నాను. అందువలన ఇంకా కొన్ని శ్లోకాలు సందర్భానుసారముగా వ్రాయుట జరిగింది. ఇప్పుడు నేను ఈ శ్లోకము వ్రాయుట వల్ల మీరు చదువుతారు. కలిదోషము నశించును.

ఎలా? కర్కోటకుని యొక్కయు, దమయంతి యొక్కయు, రాజర్షి యొక్కయు, నలుని యొక్కయు పేర్లను కీర్తించిన కలిదోషము నశించును. పాఠకులు నా భావమును అర్థము చేసుకుంటారని భావిస్తున్నాను.

శ్రీమహాభారతసారోద్ధారము 2వ భాగము - 42.

ద్వావం భసి వినిక్షే ప్త్యా గాఢం బద్ధ్వా గళే శిలామ్ ।
ధనినం చా ప్రదాతారం దరిద్రమత పస్వినమ్ ॥

తా : ఓ ధృతరాష్ట్ర ! (విదురుడు చెప్పుచున్నాడు) ఎవడు ధనవంతుడైయుండి దాత కాడో, ఎవడు దరిద్రుడైయుండి తపస్సు చేయడో వీరిద్దరు కంఠమున రాతిని గట్టిగా కట్టి నీట బడవేయ దగినవారు. భారతము - ఉద్యోగపర్వము 269

ధనము కల్గియు లోభియై దనరు వాని,
ఇడుముల దరిద్రుడౌ భక్తి హీనమతిని
దేవమాన్యముల్ కాజేసి తిరుగువాని,
బరువుగల రాతితో కట్టి, బావిలోని,
నీరమున, తలక్రిందుగా నెట్టవలయు.

## 1. గృహమునందలి శయన విధి దశలు

భోజనము పూర్తయిన ఒకగంటకు కాళ్ళు చేతులు కడుగుకొనుటకు ముందుగా మూత్రవిసర్జన చేసి మగసిరిని జలమున పరిశుభ్రపరచి, కాళ్ళతడిని తుడుచుకొని శయన మందిరమునకు ప్రవేశించవలెను.

శిరస్సును తూర్పుముఖముగా నుంచి పరుండిన ఐశ్వర్యము కలుగును. ఇంటి యజమాని గృహములో దక్షిణ దిశయందున్న గదిలో శయనించవలెను. దక్షిణమున శిరస్సు నుంచి పవళించిన ఆయుస్సు, ధనవృద్ధి కలుగును. పడమర యందు శిరస్సునుంచి పరుండిన ప్రబలము వృద్ధి, అత్తవారింటి పడమరగా శిరస్సునుంచి పరుండవలెను. ఉత్తరము శిరస్సుంచి పరుండరాదు - అట్లు చేసిన వ్యాధి మృత్యు భయమును కలుగును.

సూర్యాస్తమయము మొదలు సూర్యోదయము వరకును దీపము గల గృహము నందు దారిద్ర్యముండదు. దీపమును లేకయే దంపతులు సృష్టికార్య

ము(సంభోగము)ను చేయుదురో వారి సంతానము బ్రతికి యున్నంతవరకును దారిద్ర్య మనుభవించుచునే యుండును. దీపమును నోటితో ఊది ఆర్పరాదు.

ప్రశాంతమైన మనస్సుతో, మీ ఇష్టదైవమును తలచుకుంటూ, యే యితర ఆలోచనలను రానీయక ఏకాగ్రతతో మంచము మీద (కూర్చుని గాని) పరుండి గాని ధ్యానిస్తూ నిద్ర లోనికి జారుకోవాలి.

**యత్రైవ యత్రైవ మనో మదీయమ్,**
**తత్రైవ తత్రైవ తవ స్వరూపమ్,**
**యత్రైవ యత్రైవ శిరో మదీయమ్,**
**తత్రైవ తత్రైవ పదద్వయం తే.** శ్రీమదాంధ్ర వా.రా. సుందరకాండము. 371

తా : నా మనస్సెందెందు బోవుచున్నదో, యది యంతయు నీ స్వరూపమే. నా శిరస్సెందెందు వ్రాలుతునో, యందెల్ల నీ పాదములే యున్నవి.

తన యనుభవరస మావేశించుటచే గానవచ్చునవి, వినవచ్చునవి, ఉపేక్షించుట నిర్వికల్ప సమాధి యగును. ఇది గాలిలేని చోట నుండు దీపము వంటిది.

2 **అశ్వత్థామా బలిర్వ్యాసో హనుమాంశ్చ విభీషణః।**
**కృపః పరశురామశ్చ సప్తైతే చిరంజీవినః॥**

వేదాంతచూర్ణిక (సంఖ్యాశాస్త్రము) ప్రథమభాగము - 225

తా : అశ్వత్థామ, బలి, వ్యాసుడు, హనుమంతుడు, విభీషణుడు, కృపాచార్యులు, పరశురాముడు, ఈ యేడుగురు చిరంజీవులు. ఒక కల్పము వరకు జీవించి యుందురు.

3. దైవప్రార్థన : ఓ దయామయుడవగు ఓ గోపాలకృష్ణా ! మావాక్కు చేతను, మనస్సు చేతను, కాయము చేతను, ఏవిధమైన క్లేశమున్ను యితర ప్రాణికి గలుగనీయక సదా యుండులాగున అనుగ్రహింపుము.

ఓ కారుణ్యైకసింధో । శ్రీకృష్ణ పరమాత్మా । మావాక్కు చేతను, మనస్సు చేతను, కాయముతో కూడిన క్రియల చేతను, సర్వకాల సర్వావస్థలయందును, ప్రపంచములో గల సకల ప్రాణికోట్లకు ఉపకారము చేయులాగున ఆశీర్వదింపుము.

ఓ జ్ఞానైకమూర్తీ! పరమేశ్వరా! యోగీశ్వరేశ్వరా! మాయందు జాగ్రదవస్థ

యందుగాని, స్వప్నావస్థయందుగాని, సుషుప్త్యవస్థయందుగాని, ఈ మూడింటికి హేతువులైన స్థూల సూక్ష్మ కారణ శరీరములలోగాని ఏలాటి విషయ దోషము లున్ను, చెడు సంకల్పములున్ను గలుగకయుండులాగున ఆశీర్వాదము చేయుము.

ఓశాన్తి నిలయా ! పరమ పావన పుణ్యమూర్తీ ! అంతర్యామీ ! శ్రీకృష్ణ పరబ్రహ్మమా ! మాపై యెవరైన నిందలు మోపినను, అపకారములు చేసినను, నిరుత్సాహము కలుగజేసినను వాటినన్నిటిని సహించుకొని, వారిదుష్కృత్య ములకు వగచుచు, మా నిశ్చయ దైవకార్యమగు లక్ష్యము నుండి మనస్సును కొంచెమైనను చలింపనీయక సదాయుండులాగున అనుగ్రహింపుము. అను గ్రహింపుము.

ఓం న త్వహం కామయే రాజ్యం న స్వర్గం నాపునర్భవం ।
కామయే దుఃఖతప్తానాం ప్రాణీ నామార్తి నాశనమ్ ॥

స్తోత్రమంజరి 88

నమో ధర్మాయ మహతే నమః కృష్ణాయ వేధసే ।
బ్రాహ్మణేభ్యో నమస్కృత్య ధర్మాన్ వక్ష్యే సనాతనాన్ ॥

తా : నేను హరిభక్తి రూపమైన మహాధర్మమునకు, జగద్విధాతయగు శ్రీకృష్ణునకు నమస్కరించుచున్నాను. పిమ్మట బ్రాహ్మణులకు నమస్కరించి సనాతన ధర్మ మును వర్ణింతును.

శిశుమార చక్రవర్ణనము :

గ్రహర్క్ష తారామయమాధి దైవికం
పాపాపహం మన్త్రకృతాం త్రికాలమ్।
నమస్యతః స్మరతో వా త్రికాలం
నశ్యేత తత్కాల జమాశు పాపమ్ ॥

తా : ఇట్లు వెనుక చెప్పబడిన మంత్రముతో సర్వగ్రహములకు, నక్షత్రాదులకు నాశ్రయభూతుడు శిశుమారమూర్తియునగు భగవానుని త్రిసంధ్యలయందు జపించువారి పాపరాశి నశించును. త్రిసంధ్యలయందు అయనకు నమస్కరించి స్మరించువారి తాత్కాలిక పాపములు వెంటనే నశించును. శ్రీమద్భాగవతము 5-23-9

**అవిస్మృతిః కృష్ణపదారవిందయోః**
**క్షిణోత్య భద్రాణి చ శం తనోతి ।**
**సత్త్వస్య శుద్ధిం పరమాత్మ భక్తిం**
**జ్ఞానం చ విజ్ఞాన విరాగ యుక్తమ్ ॥**

తా : కృష్ణపదారవింద యుగళస్మృతి మానవుల యశుభమును బోగొట్టును. చిత్త శుద్ధిని, శ్రీహరిభక్తిని, విజ్ఞాన వైరాగ్యయుక్తమగు జ్ఞానమును శుభమును కలుగజేయును. శ్రీమద్భాగవతము - 12-12-55

**కిరీటినం గదినం చక్రహస్త,**
**మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ।**
**తేనైవ రూపేణ చతుర్భుజేన,**
**సహస్రబాహో । భవ విశ్వమూర్తే !**

తా : అనేక భుజములు కలిగి విశ్వరూపధరుడవైన యో స్వామి ! కిరీటము, గద, చక్రము ధరించిన నీ సహజ రూపమును దర్శనము చేయుటకు జాల కోరి యున్నాను. గనుక, నీవు దయయుంచి నీ సహజమయిన వసుదేవ పుత్రు డవగు రూపమును జూపుము. గీత - 11/46

**వేనవేల్భుజముల వెల్గు, విశ్వరూప !**
**రమ్య మకుటమ్ము ; గదయు ; చక్రమ్ము దాల్చి ;**
**తనరు నీ రూపు ; చూడంగ దలచినాడ ;**
**నాల్గు భుజముల ; నీ రూపు ; నాకు చూపు.**

శ్రీకృష్ణుడు భక్త సులభుడు.

ప్రేమమూర్తియైన సత్యభామ ఎంతధనరాశిని తులతూచి శ్రీకృష్ణుని నారదదాస్య విముక్తుని చేసి తనవశము చేసుకొనుటకు ప్రయత్నించినా అది అమెకు సాధ్యపడ లేదు. అమె ప్రేమలో శ్రీకృష్ణుడు నావాడు అనే అహంకారం వుంది. అదే అమె ఓటమికి కారణం. కాని రుక్మిణి ప్రగాఢ భక్తి తత్త్వంతో, ఒక్క తులసీదళంతో తులతూచి శ్రీకృష్ణభగవానునకు దాస్యవిముక్తి కలిగించింది. అందుచేత శ్రీకృష్ణుడు భక్త సులభుడు.

ధర్మాత్ములై తన విశ్వాసమును చూరగొన్న పాండవులను కష్టకాలము లందు కంటికి రెప్పలా కాపాడి వారి సంపూర్ణ రక్షణ భారము తాను పరిగ్రహించి భరించ లేదు? ఎందుచేత? శ్రీకృష్ణుడు ధర్మ పక్షపాతి, భక్త సులభుడు కావుననే. "మమ ప్రాణాహి పాండవాః" అనిఅనలేదూ !

కటికి దారిద్ర్యము ననుభవిస్తున్న భార్య వత్తిడి వల్ల ధనార్జనకొరకు బాల్య స్నేహితుడు శ్రీకృష్ణుని చెంతకరిగిన కుచేలుని కెదురువచ్చి ఆప్యాయంగ ఆలింగనము చేసుకుని, సాదరంగా రాజాంతర్భాగమునకు తోడ్కొనిపోయి, ఆసన ముపై కూర్చుండ నియమించి, రుక్మిణి తోయములందించగా తాను స్వయంగా స్వహస్తాలతో పాదాలు కడిగి, (సేవలు చేయించుకొనుటయే గాని, సేవలు చేసి యెరుగని ఆ శ్రీకృష్ణ పరబ్రహ్మము, యోగేశ్వరుడు, జగద్గురువు, అంతర్యామి కుచేలుని పాదములు కడుగుటలోని ఆంతర్యమేమి? నిరంతర శ్రీకృష్ణనామ స్మరణాను రక్తుడగుటయే । భగవద్గుణ శ్రవణానంద కుతూహలా యుక్త సక్త పరితప్త హృదయావేశ పరిపూర్ణుడగు చేతనే ! కుచేలుని జన్మమే జన్మము. ధన్య జీవి) ఉత్తరీయముతో పాదాల తడి అద్ది, అష్ట భార్యలతో పరిచర్యలు చేయించి, నాకొరకేమి తెచ్చితివని ఆతురతతో అడుగగా, చేసిన సపర్యలకు తబ్బిబ్బయి, చిన్నబుచ్చుకుని, తెచ్చిన గుప్పెడు అటుకులు యిచ్చుటకు సందే హించుచున్న కుచేలుని జీర్ణోత్తరీయాంచలమున ముడుపు కట్టిన పిడికెడు అటు కులు నించుక ఆప్యాయంగా ఆరగించి స్నానాదికములు కావింపజేసి, పట్టు వస్త్రములు ధరింపజేసి, షడ్రసములతో చేసిన వంటకములను భుజింప చేయించి, కుశల ప్రశ్నలతో చిన్ననాటి విద్యాభ్యాస విషయ చర్చలతో రాత్రియం తయు జాగరణ చేసి, మరునాడు ఆప్తమిత్రుని సాగనంపగా, సాయం సమయమునకు తన స్వగ్రామం చేరి, జీర్ణ కుటీర స్థానములో స్వర్ణ సౌధము వెలసియుండుట గమనించి, సందేహ సంభ్రమాశ్చర్యములతో ఏమి చేయుటకు పాలుపోక, అటు నిటు పచారులు చేయు సమయమున, సౌధాగ్రమున నుండి భర్త యవస్థను గమనించి గ్రహించిన ధర్మపత్ని ఎదురువచ్చి గృహాంతరమున కాతని తోడ్కొని పోవుచూ మీ చిన్ననాటి స్నేహితుని శ్రీకృష్ణ పరమాత్ముని అనుగ్రహ ప్రసాదమిదియే యని సంతసమానంద సాగరమున నోలలాడుటకే అదృష్టదేవత కారణము? - అది అయాచిత భగవత్కటాక్ష లబ్ధ ప్రసాదమే కాక, నిష్కల్మష హృదయుడైన కుచేలుని నిష్కామ భక్తి నివేదనా ఫలితము కూడా?

ఆర్త త్రాణ పరాయణత్వమే ఆయనతత్త్వము. అందుచేతనే, ఆర్తితో, నిష్కామ భక్తితో, కనుల వెంట అశ్రుధారలు కారగా గద్గద స్వరముతో పిలిస్తే 'ఓ' యని పలుకుతారు. పలికారు కూడా గజేంద్ర మోక్ష ఘట్టమున ! మనమూ అస్థాయిలో నీదర్శన భాగ్యము కలిగించమని వేడుకొందాము.... నిద్రిస్తూ, ధ్యానిస్తూ, ప్రార్థిస్తూ, స్వప్నావస్థలో కెళ్ళిన మనకు చతుర్భుజములతో, గద, చక్రము ధరించిన నీ సహజరూపమును చూపించమని తలచుకుంటే చూపించరూ ! చూపించరూ !! చూపిస్తారు. సహజరూపమే కాదు వేదవిశ్వ రూపమే చూపించారు. అదుగో చూడండి. కనుల కరువుతీరా వీక్షించండి.

## 77 వేదవిశ్వరూపము

వేద విభాగము చేసి, పదునెనిమిది పురాణములను వ్రాసిన వేదవ్యాసుని కొకప్పుడు ఒక సందేహము కలిగెను.

జగత్తులన్నియు నశించు స్వభావము గలవి. నశింపని వాడొక్క పరమాత్మడేయని వేదములు చెప్పును. సృష్టియంతయు అతని లీలా విలాసమే. పరబ్రహ్మమొక్కటే. నానాత్వము లేదు. (ఏకమేవా ద్వితీయం బ్రహ్మ, నేహ నానాస్తికించన) ఎవని రెప్పపాటు వలన ప్రళయమగునో, ఎవని కంటి చూపుతో సృష్టి జరుగునో అట్టిశక్తి ఏ యాధారము వలన నేర్పడినది? ఈ సృష్టియంతయు ఎవనిచేత, ఎవని సంకల్ప బలమున జరుగు చున్నది? ఎవనిని గూర్చి తెలియ నంతవరకు జగద్భ్రాంతి యుండునో, తెలిసిన తర్వాత అదినశించునో అత డెవ్వడు? అక్షర పరబ్రహ్మము కంటె పైన మరేమియు లేదని కొందరందురు. అక్షర స్వరూపుడు, గోలోకమున రాధతో రాసలీలలలో విహరించు కృష్ణభగ వానుడేయని కొందరందురు. ఆ యక్షరునికంటె పరుడు (పైవాడు) ఉన్నాడని వేదము చెప్పుచున్నదే. అతడెవ్వడు? వేద వాక్యములలో ఉద్దేశింపబడిన ఆ విశేషము నాకెట్లు తెలియును?

"క్షరస్సర్వాణి భూతాని కూటస్థో௨క్షర ఉచ్యతే, గీత-15/16

ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదా హృతః" గీత 15/17

అని గీత అంతవరకే చెప్పింది. అని వ్యాసుడెంత యాలోచించినను యథార్థము తెలియలేదు. "ఎవ్వరి నడుగవలె" నని యాలోచించుచు మేరు పర్వత గుహ

వద్దకువెళ్ళి ఆవేద పరమార్థమునే భావించుచు మూడు వందల యేండ్లు ధ్యాననిష్ఠలో నుండి పోయెను.

అతని యెదుట వేదములు నిజ స్వరూపములతో సాక్షాత్కరించెను.

నలుగురు వేదపురుషులును ఏకరూపులుగా నుండిరి. తామరపూవురేకుల వంటి కన్నులు, జటాకిరీటములు, చేతదర్భలు, లేడిచర్మములు వారికి(అతనికి) గలవు. ఓంకారము మొదలు 16 అచ్చుల (స్వరముల)నాదములు వారి వెంటనుండెను. వారికి కవర్గము కుడిచేతి వ్రేళ్ళుగాను, చవర్గము ఎడమచేతి వ్రేళ్ళుగాను, టవర్గము కుడికాలి వ్రేళ్ళుగాను, తవర్గము ఎడమకాలి వ్రేళ్ళుగాను, పవర్గము రెండు కడుపులు (పైకడుపు - పొత్తికడుపు)గాను ఉండెను. నాభి యందు యకారమును, పృష్ఠమందు రేఫమును, ఉదరమందు లకారమును, కేశములందు వకారమును ఉండెను. శషసహ లనెడి ఊష్మములు పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ రూపములైన వాక్కులుగా నుండెను. హృదయమున శ్రీకృష్ణ భగవానుడు ఉండెను.

వేదపురుషునికి భ్రూమధ్యమున మాయాపురియు (హరిద్వారము) లింగ దేశమున కాంచీపురమును, నాభియందు అవంతీపురమును, కంఠము నందు ద్వారకయు ప్రాణములందు ప్రయాగయు, కుడియెడమ ప్రక్కలయందు గంగాయమునలును, మధ్య సరస్వతియు, ముఖమున గయాక్షేత్రమును, కంఠమున ప్రభాస క్షేత్రమును, బ్రహ్మరంధ్రమున బదరియు, నేత్రములందు పౌండ్ర నేపాల దేశములును, లలాటమునందు పూర్ణగిరి (శ్రీశైలముకావచ్చును) యు, కంఠమున మధురా పీఠమును, స్తన మధ్యమున జాలంధర పీఠమును, కర్ణములందు భృగు పీఠమును, (ఇవి దేవీపీఠములు కావచ్చును) ఉండెను. ముక్కున అయోధ్య కలదు. బ్రహ్మరంధ్రమున బ్రహ్మయు, పాపటలో శివుడును, నాలుక చివర శక్తి నివాసమును, హృదయమున విష్ణు గృహమును, కన్నులందు సౌరపీఠమును ఉండెను.

మరియు ఆయన సర్వయజ్ఞస్వరూపుడై యుండెను. కంఠమున సౌత్రామణియు, హృదయమున పశుబంధమును, నడుమున వాజపేయమును, ముఖమున అగ్నియు, మొలయందశ్వమేధమును, ఉదరమందు నరమేధమును, శిరస్సునందు రాజసూయమును, క్రింది పెదవియందు అవసథ్యమును, (ఆహవ

నీయాగ్ని) పై పెదవియందు దక్షిణాగ్నియు, ముఖమధ్యమున (నోటిలో) గార్హపత్యాగ్నియు, చెవుల యందు హవ్యములును, (హోమద్రవ్యములు) రోమములందు సకల మంత్రములును ప్రకాశించుచుండెను.

మహారాజును భృత్యులు సేవించినట్లు అవేద సమ్రాట్టును పురాణములు, సంహితలు, న్యాయాది శాస్త్రములు, తంత్రములు, కర్మజ్ఞాన ఉపాసనా మార్గ ములు సేవించుచుండెను. కోటిసూర్యచంద్రుల కాంతితో తనయెదుట సాక్షాత్క రించిన అవేదమూర్తిని జూచి వ్యాసుడు పరమాశ్చర్యముతో వెంటనే లేచి సాష్టాంగ నమస్కారము చేసి, "వేదమూర్తీ కృతార్థుడనైనాను. మీ దర్శనము వలన చరితా ర్థుడనైనాను. నామనస్సు అనందపూర్ణమైనది. భూతభవిష్యద్వర్త మాన విషయ ములు, లౌకికములుగాని, అలౌకికములుగాని మీకు తెలియనివి లేవు. ఇప్పుడీ పుణ్యక్షేత్రములు, నదులు, యజ్ఞములు మీయందు నాకు కన బడుచున్నవి. అవి ప్రవృత్తి ఫలములు. (= లోకవ్యవహార హేతువులును, పునర్జన్మ కారణములును) వానిపై నాకు కోరికలేదు. మహానుభావా! నాకున్న సందేహము నడుగుచున్నాను. నాయందు కృప చూపి నా సందేహమును తీర్పుడు. కోరికలతో కర్మములు చేయువారికి ఫలముగా స్వర్గసుఖములు కలుగునని మీరే చెప్పినారు గదా! ("స్వర్గ కామోయజేత" = స్వర్గభోగమును గోరినవాడు యజ్ఞము చేయవలెను) చిత్తశుద్ధి గలిగి ఈశ్వరార్పణముగా (నిష్కా మముగా) కర్మములు చేయువారికి జ్ఞానము, దానివలన మోక్షము, సచ్చిదానంద స్వరూపమైన పరబ్రహ్మైక్యము గలుగునని కూడ చెప్పినారు గదా! అయినను నాకొక సంశయము మిగిలి పోయినది. ఆ అక్షర పరబ్రహ్మము కన్నను పరమ మైనది (మించిన గొప్పది) ఏమైన నున్నదా? ఉన్నచో అది ఏమి? మీరు తత్త్వము నెరింగిన వారు కనుక నా సందేహము తీర్పు" డని ప్రార్థించెను.

వ్యాసుని ప్రశ్న విని యానందించిన వేదపురుషుడు ఇట్లు పలికెను. "వ్యాస మహర్షీ! చాల మంచి ప్రశ్న యడిగినావు. నీవంటి వేదరహస్యవేత్తగాని యిటు వంటి ప్రశ్న నడుగలేడు. చెప్పెదను వినుము. విష్ణుమూర్తి సర్వజీవులకును ఆత్మ ఆయన, జన్మములు లేనివాడైనను అవతారములెత్తి లోకములను అను గ్రహిం చును. లేనిచో ఈ సృష్టియు, జనన మరణాది సంసారములును ఉండవు. ఆ నారాయణుడు, జ్ఞానము నశింపజేయు మాయకు అతీతుడై యుండును. అందుచేతనే తన యిచ్ఛానుసారముగా రూపములను గ్రహించి అవతారము

లెత్తును. అవసరము తీరగానే ఉపసంహరించును. అతడు సర్వతంత్ర స్వతంత్రుడు.

పురాణములందును, ఇతిహాసములందును, బ్రహ్మసూత్రాది వేదాంత గ్రంథములందును అయనయే, అక్షరుడనియు, పరబ్రహ్మమనియు సర్వకారణ కారణుడనియు, చెప్పబడెను. అయనయే ఆత్మలకు పరమాత్మ. అటువంటి అక్షర పరబ్రహ్మమునకు అతీతమైనది కేవలము రసమే. అదికేవలము పువ్వు నందు సువాసనవలె, ఫలమునందు రసము వలె అనుభవైక వేద్యము. ఇట్లుం డునని దానిని వర్ణించుటకు నేనుగూడ శక్తుడనుగాను." ("యద్వై, తత్సుకృతం, రసోవైసః రసగ్గ్హ్యే వాయం లబ్ధ్వా ఽఽనందీ భవతి" అని తైత్తరీయోపనిషత్తు చెప్పుచున్నది)

ఆ రసాస్వాదనము వలన కలిగిన యానందమును వర్ణించుటకు

మనస్సుగాని శబ్దములుగాని సమర్థములు కావు.

("యతో వాచో నివర్తంతే. అప్రాప్య మనసా సహ. అనందం బ్రహ్మణో విద్వాన్" అని కూడ తైత్తరీయోపనిషత్తు చెప్పుచున్నది)

("జ్ఞానియైన పురుషుడు, మాటలతో చెప్పుటకు శక్యముగానిదియు, మనసుచే ఊహించుటకు గూడ శక్యముగానిదియునైన బ్రహ్మనందరసమును అస్వా దించును" అని దీని యర్థము)

వేదపురుషుడు చెప్పిన మాటలు విని వేదవ్యాసుడు పరమతత్త్వమును తెలిసికొంటినని యానందించుచు ఆయనకు భక్తితో సాష్టాంగ నమస్కారము చేసెను. వ్యాసుని దీవించి వేదపురుషుడు అంతర్ధానమొందెను.

వాయుపురాణము, అష్టాదశపురాణములు 329

వ్యాసుని వేదవిభాగ క్రమము

విశ్వసృష్టి స్థితి ప్రళయకారణమైన నారాయణ పరబ్రహ్మం ఓంకారశబ్ద వ్యవస్థితమై ఉన్నది. బృహత్త్వ బృంహణ త్వాల చేత దీనికి బ్రహ్మమని పేరువచ్చింది. బ్రహ్మ భావనంచేయగల వారికి భూర్భువఃస్వరాది వ్యాహృతులలో అభివ్యాప్తమై ఉన్న ప్రణవతత్త్వాన్ని ఋగ్యజుస్సామ విద్యలు ఛందోముఖంగా అవిష్కరిస్తు న్నాయి. అనాదిమధ్య నిధనుడు, స్వీయమాయా జనితమైన జగత్తులో తానే సర్వాంత రితుడై నెలకొన్నవాడు, పరమాత్ముడు, బ్రహ్మవిష్ణు మహేశ్వరాత్మకుడైన మహా త్ముడు శ్రీమన్నారాయణుడు అద్వితీయుడు. వేదవేద్యుడైన అయనే ఋగ్య

జుస్సామ సారాత్మకుడై వేదమయ శరీరాన్ని ధరించి వేదాలను సృజించాడు. వేదశాఖా సర్వస్వమూ ఆ పరంధాముని లీలాతను విలాసం. శాఖా ప్రణేత సమస్త శాఖాగత నిర్మల జ్ఞాన స్వరూపుడు, అనంతుడు భగవత్స్వరూపుడైన నారాయణుడే వేదపురుషుడు. విష్ణుపురాణము - 152

**78. యోంతః ప్రవిశ్య మమ వాచమిమాం ప్రసుప్తాం**
**సంజీవయ త్యఖిల శక్తిధర స్స్వధామ్నా ।**
**అన్యాంశ్చ హస్త చరణ శ్రవణ త్వగాదీన్**
**ప్రాణా న్నమో భగవతే పురుషాయ తుభ్యమ్ ॥**

ఏ పరమాత్మ నాలో ప్రవేశించి వాక్కును ప్రాణేంద్రియములను ప్రేరణ చేసి చైతన్యవంతములుగా చేయునో అట్టి పరమ పురుషునకు నమస్కారము.

**79. తుట్టతుదను యీ ఆశీర్వాదపద్యమును తిలకించండి.**

**అలి నొల్లకయున్న వానమ్మ మగని,**
**అందులో దాగియున్న వా నక్క మగని,**
**నమ్మినాతని చెఱచు దానమ్మ సవతి,**
**సిరులు దయచేసి మిమ్ము రక్షించుగాక.**

భావము : వివాహము వలదని భీష్మించిన భీష్ముని మాతృదేవత గంగ. గంగాదేవి భర్త సముద్రుడు.

ఇంద్రుని వజ్రాయుధమునకు భీతిల్లి రెక్కలున్న, హిమవంతుని కుమారుడు మైనాకుడు పారిపోయి సముద్రమున దాగినాడు. ఈతని సహోదరి పార్వతి. పార్వతి భర్త యీశ్వరుడు.

ఈశ్వరుని నమ్ముకున్నవాడు రావణుడు. ఈతని సర్వనాశనము చేసినది సీత. సీతతల్లి భూదేవి. భూదేవి సవతి లక్ష్మిదేవి.

శ్రీలక్ష్మిదేవి ధనధాన్యవస్తువాహనముల నిచ్చి మిమ్ము రక్షించుగాక.

**80 భవే భవే యథా భక్తిః పాదయోస్తవ జాయతే ।**
**తథా కురుష్వ దేవేశ నాథస్త్వం నో యతః ప్రభో ॥** భాగ - 12-13-22.

దేవా ! దేవదేవా! శ్రీకృష్ణా! మాకు ప్రతి జన్మము నందును దేనివలన నీపాదముల యందు యథార్థమగు భక్తి కలుగునో నీవట్టిదానిని కలుగజేయుము.

**నామ సంకీర్తనం యస్య సర్వపాప ప్రణాశనమ్ ।**
**ప్రణామో దుఃఖశమన స్తం నమామి హరిం పరమ్ ॥**

ఎవని నామ సంకీర్తనము సర్వ పాపములను వినాశము చేయునో నమస్కారము సర్వదుఃఖములను హరించునో అట్టి పరమపురుషుడగు శ్రీహరికి నమస్కరించుచున్నాను. భాగ - 12-13-23.

**ఫలశ్రుతి :**

**"కలౌ సంకీర్తనా న్ముక్తిః " "కలౌ సంస్మరణా న్ముక్తిః"**

కీర్తనమనగా భగవంతుని వైభవమును గానము చేయుటయని భావము. కలియుగములో భగవన్నామ సంకీర్తనమే తరించుటకు ఏకైక తరుణోపాయమని శాస్త్రములు ఘోషిస్తున్నవి, మహాత్ములు ప్రవచిస్తున్నారు. "కలౌ సంకీర్త్య కేశవమ్" అని విష్ణుపురాణము ప్రవచించినది.

భగవంతుని సదా మనస్సునందు నిలుపుకొనుటను స్మరణమందురు. పరమాత్మను స్మరించే అలవాటును మనస్సునకు కల్పించాలి. పరమాత్మను స్మరించు మనస్సు పరమాత్మయందే స్థిరపడియుండును.

'నన్ను స్మరించు మనస్సు నాయందే విలీనమైయుండును' అని పరమాత్మ భాగవతమునందు తెలిపెను.

**ఓం భద్రం కర్ణేభిః శ్రుణు యామదేవాః । భద్రం పశ్యేమాక్ష భిర్యజత్రాః । స్థిరైరంగై స్తుష్టువాగ్ం సస్తనూభిః వ్యశేమ దేవహితం యదాయుః ॥**

ఓం, ఓ దేవతలారా ! మా చెవులు శుభమునే వినుగాక. యజ్ఞకోవిదులమైన మేము మాకన్నులతో శుభమునే చూతుముగాక. మీస్తోత్రములను గానము చేయుమేము, పూర్తి ఆరోగ్యము బలములతో మాకు నియమితమైన అయుష్కాలమును గడిపెదముగాక - ఓం శాంతిః శాంతిః శాంతిః

**స్వస్తిన ఇంద్రో వృద్ధ శ్రవాః స్వస్తినః పూషా విశ్వవేదాః ।**
**స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తినో బృహస్పతిర్ దధాతు ॥**
**ఓం శాంతిః శాంతిః శాంతిః**

తా : విశ్వవిఖ్యాతుడైన ఇంద్రుడు మనకు మంగళప్రదం గావిస్తాడు గాక । సర్వజ్ఞుడైన పూషా అను సూర్యభగవానుడు మనకు మంగళం ఒనరుస్తాడు గాక! చెడును ధ్వంసం చేసే గరుత్మంతుడు మనకు మంగళదాయకం చేస్తాడుగాక. దేవగురువైన బృహస్పతి మనకు మంగళాన్ని అనుగ్రహిస్తాడు గాక.

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు. సన్వరవేదమంత్రాలు - 214

లోకా సమస్తా సుఖినోభవంతు

ధర్మస్యజయోస్తు - అధర్మస్యనాశో ఽస్తు

విశ్వస్య కల్యాణమస్తు.

నిత్యానుష్ఠానచంద్రిక

పూర్వ, ఉత్తర భాగములు సంపూర్ణము.

హరిః ఓమ్ తత్ - సత్ - ఓమ్.

జై శ్రీమన్నారాయణ.



ఓంనమః పరమాత్మనే

# వేదాంతచూర్ణిక (సంఖ్యాప్రాశస్త్యము ద్వితీయభాగము) చతుర్థప్రష్నము పై ప్రముఖుల ప్రశంసలు

1. శ్రీరామకృష్ణప్రభ ఏప్రిల్ 2002, గ్రంథపరిచయం అను శీర్షిక క్రింద 39వ పేజీలో వేదాంతచూర్ణిక (సంఖ్యాప్రాశస్త్యము) ద్వితీయభాగము, అను గ్రంథ మును గురించి శ్రీరెంటాల జయదేవ గారు యీవిధంగా ప్రశంసించారు.

వేదాంతచూర్ణిక (సంఖ్యాప్రాశస్త్యము) ద్వితీయ భాగము.
రచన - వేపూరి శేషగిరిరావు, పేజీలు 228, వెల రూ. 100/-
ప్రతులకు :- రచయిత, కస్తూరి పబ్లికేషన్స్, వంగూరు, పెదవేగి మండలము, పశ్చిమగోదావరి జిల్లా.

ఇది ఓ విచిత్రమైన రచన

ఒకటి, రెండు, మూడు - ఇలా వరుసగా ఒక్కో అంకె పరంగా భారతీయ సంస్కృతి సంప్రదాయ, అచార వ్యవహారాలనూ, సనాతన ధర్మాలనూ వివరించేం దుకు రచయిత ప్రయత్నించారు. ఈ పుస్తకంలో ! ఉదాహరణకు 8 అనే అంకెనే తీసుకోండి. శ్రీకృష్ణుని అష్టభార్యలు, అష్టలక్ష్ములు, అష్టదిగ్గజాలు, అష్టైశ్వ ర్యాలు, అష్ట సిద్ధులు - వగైరాలన్నిటినీ '8' అనే అంకె క్రింద యిచ్చారు. గతంలో 1 నుండి 7 వరకు గల అంకెలకు సంబంధించిన విశేషాలతో "వేదాంత చూర్ణిక" మొదటి భాగమును రచయిత వెలువరించారు. ఇప్పుడిది రెండో భాగము. ఇందులో 8 నుండి 108 వరకు వున్న సంఖ్యల్లోని ముఖ్యమైన సంఖ్యల ప్రాశ స్త్యాన్ని వివరించారు. "1978 ఫిబ్రవరిలో శ్రీరామకృష్ణప్రభలో ప్రచురించిన అష్టావక్రవిజయము" అనే వ్యాసం నుంచి స్ఫూర్తి పొందిన రచయిత ఏకంగా రెండుభాగాల గ్రంథాన్నే రాయడం విశేషం. ఎన్నో రచనలు, పుస్తకాలను పరిశీ లించి, పరిశోధించి, పలువిషయాలను ఒక్కచోట ఏర్చి కూర్చినందుకు రచయిత వేపూరి శేషగిరిరావును అభినందించాలి. - ***శ్రీ రెంటాల జయదేవ***, 1-4-2002

**2. డా. గరికపాటి నరసింహారావు**, మహాసహస్రావధాని, చైతన్యకళాశాల, **కాకినాడ, ఫోన్** : 371693 (ఇల్లు)

నమస్తే.

వేదాంత చూర్ణిక అందింది. జీవితాంతం భద్రపరచుకోదల్చిన గ్రంథం అందిం చారు. ధన్యవాదాలు. - ***డా. గరికపాటి నరసింహారావు*** 2-4-2002.

3. రసరాజు, సినీకవి
తణుకు 534 211
"విశేష" గిరిరావు గారికి
ఉగాది శుభాకాంక్షలు !

(అ) ద్వితీయభాగంగా - వేదాంత చూర్ణిక అందింది. మొదటిభాగం అందినప్పుడు - అది దాచుకోదగిన పుస్తకం అని వ్రాశాను. ఇప్పుడైతే రెండూదాచుకోదగినవే ! ఎంతో ఉపయుక్తమైన పుస్తకాన్ని జాతికి అందించి యున్నారు. - చదివాను. క్రొత్త విషయాలు తెలిసాయి. అభినందనలు. " సంఖ్యాప్రాశస్త్యము" పై ఈపుస్తకములో ఇంత వివరణ ఇవ్వటం నిజంగా మీ పాండితికి నిదర్శనమే అవుతుంది. ఒకరకంగా ఇది "ఎన్సైక్లోపీడియా" Encyclopedia గా కనిపిస్తుంది. నిజంగా మీరు "విశేష" గిరిరావుగారే ! మీ పేరుకు ధన్యవాదాలు. ఉంటాను.

- *సినీకవి రసరాజు* 5-4-2002

4. నల్లూరు 15-4-2002

మాన్యశ్రీ శేషగిరిరావుగారికి అభినందనములతో, మీరు పంపిన వేదాంత చూర్ణిక అందినది. సమగ్రముగా పరిశీలించి ఆనందించితిని. మీ కృషి అసాధారణము. జీవితమును ఆధ్యాత్మిక చింతనలో లగ్నము చేసిన మీరు ధన్యులు. మొదటి భాగమును గూర్చి ప్రతిభావంతుల అభిప్రాయములతోపాటు నా అభిప్రాయమును కూడా ప్రకటించుట మీ చిత్తశుద్ధికి తార్కాణము. ఆర్ష విజ్ఞాన పరిశోధనలో మీకృషి కొనసాగును గాక. నేను పక్షవాతమునకు గురి అగుటచే ఈలేఖను ఇతరులచే వ్రాయించితిని.

ఇట్లు
మీ శ్రేయోభిలాషి
**యార్లగడ్డ వేంకట సుబ్బారావు**

5. సిద్ధాంతం 7-4-2001
పూజ్యులు, గౌరవనీయులు, కళాకారులు, కళాపోషకులు శ్రీ వేపూరి శేషగిరిరావు గారికి చిలువూరి కృష్ణంరాజు (లైబ్రరీ అసిస్టెంటు, జిల్లా పరిషత్ హైస్కూలు, సిద్ధాంతం, పెనుగొండ మండలము)
నమస్కారములు, ఉభయ కుశలోపరి.

నేను 30-3-2001 శుక్రవారము, వార్త దినపత్రికలో మీ గురించి భువన

విజయము, వ్యక్తిత్వ వికాసానికి కళలు అవసరం. ప్రభాతవార్త (ఏలూరు కల్చరల్) నాటకానుభవము చదివి ఎంతో ఆనందించినాను. నేను తమలాంటి ఉత్తమ కళాకారుల ఫొటోలు సేకరించి ఒక పుస్తకములో అంటించినాను. ఇప్పటికి 500లకుపైన సేకరించినాను. (పేపర్లలో పడినవి) ఇందులో మీ ఫొటోకూడా అంటించినాను. ఈ కళాకారుల పుస్తకము హైదరాబాదు, ఏలూరు, గూడెం, తణుకు, నర్సాపురం, పాలకొల్లు, పెనుగొండ తీసికొని వెళ్ళి అయా కళాకారులకు చూపించి వారిఫొటోల క్రింది వారి సంతకాలు కూడా చేయించినాను. మీ ఫొటో క్రింద మీ సంతకము చేయించుట కొరకు మీ వూరు రాగలను. హైదరాబాదు రవీంద్రభారతిలో నంది అవార్డ గ్రహీతలు నాకు సన్మానము చేసినారు. ఏలూరులో 15-2-2001 న శ్రీ గుమ్మడిగారు సన్మానము చేసినారు. డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు, రాష్ట్ర గవర్నర్ రంగరాజన్‌గారు, శ్రీ అక్కినేని నాగేశ్వర రావుగారు నాకు ప్రశంసా పత్రములు యిచ్చినారు. నేను ఏ కళాకారుణ్ణి ఏదీ కోరను. మీ ఆశీస్సులే కావాలి. ముఖపరిచయం లేకుండా మీకు లెటరు వ్రాసినాను. మీ ఆశీస్సులు పంపితేచాలు.

- చిలుకూరి కృష్ణంరాజు, 7-4-2001

6. వ్యక్తిత్వ వికాసానికి కళలు అవసరం
భువన విజయము



వృత్తి, ప్రవృత్తి రెండూ భిన్న ధృవాలు. వృత్తి ఉదర పోషణకైతే, ప్రవృత్తి మనిషిలోని కళాతృష్ణను తీర్చి ఆత్మ సంతృప్తిని కలిగించి మామూలు మనిషిని సంపూర్ణ మానవునిగా తీర్చిదిద్దడానికి సహకరిస్తోంది. నాటక రంగం, రచనా, కవిత్వం పట్ల విపరీతమైన మక్కువతో తన సుదీర్ఘమైన కళాజీవితంలో 45 ఏళ్ళ పాటు ప్రతిఫలం ఆశించకుండా ఆయా రంగాలపై కేవలం అభిమానంతో ప్రవృత్తిగా తన సంతోషం కోసం కళారం

గంలో అడుగుమోపినా ఆ రంగంలో విశేష కీర్తిని ఆర్జించిన పెదవేగి మండలం వంగూరు గ్రామానికి చెందిన వేపూరి శేషగిరిరావు 'ప్రభాతవార్త'తో తన కళా జీవితపు విశేషాలను ముచ్చటించారు. నేడు విశ్వరూపం దాల్చి విజృంభించిన టి.వి. ఛానెల్స్ గ్రామాల్లో ప్రజలను ప్రభావితం చేస్తున్నాయని గంటల తరబడి టీవీలకు అతుక్కుపోతున్నారని, నాటకాలను ప్రదర్శించినా చూసేవారు కరువవు తున్నారని ఆవేదన వ్యక్తం చేశారాయన. చారిత్రక పురుషుడు బొబ్బిలి తాండ్ర పాపారాయుడు వంశస్థుడైన శేషగిరి వృత్తి రీత్యా సర్వే అండ్ లాండ్ రికార్డ్స్‌లో గ్రేడ్ 1 డ్రాఫ్ట్‌మెన్‌గా ఉద్యోగ బాధ్యతలను నిర్వహించి పదవీవిరమణ చేశారు. 1936లో వంగూరు గ్రామంలో చినరామయ్య, సీతారావమ్మ దంపతులకు జన్మిం చిన వేపూరి 65 ఏళ్ళ వయస్సులో కూడా ఆయన కంఠంలో మాధుర్యం తగ్గలేదు. చంద్రు సూర్యనారాయణ, కోనా తాతారావు, గొల్లంగి రామారావు, అసిరయ్య తదితర సీనియర్ నటుల నటన తనకు నాటకరంగంలో స్ఫూర్తి అని వేపూరి అంటున్నారు. 1953 నుండి సాంఘిక, పౌరాణిక, జానపద నాటకాలు, నాటికలలో వేపూరి సమర్థవంతమైన పాత్రలు ధరించారు. దేశవ్యాప్తంగా వేలాది ప్రదర్శనలు ఇచ్చినా తన జన్మస్థలమైన వంగూరులో ప్రజలు తనను గుర్తించకపోవటం దురదృష్టకరమన్నారు. ప్రముఖ సినీ రచయిత రాసిన ఆడది నాటికలో తన నట జీవితం ప్రారంభించి దగాకోరు, కాంతిపథం, 1981లో ప్రఖ్యాత సినీ నటుడు నాగభూషణంతో రక్తకన్నీరులో లోకమామ వేషం వేస్తూ దేశమంతా ప్రదర్శన లిచ్చారు. తాడేపల్లిగూడెంలో సినీ నటులు రాజనాలతో కురుక్షేత్రం నాటకంలో భీష్మాచార్య, "హరిశ్చంద్ర"లో విశ్వామిత్రుడు, సతీసక్కుబాయిలో కాశీపతి, దుర్యో ధనుడు, దేవేంద్రుడు, మాయల ఫకీరులో ఫకీరు పాత్రలు శేషగిరిరావుకు మంచి పేరు తెచ్చాయి. ప్రముఖ నటులు షణ్ముఖ ఆంజనేయరాజు, కందుకూరి చిరం జీవిరావు మొదలగు వారితో కలసి ఆయన నటించేవారు. సినీ నటులు రాజనాల, ధూళిపాళతో కలసి కురుక్షేత్రంలో కరండకుడు, భీష్ముడు, రక్తబలి నాటకంలో అనాస్ పాత్రలు ధరించారు. ప్రఖ్యాత నటులు వరిగొండ శ్రీరామమూర్తి, కోటం రాజు తనకు సమకాలీకులని ఆయన తెలిపారు. తనకు హాస్య పాత్రలంటే మక్కువని అన్నారు. ఏ నాటకంలో అయినా పాత్రలో పూర్తిగా లీనం కాకూడదని లీనం అయినట్లు నటించాలని తెలిపారు. గతంలో జరిగిన సంఘటన గుర్తు చేసుకుంటూ రామబాణంతో నేలకొరిగిన సుబాహుండి పాత్రలో లీనమై నటిస్తుం

డగా వెనక్కు పడిపోవడం వల్ల తలకు తీవ్ర గాయమై ప్రాణం పోయేంత పనయిందని తన స్వీయ అనుభవాన్ని నెమరు వేసుకున్నారు. సినీరంగానికన్నా నాటక రంగానికి ఎంతో విశిష్టత వుందన్నారు. పాత తరం సినిమాలలో ప్రతి కథ ప్రేక్షకుడికి ఒకనీతి బోధించేదని నేటి సినిమాలలో కేవలం వ్యాపార ధోరణే తప్ప విలువలు కరువయ్యాయని అన్నారు. నాటకరంగాన్ని వృత్తిగా చేసుకుని వున్న ఎందరో కళాకారులకు భుక్తి కరువయిందని నాటి నాటక రంగం, నాటి సినిమాలు కళాకారులకు రంగుల కలగానే మిగిలిపోయాయని శేషగిరిరావు ఆవేదన వ్యక్తం చేశారు. మిత్ర శతకంతో పద్యకావ్యం, వేదాంత చూర్ణిక సంకలనం, విష్ణు సహస్ర నామ స్తోత్రంతో సంకలనం వంటి పలు ఆధ్యాత్మిక సాహిత్య గ్రంథాలు రచించి పలువురు ప్రశంసలు పొందారు. భక్త రామదాసు, సీతారామ కళ్యాణం, కురుక్షేత్రం నాటకాలు తనకు అత్యంత ప్రీతిపాత్రమైనవని అన్నారు. పేరు ప్రఖ్యాతుల కోసమో, ధనార్జన కోసమో తాను నాటకరంగాన్ని ఎంచుకోలే దని, తన ఆత్మ సంతృప్తి కోసం అభిమానులను ఆనందపర్చడం కోసమే రంగస్థలాన్ని ఎంచుకు న్నానని అన్నారు. జిల్లా కేంద్రమైన ఏలూరులో ప్రభుత్వ ఆధ్వర్యంలో కళల కోసం ఒక కేంద్రాన్ని నిర్మించాల్సిన అవశ్యకత ఉందని కనుమరుగౌతున్న గ్రామీణ కళలకు చేయూతనివ్వాలని కళలు కనుమరుగైతే సమాజానికి మనుగడ కష్టమని వ్యక్తిత్వ వికాసానికి కళల అవసరం ఎంతైనా ఉందని వేపూరి అన్నారు.

7. **శ్రీ కె. మల్లిఖార్జునరావు, Q.No. 988/A, BHEL,**
   రామచంద్రపురం, హైదరాబాదు. 32.

   ఓం శ్రీ సాయిరామ్ 24-4-2002

ప్రియమిత్రమా శేషగిరిరావూ ! నిన్ను సర్వే డిపార్టుమెంటులో డ్రాఫ్టుమన్ గాను, స్టేజి మీద నటకుడిగాను మాత్రమే గుర్తించ గలిగిన నాకు నీ ప్రతిభ కవిత్వములో, అందులోనూ శతకరచనలోనూ కూడా దాగియున్నదని నీ "మిత్ర శతకము" అందుకున్ననాడు నాకు మహదానందమును మహోత్సాహమును కలిగించినది. నీలో ఇంతటి మహత్వ కవిత్వ పటుత్వ సంపద దాగియున్నదని ఇంతవరకూ ఊహించను కూడలేదు. పాతమిత్రుని మిత్రశతకముతో తట్టిలేపి మనసాహచర్యము నాటి విషయములు కూడా జ్ఞప్తికి తెచ్చియుంటివి. - వెల అమూల్యముతోపాటు నీ కవిత్వము కూడ అమూల్యమే. నీస్నేహమూ అమూ

ల్యము. మానవజాతికి మరిన్ని హితోక్తులతో కూడిన మరిన్ని రచనలు చేస్తావని ఆశిస్తున్నాను. స్నేహితుని ఆశీర్వదిస్తున్నాను.

పాతమిత్రుని గుర్తుకు తెచ్చుకుని నీ అమూల్య రచన పంపినందులకు మాకృతజ్ఞతలు. స్వీయపరిచయము అమూల్యమే. ఇంకను మరిన్ని కవితలు నీ కలం నుండి జాలువారి అమూల్యరత్నములై వెలుగొందవలయునని నా అభిలాష. శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన జీయర్ స్వామివారి ఆశీర్వాద ఫలము లభించుట గొప్ప విశేషమే. (విశేషగిరిరావా)

మీమిత్రుడు, **కె. మల్లికార్జునరావు**, 24-4-2002

8. **శ్రీమాన్ అమరవాది జగన్నాథాచార్యులు**, భద్రాచలం 25-4-2002

గౌరవనీయులైన శేషగిరిరావు గార్కి జగన్నాథాచార్యులు నమస్కరించి వ్రాయునది.

ఇచ్చట అంతాక్షేమము. అక్కడ మీరు మీ Family గారు క్షేమమని తలుస్తాను. మీరు నాయందు గౌరవ భావముతో పంపినటువంటి వేదాంత చూర్ణిక, 2వభాగము, పుస్తకము అందినది. కొన్ని పేజీలు మాత్రమే చదివాను. మిగతావి కూడచదువగలను. చాల చక్కటి విషయాలు, గ్రంథములయొక్క ఆధారముతో విషయము అందించినారు. భగవంతుడు మీకు ఇంకనూ ఆయు రారోగ్యములను ప్రసాదించి మరికొన్ని గ్రంథములను వ్రాసి ప్రజానీకమునకు ఇవ్వాలని ఆశిస్తున్నాను. మీకు ఆ సీతారామ చంద్రస్వామి మిమ్ములను సర్వదా కాపాడాలని ఆశిస్తున్నాను.

ఇట్లు

***అమరవాది జగన్నాథాచార్యులు***, 25-4-2002

9. శ్రీ కె. కిశోరుబాబు, S/o. కపిలవాయి లింగమూర్తి

17-110 వాణీసదనం, నాగర కర్నూలు - 509209, 14-5-2002

శ్రీ వేపూరి శేషగిరిరావు గారికి నమస్కారములు. మీ వేదాంతచూర్ణిక (సంఖ్యాశాస్త్రము) ప్రథమ భాగము చాలా గొప్పగాయున్నది. దయచేసి దాని రెండవ భాగముకూడ పంపగోరుతాను. మా నాన్నగారివే మరికొన్ని రచనలను పంపుతున్నాను. స్వీకరించగలరు. అన్యధా భావించవలదని మనవి. ధన్యవాదములు.

ఇట్లు మీ **కపిలవాయి కిశోరు బాబు**

10. ఓం నమో భగవతే శ్రీమదుమా మహేశ్వరాయ
శివాయ గురవే నమః

**శ్రీ ఉమా మహేశ్వరాశ్రమము**, తిలక్‌నగర్, గుంతకల్లు, 27-5-2002.

గురుపుత్రులు కవులు నటనాకౌశిలురైన
శ్రీ వేపూరి శేషగిరిరావు గారికి

శ్రీగురు - ఈశాన స్మరణ పూర్వక ఆశీస్సులు - మిమ్మల్ని అడుగకనే ప్రేమతో పంపిన మిత్రశతకము, శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రం (నామావళి అర్థసహితము, రామానుజ భాష్యము) అను పుస్తకద్వయము చేరినది. చాల సంతోషం.

1. మిత్ర శతకము సదభిప్రాయము

సుదామ - శ్రీకృష్ణుల చిత్రము చూచిన వెంటనే సనాతన మిత్రత్వం ఎంత మంచిదో, తార్కాణమైనదో విదితమగును. దైవ గురుస్తుతితో ప్రారంభిం చుట, ఇది శిష్టాచారము, మంగళప్రదము. కవి ప్రశంస మీ మిత్రత్వం వ్యక్తమగు చున్నది. ఈ శతకము నీతి-ధార్మిక-భక్తి-ఆధ్యాత్మిక విషయముల నెన్నిటినో సరళభాషయందు సామాన్య చదువు గలవారికి అర్థమగునట్లు రచన సాగించారు. సర్వులు చదువదగిన శతకము. అనుష్ఠేయ విషయములు చాల గలవు.

ఓం తత్సత్
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

2. విష్ణు సహస్రనామస్తోత్రం - ప్రశంస

అట్టమీది బొమ్మ - భీష్ముడు ఉన్నది. అంపశయ్య - బోధించినది శాంతి అనునది ద్యోతకమగును. చివరి చిత్రములు మీ నటనా కౌశిలత వ్యక్తమగును. ధర్మరాజు ప్రశ్న "కిమేకమ్ దైవతమ్.... ప్రాప్ను యుర్మానవాః శుభమ్ " భీష్మ సమాధానము "జగత్ ప్రభుం దేవ...సతతోత్థి తః " ధర్మరాజు ప్రశ్నకు సమాధానమే విష్ణు సహస్రనామ స్తోత్రము. ఫలితార్థము శ్రీమద్భాగవతములో "నామ సంకీర్తనం యస్య సర్వపాప ప్రణాశనమ్" చివరి శ్లోకము.

"నిర్విఘ్న సమాప్తి కామో మంగళమాచరేత్" అను వచననానుసారము ఇష్టదేవతా - గురుస్తుతి చేసి యున్నారు. జగద్గురు శ్రీరామానుజాచార్య భాష్యము ననుసరించి నామావళి అర్థసహితముగా రచన జరిగినది. 58-శ్రీకృష్ణ, 769 నైకశృంగః " నామములకు విశేష వాఖ్యానము చేసియున్నారు. 2,3,4 పునః పునః వచ్చిన నామములకు సంఖ్య వేసి తెలిపినారు. ఎంత శ్రమించినారో

వీటివలన ద్యోతకమగును. అందరు చదువదగినది. అను దినము శ్రద్ధా భక్తు లతో, పఠించిన భుక్తి ముక్తులు చేకూరును. పాప క్షయం ద్వారా శాంతి యలవడును. ఓం తత్ సత్

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ఓం శ్రీ గురవే నమః

M.O. రు. 150/- పంపి, V.P.P. ద్వారా క్రింది గ్రంథము తెప్పించబడినది.

3. వేదాంత చూర్ణిక - సంఖ్యా ప్రాశస్త్యము
   (1 నుండి 108 వరకు - 2 భాగములు)

ఈ గ్రంథావతరణమునకు "అష్టావక్ర విజయము" అష్టావక్ర - బంది, శాస్త్ర చర్చ కారణమైనది (1 నుండి 13 అంకెలు) శ్రీమత్ పరమహంస పరివ్రాజకా చార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయరు స్వామి వారి ఆశీర్వాదబలము. ఆరాధ్య దైవము శ్రీకృష్ణ పరమాత్మ అనుగ్రహము, వాగ్దేవి కృపాకటాక్షము, మిత్ర, బంధు, సఖీ సహాయముతో ఈ గ్రంథము కూర్చి శ్రుతి, స్మృతి, పురాణ ఇతిహాస ఇత్యాది (84 గ్రంథ ములు) స ప్రమాణముగా తెలిపియున్నారు. సంఖ్యానుగుణంగా పొందుపరచి నవి. సంఖ్యల యొక్క ప్రాముఖ్యతను సంఖ్యా మహత్యాన్ని, వేదాలలో సంఖ్యకు గల స్థానాన్ని తెలియ పరచి దాని ప్రభావాన్ని ఎల్లరకు తెలియ చెప్పారు. మేము కొన్ని సంఖ్యల వివరాలు వాటి శక్తి మాత్రమే తెలిసికొని యుంటిమి. మీరు అపూర్వ పాటవాలతో రచించిన ఈగ్రంథమునకు బహు ప్రాముఖ్యత నంతరించుకొంది. వేదప్రియులకు, ఆధ్యాత్మిక మార్గానుచారులకు సాహిత్యాభి మానులకు ఈ గ్రంథము చాల ఉపయోగికారిగా యుండునని భావించు చున్నాము. మీ యొక్క కృప, దృఢ పట్టుదల, భక్త్యాదులు చాల సంస్తుత్యము. శ్రుతి యుక్తి అనుభవములతో కూడినదీ గ్రంథము.

శ్రీ గురు - లక్ష్మీ నారాయణులు మేధాశక్తి ఆయురారోగ్య భక్తి జ్ఞాన వైరాగ్యము లొసంగి కాపాడుదురు గాక ! రక్షింతురు గాక ! ఓం తత్సత్ -

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

సర్వేజనాః సుఖినో భవంతు.

*స్వయం ప్రకాశానందస్వామి.*

శ్రీశంకర - శ్రీరామానుజ జయంతి వైశాఖ(మాధవ)మాసం - గుంతకల్లు.

11 శ్రీమాన్ వరిగొండ నాగేంద్రరావు, వంగూరు 31-7-2002
శేషగిరిరావు గారికి

సంస్కృత మహాభారతమును గురించిన ఆసక్తికరమైన ఎన్నో విషయాలు మీ "వేదాంత చూర్ణిక" ద్వితీయభాగములో ఉన్నాయి. కాని శ్లోకముల సంఖ్య ఇవ్వలేదు. ప్రథమ భాగములో 113 పేజీ చివర "లక్షకు పైబడి" అని వున్నది. ఒక అంచనా ప్రకారం సుమారు లక్ష అని తెలుస్తోంది. సంఖ్య ఖచ్చితముగా తెలియదు. తెలుసుకోవలసిన అంశమే ఇది. రామాయణము (వాల్మీకి విరచితము)లో వున్న శ్లోకాల సంఖ్యను ఇరువదినాలుగు వేలుగ ఖచ్చితంగ పేర్కొన్నారు. అలాగే మహాభారతము విషయములో కూడ తెలుసుకోవాల్సి వుంది. నాకు తెలిసినంతవరకు ఇప్పటివరకు ప్రపంచ సాహిత్యములో లభ్యమవుతున్న ఇతిహాసములన్నిటిలోకి సంస్కృతములోని వ్యాసుని మహాభారతమే శ్లోకముల సంఖ్య దృష్ట్యా పెద్దదిగా చెప్పబడుతోంది. అష్ట దిగ్గజముల పేర్లను ఇచ్చినారు. అష్ట దిక్కరిణుల పేర్లను కూడా ఉదహరించవచ్చుననుకుంటాను. "నవ రసములు, వాటి స్థాయీ భావములు తెలియజేసినారు. కాన స్థాయీ భావములకు తోడ్పడే సంచారి భావములు ప్రసక్తిలేదు. పదకొండవ సంఖ్యక్రింద మహాత్మా గాంధీ ఆచరించిన ఏకాదశవ్రతాన్ని కూడా చేర్చవచ్చును. ఎనిమిదవ సంఖ్య క్రింద అష్ట గంధములు అష్ట కష్టములు కూడా చేర్చవచ్చును. అష్ట దిగ్గజములుగా పేరు గాంచిన కవుల జాబితాలో మాదయ గారి మల్లన పేరు లేదు. దీనిని పునర్ముద్రణలో సరి చెయ్యగోర్తాను.

దేవీ నవరాత్రములను గురించి చక్కని వివరములు అందించినారు. అయితే వసంత నవరాత్రములు, గణపతి నవరాత్రములు, శ్రీరామ నవమిలను కూడా చేర్చవచ్చునను కుంటాను. పదవ అంకెక్రింద కావ్యముయొక్క దశగుణములు అనే అంశాన్ని ఉదహరించవచ్చు. ఆంధ్రప్రదేశ్‌లోని పుణ్యక్షేత్రములలో పుట్టపర్తిని కూడా చెప్పాలి. నల్గొండ జిల్లాలోని హుజూర్‌నగర్ సమీపంలోని బూరుగుగడ్డ గ్రామంలో పండ్రెండుగురు ఆళ్వార్లకు కలిపికట్టిన ఆలయం వున్నది. ఇదికూడా పుణ్యస్థలమే. ఆళ్వారుల గుడిగురించి ఎప్పుడో 'వార్త' అనే పత్రికలో చదివాను. ఇటువంటి ఆలయము ఆంధ్రదేశములోనే చాల అరుదట.

తాజమహల్ నిర్మాణ కాలమునందు దానికి ముందు తరువాతకాలములలో కూడా జీవించినట్లు చెప్పబడుతున్న శ్రీపోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి

వారి పేరిట కడపజిల్లాలో ఉన్న మఠాన్ని కూడా ఆంధ్రప్రదేశ్‌లోని పుణ్యక్షేత్ర ములలో ఒకటిగ మీ పుస్తకములో ఉదహరించవచ్చును.

'మిత్రశతకము' పై నేను చేసిన వాఖ్యలో ఒక తప్పు దొర్లినది. 'పారమార్థకత' సరికాదు. 'పారమార్థికత' అని వుండాలి. పొరపాటుకు చింతిస్తున్నాను. దయతో క్షమించండి.

పశుల వన్నె వేరు పాలెల్ల ఒక్కటి - పుష్పజాతి వేరు పూజ ఒకటి దర్శనంబులారు
దైవంబు ఒక్కటి - విశ్వదాభిరామ వినురవేమ

అన్న వేమన గారిని గుర్తు చేస్తున్న ఈపుస్తకములోని చిట్టచివరి పద్యం

'మతము లెవ్వైన బోధించు హితమొకండె '

భిన్నత్వంలో ఏకత్వం ఉన్నది - అనే ఒక చక్కని భావాన్ని, అందరూ తెలుసు కోదగిన ఒక వాస్తవాన్ని శ్రవః పేయంగా అందించి శతకం ముగింపుకు మరింత అందం తెచ్చింది.

శ్రీమాన్ వంగొండ నాగేంద్రరావు
మౌనవ్రత దీక్షా దక్ష శిఖామణి
B.A., (Hons) M.A. (Andhra), M.A.(Poona) P.B.D.T.E., P.G.D.E.S. (C.I.E.F.L.)

12. శ్రీరాములు

గుర్రం గుర్నాథంశెట్టి - హైదరాబాదు 22-8-2002

మహారాజశ్రీ దైవ సమానులయిన రచయిత గారయిన గురుదేవులు శ్రీ వేపూరి శేషగిరిరావు గారి దివ్యసముఖమునకు తమ శిష్యుడు గుర్రం గుర్నాథంశెట్టి అనేక నమస్కారములతో వ్రాసుకున్న మనవి.

అయ్యా - మహాశయా తమరు దయతో పంపిన 'మిత్ర' శతకం యీరోజు చేరింది. వెంటనే చదివితిని. చాలాబాగా వ్రాసారు. యెన్నో శతకాలు చదివితిని. కాని తమరచన సాంఘికం సామాన్య రాజకీయ కుటుంబ రకరకాల వారికి జ్ఞానోదయం అయ్యేటట్లు వ్రాశారు. యెలా పొందిక చేసారో చాలా ఆశ్చర్యంగా వుందండి. తల్లిదండ్రులు ఎప్పుడు పోతారా, వారిపీడ పోయే దెప్పుడా? అని ఆసించే వారికిది బాగుందండి.

ఇట్లు
తమ శిష్యుడు
గుర్రం గుర్నాథంశెట్టి

13. శ్రీమన్నంపమ్మడుంబై రంగ కృష్ణమాచార్యులు, M.O.L.
శ్రీమద్భగవద్గీతా విద్యాపీఠం - ధర్మక్షేత్రం - దివ్యశ్రీధామం - 18-28,
ప్రశాంతినగరం - ఉప్పలు (కలాను) హైదరాబాదు - 39
శ్రీమాన్ వేపూరి శేషగిరిరావు గారికి
మంగళాను శాసనములు

మీరు పంపిన M.O. ((218.00 రూలు) మెంబర్ షిప్ కొరకు) అందినది. పుస్తకాలు అందినవి. వాటిలోని రసాస్వాదన చేయడమైనది. - మిగతా శుభం.

హితైషి. - **ఎం. రంగ కృష్ణమాచార్యులు**, 6-9-2002
దివ్య ధర్మసూరి, గీతాచార్య, 'విరించి' లేఖినీ నామక - హైదరాబాదు - 39

14. మాన్య మహోదయులు,

శ్రీ వేపూరి శేషగిరిరావు గారికి హృదయ పూర్వక శుభాకాంక్షలు భావ తరంగిణి ఫిబ్రవరి 2003 సంచిక చూసి ఈ ఉత్తరము వ్రాస్తున్నాను. 'మిత్ర శతకము' రచించినందులకు ధన్యవాదములు. మీ శతకం కోసం నిరీక్షిస్తూ మీ సాహితీ మిత్రుడు. - **ఆకుల రఘురామయ్య** - హవేలి.

బుక్ పోస్ట్‌లో శతకము పంపించాను.

15. భావతరంగిణి - గ్రంథ సమీక్ష - మిత్రశతకము
రచన : వేపూరి శేషగిరిరావు, వెల : అమూల్యము
ప్రతులకు : వేపూరి శేషగిరిరావు, వంగూరు ఫోన్ : 279582
పెదవేగి మండలము, ప॥గో॥ జిల్లా.

పద్యరచన బాగా తగ్గిపోయిన ఈ రోజుల్లో "వాసి గాంచిన " వేపూరి" వంశభవుడ, శేషగిరిరావటంచు వచింత్రు నన్ను " అంటూ తనను పరిచయం చేసుకుంటూ, "ప్రాచీన కావ్య శాస్త్రము, లే చదివిన వాడకాను హితవాణి కృపన్, తోచిన రీతిన్ వ్రాసితి " నంటూ వేపూరి శేషగిరిరావు వ్రాసిన శతకమిది. ఇదిచక్కని నీతి శతకం ! తేటగీతిలో తేలికభాషలో వ్రాసిన శతకమిది ! అక్కడక్కడా ఆటవెలది విన్యాసం కూడ కన్పిస్తుంది. కవిత తొలి పద్యాలలో "అవని పరసతీ వాంఛ పాపా వహమ్మని" పదే పదే ప్రబోధించాడు. "కలికి సౌందర్య శోభను కనుల జూచి, తనియదగు నంతె వాంఛింప దగదు మిత్ర ! " అంటాడు. స్త్రీ యొక్క బాహ్య సౌందర్యమును జూచి భ్రమసి పోకూడదనీ ఆత్మ సౌందర్యములో పరమాత్మను దర్శింపమని హితవు పల్కుతాడు. కాముకుడిని "అచ్చు పోసిన అబోతుగా వర్ణిస్తాడు. " సత్యము వచించు నప్పుడు శంకవలదు" అంటాడు. "విందులోనైన

సురను సేవింప రాదంటాడు. న్యాయ సమ్మతమైన ధనార్జనము వల్ల కీర్తికాంతను పొందవచ్చునని భరోసా ఇస్తాడు. పరమ పదము నిచ్చు శ్రీహరి స్మరణమును మానవద్దని ప్రబోధిస్తాడు. భక్తికి ఎడమైన బ్రతుకు పాము వాతబడిన కప్ప బ్రతుకు వలె, వలలో పడిన మత్స్యము బ్రతుకు వలె దుర్భరము అంటాడు. ఆశ్రీహరిని రామునిగా ఒకసారి, కృష్ణునిగా వేరొకసారి అభివర్ణిస్తాడు. ఆరాము డెటువంటివాడు !

"పితృ విధేయుండు జానకీ ప్రియ విభుండు
పరశురామ దోర్బల గర్వ భంగహారి,
వాలి సంహారి, రావణ ప్రాణ హారి,
రామచంద్రుని స్మరియింప రాదె మిత్ర" మరి కృష్ణుడో !
"డెందమునకమందానంద మందజేయు
గోపికా బృందవిలసితు గోపబాలు
నందనందను విస్ఫురత్సుందరాంగు
నాత్మ కృష్ణుని నిల్పుకోవయ్య మిత్ర ! ॥

అతడే తరువాత - " బోధి వృక్షంబు క్రింద తపోనిరూఢి
జ్ఞానియై జీవహింసకు స్వస్తి బలికి"నవాడు

"తీర్థయాత్రలు చేయుట మానమనీ, గుడుల చుట్టూ తిరగవద్దనీ హితవు పలుకుతూ "కాయమెగుడి ఆత్మయెహరి కాదె మిత్ర! " అంటాడు. చంకలో వున్న బిడ్డను విస్మరించి ఇల్లాలు తల్లి బిడ్డను వెదుకుతూ తిరిగినట్లు మానవుడు ఆత్మలో నున్న దైవాన్ని చూడలేక తీర్థయాత్రలు తిరుగుతాడని ఎద్దేవా చేస్తాడు. అలాగే స్త్రీ భోగ్యవస్తు వుకాదని సంతాన యంత్రమసలే కాదనీ "ఆదిశక్తి" యని సృష్టికే మూలమని గుర్తెరుగ గలరనీ చెప్తాడు. మాంస భక్షణం వల్ల బుద్ధి మందగిస్తుందనీ, శాఖాహారాన్నే స్వీకరించమని ప్రబోధిస్తాడు.

"అన్నమడిగిన పేదకున్నంతలోన
భిక్ష పెట్టు ము లేనిచో బిచ్చమెత్తి
పొట్లు పడుదువు మరుజన్మ నట్లె నీవు
భాగ్యవంతుల లోగిళ్ళ వద్ద మిత్ర ! " అని హెచ్చరిస్తాడు.

ఒక విశ్వాసంతో ఒక ఉత్తమ లక్ష్యంతో, ఒక మంచి పరిణామం కొరకు వ్రాసిన శతకం ఇది ! కవి చేసిన ప్రయత్నం అభినందనీయమైందేకాదు అనుసరణీం కూడా ! గ్రంథ సమీక్షకులు :- ***డా. మాచిరాజు రామలింగేశ్వరరావు***

జై శ్రీమన్నారాయణ.

ఓం నమః పరమాత్మనే
శ్రీమన్నారాయణ రామానుజ యతిభ్యోనమః

# పరిశీలనా గ్రంథపట్టిక

1. తైత్తరీయ సంధ్యోపాసనము
2. తైత్తరీయోపనిషత్తు
3. స్వస్వరూపసంధానము
4. త్రికాల సంధ్యావందనము
5. సస్వర వేదమంత్రాలు
6. నిత్యప్రార్థనావళి
7. శ్రీ మదాంధ్ర వాల్మీకి రామాయణము - మందరము శ్రీ వావిలికొలను సుబ్బారావు గారు.
8. శ్రీ మద్భవగద్గత
9. శ్రీ మద్భాగవతము - వంగానువాదము ప్రభుపాద శ్రీలభక్తి సిద్ధాంత సరస్వతీ ఠాకురులు, ఆంధ్రాను వాదము శ్రీ జన్నాభట్ల వాసుదేవశాస్త్రిగారు.
10. శ్రీ భాగవతరత్నాకరము - శ్రీ విద్యా ప్రకాశనందగిరి స్వాముల వారు.
11. శ్రీ మదాంధ్ర మహాభారతము.
12. మహా భారతోపన్యాసములు - శ్రీ నండూరు సుబ్రహ్మణ్యశర్మగారు
13. స్తోత్రమంజరి
14. ముకుందమాల
15. శ్రీరామకృష్ణ ప్రభలు - శ్రీరామకృష్ణ మఠం వారు - మైలాపూర్ - చెన్నై
16. భక్తి నివేదనలు - ప.ప. శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి వారు.
17. శ్రీపతి స్తుతిమాల
18. శ్రీ శుష్కవేదాంతతమోభాస్కరము - శ్రీ మళయాళ స్వాములవారు - ఏర్పేడు.
19. ఆదిత్య హృదయ రహస్యము
20. అష్టాదశ పురాణములు
21. విశ్వదేవార్చన దైవప్రార్థన
22. చైతన్యభాగవతము - స్వామి సుందర చైతన్యానందవారు
23. శ్రీ విష్ణోర్దివ్య అష్టోత్తర సహస్రనామస్తోత్రమ్
24. పురుష సూక్తము
25. శ్రీ సూక్తము

} శ్రీ భాష్యకర్త దివ్యధర్మ సూరి, గీతాచార్య విరించి లేఖినీ నామక శ్రీ మన్నంపన్నమ్మడుంబై రంగ కృష్ణమాచార్యులుగారు, ఎం.ఓ.ఎల్.వారు.

26. కఠోపనిషత్తు
27. సప్తగిరి - తిరుమల తిరుపతి దేవస్థానము వారు. తిరుపతి
28. ఈశావాస్యోపనిషత్తు
29. శ్రీ కృష్ణావతారతత్త్వము 2,3,6,8,12 భాగములు. శ్రీ జనమంచి శేషాద్రి శర్మ గారు.
30. సాంధ్య దీపిక
31. ఆరాధన - 9/97 హిందూ ధర్మమాసపత్రిక - దేవాదాయ ధర్మాదాయ శాఖ - హైదరాబాద్.
32. పద్మపురాణము
33. శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము - రామానుజ భాష్యము, శంకరభాష్యము
34. విష్ణు ధర్మము
35. విష్ణుపురాణము
36. పెద్దబాలశిక్ష
37. అచలగురుపూజా విధానము
38. గురుపరంపర
39. మంత్రవైభవము, నారాయణ అష్టాక్షరీ మంత్రమహాత్మ్యము
40. నారాయణోపనిషత్తు
41. నిత్యానుష్ఠానక్రమము
42. ముండకోపనిషత్తు
43. మంత్రపుష్పము 1967 సంవత్సరము ముద్రణ
44. శ్రీరామాయణ సారోద్ధారము
45. శ్రీమదుత్తర మహాభారత సారోద్ధారము, 5వ భాగము.
46. స్తోత్రరత్నములు
47. ఆధ్యాత్మ రామాయణము
48. నిత్యసాధనచంద్రిక
49. భగవస్తుతి రత్నములు
50. కాశీ మజిలీకథలు, 8వ భాగము
51. శ్రీ గాయత్రి నిత్య పూజా విధానము
52. అర్చావతారము
53. విష్ణుతత్త్వము
54. కలి సంతరణోపనిషత్తు

సీ॥ ఆత్మపోయిన దేహ మగ్నిహోత్రుని పాలు
కఠిన శల్యంబులు గంగపాలు
మీద గప్పిన బట్ట మేటి చాకలిపాలు
దాచిపెట్టిన సొమ్ము ధరణిపాలు
కొడుకిచ్చు పిండంపు కూడు కాకులపాలు
అల్లజీవుడు కాల యమునిపాలు
ఇల్లు మంచము సొమ్ములెల్ల లోకుల పాలు
భార్య చెడిపయైన పరులపాలు

తే.గీ. ఏది తనవెంట రాబోదు నెవరికైన
నిన్ను మదినమ్మి కొలిచిన నిత్య సుఖము
అఖిల భవభంగ విపుల దయాంతరంగ
సంతతోంకార పరబ్రహ్మ సన్నుతాంగ

నిన్ను నీవు తెలిసికొనినప్పుడు, భగవంతుని తెలిసికొనగలవు. "నేను" అనునది యేది? చేయియా, కాలా, మాంసమా, రక్తమా లేక శరీరములోని మరేదైన భాగమా? బాగుగా యోచింపుము. "నేను" అనునదేదియు లేదని, నీకే తెలియగలదు. నీరుల్లి పాయపొరలను వలచినకొలది పొరలు వచ్చుచునేయుండు. కాని పలుకదగినదేది యును కనబడదు. అట్లే అహంకారము యొక్క స్వరూపమేమి? అని పరిశోధించిన అది తానుగా అదృశ్యమై పోవును. మిగులునది "ఆత్మయే" (చిత్స్వరూపమే) అహం కారము నశించినప్పుడే, భగవంతుడు ప్రత్యక్షమగును.

భోజరాజొకసారి సభలో మోక్షమున కెవరు పోయెదరో చెప్పుమనగా "నేను" పోతే పోతానన్నాడు కాళిదాసు. 'నేను' అను అహంకారము పోవాలి అప్పుడే మోక్షార్హుడు. నేను అంటే అహంకారము. నాది అంటే మమకారము. ఈ రెండు పోవాలి.

పురుషుడు శరీరమునందున్నంతకాలము వాని అహంకారము వానిని పూర్తిగా విడువజాలదు. కొంతశేషించియే యుండును. ఎట్లనగా కొబ్బరిచెట్టు మట్టలు పడి పోయినను, ఆ స్థలమున వాని గుర్తులు మిగులును. అహంకారమట్టిదే. అయినను యీ అహంకారము ఆత్మజ్ఞానియైయున్న వానిని బాధింపదు.

జై శ్రీమన్నారాయణ

జై శ్రీమన్నారాయణ !

ఓమ్ నమః పరమాత్మనే

సీ॥ అడవి పక్షుల కెవ్వ డాహార మిచ్చెను?
మృగజాతి కెవ్వడు మేత బెట్టె ?
చెట్ల కెవ్వడు నీరు జీవింప బోసెను ?
నెమిలికి నడకలు నేర్పెనెవడు ?
గర్భస్థ శిశువును కాచిపెంచె నెవండు?
చూలింతకెవడు చన్పాలొసంగె ?
బుడి బుడి నుడువులు బుడతకెవడు నేర్పె ?
పూలకు రంగులు పులిమెనెవడు ?

తే.గీ. నీరు పాల్విభజించెడు నేర్పు యమికి,
పామునకు వినికిడి శక్తి, పక్షి కంబ
ర తల సంచార శక్తి నిరంతరంబు
నొసగె నెవ్వండు ? వాసుదేవుండుగాక !

## గ్రంథకర్త రచనలు

1. మిత్రశతకము
2. వేదాంత చూర్ణిక (సంఖ్యాశాస్త్రము) ప్రథమ భాగము
3. విష్ణుసహస్రనామ స్తోత్రము, రామానుజ భాష్యము
4. వేదాంత చూర్ణిక (సంఖ్యా ప్రాశస్త్యము) ద్వితీయ భాగము
5. నిత్యానుష్ఠానచంద్రిక పండిత పరిష్కృతము
6. శ్రీ కృష్ణ విశ్వరూపాలు (అముద్రితము)
7. సప్త సంఖ్యా వైశిష్ట్యము (అముద్రితము)
8. సూక్తి సుధానిధి (అముద్రితము)

జై శ్రీమన్నారాయణ